# కాహ్వాతి

శ్రీమతి ద్వివేదుల విశాలాక్షి

స్టూడెంట్స్ బుక్ సెంటర్,
ఏలూరురోడ్డు : : విజయవాడ2.

ఆంధ్రజ్యోతి వారపత్రికలో
ధారావాహికంగా ప్రచు
రింపబడి, అశేష పాఠ
కుల మన్ననలు
పొందిన
నవల
*

# కొవ్వొత్తి

శీతకాలం ప్రొద్దు. సాయంకాలం ఆరుగంటలు కాకుండానే చీకటి పడిపోయింది.

ప్రకాశం కాలేజి అయిదుగంటలకే మూత పడుతుంది. రోజూ అయితే ఆ వెంటనే ఇంటికి వెళ్ళిపోతాడు. కనిపించిన వాళ్ళతో అల్లా బాతాకానీ వేసుకు కూర్చోడం, పనివున్నా లేకున్నా బజార్లంట, రోడ్లంట పడి తిరగడం అతనికి అలవాటులేదు. కాలేజీలో అంతా ప్రకాశాన్ని "అమ్మచాటు పిల్లడని, అడ్డాల్లో బిడ్డడని" తాటాకులు కడ్తారు.

ఒకరు ఏదో అంటారనీ, అనుకొంటారనీ తన అలవాట్లని, అభిప్రాయాల్ని మార్చుకొనే అలవాటు ప్రకాశానికిలేదు. అతడి పెంపకం ఆ తీరులో జరిగింది. జీవితంపట్ల అతడు ఏర్పరచుకొన్న విలువలు అతన్ని ఆ దారిలో నడిపిస్తాయి.

ఆ రోజు అలవాటుకి భిన్నంగా, అతడు చీకటిపడేవరకు ఇల్లు చేరకపోడానికి కారణం లేకపోలేదు. రెండేళ్ళక్రిందట కాలేజీలోట్యూటర్‌గా ప్రవేశించిన ప్రకాశం ఉద్యోగం ఖాయపరుస్తూ, అతడి పనికి మెచ్చి రెండు ఇంక్రిమెంట్లు కూడా ఇస్తున్నట్లు అధికార్ల దగ్గరినుంచి ఆరోజే వర్తమానం వచ్చింది. తోటి ఉద్యోగులు పార్టీ ఇవ్వాలంటూ పట్టుపట్టేరు. వారి పట్టుదలవల్ల కాకున్నా, తన సంతోషాన్ని ఆ విధంగా నలుగురికి పంచిపెట్టాలన్న ఉద్దేశంతో కాలేజీలో పనిపూర్తిఅయేక వారిని వెంటబెట్టుకొని ఎదురుగాఉన్న కాఫీహోటల్లోకి దారితీసేడు ప్రకాశం.

ఆ రోజు షష్ఠితారీకు జీతం అందింది. ఎంత తింటారో తినసీ అన్నట్లు ఎవరేది కోరితే అదల్లా ఆర్డరు చేసేడు. ఒకగంట గడిచేక ఖుశ్హా యాసంతో కడుపులు రాసుకొంటూ 'నిజంగా మన ప్రకాశంచేతికి ఎముక లేదు....ఎవడు ఎప్పుడు చేసేడ్రా ఇటువంటిపార్టీ' అని ప్రకాశాన్ని చెడ పొగిడి ఇళ్ళదారి పట్టేరు మిత్రులంతా.

తమవీధిలో కాలు పెట్టేసరికి, ఇళ్ళూ వాకిళ్ళూ వెలవెల పోతు న్నట్లు ఏదో కొత్తగా కన్పించింది ప్రకాశానికి. ఆ మార్పుకి కారణం ఏమిటా అని ఆలోచిస్తూ ఉండిపోయేందుకు అతడికి సమయంలేదు. అప్ప టికే వేళ మిగిలిపోయింది. అమ్మ తనకోసం చూస్తూఉంటుంది. ఉదయం ఈ విషయం తెలుస్తే, తను ఆలస్యంగా వస్తానని చెప్పివెళ్తే అదోదారి. ఇల్లు చేరుకోడానికి గబగబ అడుగులు వేస్తున్నాడు ప్రకాశం.

ఆకాశంమీద అరసున్న ఆకారంలోఉన్న చంద్రుడు ప్రకాశంతో పాటే పరుగుపెడ్తున్నాడు. చిరువెన్నెల కాస్తున్నా వీధంతా మసకగాఉంది. ఆ కనుచీకటికి కారణం ఏమిటో, ఆ రోజు వీధిలో ఇళ్లూ వాకిళ్లూ కొత్తగా ఎందుకు కన్పించేయో తను ఇంటిముందు నిలచేవరకు ప్రకాశం బుర్రలోకి దూరలేదు.

ఆ చుట్టుప్రక్కలంతా కరెంటు పోయింది. ఇళ్ళలో, వీధుల్లో ఎక్కడా దీపాలులేవు. వెన్నెలరాత్రి కాబట్టి ఆపాటి వెలుగైనా ఉంది. లేకుంటే రోడ్డుమరామత్తుకోసం తెచ్చిపోసిన కంకరరాళ్ళని, తారుడబ్బాల్ని తన్నుకు నడవవలసి వచ్చేది.

ఇంటిముందు నిలచి 'అమ్మా' అని పిలిచేడు ప్రకాశం.

రాజమ్మ అప్పటివరకు కొడుకు రాకకోసం నిరీక్షిస్తూ అక్కడే కూర్చుంది. చీకటి పడింది దేవుడిగదిలో దీపంపెట్టి రావాలని అప్పుడే లోప లికి వెళ్ళింది.

అది ఒక పురాతనమైన నాలుగిళ్ళ లోగిలి. ఆ ఇంటివారు మంచి దశలో ఉన్నప్పుడు బారుగా చావిళ్ళు వాకిళ్ళు పెట్టుకొని ఇల్లు కట్టు

కొన్నారు. కరువు కాటకాలు మీదపడగా, కాలం కలసిరాక బ్రతుకులు బండదేరగా, ఎక్కడి కక్కడ అడ్డగోడలు, తడికలుపెట్టి చిన్న, చిన్న వాటాలుగా మార్చి అద్దె కిచ్చేరు.

ప్రకాశం తమ వాటావైపు వెళ్ళాలంటే సన్నని నడిసావిట్లోంచి ఇటు అటు వాటాలవాళ్ళ మంచాలు కుంచాలు తప్పించుకొంటూ, పసి పిల్లల అవశిష్టాలమీద కాలుపడకుండా జాగ్రత్తపడుతూ మరీ ముందుకు పోవాలి.

నడిచావిడ గోడకున్న గూట్లో మధ్యింటివాళ్ళు చిటికెన వేలంత లావున్న చిన్న కొవ్వొత్తి ఒకటి వెలిగించిపెట్టేరు. అది ఎదురుగాలికి ఆరుతు వెలుగుతు ఇంక గడియకో, గంటకో ప్రాణంపోయే రోగిలా ఉంది. ఆ చిరువెలుగులో అతి కష్టంమీద దేనిమీదా కాలుపడకుండా తమ వాటా చేరుకున్నాడు ప్రకాశం.

రాజమ్మ దేవుడి గదిలో దీపంపెట్టి, ఇంకొక కుందులో రెండు గరిటెలు నూనె, వత్తివేసి వెలిగించి ముందువరండాలో పెట్టింది. గడప లోకి వచ్చిన కొడుకుని చూచి "వచ్చేవా నాయనా ! నీమాటే అనుకొంటు న్నాను. చీకటిపడ్డా రాలేదేమా అని'' అంది.

"ఎంతసేపయింది లైట్లుపోయి" అన్నాడు ప్రకాశం బాల్చీలో నీళ్లు తీసుకొని కాళ్ళు కడుక్కొంటూ.

"సాయంకాలంనుంచి లేవు. ఈ నిముషమో, ఆ నిముషమో రాక పోతాయా అని ఇంతవరకు చూస్తూ కూర్చున్నాను. వంటయిపోయింది. భోజనానికి లేస్తావా" అంది దండెంమీది తుండుగుడ్డ తీసి అందిస్తూ.

"లైట్లు రానీ....ఆకలిగా లేదు" అన్నాడు ప్రకాశం.

"అదేం....ఆకలి లేకపోవడమేమిటి! ఉదయమనగా తినిపోయేవు. అందరిలా కాఫీహోటళ్ళలో అదీ, ఇదీ తినే అలవాటుకూడా నీకులేదు" వంట్లో ఏం చికాకుగా లేదుకదా అన్నట్లు ఆత్రంగా నుదురుముట్టుకు చూస్తూ అంది రాజమ్మ.

"ఎప్పుడూ చెయ్యని పని ఈ రోజు చేసేను. అందుకే ఆకలి లేక పోవడం" అంటూ తన ఉద్యోగం ఖాయం అయిన సంగతి మిత్రులకి పార్టీ యిచ్చిన విషయం చెప్పేడు ప్రకాశం.

"మంచిపని చేసేవు నాయనా, మనిషి తన సుఖాన్ని నలుగురితో పంచుకోవాలనీ, తన దుఃఖాన్ని తనలోనే ఉంచుకోవాలనీ పెద్దలు అంటారు" అంది రాజమ్మ.

ప్రకాశం వాలుకుర్చీలో కూర్చుని ఆకాశంపై వెన్నెల పోగుల్లా చెల్లా చెదురుగా ఉన్న నక్షత్రాలను చూస్తున్నాడు. ఎదురుగా కృత్తిక నక్షత్రం కుప్పపోసిన ముత్యాలరాసిలా ఉంది. అందుకే దాన్ని పిల్లలకోడి అంటారు. అది నక్షత్రరాసి కాబట్టి సరిపోయింది. ఎవరైనా మనిషికి అంతమంది పిల్లలుంటే, ఈ కరువురోజుల్లో ఆ సంసారాన్ని మొయ్యలేక, "జై పరమేశ్వరా" అని తిన్నగా ఉత్తరాదికిపోయి హిమాలయాలు ఎక్కేసవాడు.

రాజమ్మ తలుపుకి చేరబడి కూర్చుని ఏవో కబుర్లు చెప్తున్నది. ప్రకాశం తన ఆలోచనలో ఉండి వాటిని సరిగా వినిపించుకోవడంలేదు. అంతలో గుర్తు వచ్చింది రాజమ్మకి ఆ సాయంకాలం వచ్చిన ఉత్తరాల సంగతి.

"మరచేపోయేను....ఏవో ఉత్తరాలు వచ్చేయి" అంటూ వాటిని తేవడానికి లేచింది.

"ఎక్కడనుంచేమిటి?" అన్నాడు ప్రకాశం.

"ఏమో చూడలేదు....అప్పటినుంచి దీపాలు లేవుకదా" అంటూ వాటిని కొడుకుచేతిలో తెచ్చి పెట్టింది.

ఆ చిరు వెలుగులో ఉత్తరాలపై రాత చూసేడు ప్రకాశం.

"ఒకటి సావిత్రి అక్క రాసినట్టుంది. రెండో దానిమీద దస్తూరీ పోలిక తెలియడంలేదు"

"దీపం ఆక్కడికి తెమ్మంటావా?"

"లైట్లు రానీ చూడవచ్చు....ఇంతలో ముంచుకుపోయే సంగతులు ఏముంటాయి" అన్నాడు ప్రకాశం వాటిని పక్కన పెడుతూ.

మరో అరగంటకైనా లైట్లు రాలేదు.

"ఇంకా ఎప్పటికి వస్తాయో .... ఆ కాస్తఅన్నం చప్పగా చల్లారి ఊరుకొంటుంది. రా.... పెట్టేస్తాను. భోజనం అయిందనిపించుకొంటే కళ్ల మూసుకు పడుకోవచ్చు...." అంటూ లేచి భోజనాల గదిలోకి వెళ్ళింది రాజమ్మ.

తల్లివెనుకే తనూలోపలికి వెళ్ళేడు ప్రకాశం. పీట వాల్చుకొని కూర్చోబోతుంటే ఒక్కసారిగా వెలిగేయి రెండుగదుల్లో దీపాలు.

"మనం లేస్తేకాని వాటికీ వేడి పుట్టలేదు. ఎలాగైతేనేమి ఇప్పటికి వెలిగేయి" అంది రాజమ్మ వంటగిన్నెలు తెచ్చి ముందు పెడుతూ.

తల్లి వడ్డనచేస్తుంటే ప్రకాశం సావిత్రి రాసిన ఉత్తరం చదివేడు.

"మళ్ళా నెల తప్పిందన్నమాట"

"అనేగా దాని అర్థం...."

"దానికేం వచ్చి నెలరోజులు ఉండు అంటూ రాసింది కాని, నాకెలా అవుతుంది. నీ భోజనం వగైరా...."

"అవన్నీ నేను చూసుకుంటా....నువ్వు ఓ సారి వెళ్ళిరావడమే మంచిది...."

"సరే ఆలోచిద్దాం....ముందు భోజనం కానీ" అంది రాజమ్మ నేతిగిన్నె అందుకుంటూ.

"ఉండు ఈ రెండోది కూడా చూసేసి .... ఎక్కడినుంచో........ ఏమిటో కవరు చింపుతూ అన్నాడు ప్రకాశం.

కొడుకు కనుబొమలు ముడిపడ్డంచూసి "ఎక్కడినించిరా" అంటూ ప్రశ్నించింది రాజమ్మ.

"రంగాపురం నుంచి....జగన్నాధరావుగారట .... ఎవరీయన ?" అన్నాడు తల్లివంక చూస్తూ.

కాగల కార్యం గంధర్వులే తీర్చేరు అన్నట్లు తను కదపాలను కొంటున్న విషయం ఆ ఉత్తరం మూలంగా కదలినందుకు సంతోషించింది రాజమ్మ. అయినా ఆ సంతోషాన్ని మనసులోనే నిలుపుకొని "ముందు భోజనం కానీ సావకాశంగా చూడవచ్చు" అంది.

ఉత్తరం పూర్తిగా చదివి మరీ భోజనానికి ఉపక్రమించేడు ప్రకాశం.

కూర అన్నంలోకి నెయ్యి వడ్డిస్తూ కొడుకు ముఖంలోని భావాల్ని పసికట్టడానికి పరీక్షగా చూసింది రాజమ్మ. అది పండక్కి ముందురోజు కడిగిన పాలగచ్చు నేలలా ఉంది.

"ఏం రాసేరేమిటి....జగన్నాధరావుగారు" అంది కూర మారు వేస్తూ.

"అసలు ఇటువంటి ఉత్తరం ఎలా వచ్చింది? నా పేరు పెళ్ళికొడుకుల లిస్టులోకి ఎవరు ఎక్కించేరు? సూటిగా తల్లివంక చూస్తూ ప్రశ్నించేడు ప్రకాశం.

"ఒకరు ఎక్కించేదేమిట్రా? పెళ్ళీడు ఆడపిల్లలున్న తలిదండ్రులు ప్రపంచమంతా వలవేసి, ఏమూల మూలల్లో ఎవరున్నారో ఇట్టే పట్టేస్తారు. అటువంటిది పండులాటి కుర్రాడివి, పట్నంలో ఉద్యోగం చేసుకొంటున్న వాడివి నువ్వు ఎలా కనిపించకుండాపోతావు?" కొడుకువంక గర్వంగా చూసుకొంటూ అంది రాజమ్మ.

"అది కాదమ్మా. ఇంతకు పూర్వం ఏవో మాటలు జరిగినట్లు పెళ్ళిచూపులు అంటుంటే...."

"అదా....ఆ మధ్య అక్కయ్యగారి ఊరువెళ్ళినప్పుడు మీ బావ కదిపేడు ఈ సంబంధం గురించి....అతడికేదో దూరపు బంధుత్వమున్నట్లుంది....నిన్నడిగి ఉత్తరం రాస్తానన్నాను .... ఆడపిల్లలు కలవాళ్ళు చూడు....వాళ్ళ తొందర వాళ్ళకుంటుంది." ఈ విషయంలో తనప్రమేయం అంతగా లేనట్లు తేల్చివేసింది రాజమ్మ.

ఉత్తరంలోని మాటల్నే మననం చేసుకొంటూ ప్రకాశం భోజనం పూర్తి చేసేడు.

"మాకొక్కతే ఆడపిల్ల. ఇరవై ఎకరాల పల్లపుపొలం. నాలుగెక రాలు మెట్ట. రంగాపురంలో డాబా ఇల్లు. అన్నీ మా తరువాత అమ్మాయికే సంక్రమిస్తాయి. ఇంక కట్నకానుకలు, ముద్దుముచ్చట్లు మీరు కోరిన విధంగా జరపగలము"

కంచంలో చెయ్యి కడుక్కొని లేచిపోతుంటే "వాళ్ళకేం జవాబు రాయమన్నావు ?" అంటూ ప్రశ్నించింది రాజమ్మ.

"ఈ సంబంధం నాకు యిష్టం లేదమ్మా" నిశ్చలంగా జవాబు చెప్పేడు ప్రకాశం.

"అది కాదురా....వారికి ఒక్కతే ఆడపిల్లట. కాస్త ఆస్తిపాస్తులు ఉన్నవారేనట....పైగా...."

" ఆ విషయాలన్నీ ఉన్నాయి."

"మరి...."

"డబ్బుని ఎరచూపి మనిషిని ఆకట్టుకోవాలనుకునే మనుషులపట్ల నాకు గౌరవం లేదమ్మా. వారు ఇవన్నీ రాయకుండా మామ్మూలుగా పెళ్ళిచూపులకు రమ్మంటే వెళ్లిచూసి వచ్చేవాడినేమో, పిల్ల నచ్చడం, నచ్చకపోవడం మాట అటుంచి, ఆ కాబోయే అల్లుడు అనుకొన్న వ్యక్తికి వారిచ్చేవిలువచూస్తే నాకు కడుపులో కలుపుతున్నట్లుఉంది. డబ్బుకుదాసులు కానివారు ఈ ప్రపంచంలో ఎవరైనా ఉన్నారా ! అన్న ఛాలెంజిలా వుంది వారి ధోరణి."

"నువ్వేమో అంటున్నావు కాని, వాళ్ళన్న మాటలలో నాకేం తప్పు కన్పించటంలేదు. పిల్ల నిచ్చి సంబంధం కలుపుకోవాలనుకొన్నప్పుడు తమ మంచి చెడ్డలు ఎదుటివారికి చెప్పడంలో బేసవుబు ఎక్కడుంది ? ఇంతకీ ఆస్తిని, అమ్మాయిని నీ చేతిలో పెడ్తామంటున్నారే కాని, నిన్నేం వారింటికి ఇల్లరికం రమ్మనడం లేదుకదా?"

ప్రకాశం చురుకుగా తల్లి వైపు చూసి "అమ్మా నువ్వు ఊరునుంచి రాగానే అడగాలనుకొని మరచిపోయేను. మీ బుచ్చి మామయ్య పెళ్ళాం కులాసాగా ఉందా?" అన్నాడు అప్పుడే ఆ విషయం గుర్తు కొచ్చింది అన్న ధోరణిలో.

కొడుకు అప్పుడు ఆ విషయం ఎందుకుఎత్తేడో తెలుసు కోలేనంత అమాయకురాలు కాదు రాజమ్మ. ఆమె చివరి మేనమామపెళ్ళాం వెంకట లక్ష్మి, కలిగినవారింటి పిల్ల. ధన, ధాన్యాలను వెంటబెట్టుకొచ్చేనన్న అధి కారంతో భర్తనిరాత్రి, పగలు అదుపాజ్ఞల్లో ఉంచేందుకుప్రయత్నిస్తూ,అతడి ప్రతిమాటను, చేతను తను డబ్బిచ్చికొన్నట్లు శాసిస్తుంటుంది. రామరాజుకి కావలసింది డబ్బు. దానివల్ల నలుగురిలో వచ్చే గౌరవం పెళ్ళాం ఎంత ఈసడించి పారేసినా తేలిగ్గా నవ్వేసి ఊరుకొంటాడు. "పిచ్చిది ఏదో అలా వాగుతుంది కాని నేనంటే దానికి చచ్చేంతప్రేమ, అభిమానం" అంటూ పెళ్ళాన్ని వెనకేసుకొస్తుంటాడు అతడు.

ఆ మాట నిజమే కావచ్చు, కాని ప్రతిక్షణం ఇంట్లో ఆడది అలా ఊదరగొట్టి, సాధిస్తుంటే భరించడం కష్టమే, అనుకొంటారు చూచినవాళ్ళు.

''నీఇష్టం నాయనా, నీ జీవితం....వచ్చే అవకాశాలు నువ్వు చూసుకోవాలి కాని నేనేం చెప్పను? ఇంకా పై చదువులు చదువుకోవా లనుకొన్నా, పై దేశాలకి వెళ్ళి రావాలనుకున్నా...."

''అదన్నమాట అసలు సంగతి. రాజమ్మ కొడుకు ఇంత చదువు చదివి....అంత ఉద్యోగం చేస్తూ....'' విషయాన్ని పక్కదారులు పట్టించి పరిహాసాలకిందికి లాగేడు ప్రకాశం.

ఆ ధోరణిలో ఉన్న కొడుకుచేత ఔననిపించడం అంత సులువైన పనికాదని అప్పటికి ఆ ప్రస్తావన ఆపివేసింది రాజమ్మ.

*    *    *

రెండు మూడురోజులు మనసులో కదులుతున్నా, ఆ మాటని తిరిగి ప్రస్తావించలేదు రాజమ్మ. కొడుకు మరి కొంచెం ఆలోచించుకొని తనంత తానుగా కదుపుతాడేమో అనుకొంది.

కాని ప్రకాశం ఆ విషయంలో ఒక నిర్ణయం జరిగిపోయినట్టే భావించి మళ్ళా మాట్లాడలేదు.

ముసుగులో గుద్దులాటలా మరొక వారం గడిచిపోయింది. ఉత్తరానికి ఇంతకాలం జవాబు రాయకుండా ఉండడం మర్యాదగా ఉండదని ఆ రోజు రాత్రి భోజనాలు అయేక తనే ఆ విషయం మళ్లా కదిపింది.

"ఆ జగన్నాధంగారి ఉత్తరానికి రేపైనా జవాబు రాసిపడేయాలి" నీళ్ళచెంబు కొడుకు మంచంపక్కగా పెడుతూ తనలో తను అనుకొంటు న్నట్లు అంది రాజమ్మ.

"దానికేం రాసి పడేయి. నా డ్రాయర్లో కవర్లున్నాయి" అన్నాడు ప్రకాశం.

"ఏమని రాయమంటావో, అదికూడా చెప్తే సంతోషిస్తాను."

"ఏముంది....కట్నకానుకలు నచ్చకపోతే రాసేమాట ఏదో ఉంది కదూ ? మావాడికి ఇప్పుడప్పుడే పెళ్లి చెయ్యాలనుకోలేదనో ........ ఇంకేదో...."

"కాని మనకి కట్న కానుకల పట్టింపులేదుగా."

"పోనీ....ఇంకోలా రాయి. మా అబ్బాయికి మీపిల్ల ఇష్టంలేదు. ఏవైనా మంచి సంబంధాలు మాకళ్ళపడితే మీకు తెలియజేస్తాము అంటూ"

"అఘోరించినట్టే ఉంది. వాళ్ళపిల్లని మనం చేసుకుంటామేమోనని ఉత్తరం రాసేరుకాని మనని పెళ్లి సంబంధాలు చూచిపెట్టమనా?"

"అయితే నీ కెలా బాగుంటుందని తోస్తే అలా రాసి పడేయి...."

"ఒక్కమాట చెప్పు ప్రకాశం. నీకీ సంబంధం అంటే ఇష్టం

లేదంటున్నావు. అందుకు నువ్వు చెప్పిన కారణంకాక ఇంకేమైనా ఉందా ?''

ప్రకాశం తల్లిమాటకి అవును, కాదు, అంటూ జవాబు చెప్పలేదు. వినీవిననట్లు ఊరుకున్నాడు.

''వాళ్లు ఇల్లు, పొలం ఇచ్చి, కోరినంత కట్నం ఇస్తాము; పిల్ల నచ్చితే చేసుకోండంటున్నారు. పిల్లని చూడకుండా నచ్చలేదనడం సమంజసంగా లేదు. పోనీ నువ్వు ఇంకెవరినైనా చేసుకోవాలనుకొంటుంటే ఆ మాటయినా చెప్పు''

ఈసారీ తల్లిమాటకి ప్రకాశం నోటినుంచి జవాబు రాలేదు. ఎదురుగా టేబిలుమీద పడివున్న పుస్తకాల్ని సర్దడంలో నిమగ్నుడై పోయేడు.

కొడుకు మాట్లాడకపోవడమే శుభ సూచన అనుకొని రాజమ్మ తన హితబోధ తిరిగి ప్రారంభించింది.

''నువ్వు ఉద్యోగం చేసుకొంటూ నలుగురిలో తిరుగుతున్నవాడివి. ప్రాజ్ఞత పొంది, ప్రపంచం తీరుతెన్నులు చూస్తున్నవాడివి. నిజానికి నీ పెళ్లి విషయంలో నేను చెప్పవలసిన అవసరం లేదు. అయినా తల్లిగా పిల్లలకి మంచి అనుకొన్నది చెప్పడం నా విధి. అందుకే ఇంకోసారి బాగా ఆలోచించుకో మంటున్నాను. జగన్నాధరావుగారు ముందూ, వెనకా పచ్చగా ఉన్నవాడు. మంచి సంప్రదాయమైన కుటుంబం. ఏడాదికిందట ఒక పెళ్లిలో ఆ పిల్లనికూడా చూసేను. పెద్ద అందగత్తె అని చెప్పుకోడానికి కాకపోయినా కళగా, ఆకర్షణీయంగా ఉంది పిల్ల.

''ఈ రోజుల్లో అంగబలం. అర్థబలం ఉన్నవాడే జీవితంలో ముందుకు తోసుకుపోగలుగుతున్నాడు. నువ్వు ఒంటరివాడివి. కాస్త అత్త వారి వంకయినా ఆదుకొనేందుకు నలుగురుంటే ....ఇదేదో నిన్ను నిర్బంధించడానికి చెప్తున్నాననుకోకు. కేవలం మరోసారి మంచీ చెడూ ఆలోచించమని మాత్రమే అంటున్నాను.''

అప్పటివరకు నోరు మెదపకుండా తల్లి హితబోధ వింటున్న

ప్రకాశం ఇంక ఏదో ఒకటి తను చెప్పవలసిన తరుణం వచ్చిందను కొన్నాడు. దాన్ని ఎలా మొదలుపెట్టాలా అని క్షణకాలం ఆలోచించి, ఓ చిన్న పొడిదగ్గు దగ్గి, "అమ్మా ఓ రోజున వర్షంలోతడుస్తూ ఒక అమ్మాయి దారినిపోతూంటే, లోపలికి పిలిచి కట్టుకొనేందుకు పొడిబట్టలిచ్చి, కాఫీ అదీ ఇచ్చి, వర్షం తగ్గేక సాగనంపేవు గుర్తుందా?" అన్నాడు.

"ఎందుకు గుర్తులేదు. ఆ వెనుక నువ్వుచూసి ఆ పిల్ల మీ కాలేజీ లోనే చదువుతున్నదని, నీకన్నా ఒకటి, రెండేళ్లా వెనుకగా ప్రవేశించిం దనీ చెప్పేవు .... ఆ పిల్లేనా?"

"ఆ .... ఆ అమ్మాయే. ఇప్పుడు బి. ఏ. పాసై, షార్టు హేండ్ నేర్చుకొని, ఏదో ప్రయివేటుకంపెనీలో ఉద్యోగం చేస్తున్నది."

కొడుకు ఆ పిల్ల విషయం ఆ సమయంలో కదిలించడంలో ఉన్న ఆంతర్యం ఏమిటో రాజమ్మ సులువుగానే గ్రహించింది. అయినా ఏ మాత్రం, పైకి తేలకుండా "పోనీలే .... కష్టపడి చదువుకొన్నందుకు వెంటనే నౌకరీ దొరికింది" అంది.

తల్లి చాలా గడుసుది. ఆ విషయం ప్రకాశానికి తెలుసు. తనకు తానుగా ఏ విషయంలోను వెలితిపడదు. ఆ మాట తన నోట చెప్పవల సిందే కాని ఏ విధానా ఆమెచేత అడిగించడం అసాధ్యం — అనుకొన్నాడు ప్రకాశం.

అయినా తనేం చిన్న పిల్లడు కాడు. పెళ్ళివిషయం తల్లిదగ్గర మాట్లాడడానికి సిగ్గెందుకు? ఆమె అభిప్రాయం ఆమె చెప్పింది. తనకు నచ్చిన పిల్లగురించి తను చెప్తున్నాడు. ఇందులో కంగారుపడేందుకి ఏముంది? ధైర్యంగా జవాబు చెప్పాలని తలఎత్తి, మళ్ళీ అంతలోనే ముఖం వాల్చుకుని "ఆ పిల్ల నాకునచ్చిందమ్మా" అంటూ ప్రశ్నించేడు.

"ఎవరో ఓ పిల్ల నచ్చగానే సరికాదురా ప్రకాశం! ఇంటికి కోడ లుగా రావలసిన ఆడపిల్ల గురించి ఇంకా ఎన్నో, తెలుసుకోవలిసి ఉంటుంది" అంది రాజమ్మ అవునూ, కాదూ అనకుండానే.

"ఈ జగన్నాధరావుగారి సంబంధం గురించి మనకెంత తెలుసో, లలితగురించి అంతకన్నా ఎక్కువే తెలుసు అమ్మా! వారికి పుట్టెడుకూటి బలగం ఉంటే, ఈ పిల్లకి ఒక తమ్ముడు, మేనమామ ఉన్నారు. ఆ పిల్లకి వరకట్నంగా పొలం, ఇల్లూ, ఇంకా నగా నట్రా పెట్టడానికి ఆ తల్లి దండ్రులు సిద్ధంగా ఉంటే, గుళ్లో పెళ్ళిచేసి కొబ్బరిబొండాం చేతపెట్టి అత్తవారింటికి అంపకం పెట్టడానికి లలిత మేనమామ తయారుగా ఉన్నాడు. ఇంక పిల్లగురించి అంటావా, అరగంట పెళ్ళిచూపులు జరిపి ఆ సంబంధం ఖాయం చేసుకొనేందుకు స్థిరపడగలిగితే ఈ రెండేళ్ళ పరిచయంలోను లలిత గురించి అంతకన్నా ఎక్కువే తెలుసుకొన్నానని చెప్ప గలను."

"నీకన్ని విధాలా నచ్చిన సంబంధం ఇదే అయితే ఇంకా ఆలోచన దేనికి? మంచిరోజు చూసి శుభం అనుకొంటే సరిపోతుంది" ఏ భావం వ్యక్తంకాని కంఠంతో అంది రాజమ్మ.

"నువ్వు అలా అంటీ ముట్టనట్టు మాట్లాడితే ఇది అయ్యే పని కాదమ్మా. ఈ ఇంటిలో ప్రస్తుతం ఉన్నది మనమిద్దరం. ఈ ఇంటికి రాబోయే మూడోవ్యక్తి మనిద్దరికీ నచ్చిఉండాలి. కోడలు యిటు కాలు పెట్టగానే అత్తగారికి అటు అంపకాలు అన్నట్లు తయారుకావడం నాకిష్టం లేదు."

"నీకా భయం అక్కర్లేదు నాయనా! ఏ పిల్లయినా నా కోడలు నాపట్ల ఆదరంగానే ప్రవర్తిస్తుంది." అంది రాజమ్మ.

తల్లి అన్నమాటలు అక్షరాలా నిజం అనుకున్నాడు ప్రకాశం. రాజమ్మ ఎదుటివారి మనసునిబట్టి నడుచుకుపోయే రకం. ఆమెతో ఎవ్వరూ విరోధం పెట్టుకోలేరు.

ఆ రాత్రి, తల్లి నిద్రపోయేవరకు లలితతో తను ఊహించుకొన్న జీవితం గురించి చెప్తూనే వున్నాడు ప్రకాశం. నిద్రకి కళ్లు మూసుకుపోయే

వరకు అవునూ, కాదూ అనకుండా అలా "ఊ" కొడ్తూ వింటూనే ఉంది రాజమ్మ.

* * *

లలిత చిన్నతనంలోనే తల్లి పోయింది. తమ్ముడు రామకోటి రెండేళ్ళ పిల్లవాడుగా ఉండగా అంతవరకు పెంచిన అమ్మమ్మ కాలధర్మం పొందింది. మరి పదేళ్ళనాడు తండ్రి పరలోకానికి తరలిపోతూ ఏవో కొంత ఆస్తిని, పిల్లల్ని బావమరది చేతిలో పెట్టి, "వీళ్ళని పెంచి పెద్దచేసే పూచీ నీదే'' అంటూ కళ్లు మూసేడు.

మేనమామకి పెళ్ళాం పిల్లలు లేరు. ఎప్పుడు చూసినా నల్లమందు నిషాలో కళ్ళు మూతలు పడ్తుంటే ధ్యానముద్రలో ఉన్న యోగిలా ఉంటాడు. నిజానికి లలిత తండ్రి కోరినట్లు పిల్లల్ని అతడు పెంచిందేం లేదు. ఆయువు గట్టిది కాబట్టి బ్రతికి బట్టగట్టేరు. తెలివితేటలున్నాయి కాబట్టి, పరీక్షలు పాసయ్యేరు.

లలిత తమ్ముడు రామకోటి ఆ ఏడు డిగ్రీ చదువులోకి వచ్చేడు. అది కాస్తా చేతిలో పడితే వారి జీవితాలకోమార్గం దొరికినట్లే. తండ్రి యిచ్చిన సొమ్ము అంతవరకు వారి చదువులకి, మేనమామ నల్లమందు ఖర్చుకి సరిపోయింది. అప్పుడు బండి నడుస్తున్నది లలిత ఆర్జనపైనే.

లలిత మేనమామ, దత్తుడు. కన్నవారివంక అన్నదమ్ములు, అన్న చెల్లెళ్లు చాలమందే ఉన్నారు. ఇతడు ఇల్లు చొచ్చుకు వెళితే అన్నం పెట్టి ఆదరించేపాటి ఆర్థిక స్తోమత ఉన్నవారే వారంతా. అభివృద్ధిలోకి వస్తాడని దత్తు పంపితే అన్నోదకాలకి లేకుండా ఆస్తిఅంతా పాడుచేసుకొన్నాడు. ఇతడు. ఉన్నదాన్నే పెంచుకొని బాగుపడ్డారు వాళ్లు.

"మామయ్యని దత్తత చేసుకొనే సరికి తాతగారికి ఆస్తి ఉండేదట. అంతా వయసులో ఉన్నప్పటి సరదాలకి, నల్లమందుకి వెచ్చబెట్టేసేడు మామయ్య. ఇప్పటికీ స్వగ్రామంలో ఏకొద్దో, గొప్పో భూమి మిగిలే

ఉంటుంది. అయినా మామయ్య దానిగురించి పట్టించుకోడు. వారసులు అందిందే దక్కుడు అన్నట్లు ఆరగిస్తున్నారు." అంటుంది లలిత.

ప్రకాశం ఆరోజు కాలేజీనుంచి కాస్త ఆలస్యంగా వస్తున్నాడు. మెయిన్‌రోడ్డు ఆ వేళప్పుడు మరీ రద్దీగా ఉంటుందని పక్కసందులోకి తప్పుకొన్నాడు. లలిత ఇల్లు ఆ సందులోనే ఉంది. ఆ విషయం ప్రకాశానికి తెలుసు. ఒకసారి కాలేజీ వార్షికోత్సవాల్లో, డ్రామా టిక్కెట్లు అమ్మడానిక చదువుకొనే రోజుల్లో, లలిత మామయ్యదగ్గరికి వెళ్ళేడు.

ఆయన "నా దగ్గర డబ్బులేం ఉండవు బాబూ, ఇటీవల అన్నీ మా లలితే చూచుకొంటున్నాది" అంటూ మొండిచెయ్యి చూపించేడు. అటు తరువాత లలితతో పరిచయం అయేక ఆ విషయం నిజమే అని తెలియవచ్చింది.

''పాపం ఉత్తచేతులతో తిరిగి వచ్చేరన్న మాట. ఇంకా నయం; నల్లమందు కొట్టువాడిచేత ఇప్పిస్తానని లాక్కుపోలేదు'' అంది లలిత నవ్వుతూ.

''అదేమిటి !'' అన్నాడు ప్రకాశం.

''నిషాలో అడిగిన వారికల్లా జేబులో ఉన్నకాడికి డబ్బులు పంచిపెడ్తున్నాడని తెలిసి అతడికి డబ్బులు అందకుండా చేసేను. దానితో ఎవరైనా అడిగితే 'నా పేరుచెప్పి అప్పలసామి దగ్గర రూపాయి తీసుకోండి, అర్ధ తీసుకోండి' అంటూ అక్కడికి పంపేవాడు.

''ఆ అప్పలసామి మామయ్యకు తగినవాడే. అడిగినవానికల్లా డబ్బిచ్చి, ఆ వెనుక నా పీకలమీద కూర్చునేవాడు. ఇకముందు ఇటువంటి అప్పులు తీర్చనని అతడితో ఖచ్చితంగా చెప్పేను. అప్పుడు మామయ్య కాస్త తెలివిలో ఉన్నాడు. 'నేను ఇయ్యమనిచెప్పినా ఇయ్యకు అప్పలసామీ. పాపం చిన్నపిల్ల తీర్చలేక చస్తున్నాది.' అన్నాడు'' అంటూ ఆ కథంతా వివరించి చెప్పింది లలిత.

ఆ వెనుక ఒకటి, రెండుసార్లు అతడిని చూసేక ఆ నల్లమందు

దురలవాటువల్ల ఏది పట్టించుకోకుండా అలా తయారైనా, మనిషి మంచి వాడే అన్న భావం కలిగించి ప్రకాశానికి.

ఇంకా పదిగజాలు మార్గంలో ఉండగానే లలిత ఇంటివైపు ప్రకాశం దృష్టి మళ్లింది. లలిత గుమ్మంలో నిల్చుని ఎదురింటి అమ్మాయితో ఏదో మాట్లాడుతున్నది. అలవాటు ప్రకారం
కునికిపాట్లు పడ్తున్నాడు.

"నమస్కారమండి" అన్నాడు ప్రకాశం రోడ్డుమీద నిలచే చేతులు డిస్తూ.

"అదేమిటి అలా తప్పించుకుపోతున్నారు లోపలికి రండి" అంది లలిత.

"మీయింటికిరావాలని బైలుదేరలేదు."

"అయినా కాళ్ళు ఇటే లాక్కొచ్చాయి. చూసేరా ? మీకంటె మీ కాళ్ళ చాలా మంచివి" అంది లలిత నవ్వుతూ.

"మీయింటికి వస్తే మంచివాడిని, లేకుంటే చెడ్డవాడిన్నీ అన్నమాట. మీ తీర్పు చాలా తమాషాగా ఉంది."

"ఆ రోజు మీ అమ్మగారు చేసిన ఆతిథ్యం గురించి చెప్పినప్పటి నుంచి, మామయ్య మిమ్మల్ని చూడాలంటున్నాడు. 'నువ్వు ఇదివరలో చూసేవు మామయ్యా, ఇంతకుపూర్వం మనింటికి ఒకటి రెండుసార్లు వచ్చేరు.' అంటే అతడు గుర్తుచేసుకోలేక పోతున్నాడు."

"ఈరోజుకూడా పరిస్థితి అందుకు భిన్నంగా ఉన్నట్లులేదే" వరండావైపు దృష్టి మళ్ళిస్తూ అన్నాడు ప్రకాశం.

"లేదు; ఈరోజు వంట్లో సరిగాలేదని మోతాదుకొంచెం తగ్గించేడు. ఊరకే అలా కళ్ల మూసుకుపడుకొన్నాడు. కాని మరీ అంత మైకంలో లేడు. రండి, పలకరించి వెళ్లిపోదురుగాని" లలిత ఇంటిలోకి దారి తీసింది.

ప్రకాశం ఆమెని అనుసరించేడు.

"మామయ్యా ! మామయ్యా" అంటూ తట్టి లేపింది లలిత.

ఉలికిపాటుతో కళ్లు తెరిచేడు అతడు.

"ఇదిగో ప్రకాశంగారు వచ్చేరు. ఆ రోజు రాజమ్మగారి గురించి చెప్పేనే ఆవిడ కొడుకు...."

"మా లలిత అన్నట్లు ఎర్రగా, బుర్రగా బాగున్నావు. నీ పేరు ప్రకాశమా బాబూ"

"అవునండీ." అంటూ అతడి ప్రశ్నకి జవాబు చెప్తూ లలితవైపు చూసేడు ప్రకాశం.

లలిత తల వాల్చి నేలచూపులు చూసింది. ఆమె బుగ్గలమీద సంధ్య కాంతి పడి, ఎర్రగా మెరిసింది.

"మీ అమ్మగారు చాలామంచివారట. లలిత చెప్పింది. అప్పటి నుంచి నిన్ను చూడాలనుకొంటూనే వున్నాను. ఇప్పటికి వచ్చేవు."

అమ్మ మంచితనానికి కొడుకుని చూడాలనుకోడానికి సంబంధ మేమిటి ? చిన్నగా నవ్వి ఊరుకొన్నాడు ప్రకాశం.

"ఏం చదువుతున్నావు?"

"ఉద్యోగం చేస్తున్నానండీ"

"కలెక్టరాఫీసులోనా ?"

"కాదు కాలేజీలో .... పిల్లలకి చదువు చెప్తాను."

"మీ స్వగ్రామం"

"నాకు పదేళ్లవచ్చినప్పటినుంచి ఇక్కడే ఉన్నాం. ఇదే అనుకొంటే సరి ...."

"అహ .... అదేం కాదు .... ఆస్తిపాస్తులు .... ఇళ్లు వాకిళ్ళు అవీ...."

"అటువంటి బాదరబంది మాకేం లేదండి .... ఈ వూరు వచ్చే సరికి ఏ కాస్తో బ్యాంకులో ఉండేది .... అదికాస్తా నా చదువుతో సరి. ఇంక మిగిలింది నాకు మా అమ్మ. మా అమ్మకి నేను" అన్నాడు ప్రకాశం నవ్వుతూ.

ఇంక నీ గురించి తెలుసుకోవలసింది ఏమీ లేదన్నట్లు లలిత మామయ్య కళ్ళకి పరదాలు దింపేసేడు.

"పదండి. ఇంటర్వ్యూ అయిపోయింది" అంది లలిత.

"దేనికి" అన్నాడు ప్రకాశం.

"ఇంకాతెలియలేదా? ఇది ఈమధ్యమామయ్యకి ఒక హాబీగా పరిణమించింది. కాస్త తెలివిగా ఉన్న సమయంలో ఇంటికి ఎవరు వచ్చినా ఇవే ప్రశ్నలు"

"అంటే మేనకోడలి పెళ్ళి ప్రయత్నాలన్న మాట!''

"అటువంటిదే. నా పెళ్ళి కానిచ్చి తను సన్యాసుల్లో కలిసిపోతాట్ట. ప్రస్తుతం అతడి మనసులో తిరుగుతున్న ఆలోచన అది. "మీనాన్న నాకు అప్పగించేడమ్మా! నీ పెళ్ళిచెయ్యకుండా కన్నుమూస్తే స్వర్గంలో నాతో పోట్లాట పెట్టుకుంటాడు" అంటాడు.

"సన్యాసుల్లో కలుస్తే,మరి నల్లమందు మాటో?" తమాషాకి ప్రశ్నించాడు ప్రకాశం.

"గంజాయి మత్తు ఇందుకి తక్కువదంటారా? అసలు ఇంతకీ అది జరిగేపనేనా" అంది లలిత.

''మీరు పెళ్ళిచేసుకొని అత్తారింటికి వెళ్ళిపోతే ఏం చేస్తారు మరి"

''ఆయనికి చాలా బలగం ఉందని చెప్పేగా.... ఎవరి దగ్గరికి వెళ్ళినా ఉంచుకొంటారు. నాకు మామయ్య చింతలేదు. రామకోటి శ్రద్ధగా చదువుకొని ఆ పరీక్ష కాస్తా పాసయింవనిపించుకొంటే మాకింకేం కొరత ఉండదు" అంది లలిత.

ఆస్తిపాస్తులు లేవు. ఆదుకునే బంధువులు లేరు. అయినా మాకే కొరత ఉండదంటూ ఎంత ధైర్యంగా చెప్తున్నాది ఈ పిల్ల అనుకున్నాడు ప్రకాశం.

అసలు ఆమె పెరిగిన వాతావరణమే ఆమెని అంత నిర్భయ మనస్కురాల్నిగా తీర్చిదిద్దింది. ఆమెకే అటువంటి గుండె నిబ్బరం లేకపోతే ఆ నల్లమందు మామయ్యపక్క తనూ కునికి పాట్లుపడుతూ కూర్చుని

ఉండేది. అడుగడుక్కీ ఎదురునిలిచే అడ్డంకుల్ని తప్పించుకొంటూ, బ్రతుకు బండిని ముందుకు లాక్కుపోవడం ఆమె అయిదేళ్ళ వయసులో తల్లి చనిపోయిననాటినుండే నేర్చుకుంది. అటుతరువాత తండ్రి పక్కనున్నా, మేనమామ ఇంటపెరిగినా, వారంతా హంగుదారులుగా మాత్రమే మిగిలిపోయేరు.

ఆ జీవితక్షనాటకానికి నాందీ ప్రస్తావనలుచేసి, తెరయెత్తింది లలిత మాత్రమే.

కాస్తసేపుక్షఈ మాట, ఆమాట మాట్లాడి ప్రకాశం బైటికివచ్చేడు.

"పదండి ఆవీధి మొదట్లో కిరాణాకొట్టు దాకా నేనూ వస్తాను." అంది లలిత అతడితోపాటు అడుగులువేస్తూ.

ఆ సమయంలో ధైర్యాన్ని చిక్కబట్టుకొని "ఈ ఉద్యోగానికి నేను అర్జీ పెట్టుకోవచ్చునా" అన్నాడు ప్రకాశం చిన్నగా.

"పెట్టండి ఆలోచిస్తాం" అంది లలిత నవ్వుతూ.

లలిత ఆమాట అన్నతీరులో, చూసినచూపులో అసలు విషయం తేలిపోయింది ప్రకాశానికి.

"మీరు కాస్త రికెమెండేషన్...."

"చేస్తే ఏమిస్తారు?"

"తప్పు....తప్పు లంచమా? మిమ్మల్నీ నన్నుకూడా జైల్లో తోసేస్తారు."

"నలుగురూ చూసేలా ఇమ్మన్నానా? పుచ్చుకుంటున్న ఆందరూ ఎలా పుచ్చుకొంటున్నారో అలాగే టేబిలు కిందనుంచి."

"పండు చేతిలో పడ్డాక...."

"మాట తప్పకూడదు సుమండీ."

"అబ్బే మాఇంటా వంటాలేదు"

నవ్వుతూ నమస్కారంపెట్టి సెలవుతీసుకొన్నాడు ప్రకాశం. లలిత అన్నట్లు నాకాళ్ళు ఎంతమంచివి; ఏమీ ఎరగనట్లు నన్ను అటు నడిపించి ఎంత తమాషా చేసేయి. ఇటువంటి అవకాశమే రాకుంటే, ఈమాట లలిత

చెవిని వెయ్యడానికి తను ఎన్ని పడిపాట్లు పడవలసి ఉండేది? అప్పటికైనా లలిత మనసు ఇంతలా అద్దంలో బొమ్మలా కన్పించి ఉండేదా ?

ఎర్రగా బుర్రగా ఉంటాడని లలితే చెప్పిందట. అంటే ఈ ఎర్ర బుర్రని అబ్బాయి మీద ఆమె చూపులు పడ్డాయన్నమాట. వర్షం నెపాన ఇంట్లో ప్రవేశించి, కాబోయే అత్తగారి మంచిచెడ్డలు కూడా పరిశీలించుకొందన్నమాట. అమ్మ లలితా ! ప్రకాశం....ప్రకాశం అంటూ కబుర్లు చెప్తూ తిరుగతూంటే ఏమిటో అనుకున్నాను. ఈ ప్రకాశాన్ని పట్టడానికి ఎంత పన్నాగము పన్నేవు? ఎలాటి వల విసిరేవు ?

ఆలోచనల మధ్య ప్రకాశం ఇల్లు దాటి వెళ్ళిపోతుంటే రాజమ్మ కేకవేసి పిలిచింది. "అటలా ఎక్కడికిరా వెళ్ళిపోతున్నావు" అంటూ.

*    *    *

రోజులు గడుస్తున్నాయి. జగన్నాధరావుగారి పిల్ల విషయం ఇంకా రాజమ్మమనసులో నలుగుతూనే ఉంది. "ఒక నెల రోజుల్లో మీకు ఏ భోగట్టా రాస్తాను?" అంటూ వారికి ఒక ఉత్తరం రాసి పడేసింది. కాని ఆ విషయం కొడుకుతో చెప్పలేదు. ఈనెల రోజుల్లో కొడుకుని ఏదో విధంగా ఒప్పించగలనని ఆమె ఆశ.

ప్రకాశం తన ఆలోచనల్లో తను ఉన్నాడు. మళ్ళా జగన్నాధరావు గారి సంబంధం విషయం మొఖటికి రాకుండా పెళ్ళి ప్రస్తావన తల్లిముందు తేవడం ఎలాగా అని సతమతపడ్తున్నాడు.

చివరికి ఒకరోజు రాత్రి ప్రకాశమే తెగించి అడుగు ముందుకి కదిపేడు. ఏ విధాన అయినా ఆ రాత్రి లలితతో తన వివాహ విషయం తల్లిచేత ఒప్పించాలని నిశ్చయించుకొన్నాడు.

రాజమ్మకూడా ఆ రోజు మాటలకి సుముఖంగా ఉన్నట్లే ఉంది. రోజూ ప్రకాశం భోజనం కాగానే తన మంచం వరండాలోవేసుకుని ఏదో చదువుకొంటూ పడుకొనేది. ఆరోజు అలవాటుకి భిన్నంగా కొడుకు గది లోకివచ్చి కూర్చుంది.

తల్లి అలావచ్చి కూర్చోడంచూసి ముందు ఎటువంటి ఉపోద్ఘాతం లేకుండా అసలు విషయం మొదలుపెట్టేడు ప్రకాశం. కొడుకు తన మనసులో ఉన్నదంతా చెప్పనీ అన్నట్లు వింటూ కూర్చుంది రాజమ్మ.

"ఎంతసేపు ఇతరులడబ్బుమీద, వారి దయాదాక్షిణ్యాలమీద ఆధారపడే ప్రతికేమనిషికి ఒక వ్యక్తిత్వం అంటూ ఎప్పటికీ ఏర్పడదు. మనిషి తన స్వశక్తి మీద ఆధారపడి సాధించిన కార్యం అది అల్పమైనదైనా దానివల్లతృప్తికలుగుతుంది. తనశక్తిసామర్థ్యాలపట్ల నమ్మకమేర్పడుతుంది.

"ఈరోజు జగన్నాథరావుగారు అల్లుడికి పదివేలుకట్నం ఇస్తారు. బ్రతుకంతా దానితో అయిపోదుకదా? ధనం వల్ల వచ్చేసుఖాలకి అలవాటు పడతాము.... ఆ వెనుక సంగతి ఏమిటి? అ ఇల్లూ, పొలం వస్తుందని వారి చాపుకోరుతూ కూర్చోడం, లేకపోతే మా అత్తవారు ఇంతవారు, అంత వారని భట్రాజులా పొగుడుతూ వారిని మంచి చేసుకోడానికి పడిపాట్లు పడడం, ఇవన్నీ నావల్ల అయేపనులు కావమ్మా

"ఇంటికి వచ్చేసరికల్లా సిరిసంపదల మధ్య పుట్టి పెరిగిన ఆ పిల్ల. మా పుట్టింట ఇలా ఉంటాము. అలా చేసుకొంటాము. అంటూ దీర్ఘాలు తీస్తుంటే ఆమెకి అలవాటుపడిన ఆ జీవితాన్ని అందివ్వలేక, భర్తననే అధికారంతో ఆమె నోరు నొక్కలేక, ఇంటిని కదనరంగంగా మార్చి, నలుగురిలో నవ్వులపాలు కాలేక, నన్నునేనే అసహ్యించుకునే పరిస్థితికి దిగజారవలసి వస్తుంది.

'నేను ఇవన్నీ బాగా ఆలోచించే ఆ సబంధం ఒద్దన్నది. నాది మొండి పట్టుదలగా భావించక కాస్త నిదానంగా ఆలోచిస్తే.... నా అభిప్రాయం సరియైనదే అని...."

"నేను నీమాట కాదన్నదెప్పుడు ప్రకాశం. ఆర్థికంగా కాస్త కలిసి వచ్చే సంబంధం.... ముందు....ముందు....పిల్లా, పాపా పుట్టుకొచ్చినా ముద్దుముచ్చట్లు జరుగుతాయని.... అస్తమానం కాణీకి, పరక్కి వెతుక్కోనక్కర లేదనీ....అనుకొన్నాను కాని...."

"అటువంటి ఇబ్బందులేం ఉండవు అమ్మా! భార్యా, భర్తలు

ఇద్దరూ ఉద్యోగాలు చేస్తుంటే వచ్చేసొమ్ము సంసారానికి సరిపోకపోదు. అవసరాన్ని అదుపులోఉంచుకొంటే మనం ఆర్థికంగాఏనాటికీ ఇబ్బందిపడే పరిస్థితి కలుగదు''

''తల్లిగా నేను కోరేది అంతకన్నా ఏముంటుంది నాయనా ! కొన్ని విషయాలు ముందు ఆలోచించేందుకు ఎంతో బాగుంటాయి. కాని ఆచరణ లోకి వచ్చేసరికి ఏవేవో అడ్డంకులు, ఎదురుచూడని సమస్యలు తలెత్తు తాయి. వాటినన్నిటినీనిశ్చలంగా నిర్మలంగా ఆలోచించిపరిష్కరించుకోగల శక్తి,నమ్మకం మనిషికుంటే అప్పుడుఏవారితోక్కైనా బ్రతుకులో బంగారం పండుతుంది. నీకటువంటి శక్తి నిమ్మని భగవంతుణ్ణి రోజూ ప్రార్థిస్తూం టాను. తల్లిగా నీకు నే చెయ్యగల సాయం అదే" అంది రాజమ్మ కొడు కుని ఆశీర్వదిస్తున్న ధోరణిలో.

ప్రకాశానికి పదేళ్ళ వచ్చేవరకు తల్లీ తండ్రి, గురువు అన్నీ తానే అయి పెంచుకొచ్చింది రాజమ్మ. పదిహేనేళ్ళనాడు ఉన్న కాస్త పొలం అమ్మి కొడుకుని చదివించాలని రాజమ్మ నిశ్చయించుకొన్ననాడు, సవతి కూతురు సావిత్రి, అల్లుడు అరుణాచలం ఆ చర్యని వ్యతిరేకించారు.

"నాన్న పేరు మీదుగా, ఆ పాటి మడిచెక్క మిగలనీ పిన్నీ" అంది సావిత్రి.

"మీ నాన్న పేరు నిలపడానికి మీ తమ్ముడు పెరుగుతున్నాడమ్మా. వాడిని పెంచి, పెద్దచేసి విద్యాబుద్ధులు చెప్పించడం కన్నా, మీ నాన్నగారి ఆత్మ తృప్తికి నేను చెయ్యగలిగింది ఇంకేమీ లేదనుకుంటాను. నీ ఆశ నాకు తెలుసు సావిత్రీ. ఆ భూమిమీదవచ్చే ఫలసాయంలో భాగం నువ్వు అనుభవిస్తున్నావు. కాని మీ తమ్ముడు పెరిగి పెద్ద ఉద్యోగస్తుడవుతే ఇంతకన్నా ఎక్కువగానే నిన్ను ఆదుకొంటాడు.'' అంటూ ఆమెని సమా ధానపరచింది రాజమ్మ.

ఆనాటినుంచి గురువుగా హితబోధలు చేస్తూ, తల్లిగా మంచి, చెడ్డలు చూస్తూ ప్రకాశాన్ని పెంచుకొచ్చింది రాజమ్మ. ప్రతిచిన్న విష

యానికి విశదపరచి చెప్పడం రాజమ్మకి ఎంత అలవాటో తల్లి ఏం చెప్పినా తలవంచి వినడం ప్రకాశానికి అంత పరిపాటి అయింది.

ఒక్కొక్కసారి అంతా చెప్పి రాజమ్మ "నేను చెప్పడం, నువ్వు వినడం అన్న ఆ దశ దాటిపోయింది ప్రకాశం. ఇంక పరిస్థితి అటునుంచి ఇటు మార్చవలసిన సమయం వచ్చింది. ఇంత చదువు చదివి, ఉద్యోగం చేసుకుంటున్న నీకు,ఇంకా చిన్న పిల్లడికిచెప్పినట్లు నేను చెప్పడ మేమిటి?" అంటూ తేలిగా నవ్వేసేది.

మాటకి అలాఅన్నా ఆ అలవాటు తల్లీ, కొడుకు లిద్దరికీ తప్పిపోలేదు.

లలితను తను పెళ్ళి చేసుకొంటే పశ్చాత్తాప పడవలసిన అవసరం జీవితంలో ఎన్నటికీ కలగదనీ, ఆ విషయంలో తన కెటువంటి అపనమ్మకం లేదనీ తల్లి మనసుకి హత్తేలా మళ్ళామళ్ళా చెప్పేడు ప్రకాశం.

"సరే....చాలా రాత్రయింది. ఇంక పడుకో. బావకి ఉత్తరం రాస్తే వచ్చి, లలిత మామయ్యగారితో మాట్లాడుతాడు. వారికి ఇష్టమైతే అటు తరువాత ముహూర్తాలు అవీ చూసుకోవచ్చు." అంటూ అప్పటికి ఆ సంభాషణ ఆపివేసింది రాజమ్మ.

దానితో తల్లీ కొడుకుల మాటలైతే ఆగిపోయాయి కాని, ఆ మాటల సారాంశమే ఇద్దరి మనసుల్లో చాలాసేపు సుళ్ళు తిరుగుతూ ఉంది.

కొడుకు బ్రతుకు భారాన్ని ఇంకొక వ్యక్తి చేతిలో పెట్టి, తను పక్కకి తప్పుకోనున్న ఆ తరుణంలో గడచిన జీవితాన్ని మననం చేసుకుంటూ ఎంతోసేపు అలా మెలకువగానే ఉండిపోయింది రాజమ్మ.

తల్లిని ఆమె ఆలోచనలకి వదలి, లలిత, తాను పయనించబోయే పంచరంగుల జీవిత బాటని పరవశంతో చూస్తూ, అందుగురించిన అందమైన కలలు కంటూ మరునాడు ఉదయం ఎనిమిది గంటల వరకూ నిద్రపోయేడు ప్రకాశం.

"రాత్రి నిద్రమాని తెల్లవారి జాము పొద్దు ఎక్కేవరకూ నిద్రపోతానంటే ఎలారా? ముత్యాలు ఇల్లు తుడవడానికి వచ్చింది....లే....కావా

లంటే మధ్యాహ్నం మళ్ళీ పడుకుందువుగాని....ఈరోజు ఆదివారమేగా అంది రాజమ్మ కొడుకుని తట్టిలేపుతూ.

తల్లి మేలుకొలుపుతో నిద్రని అప్పటి మటుకి పక్కకి నెట్టి, పెరట్లోకి దారి తీసేడు ప్రకాశం.

పచ్చని ఆకులమధ్య నందివర్ధనం పువ్వులు రోజుకన్నా తెల్లగా కన్పించేయి. ముద్దమందారం లోంచి తేనె పొంగి పొరలి, రేకులనుంచి బొట్లు బొట్లుగా కారుతున్నట్లు అనిపించింది.

ఈ రోజు పువ్వులు ఎంత నిర్మలంగా ఉన్నాయో.... ఆకులు కూడా....రాత్రి వానలో దుమ్ము ధూళీ కడుక్కుపోయి ఉంటుంది అనుకొన్నాడు ప్రకాశం.

రాత్రి వాన పడిందా ?

పడేవుంటుంది. లేకపోతే ఆకాశం ఇంత నీలంగా, ఇంత నిర్మలంగా, ఉండేది కాదు. ఈ మట్టిలోంచి ఇంత కమ్మని వాసనలు వచ్చేవి కావు. బాదంచెట్టు ఆకులు అంత ఎర్రగా మెరిసేవి కావు.... రాత్రి తప్పక వర్షం పడే ఉండాలి.

"అమ్మా రాత్రి బాగా వర్షం పడిందా?"

కాఫి తాగుతూ తల్లిని ప్రశ్నించేడు.

"లేదురా.... ఏం అలా అడుగుతున్నావు ?నీ పుస్తకాలుకాని తడిసిపోయేయా ? తాగిందికి పెట్టిన నీళ్ళు తిరగబోసు కున్నావేమో" అంది రాజమ్మ.

"అదేం లేదమ్మా. ఊరికే అడిగేను" ఆ నాటి పేపరు చేతిలోకి తీసుకొని గదిలోకి వెళ్ళిపోయేడు ప్రకాశం.

# 2

పిరుదుల వరకు పడుతున్న వాలుజడ చివర జడగంటలకు పట్టు తాడు కట్టి, ఒకసారి జడను వెనక్కి వేసుకొని, మళ్ళా కుడిభుజం మీదుగా ముందుకి వేసుకొంది అనసూయ. అద్దాన్ని ఎడం చేత్తో ఎత్తి పట్టుకుని కుడిచేత్తో ముంగురులు సవరించుకుంది. నుదుట కుంకుమబొట్టు దిద్దుకొని మెడలో జిగిని గొలుసు పెట్టుకొంది. రంగు పువ్వుల పరికిణీ మీద చెంగావి వల్లెవాటు వేసుకొంది. కళ్ళకి కాటుక దిద్దుకొని, కాళ్ళకి పాంజేబులు పెట్టు కొంది.

ఆఖరి సారిగా అద్దంలో తన ముస్తాబు చూసుకొని మురిసిపోతూ, బంతిపువ్వులకోసం పెరటి తోటలోకి వెళ్ళబోతుంటే తల్లి కంటబడింది.

"ఎక్కడికే పొద్దుపొడవకుండా మూడు ముస్తాబులై అలా జారు కొంటున్నావు. మళ్ళా ఆ సెంటరుకేనా? వాళ్ళకైతే పనిపాటూలేదు. మూడు పొద్దులా ఆ కరణం గారింట పీకల మొయ్యా తిని, చిలకల్లా కబుర్లు చెప్తూ కూర్చుంటారు. ఇంక గ్రామంలో ఆడవాళ్ళకే పనులు లేవూ? జ్ఞానం వచ్చిన పిల్లవి, ఇంట్లో అమ్మకి ఆసరాగాఉండమ్మా, అని చెప్పడంపోయి 'ఉదయాన్నే రా— చదువు చెప్తాము' అంటారు.

"ఏం నీకు వచ్చిన చదువుచాలదా ఏమిటి, రేపు అత్తారింటికి పోయి మట్టి గోడలకి పేడా మన్ను ఊర్చుకోడానికి, ఇంటిముందు కళ్ళాపులు జల్లుకోడానికి....నువ్వేం పట్నం పోయి ఉద్యోగాలుచెయ్యాలా ఊళ్ళేలాలా? ఎక్కడికీ పోక తిన్నగా యింటి పట్టునఉండు" అంటూ ఉదయాన్నే దండ కం అందుకొంది సావిత్రి.

"పోనిద్దూ.... ఏదో చిన్నపిల్ల.... ముచ్చటపడి నాలుగు ఇంగ్లీషు ముక్కలు నేర్చుకొందామని అక్కడికి వెళ్తుంటే ఎందు కం తలా నోరు చించుకొంటావు? మనమేం మునసబుగారిలా ఆడపిల్లల్ని పట్నానికిపంపి చదివించగలమా ఏమన్నా.... ఏదో ఆ సెంటరువాళ్ళు ఊరు చొచ్చుకొచ్చి

నాలుగు ముక్కలు చెప్తామన్నారు నేడ్పుకొనీ.... పోయిందేమిటి, అసలు చదువుకొన్నా, మానినా చదువువచ్చినవారితో తిరిగితేనేచాలు కాస్త తెలివి తేటలు అబ్బుతాయంటారు.''

''ఓహో .... మీకూ గాలి అటు తిరిగిందన్న మాట....మరింకేం తండ్రీ, కూతురు వెళ్ళి ఆ శాంతమ్మ కాళ్ళు పిసకండి.'' సావిత్రి కంఠం హెచ్చుస్థాయికి పోతున్నకొద్ది,చింతగిరులా చెవులు చిల్లులు పొడుస్తున్నది.

అనసూయ రెండు చేతులతో చెవులు మూసుకుంటూ ''నేను ఎక్కడికి పోవడంలేదు. ఊరు కోవే అమ్మా'' అంది.

ఏటి కాకరు ప్రొప్పున పుట్టుకు వస్తున్న పిల్లలతో, రాత్రి పగలూ చేసినా పూర్తికాని ఇంటిపనులతో,సావిత్రి మనసు మొరటు తేలిపోయింది. సున్నితభావాలేమీ చొరలేనంత దట్టంగా,ఆమె జీవితంమీద నిరాశనిస్పృహల పొరలు కప్పుకు పోయాయి. యవ్వనంలో అందరి స్త్రీలలాగే ఏమేమో కలలుకన్న సావిత్రి, ఈనాడు ఆ కలల్ని మననం చేసుకునేందుకు కూడా ఓపికలేనంతగా అలసిపోయింది.

కొంతకాలం వరకు ఏమిటి బ్రతుకు ? ఎందుకిలా జీవించడం ? అనుకొని దిగులుపడేది. పంజరంలోపడ్డ చిలుక ఇంక ఆ పంజరం నుండి తప్పించుకుపోయే అవకాశం లేదని తెలుసుకొని, యజమాని పెట్టే పళ్ళు కాయలతో తృప్తిపడుతూ, ఆ రకమైన జీవితానికి అలవాటు పడ్డట్లు, సావిత్రి కూడా కాలం గడుస్తుంటే తనకంతే ప్రాప్తం అన్న ధోరణిలో, పరిస్థితులతో రాజీ పడింది. అంతవరకు గాలిలో తేలియాడే కోర్కెలు, కాళ్ళూచేతులూ మొలిపించుకొని వచ్చి ఆమెతోపాటు ఇంటిపనుల్లో జొరబడ్డాయి. ఇప్పుడు తను అనుభవిస్తున్న జీవితానికి భిన్నంగా ఉండేదాన్ని, ఊహించుకోడానికి కాని, అమోదించడానికి కాని, ఆమె సిద్ధంగాలేదు.

''ఎక్కడికి పోకపోతే ఉదయం పనివేళప్పుడు ఏ పాత పరికిణియో కట్టుకోక తగదునమ్మా.... అని, ఆ పువ్వుల పరికిణీ, ముస్తాబు, అవన్నీ ఎందుకే?''

"అది కాదమ్మా ఈరోజు బావ పుట్టినరోజటకదూ. అత్తయ్య భోజనానికి అక్కడికి రమ్మంది"

"నామతి మండా.... ఆమాటే మరచిపోయేనే—ఈరోజు రమణ పుట్టినరోజు కదూ— ఇంతలా నోరు పారేసుకుని నేను అరుస్తుంటే మరి ఆ మాటచెప్పవేం" అంటూ కూతుర్ని మందలించి, వీధి అరుగు మీదవున్న భర్తనుద్దేశించి 'ఏమండోయ్, ఈరోజు మీ అల్లుడి పుట్టిన రోజట. ఈ పనితో నాకెలాగా తెమిలి చావదు. మీరైనావెళ్ళి నాలుగక్షింతలు వేసిరండి" అని గావుకేక పెట్టింది.

"ఇంతలా మూడుముస్తాబులు అయి, పునిస్త్రీ పిల్లవి తల్లో పువ్వులు పెట్టుకోపూ—వెళ్ళి పెరట్లో బంతి పువ్వులో, కనకాంబరాలో ఏముంటే అవి కోసుకు పెట్టుక్కో .... ఆ చేత్తో నాలుగు రుద్రజడ ఆకులు కూడా తెచ్చుకో....చెండులా కట్టి పెట్టుకోవచ్చు."

"నేను అందుకే వెళ్తుంటే మధ్యలో నువ్వు తగులుకొన్నావు.... మరి...."

"అత్తయ్యగారింటికి వెళ్తున్నావని నాకేం తెలుసు.... ఇంకా ఆ శాంతమ్మ దగ్గిరకే పరుగుపెడ్తున్నా వనుకున్నాను." అల్లుడి పుట్టిన రోజు పూటా కూతుర్ని కేకలేసినందుకు మనసులోనే నొచ్చుకొంటూ అంది సావిత్రి.

సాయంకాలపు చల్లగాలిలో రెక్కలల్లారుస్తూ ఎగిరే పక్షిలా ఉత్సాహంగా అనసూయ పెరటి తోటవైపు పరుగుతీసింది. అక్కడినుండి పడిపోయిన పైడిశెట్టి పెరటిగోడమీదుగా ఊరిపొలిమేరకనిపిస్తుంది. పువ్వులు కోసుకుంటూ అనుకోకుండా అటుచూసింది అనసూయ. దూరంగా ఎర్ర సైకిలుమీద పోస్టు బంట్రోతు వస్తున్నాడు.

అనసూయ చిన్నతనంలో అయితే ఇక్కడ పోస్టుబంట్రోతునిచూసి, అతడిని ఎదురుకోడానికి రాంభజన కోవెలదాకా ఒక్క పరుగు తీసేది. అప్పట్లో ఆ గ్రామానికి అట్టే ఉత్తరాలు వచ్చేవికావు. గ్రామంలో ఎవరింటికి ఉత్తరం వచ్చినా చేతుల్లో పనులు అక్కడికక్కడ వదలి పెట్టి,

ఏమిటి సంగతి? ఎవరు రాసేరు? వంటి విషయాలు తెలుసుకుని మరీ తమ పనుల్లోకి పోయేవారు గ్రామస్థులంతా.

దరిమిలా ఆ గ్రామంలో పంచాయతీ బోర్డు ఆఫీసు, ఒక టెంటు సినిమాహాలు, తడికెల కాఫీహోటలు వెలయడంతో గ్రామ స్వరూపమే మారిపోయింది.

మధ్యకాలంలో ఎందరో చదువులకనీ, ఉద్యోగాలకనీ, పట్నాలకి ఎగబడ్డారు. అటువంటివారు ఇక్కడ మిగిలిఉన్న బంధు, మిత్రులకి ఉత్తరాలు రాస్తుంటారు. సొమ్ము పంపుతుంటారు. ఆ విధంగా గ్రామానికి పోస్టు బంట్రోతు రాకపోకలు ఎక్కువయేయి.

''మా ఊరుకి రోజూ టపా వస్తుంది'' అంటూ ఎంతో గర్వంగా చెప్పుకొంటారు పాతరోజులతో పరిచయంఉన్న ముసలివాళ్లు.

అరుణాచలానికి అయినబంధువులంతా ఆ గ్రామంలోనే ఉన్నారు. ఇచ్చి పుచ్చుకొనే అనుబంధాలు, పంటలు, ఫలసాయాల లావాదేవీలు అన్ని ఆ చుట్టుపక్కల పదిమైళ్ళలోపుగా ఉన్న గ్రామాలతోనే.

అందరికీ ఉత్తరాలు వస్తూ తమింటికి రాకపోవడం అనసూయకి చిన్నతనంగా ఉండేది.

''మనకెప్పుడూ ఉత్తరాలు రావేం నాన్నా'' అనేది దిగులుగా.

''మనకి ఉత్తరాలు రాసేవాడు, మీ మామయ్య ఒక్కడే. రోజూ ఎలా వస్తాయి.'' అనేవాడు తండ్రి.

''ఈ రోజు మా ఇంటికి ఉత్తరంవస్తేబాగుండును'' రావని తెలిసి కూడా అనుకొంది అనసూయ.

పొట్టిగోడ పక్కగా పోస్టు బంట్రోతు సైకిలు మాయమలు, బ్రాహ్మణవాడ మొదట్లో తేలింది. ఆ సమయంలో పెరటితోటలోంచి వీధి గుమ్మంలోకి పరిగెట్టుకొంటూ వచ్చింది అనసూయ.

''ఏదీ కనకాంబరాలు కోసుకోలేదూ'' సావిత్రి కూతురి చేతిలో బంతిపువ్వులు మాత్రమే చూసి ప్రశ్నించింది.

''పోస్టు బంట్రోతు వస్తున్నాడమ్మా'' ఆత్రంగా వీధిలోకి వెళ్తూ అంది అనసూయ.

''వస్తేరానీ....మనకేం ఉత్తరాలు ఉండవు.... నువ్వెళ్ళి పువ్వులు తెచ్చుకో''

''లేదమ్మా కరణంగారింటికి ఇచ్చి, మనింటి వైపే వస్తున్నాడు'' అంది అనసూయ ఉత్సాహంగా.

''మొన్ననేగా అమ్మమ్మ రాసింది.... ఇంక మనకెక్కడ నుంచి వస్తాయి, పక్కనున్న మేష్టరు గారింటికేమో....''

''లేదమ్మా—మనకే—మనకే—ఇదిగో నాన్నగారి పేరేఉంది'' అంటూ గెంతుకొంటూ లోపలికి వచ్చింది.

''ఏమిటమ్మా అనసూయా'' అన్నాడు ధాన్యం కొట్లోఉన్న అరుణాచలం.

''ఉత్తరం నాన్నా....ఉత్తరం వచ్చింది'' అనసూయ గట్టిగా కేక పెట్టింది.

చేతికంటిన దుమ్ము దులుపుకొంటూ వచ్చేడు అరుణాచలం.

''చదవండి....మా తమ్ముడే రాసుంటారు'' తొందర పెట్టింది సావిత్రి.

అరుగుమీద కూర్చుని, అంగవస్త్రం భుజం మీద వేసుకొని కవరు చించి కాగితం పైకి లాగేడు అరుణాచలం.

''ఎవరు రాసేరు.... మా ప్రకాశమేనా?''

''కాదు....మీ పిన్నమ్మ''

''ఉండు....మరి చదవనీ....''

''చిరంజీవి సౌభాగ్యవతి సావిత్రిని ఆశీర్వదించి మీ పిన్ని వ్రాయునది. ఇక్కడ మేము క్షేమం. అక్కడ మీరంతా కులాసాగా ఉన్నారని తలుస్తాను. నేను మీగ్రామంలో ఉండగా మనం అనుకొన్న జగన్నాధరావు గారి సంబంధానికి మీ తమ్ముడు ఇష్టపడలేదు. అసలు పెళ్ళి చూపులు

కైనా పోనన్నాడు. ఇక్కడ లలిత అనే ఒక అమ్మాయిని పెళ్ళిచేసుకో నిశ్చయించుకొన్నాడు. ఆ పిల్ల మేనమామఇంట్లో, ఈ ఊళ్లోనే ఉంది. అల్లుడు ఒకసారి తెరిపి చేసుకొని వస్తే అతడితో మాట్లాడి సంబంధం ఖాయంచేసుకోవచ్చు.

ఎప్పటి కప్పుడు ఏవో అడ్డంకులలో ఇప్పటికే మీ తమ్ముడి పెళ్ళి వెనకపడ్డాది. ఈ సంవత్సరం ఎలాగైనా చేసివేయాలనుకొంటున్నాను. మూఢమొస్తే మళ్ళా ముహూర్తాలు ఉండవు. సాధ్యమైనంత వేగంగా అల్లుణ్ణి పంపించు,

ఆశీస్సులతో
మీ పిన్ని"

"ఈ లలిత ఎవరు? మన శాఖేనంటారా?"

"నాకు తెలిసినంతవరకు మన బంధుకోటిలో మీ తమ్ముడికి ఈడైన పిల్లల్లో లలితలెవరూ ఉన్నట్టులేదు."

"మరి మా పిన్ని పై శాఖ పిల్లని చేసుకుంటుందా?"

"మీ పిన్ని చేసుకోదు మీతమ్ముడు చేసుకుంటాడు. అతడికి అటువంటి పట్టింపులు ఉంటాయనుకోను."

"మీరువెళ్ళి వాడికి మరినాలుగు పుల్లలు పెట్టిరండి," అంది సావిత్రి విసురుగా

"నాకేంపట్టింది!" అన్నాడు అరుణాచలం.

ఆ సెంటరువాళ్ళ ముందు మా బావమరది శాఖాంతర వివాహం చేసుకున్నాడని గొప్పగా చెప్పుకోడానికి."

"ఛీ....ఛీ.... నీకెప్పుడూ ఇలాంటి ఆలోచన్లే వస్తాయి."

"మీరు అలాంటి పనులు చేస్తారు కాబట్టి"

"అమ్మా అమ్మా మామయ్యకి పెళ్ళా" ఉత్సాహంగా అడిగింది అనసూయ.

"అనే మీ అమ్మమ్మ రాసింది" అంది సావిత్రి.

"వెళితే రేపే వెళ్ళాలి సావిత్రీ, మళ్ళీ నూర్పుల్లో పడితే ఇంతవేగిరం కదలడం జరగదు." అన్నాడు అరుణాచలం ఆలోచిస్తూ.

"అమ్మా నేనూ నాన్నతో వెళ్తానే"

"నువ్వెందుకూ పిలవని పేరంటానికి"

"పిలవని పేరంటం ఎందుకవుతుంది? అనసూయని పంపమని వాళ్ళు ఎన్నిసార్లు రాసేరు. ఒక్కసారికూడా మనం పంపకపోవడం చేత మనకి ఇష్టం లేదని ఊరుకొని ఉంటారు. సరదాపడ్తున్నది. రానీ" అన్నాడు అరుణాచలం

"బాగుందండీ మీవరస. ఈడేరినపిల్ల. నేడో రేపో ఆనాలుగు అక్షింతలు వేసి అత్తవారింటికి అంపకము పెట్టాలనుకొంటున్నాము. ఈ పరిస్థితిలో ఇక్కడా అక్కడా తిప్పుతే వాళ్ళేమనుకుంటారు." అంది సావిత్రి.

"అమ్మమ్మగారింటికి వెళ్తానంటే అత్తయ్య ఏమీ అనరే. నేనిప్పుడే వెళ్ళి అడిగొస్తా" అంటూ తల్లిమాట వినిపించుకోకుండా పరుగు తీసింది అనసూయ.

* * *

తెల్లవారి పదిగంటలకు ప్రయాణం. ముందు రోజు రాత్రంతా అనసూయ కలలతోనే గడిపివేసింది. ఆరోజు తల్లికన్న ముందుగాలేచి నీళ్ళ పొయ్యి రాజేసింది. ఇల్లూ, వాకిలీ తుడిచి కళ్ళాపు జల్లింది. వాకిట్లోముగ్గు పెట్టి, తండ్రి స్నానానిక నీళ్లు తోలిపింది.

కత్తిపీట కూర్లబుట్ట ముందేసుకుని కూర్చున్న కూతుర్ని చూసి "ఈరోజు నామీద ఇంత అభిమానం మొలుచుకొచ్చిందేమిటి?" అంది సావిత్రి.

"అదికాదే అమ్మా! మరి పదిగంటలకల్లా భోజనంచేసి బయలుదేరాలిగా" అంది అనసూయ.

"ఓహో ఇదంతా ప్రయాణ సరంజామా?" అంది సావిత్రి నవ్వుతూ.

అప్పుడే అన్నమాటేముంది? ముందురోజు అత్తయ్య చేత ఔనని పించుకొని వచ్చినప్పటినుంచి అనసూయ ఆ ప్రయత్నంలోనే ఉంది. అటకమీద చిన్న ట్రంకు పెట్టి దింపి అందులో తనవి, తండ్రివి బట్టలు పొంది

కగా సర్దింది. తండ్రి తోలుచెప్పులకు అంటుకొన్న బురదంతా తడిగుడ్డతో తుడిచి ఎండలో పెట్టింది. జరీకండువాని సాపుచేసి పరుపుకింద ఒత్తు పెట్టింది.

తను తిరునాళ్ళలో కొనుక్కున్న పైటపిన్నుని చింతపండురాసి బంగారంలా మెరిసే వరకు ఓపిగ్గా తోమింది. పాంజీబులు కుంకుడుకాయ పులుసులో నానవేసి, వరహాల పంచెతో ఇరుకుల్లో కుళ్లుపోయి తళతళ లాడేవరకు శుభ్రపరిచింది. సిల్కు పరికిణీకి పడ్డ చిన్నచిన్న చిరుగుల్ని కనిపించకుండా నేర్పుగా కుట్టివేసింది.

తను దేశం విడిచిపోతున్నట్లు, మళ్ళీ ఎప్పటికి తిరిగి వస్తుందో తెలియనట్లు, చెల్లెళ్ళకి తమ్ముళ్ళకి అప్పగింతలు పెట్టింది: ఎర్రావుదూడకు ఎప్పుడు గడ్డివెయ్యాలో, చామంతి బంతిమొక్కలకి ఎన్ని నీళ్లు పొయ్యాలో చెల్లెలికి బోధపరచింది.

ఇంట్లో తను చెయ్యాల్సిన పనులు అయిపోయేయి అనిపించేక ఇరుగుపొరుగు ఇళ్ళకి వెళ్ళి తను పట్నం వెళ్తున్నానని చెప్పివచ్చింది. ఆదారినే సెంటరుకుపోయి ''మీకు పట్నంనుండి ఏమన్నా కావాలంటే చెప్పండి. నేను వెళ్తున్నాను'' అంటూ అడిగివచ్చింది.

పదిగంటలవేళ గూడులేని సర్రాంబండి ఒకటి ఇంటిముందువచ్చి నిలబడింది. చిన్న ట్రంకుపెట్టె, పక్కచుట్ట బండివాడికి అందిచ్చి ఒక ఎగురు ఎగిరి బండిలో కూర్చుంది అనసూయ.

"అయ్యో చిన్నమ్మగోరు వత్తున్నారని తెలుత్తే గూడేసితేచ్చేవోడిని. ఒక్క అయ్యగోరే ననుకొని ఏల మిగిలిపోతున్నాదని అట్టగే తోలుకొచ్చేను" అన్నాడు బండివాడు.

''ఫరవాలేదురా .... పద.... అట్టే దూరం లేదుకదా"అన్నాడు అరుణాచలం తనూ బండిలో ఎక్కికూర్చుంటూ.

ఎండ నెత్తిమాడుతున్నా అనసూయకి ఆనందంగానే ఉంది.పుట్టిబుద్ధెరిగి అదే ఆమె రైలులో ప్రయాణం చెయ్యడం. పట్నం వెళ్ళడం. దారిలో కన్పిస్తున్న ప్రతివారితో ఆ విషయం చెప్తూనేఉంది.

పది నిముషాలకి రైలు వస్తుందనగానే బండి స్టేషను చేరింది. బండి వాడిని తిరిగి పంపివేసి, రెండు టిక్కెట్లుకొని తెచ్చేడు అరుణాచలం.అతడు వచ్చేసరికి అల్లంత దూరంలో రైలు కన్పించింది.

నల్లని ఇంజను పొగలు కక్కుకుంటూ పట్టాలని అదరకొడ్తూ, దడ దడమని చప్పుడుతో మీదికి వస్తుంటే భయంతో తండ్రిని వాటేసుకొంది అనసూయ. "కూ" అని చెవులు చిల్లులుపడేలా కూతేసి ఆగిందిరైలు.

ఆ స్టేషనులో రైలు అట్టేసేపు ఆగదు. అరుణాచలం కూతురిచెయ్యి పట్టుకొని ఇటు అటు పరుగులు పెట్టి, చివరికి కాళీగాఉన్న ఒక పెట్టెలోకి ఎక్కి.... అది పరుపులపెట్టె అని గ్రహించి, అందులోంచి దిగి, ఇంకో పెట్టె చూసుకొని ఎక్కేసరికి రైలు కదలబోతూ ఉంది. సామాన్లని, కూతుర్నీ పైకితోసి తనూ అతి కష్టంమీద పైకిచేరాడు.

"అమ్మయ్యో రైలు ఎక్కడమంటే మాటలతో పనికాదు....నాన్న లేకపోతే నేను ఎక్కనే లేకపోదును''– అనుకొంది అనసూయ.

అదృష్టవశాత్తు అనసూయకి కటికీపక్క సీటు దొరికింది. ఇంక ఆ పిల్ల ఆనందానికి హద్దులు లేవు. పదమూడేళ్ళు నిండినపిల్ల పసిపిల్లలా చెట్లుల్నీ, పుట్టల్నీ, దిగువగా జారే గడ్డల్ని, చకచక మారే పరిసరాల్ని చూస్తూ ఉత్సాహంగా కేకలు వేస్తుంటే పెట్టెలో అంతా ఆమెవంక వింతగా చూడసాగేరు.

రాజమ్మవాళ్ళు పట్నంలో కాపురం పెట్టేక సావిత్రి రెండు మూడు సార్లు చంటపిల్లలిద్దర్నీ వెంటపెట్టుకొనివెళ్ళి వచ్చింది కాని, ప్రతిసారి అన సూయ ఇంటికాపుకి విధిగా ఉండిపోవలసివచ్చింది. పదమూడేళ్ళపిల్ల అంత వరకూ రైలే ఎక్కలేదంటే చాలమంది నవ్వుతారు.

కాని, ఒకగ్రామంలోపుట్టి, ఆ గ్రామంలోనే మెట్టి, జీవితంలో ఒక సారికూడా పొలిమేర దాటకుండానే తనువు చాలించిన వాళ్ళు మారుమూల గ్రామాల్లో ఎందరో ఉంటారు. అవసరంపడక, ఆసక్తిలేక, కొందరికి పరి స్థితులు అనుకూలించక పుట్టినఊరునుంచి కాలుకదపడం లేకుండాపోతుంది.

అనసూయ అప్పటివరకు రైలెక్కి పక్కనున్నపట్నం పోలేక పోయిందంటే ఆరుగురు తోడ పుట్టినవారికి అక్కగా పుట్టడం దానికి కారణం. ఎదుటి వాసలోఉన్న మేనత్త కొడుకుని పెళ్ళిచేసుకోవడం ఇంకో కారణం.

రైలు ఆగిన ప్రతిచోట అనసూయ పెట్టి పట్టుకొని దిగిపోయేం దుకు తయారుగా ఉండేది.

"ఇంకా మనం దిగవలసిన స్టేషను చాలా సేపటికికాని రాదమ్మా... వస్తే నే చెప్తాలే .... నువ్వు తిన్నగా కూర్చో" అని తండ్రి భరోసా ఇచ్చిన పిమ్మట స్థిమితంగా కూర్చుని అన్నీ చూడ్డం మొదలుపెట్టింది.

రెండుగంటల ప్రాంతంలో వాల్తేరు స్టేషను వచ్చింది పెట్టె, పక్కచుట్ట పట్టుకొని కూతురితోపాటు ప్లాటుఫారంమీదికి దిగేడు అరుణా చలం.

ఆ జన సమూహాన్ని, అమ్మకందార్లని చూసి "ఈ రోజు ఈ ఊళ్లో తిరునాళ్ళా నాన్నా" అంటూ ప్రశ్నించింది అనసూయ.

"కాదమ్మా ఇది పెద్ద పట్నంకదా, ఇక్కడ ఎప్పుడూ ఇలాగే ఉంటుంది. వీళ్ళంతా ఊళ్ళకి పోయేవాళ్లు, మనలాగ వేరే ఊళ్ళనుంచి వచ్చినవాళ్లు" అంటూ జవాబు చెప్పేడు అరుణాచలం.

ఒక రిక్షాని మాట్లాడి అందులో సామాన్లు పెట్టుకొని కూర్చున్నారు తండ్రీ కూతుళ్ళు. అరుణాచలం చెప్పిన వీధివైపు పరుగుతీసింది, సైకిలు రిక్షా. పెద్దపెద్ద మేడలు, బారులు తీరిన బజార్లు, రయ్ ....రయ్‌మని వచ్చి పోతూండే కారులు, బస్సులు — అనసూయ దృష్టి తిప్పుకోలేకపోయింది. నోరు తెరచుకొని వింతగా వాటివంక చూస్తూ కూర్చుంది.

ఒకచోట ట్రాఫిక్ రద్దీవల్ల రిక్షా ఆగిపోయింది. ఎదురుగా మూడం తస్తుల పెద్ద మేడ ఉంది. మేడకి ముందుభాగంలో చక్కనితోట....ఇనుప కటకటాల గేటులోంచి ఎంతో అందంగా కన్పిస్తున్నాయి పువ్వుల మొక్కలు.

ఇదే మామయ్య గారిల్లనుకొంది అనసూయ. సావిత్రి ఎప్పుడేనా

ఆ పల్లెటూరి జీవితంమీద, మొగుడిమీద, పిల్లలమీద, విసుగు జనించినప్పుడు "ఒకే తండ్రికి పుట్టేము. వాడేమో పట్నంలో హాయిగా రాజాలా బ్రతుకుతున్నాడు. నా బ్రతుకేమో ఇలా పెంటకుప్పల మధ్య, పేడ పిడకల మధ్య గడిచిపోతున్నది. ఎవరెంత పెట్టిపుడితే అంతే ప్రాప్తం .... ఎక్కువ కావాలంటే ఎలా వస్తుంది" అంటూ విసుక్కొనేది.

అనసూయ ఒకసారి వాళ్ళ ఊరి టెంటు సినిమాలోకి వచ్చిన ఏదో జానపదచిత్రం చూసింది. అందులో రాజుగారిమేడ ఇంకా చాలా బాగుంది. అయినా ఫరవాలేదు. మామయ్యగారి ఇల్లూ బాగానే ఉంది— అనుకొంటూ దిగబోయింది.

"కాకొండమ్మా .... ఇంకా ముందుకి పోవాల" అంటూ రిక్షావాడు గంట వాగిస్తూ, నేర్పుగా మనుష్యుల్ని తప్పించుకొంటూ రోడ్డుమీద దూసుకుపోయేడు.

మామయ్యగారి ఇల్లుచూసి అనసూయ నిరుత్సాహపడింది. ఇదేం రాజుగారిఇల్లు? మా ఇల్లే ఇంతకంటే ఎంతో బాగుంటుంది. - అనుకొంది.

అల్లుడు అంతవెంటనే వస్తాడని ఎదురుచూడని రాజమ్మ వెంట మనుమరాల్ని కూడా తీసుకురావడంతో ఎంతో సంతోషించింది.

"రామ్మా అనసూయా ! అమ్మమ్మ గారింటికి రావడానికి ఇంత కాలానికి మీ అమ్మ అనుజ్ఞ ఇచ్చిందా ?" అంటూ ఆప్యాయంగా చేతుల్లోకి తీసుకొంది.

"అప్పుడు పెళ్ళిలో చూడ్డమే దీన్ని. ఎంత పొడుగు పెరిగింది. ఇంకా అనసూయ తలపుకి వచ్చినప్పుడెల్లా ఆ రూపమే గుర్తుకొస్తుంటుంది నాకు" అంది రాజమ్మ అనసూయ ముఖంపై పడుతున్న ముంగురుల్ని సవరిస్తూ.

"మరేమిటండీ ఆడపిల్లలు ఏటికేటికి ఇట్టే పెరిగిపోతారు. అందులో ఈడేరిన పిల్ల వాళ్ళమ్మలాగే ఏపరి" అన్నాడు అరుణాచలం.

ఇంటివిషయాలు, పంటలవిషయాలు, మంచీ చెడ్డా మాటలు పూర్తి అయేక అల్లుడికి, మనుమరాలికి కాఫీ, టిఫిన్లు చేసి తెచ్చిపెట్టింది రాజమ్మ.

అల్లం పచ్చడిలో అరటికాయ బజ్జీలు నంజుకుతిని కంచుగ్లాసుడు కాఫీ గటగట సేవించి, నోట్లో వక్క-పలుకు వేసుకుంటూ వచ్చినపని గురించి ప్రస్తావించేడు అరుణాచలం. "ఎవరీ లలిత ? ఏ ఊరు ? ఎవరిపిల్ల? మన శాఖ వాళ్ళేనా ? కనీసం బ్రాహ్మలేనా — అవునా కాదా" అంటూ.

లలితగురించి తనకి తెలిసినంతవరకు అల్లుడితో చెప్పింది రాజమ్మ. "ఇంక మిగిలిన విషయాలు మీరు స్వయంగా తెలుసుకోవలసినవే" అంది.

"చదువుకొని ఉద్యోగం చేస్తున్నపిల్ల అవగానే అనసూయ ముఖం ఇంతగా విప్పారింది. పట్నంలో ఆడవాళ్ళుకూడా, పెద్దచదువులు చదువుకొని, మగాళ్ళలా ఉద్యోగాలు చేస్తుంటారని సెంటరులోవాళ్ళు చెప్పగా వింది అనసూయ. అదేం తప్పుపనికాదని, దానివల్ల ఇంకా గౌరవం వస్తుందని, చదువుకొన్న పెళ్ళాం ఉంటే భర్త కెంతో మంచిదని, ఇల్లు బాగా దిద్దుకొంటుందని, పిల్లలు ఆరోగ్యంగా పెరుగుతారని, ఇంకా ఇలాగే ఎన్నో విషయాలు చెప్పేరువాళ్ళు. నిజానికి వారి మాటలు విన్న తరువాతే అనసూయకి చదువుమీద దృష్టి మళ్ళింది. ఎప్పుడో అటకమీద పడేసిన మూడోక్లాసు పుస్తకాలుతీసి, మరచిపోయిన లెక్కల్ని, పద్యాల్ని గుర్తు చేసుకోడం మొదలుపెట్టింది.

తన మామయ్య చదువుకొని ఉద్యోగం చేసుకొంటున్న పిల్లని పెళ్ళి చేసుకొంటున్నాడంటే అనసూయకి ఎంతో గర్వంగా అనిపించింది. ఆ పిల్ల ఎలా ఉంటుందో ? తనవంటి పల్లెటూరి పిల్లతో మాట్లాడుతుందో.... మాట్లాడదో ? సవాలక్ష అనుమానాలు.

చివరికి ఎప్పుడో చూసేదాకా మనసుపట్టలేక "అమ్మమ్మా; ఆ పిల్ల ఎలా ఉంటుంది ?" అంటూ ప్రశ్నించింది.

"ఎలా ఉంటుంది నీలాగే చక్క-నిచుక్క-లా ఉంటుంది. కాకపోతే నీ కన్న వయసులో బాగా పెద్దది. చదువుకొని పట్నంలో ఉంటుంది. కాబట్టి కాస్త ఫ్యాషన్‌గా ఉంటుంది." అంది రాజమ్మ.

"ప్రకాశం త్వరగా ఇంటికివస్తే బాగుండును వీలుంటే ఈ రోజే పోయి చూసిరావచ్చు" అన్నాడు అరుణాచలం.

"ఇంకాఇప్పుడేకదా గుమ్మంలోకాలుపెట్టేరు. అప్పుడే ప్రయాణానికి తొందరేమిటి? ప్రకాశం బాగా చీకటి పడితేగాని రాడు. ఇంక ఈ రోజు కదేమీ కుదరదు." అంది రాజమ్మ.

"అంత చీకటి పడేవరకు పాఠాలు చెప్తాడా?"

"పూర్వం ఆరు లోపునే ఇల్లు చేరేవాడు. ఇప్పుడు పెద్దవాడు అవుతున్నాడు కదా"

"అంటే...."

"మరేంలేదు. ఏపార్కులోనో,బీచ్‌లోనో, స్నేహితులతోనో కాస్త సేపు గడిపి వస్తుంటాడు."

కొడుకుని క్రమంతప్పకుండా పట్టివుంచుతున్న ఆ స్నేహితులెవరో రాజమ్మకి తెలుసు. అయినా అల్లుడిముందు ఆ మాట తేల్చలేదు

* * *

ఆ రోజు లలితకి ఆఫీసులో కాస్త త్వరగా పని తెమిలిపోయింది.

ప్రకాశానికన్న ముందుగా వచ్చి బీచిలో నిర్ణీత స్థానంలో కూర్చుంది. ఎగిరెగిరి పడ్తున్న కెరటాల్ని, ఇసుకలో పిచ్చిక గూళ్ళు కట్టుకొంటున్న చిన్నపిల్లల్ని, నవ్వుతూ తుళ్ళుతూ, కబుర్లు చెప్పుకొంటున్న నవదంపతుల జంటల్నిచూసి, చూసి అలసిపోయింది.

ఆమె వచ్చేసరికి ఉన్న ఎండ పలుచబడి వెలుగ్గామారి, క్రమంగా చీకటిగదిలోకి దూరిపోయింది. ఆకాశంమీద ఒకటీ, రెండూ చుక్కలు మినుకు మినుకుమంటూ పొడుచుకొచ్చేయి.

ఈ రోజు ప్రకాశం వేళ తప్పించేసేడు. చీకటి పడ్తున్నా వచ్చే సూచనలు కన్పించడంలేదు. రావడం పడకపోతే ఆ విషయం ముందుగా తెలియచెయ్యవలసింది. అనవసరంగా తను కాచుకు కూర్చునేది కాదు. చికాకుతో లలిత ముఖం చిటపటలాడుతున్న తరుణంలో ప్రకాశం ప్రత్యక్షమయేడు.

"సారీ లలితా! ఆస్టాపు మీటింగ్ ఎంతకీతెమిలిందికాదు. ఇదిగో— అదిగో అంటూనే ఎప్పటికీ పూర్తి కానివ్వలేదు. నువ్వు వెళ్ళిపోయి

ఉంటావేమో అని అనుమానిస్తూనే వచ్చేను" అన్నాడు ప్రకాశం, లలిత పక్కని ఇసుకలో కూర్చుంటూ.

"ఈ రోజు మిమ్మల్ని ఒక సలహా అడగాలని వచ్చేను. అందుకే మీరు రావడం ఇంత ఆలస్యం అయినా కూర్చున్నాను. లేకుంటె ఈపాటికి వెళ్ళిపోయి ఉండేదాన్ని" అంది లలిత.

"అప్పుడే ఇంటి పెద్దని చేసేస్తున్నావే."

"ఈ రోజు కాకపోతే రేపైనా కావలసినవారేగా— ఇప్పటినుంచి ఆ హోదా ఇచ్చినా, దాన్ని మీరు దుర్వినియోగంచెయ్యరని నాకుతెలుసు"

"ఇంతకీ ఆ సలహా ఏమిటి? ఏ విషయంలో" అంటూ ప్రశ్నించేడు ప్రకాశం.

"ఆ మధ్య మా తమ్ముడు రామకోటి ఉద్యోగానికి అప్లికేషన్ పెట్టేడని చెప్పేను కదూ— దానికి ఇంటర్వ్యూకి పిలుపు వచ్చింది; వెళ్ళాలా మానాలా అని ఆలోచిస్తున్నాను. మీరేమంటారు?"

"ఎలాగా కాలేజీలో ప్రవేశించేడు కదా— ఆ చదువేదో పూర్తి కానివ్వరాదూ! ఇప్పటినుంచి ఉద్యోగం చెయ్యకపోతేనేం ? ఆ డిగ్రీ ఏదో చేతిలో పడితే అప్పుడు చూసుకోవచ్చు."

"నేనూ ఆ మాటే అన్నాను. 'డిగ్రీ రావాలంటే ఇంకా రెండేళ్ళు చదవాలి. అప్పుడుమాత్రంఉద్యోగాలుసిద్ధంగాఉంటాయా?' అంటున్నాడు."

సరి అతడికి అంత ఇష్టంగాఉంటే ఇంటర్వ్యూకి వెళ్ళమనండి. ఉద్యోగం వస్తే అప్పుడు మరోసారి బాగా ఆలోచించుకొని ఎలా బాగుంటుందని తోస్తే అలా చెయ్యవచ్చు" అన్నాడు ప్రకాశం.

లలితకి ఆ సలహా నచ్చింది. ఇంటర్వ్యూకి పిలుపు వచ్చినంత మాత్రాన ఉద్యోగం వచ్చేసినట్లేం కాదుకద. వీడికివచ్చినట్లే ఇంకా ఎంత మందికి వెళ్ళేయో పిలుపులు—అనుకొంది.

"అదే బాగుంది....అలాగే చెయ్యమంటాను. మరింక లేద్దామా? బాగా చీకటి పడింది" అంటూ లేచి నిలబడింది.

ఆ మాటా ఈమాటా చెప్పుకొంటూ ఇద్దరూ బస్సుస్టాపు దాకా

నడక సాగించేరు. లలిత ఎక్కవలసిన బస్సు ఇంకా రాలేదు. ప్రకాశం ఇంటివైపు పోయేది ముందుగా వచ్చింది.

"మీరు వెళ్ళిపోండి. నాలుగైదు నిముషాల్లో నా నెంబరు రానే వస్తుంది" అంది లలిత.

"మిమ్మల్ని ఎక్కించి ఇంకో బస్సులో వెళ్తాను. నాకేం తొందర లేదు" అన్నాడు ప్రకాశం.

"మీ అమ్మగారు ఎదురు చూస్తుంటారు."

"అది పూర్వంమాట. ఈమధ్య మా అమ్మకి కొడుకుగురించి సగం బెంగ తీరిపోయింది. కంటికి రెప్పలా కాచిందికి ఇంకో వ్యక్తి తయారుగా ఉందని తెలుసుకొంది."

"ఎవర్నీ ఎవరూ కాచేదిలేదు. అందర్నీ ఆ దేవుడు కాయాలి. అదృష్టం కలసిరావాలి........ జీవితాలు తిన్నగా గడిచిపోవాలి. ఇంతకీ మన విషయం మీ అమ్మగారితో చెప్పేరా ?"

"చెప్పడమేకాదు. పెళ్ళిమాటలకి రమ్మని మా బావకి ఉత్తరం కూడా రాయించేను. ఇంక నేడో రేపో వస్తాడు. ఈ రెండు, మూడు రోజులు మీ మామయ్యగారు కాస్త నిషాతగ్గి మనలో ఉంటే అన్నీ సవ్యంగా జరిగిపోతాయి."

"మా మామయ్య నిషా మనపెళ్ళికి ఆటంకంగాఉంటుందంటారా?"

"నా ఉద్దేశం అది కాదు. ఆయన అవును కాదు అంటూ అడ్డు తగలకుండా...."

"చూడండి ప్రకాశంగారూ : మన పెళ్ళికి ఆహ్వానాలైనా అవరోధాలైనా, మీ వంక నుంచే రావాలి. నా వంక నుంచి కావలసింది నా అంగీకారం ఒక్కటే. అది ఏనాడో మీకు తెలియజేసేను."

అంతలో ఏడో నెంబరు బస్సు వచ్చి ఆగింది. లలిత ఎక్కి కూర్చుంది. కిటికీ దగ్గరగా తల పెట్టి "మళ్ళా రేపు కలుద్దాం" అన్నాడు ప్రకాశం.

"పెళ్ళికొడుకులా వేషం వేసుకొని మాత్రం రాకండి. స్నేహితుడు

గానే రండి. పెళ్ళిమాటల్లో ఏదైనా సహాయం అవసరమైతే నాపైన్రకూడా మీరే మాట్లాడాలి" అంది లలిత.

"పెళ్ళికొడుకునైనా, భర్తనైనా, నేను ఎప్పుడూ నీ స్నేహితుడినే లలితా" అన్నాడు ప్రకాశం.

"సంతోషం....అదే నేను కోరుకునేది" అంది లలిత.

లలితబస్సు కదలి వెళ్ళిపోయింది.

ప్రకాశం తన నెంబరు బస్సుకోసం ఎదురు చూస్తూ నిల్చున్నాడు.

* * *

ఆ రోజు ఆదివారం.

ఆదివారంనాడు ఆలస్యంగా లేస్తుంది లలిత.

సెలవు రోజు కోసం ఎదురు చూస్తున్న పనులెన్నో వెన్నుతట్టి లేపకపోతే, ముందురాత్రి కన్న, కలల మత్తులో ఆదివారంగడచి, సోమ వారం అవతరించేవరకు అలాగే నిద్రపోయి ఉండేది లలిత.

మామయ్యకి, తమ్ముడికీ కాఫీ చేసి ఇచ్చి, ఇంట్లో చిందర, వంద రగా పడివున్న సామానుల్ని ఒకచోటచేరుస్తుంటే వీధి గడపలో మనుషుల అలికిడి అయింది. ఇంటివారికోసం ఎవరో వచ్చి వుంటారనుకొని, అటు చూడకుండానే తన పని చూసుకోసాగింది. "లలితా" అన్న ప్రకాశం గొంతుక వినిపించేసరికి చేతిలోని మాసిపోయిన బట్టల్ని తలుపుచాటున బుట్టలో కూరి, ముందు వాకిట్లోకి వచ్చింది.

"ఇంత ఉదయాన్నే ....ఇలా...." లలిత పలకరింపు పూర్తికానే లేదు.

"ఒంటరిగా రాలేదు పెళ్ళివార్ని వెంటబెట్టుకొని మరీ వచ్చేను" ఉత్సాహంగా అన్నాడు ప్రకాశం.

"ఇది చాలా అన్యాయం .... ముందుగా కాస్త చెప్తే.... ఈ ఇల్లు చూడండి ఎలా ఉందో ?"

"నేను పెళ్ళాడబోయేది ఇంటివికాదు — ఇంట్లో పిల్లని" చిలి పిగా చూస్తూ అన్నాడు ప్రకాశం.

"పిల్ల మాత్రం ఏం ముచ్చటగా ఉందని!" నలిగిన చీరవంక, చెద రిన జుట్టువంక చూసుకొంది లలిత.

"పిల్లని ఈరోజు కొత్తగా చూడబోవడంలేదు. మూడేళ్ళబట్టి చూస్తూనే ఉన్నాను."

"అయితే మరి ఇప్పుడెందుకో ఇలా ఉరమని పిడుగులా మా ఇంటి మీదికి రావడం ?"

"ఎందుకా మాబావ, మీ మామయ్య మాట్లాడుకొనేందుకు. ఇదిగో నా ఈ చిన్నారి మేనగోడల్ని నీకు పరిచయం చేసేందుకు" అన్నాడు అన సూయని చూపిస్తూ.

అప్పటికే అరుణాచలం, అనసూయ లోపలికి ప్రవేశించేరు. లలిత అక్కడ చేయి విరిగిన కుర్చీలో పడివున్న పుస్తకాల్ని, పేపర్లని తీసి పక్కనిపెడ్తూ "కూర్చోండి" అంటూ అరుణాచలాన్ని ఆహ్వానించింది. "మామయ్య గదిలో ఉన్నాడు. పిలుచుకొస్తా. మీరు, మీ మేనగోడలు ఆ మంచం వాల్చుకు కూర్చోండి" అంటూ లోపలికి వెళ్ళింది.

లలిత మేనమామ సాంబమూర్తి దగ్గుతూవచ్చి ప్రకాశంపక్కగా మంచంమీద కూర్చున్నాడు. అతడి నోటిలోంచి వస్తున్న నల్లమందు వాస నకి అనసూయ ముక్కు మూసుకొంది.

"నువ్విలారామ్మా .... నా దగ్గర కూర్చుందువుగాని" అంటూ పిల్చింది అది చూసిన లలిత.

లలితపక్కన అరుగుమీదకివచ్చి కూర్చుంది అనసూయ.

"నీ పేరేమిటి!" నీటిలోనిచేపల్లా ఇటుఅటు కదలుతున్న అన సూయ కళ్ళవంకచూస్తూ ప్రశ్నించింది లలిత.

"అనసూయ"

"చాల బాగుంది పేరు"

"మీ పేరు లలితకదూ ?" మీ గురించి నాకు ముందే తెలుసు అన్నట్లు మాట్లాడింది అనసూయ.

"అవును .... నీకెలా తెలుసు ?" ఆశ్చర్యాన్ని నటిస్తూ అడిగింది లలిత.

"మా అమ్మమ్మ చెప్పింది. ఇంకా చాలా చెప్పింది."

"ఇంకా ఏం చెప్పేదు?" అని లలిత అడగలేదు. అప్పుడితో ఆవిడ మనసులోని అభిప్రాయాలు ఏవో చెప్పి ఉంటారు. అమాయకంగా ఆ పిల్ల ఏదో అంటని, అవన్నీతరచి తెలుసుకోవటం మర్యాదకాదు అనుకుంది.

అప్పటికి మగాళ్ళమధ్య పరిచయాలు పూర్తిఅయి కుశల ప్రశ్నాది కాలు జరుగుతున్నాయి.

లలిత ప్రకాశాన్ని పక్కకు పిలిచి "నేను కాస్త తల సరిచేసుకొని బట్టలు మార్చుకుని వస్తాను. ఈలోగా వారిద్దరి మధ్య సంభాషణ బెడిసి పోకుండా చూడండి" అంది.

నీకేంభయంలేదు, అన్నీ నే చూసుకొంటా-అన్నట్లు తల ఊపేడు, ప్రకాశం.

పావుగంటలో లలిత తయారై వచ్చింది. రామకోటి అక్కచేతి లోని కాఫీకప్పులు అందుకొని అక్కడఉన్న అందరికీఇచ్చేడు. లలిత ఒక కప్పుతీసుకొని ఇంకొకటి అనసూయకి ఇచ్చింది. "నేను కాఫీ తాగను అల వాటు లేదు" అంది అనసూయ

"ఒకరోజుకి తప్పులేదు. తీసుకో" అన్నాడు ప్రకాశం.

"కాఫీ వంటికి మంచిది కాదుట."

"ఆమాట నిజమే కాని ఒక్కసారి తాగినంతమాత్రాన ఏమీ చెరుపు చెయ్యదు. పోనీ పాలు తాగుతావా ?"

"ఊహు ఇదే తాగుతాను" అంటూ ఒక గుక్క పీల్చింది అన సూయ.

"ఎలాఉంది?" లలిత ఆ పిల్ల ముఖంచూస్తూ, ప్రశ్నించింది.

"కొంచెం చేదుగా తీపిగా"

"తాగాలనిలేకపోతే తాగకు. ఒకరిబలవంతాన ఏపనీచెయ్యకూడదు."

మరోగుక్క తాగి కప్పు పక్కన పెట్టింది అనసూయ.

పెళ్ళిమాటలన్నీ రెండుగుక్కల్లో తేలిపోయేయి.

"కట్నం కానుకలకీ సొమ్ములేదు, పెట్టుపోతలకు కన్నవారులేరు.

పెంచిననేను ఇలాఉన్నాను. పిల్ల మీ ఎదుటనేఉంది. దాని మంచిచెడ్డలు మీ బావమరదికి తెలుసు. ఇష్టపడి చేసుకొంటామంటే నా అభ్యంతరం లేదు." అన్నాడు సాంబమూర్తి.

ఏకబిగిని అన్నిమాటలు మామయ్య మాట్లాడ్డమే లలితకి ఆశ్చర్యం కలిగించింది.

"నీ యిష్టమేమిటమ్మా?" అరుణాచలం పెళ్ళి పెద్ద హోదాలో అడిగేడు.

లలిత ప్రకాశం వంక చూసి చిన్నగానవ్వి ఊరుకొంది.

"నా ఇష్టమే....తన ఇష్టం అంటున్నాది లలిత" అన్నాడు ప్రకాశం ఆ నవ్వుకి, చూపుకి అర్థం చెబుతూ.

"మరి నీ యిష్టం మాత్రం నాకు తెలుసా?'' తెలివిగా ప్రశ్నించేను అనుకున్నాడు అరుణాచలం.

"లలిత ఇష్టమే నా ఇష్టం" అన్నాడుప్రకాశం.

అంతా గొల్లుమని నవ్వేరు. లలిత కూడా నవ్వకుండా ఉండలేక పోయింది.

"ఇక్కడికిది నిర్ణయమైపోయినట్లే. మంచిరోజు చూసి, ముహూర్తాలు పెట్టించి మీకు తెలియజేస్తాము" అన్నాడు అరుణాచలం.

"మీరన్ని విషయాలు ఆకళింపు చేసుకొన్నారనుకుంటాను...." అన్నాడు సాంబమూర్తి నీళ్ళు నములుతున్నట్లు.

"మీ రింకేం ఆలోచించకండి.... బరువు బాధ్యతలన్నీ నావి" అన్నాడు ప్రకాశం.

ప్రకాశం చేతిని నొక్కి పట్టుకున్నాడు సాంబమూర్తి. అతని కళ్ళలో కృతజ్ఞతా పూర్వకమైన అశ్రువులు కదులాడేయి.

"అత్తా మీరు చాలా చదువుకొన్నారు కదూ.... ఉద్యోగం కూడా చేస్తున్నారట కదూ?" తను విన్నది నిజమా కాదా అని నిర్ధారణ చేసుకోడానికి ప్రశ్నించింది అనసూయ

"అప్పుడే వరస కలిపేసేవా గడుసుపిల్లా" అంటూ అనసూయని ముచ్చటగా దగ్గరికి తీసుకొంది లలిత.

# 3

లలితతో ప్రకాశం పెళ్ళి అట్టే ఆర్భాటంలేకుండానే జరిగిపోయింది. పెళ్ళికి సావిత్రి, పిల్లలు వచ్చేరు. అరుణాచలం రెండువైపులా తానే పెళ్ళి పెద్దగా వ్యవహరించి పని జరిపించేడు. ఏక రాత్రి పెళ్ళి.

మరునాడు మిత్రులకి చిన్న టీ పార్టీ ఇచ్చేడు ప్రకాశం. లలిత ఆఫీసునుంచి ఆమె బాస్ రామలింగం భార్యా సమేతుడై వచ్చేడు. మరి కొందరు ఉద్యోగులు కూడా వచ్చేరు. ప్రకాశం మిత్రులు, కాలేజీ లెక్చరర్లు చాలామంది వచ్చేరు. ఎవరికి తోచినవి వారు చిన్నా పెద్ద, కానుకలు వధూ వరుల చేతుల్లో పెట్టి ఆశీర్వదించి వెళ్ళేరు.

అంతమంది పెద్దవాళ్ళమధ్య చూడ ముచ్చటగా తిరుగుతున్న కొడుకుని, కోడల్ని చూసి ఆనందించింది రాజమ్మ.

పెళ్ళింట్లో సగం సందడి అనసూయదే. అమ్మమ్మకి తలలో నాలుకలా తిరుగుతూ కనిపించిన ప్రతి పనీ తలకెత్తుకొని చేస్తుండేది. వయసుకి తగని పనిచేసి పిల్ల అలసిపోయిందని బాధపడేది రాజమ్మ.

"మరేం ఫరవాలేదు పిన్నీ ! ఆడపిల్లకి ఆమాత్రం పనిచేసుకోకుండా ఎలా అవుతుంది. దానికి చిన్నప్పటినుంచి పని అలవాటే" అనేది సావిత్రి.

ఆ రోజు టీ పార్టీ, వచ్చీ పోయేవాళ్ళు, ఆ సందట్లో అనసూయను పట్టించుకునేలేదు లలిత. సాయంకాలం అంతా సవ్యంగా పూర్తిఅయి వచ్చిన అతిథులంతా వెళ్ళిపోయేక బట్టలు మార్చుకొందామని గదిలోకి వచ్చింది. ముందురోజు వాడిన సామానుల్ని, బట్టల్ని ఒకవంక జాగ్రత్తగా సర్దిపెట్టుతున్నాది అనసూయ.

ఆ రోజు అనసూయ తన పెళ్ళినాడు అత్తవారు పెట్టిన కంచి

పట్టుచీర కట్టుకొంది. పిరుదులవరకు తాచుపాములా వేలాడే జడను ఎత్తి పెట్టి బర్మాముడిచుట్టింది. ముడిచుట్టూ మల్లెపువ్వులు, మెడలో జాజిమొగ్గల నెక్లెసు — వెనుకనుంచి ఎవరా అనుకొంది లలిత.

ఎవరో వచ్చిన అలికిడి విని ముందుకి తిరిగింది అనసూయ.

"గదినిండా సామాన్లు చిందర వందరగా ఉన్నాయని సర్దుతున్నాను" అంది.

"నువ్వా అనసూయా ! వెనకనుంచి చూసి ఎవరా అనుకొన్నాను. చీర కట్టుకొంటే ఎంతో పెద్దదానిలాఉన్నావు. ఆరోజు పరికిణీ వల్లెవాటులో చూసి, ఏపాటి సంకోచంలేకుండా "ఏమమ్మా" అంటూ పిలిచేను. ఈనాటి నీ రూపు చూస్తుంటే "ఏమండీ" అనాలని పిస్తున్నాది." అంది లలిత.

"అదేమిటత్తయ్యా, నాకన్న పెద్దదానివి. పెద్ద చదువులు చదివిన దానివి. నిన్ను నేను "నువ్వు" అంటుంటే నువ్వు నన్ను మన్నిస్తావా ?"

"ఈడులో చిన్నదానివి అయినా భర్తవంక బంధువువి కదా"

"మా అమ్మ మామయ్యవంక బంధువు. ఆమెని నీకు తోచినన్ని అండీలు, గిండీలు దింపి మన్నించు. నేనుమాత్రం నీవంక బంధువునే .... ఇప్పుడేకాదు .... ఎప్పటికీకూడా"

"ఆ సంగతి నిన్ను చూసిన మొదటిరోజునే గ్రహించేను. కోర కుండా భగవంతుడు నాకో చిన్న చెల్లెమ్మని ప్రసాదించేడని"

"అయితే మనిద్దరం జట్టు" అంటూ లలిత చేతులు పట్టుకొంది అనసూయ.

"అత్తాకోడళ్ళు చెమ్మచెక్క లాడుతున్నారేమిటి ?" నవ్వుతూ గది లోకి ప్రవేశించేడు ప్రకాశం.

"రండి .... మీరూ చెయ్యి కలపండి .... ఆరు చేతులుంటే మరీ అందంగా వినిపిస్తాయి తప్పట్లు" అంది లలిత.

"మీరిద్దరూ ఆడుతుండండి .... నే నిప్పుడే వస్తాను" అక్కడి నుంచి సన్నగా జారుకొంది అనసూయ.

అనసూయ అలా వెళ్ళిపోవడంలోని అంతర్యాన్ని గ్రహించి భార్యాభర్త లిద్దరూ చిన్నగా నవ్వుకొన్నారు.

*   *   *

రామకోటికి ఆ ఉద్యోగం కలిసివచ్చింది. లలితపెళ్ళి అయిపోగానే నాగపూర్ వెళ్ళిపోయేడు. సాంబమూర్తి ఆఖరిక్షణంలో సన్యాసుల్లో కలసిపోడానికి సంశయించేడు. వేళకి తిండీ, నిద్రా అమరకపోతే చివరిదశలో ఆత్మారాముణ్ణి ఆరాట పెట్టవలసివస్తుంది. అనవసరంగా లేనిపోని పాపాన్ని మెడకి చుట్టుకోడం ఎందుకు అనుకొన్నాడు. చర్లంపేటలోవున్న చిన్నక్కగారింటికి మరణపర్యంతం అతిథిగా ఉండే నిర్ణయంమీద వెళ్ళిపోయేడు.

ఎవరి సామాన్లు వారికి మూటలుకట్టి ఆ ఇల్లు కాళీచేసింది లలిత. చివరగా తన సామాన్లు తీసుకొని బైటికి వస్తుంటే ఎందుకో ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగేయి.

ఒక అధ్యాయాన్ని ముగించి, ఇంకొకటి మొదలు పెట్టబోయే ముందు, రచయిత మనసులో కలిగే సంచలనంగా, గడచిన జీవితపు జ్ఞాపకాలు, గడుపబోయే బ్రతుకులోని ఆశలు, ఆలోచనలు, ఆశయాలు, కలగలుపుగా కదలి, మనసుని ఊయలలా ఇటు అటు ఊగించేయి.

అత్తవారింటికి ఆడపిల్ల వెళ్ళిపోతుంటే మిగిలినవారు ఆమెని అంపకం పెడుతూ కళ్ళనీళ్ళు పెట్టుకోవడం ఆచారం. కాని ఇక్కడ అత్తింటికి వెళ్తున్నది తనే. కళ్ళనీళ్ళు పెట్టుకొంటున్నది తనే— ఈ ఆలోచన మనసులోకి రాగా చిన్నగా నవ్వుకొంది లలిత !

లలిత అత్తింటి జీవితం వేలెత్తిచూపే లోటుపాట్లులేకుండానే సాగిపోవడం మొదలయింది. మంచిచెడ్డల్ని అర్థంచేసుకొని వాటికిఅనుగుణంగా నడిచే అత్తగారినీడలో కలతలకి, కల్మషాలకి తావులేకుండా, దినచర్య గడచిపోసాగింది.

వ్యర్థంగా కదలిపోతున్న కాలానికి కళ్ళెం వేసి, దాన్ని సాధ్యమైనంతగా ఉపయోగించుకోవడం లలిత నైజంలోఉన్న గుణం. అటువంటి

అలవాటు వల్లనే ముందు చదువుకొనే రోజుల్లోను, అటుతరువాత ఉద్యోగ కాలంలోను ఇటు ఇల్లు చక్కదిద్దుకొంటూ, అటు విధి నిర్వహణలో లోపం రాకుండా మసలుకోగలిగింది.

ఉదయం తొమ్మిదిగంటలకి ఆఫీసుకివెళ్ళేలోపున తను చెయ్యగలిగి నంత సహాయం అత్తగారికి ఇంటిపనుల్లో చేసి మరీ వెళ్ళేది. రాజమ్మకి భర్తపోయిన నాటినుంచీ ఏక భుక్తమే. రాత్రికి ఏ పండో, కాయో తిని, ఇంత మజ్జిగతేట తాగేది. లలిత వచ్చేక రాజమ్మని రాత్రిపూట పొయ్యి దగ్గరికి పోనియ్యలేదు.

"తనకున్నపని తినకున్నా తప్పదు. అన్నట్లు; మీరుభోజనం చెయ్యక పోయినా రాత్రివంట తప్పడంలేదు. ఇంక మీరు ఆ జోలికి పోకండి. ఆ వరండాలోకూర్చుని ఏ పుస్తకమో చదువుకోండి. నేను అరగంటలో వంట పూర్తిచేసి వచ్చేస్తాను" అంటూ వారించేది.

లలిత, ప్రకాశం సినిమాకికాని, స్నేహితుల ఇళ్ళకికాని వెళ్ళిననాడు రాజమ్మ తనే వంట చేసేది. అటువంటి సమయాల్లో లలితఅడ్డుపడేదికాదు.

"కష్టసుఖాల్ని అర్థం చేసుకొని మసలుకొనే మీ వంటి అత్తగారు దొరకడం నాఅదృష్టం" అనేది లలిత.

"అత్తగారి మంచితనాన్ని ఆమోదించే నీలాంటి కోడలు ఇంటికి రావడం అంతకి తక్కువ అదృష్టం అంటావా ? అత్తమంచి, కత్తిమెత్తన ఉండదంటూ మనవాళ్ళు ఏనాడో సామెతచేసి పారేసేరు" అనేదినవ్వుతూ.

"మీరా సామెతని నిర్దాక్షిణ్యంగా ముక్కలు చేసి పడేసేరు కదా" అనేది లలిత.

"ఎంతసేపు అత్తాకోడళ్లు భత్రాజుల్లా ఒకరి నొకరు పొగుడు కొంటూ కూర్చోడమేనా? ఇద్దర్నీ కలిపిన ఈ మానవమాత్రుణ్ణి కన్నెత్తి చూడ్డం అంటూ ఏమైనా ఉందా ?" అంటూ తనూ గొంతు కలిపేవాడు ప్రకాశం.

ముచ్చటకైనా ఒకనాడు పోట్లాడుకోలేని ఆ అత్తాకోడళ్ళ పొత్తు

చూసి, మొహల్లో సరదాపడే వారు. ఇరుగు పొరుగు వాటాల్లో ఉన్నవాళ్ళు కాలం గడుస్తుంటే ఆ మెప్పులు ఈర్ష్యగామారి, ఆ ఈర్ష్య చెంపలు పెట్టాలన్న పాడు బుద్ధిగా పరిణమించి, పరువు, సభ్యతగల లలిత దగ్గర ప్రపంచపు కిటుకుల్ని ఆకళింపు చేసుకొన్న రాజమ్మదగ్గిర తమ పప్పులు ఉడకక-పోవడంతో నోరుమూసుకొని ఊరుకొన్నారు.

కోడలు ఉద్యోగంచేస్తూ డబ్బుతో అత్తగారి నోరుకట్టేసింది. ఇంక దెబ్బలాటలు ఎలావస్తాయి.... అని తమ మనసులకి సమాధానాలు చెప్పుకొన్నారు. కొందరు తమకాలంలో అత్తరికం చెలాయించిన ముసలివాళ్ళు.

తాముకూడా లలితలా డబ్బు గడిస్తుంటే తమ అత్తలూ కాలికింద చెప్పులా అణగిమణిగి పడిఉండేవారు—అనుకొనేవారు కోడంటికం పడుతున్న నోళ్ళు.

"రాజమ్మ తరహావేరు. ఆమెని ఎవరూ చెడ్డ చేసుకోలేరు" అనుకొన్నారు సహృదయంతో మనుష్యుల్ని అర్థం చేసుకోడానికి తాపత్రయపడే ఇల్లాళ్ళు.

*　　*　　*

వారంలోఆరురోజులు లలిత దినచర్య ఒక్కలాగేఉండేది. చీకటితో లేచి తనపనులు, భర్త అవసరాలు చూసుకొని, అత్తగారికి కాస్త సహాయం చేసి, తొమ్మిది గంటలకల్లా ఇంత తిండితిని, ఆఫీసుకి పోవడం; సాయంకాలం తిరిగివచ్చి భర్తతో, అత్తతో సరదాగా కబుర్లు చెప్తూ; కాఫీ సేవించి, వంటపని, భోజనాలు ముగిసేక ఏ పుస్తకం చదవడమో, లేక భర్తకి నోట్సు మైపు చెయ్యడమో, తన ఆఫీసులో మిగిలిపోయినవి చూసుకోడమో — అలా గడిచిపోయేది రోజు.

లలిత బాస్ రామలింగం చాలా మంచివాడు. ఎప్పుడేనా అవసరంపడి గంటా, అరగంటా లలిత ఆఫీసుకి ఆలస్యంగా వచ్చినా, ముందుగా వెళ్ళిపోయినా, ఏమీ అనేవాడు కాడు. "పెళ్ళిచేసుకొని, ఇల్లు దిద్దుకొంటున్న ఆడవాళ్ళు ఉద్యోగాల్లో ఉన్నప్పుడు, అటువంటివారి సమస్యల్ని సాను

భూతితో అర్థం చేసుకోవాలి. అటువంటివారికి కొన్ని మినహాయింపులు ఇవ్వాలి....అప్పుడే ఇంట్లో భర్తని, ఆఫీసులో అధికారిని మనసులో తిట్టుకోకుండా వారు పనిచెయ్యగలుగుతారు" అనేవాడు అతడు.

అందుకు తగిన విధంగానే లలితఆఫీసులో ఉన్నంతసేపు వంచిన తలఎత్తకుండా పనిచేసేది. మిగిలిపోయిన పనిని రాత్రిపూట ఇంటికి తెచ్చుకొని పూర్తి చేసేది.

ఒకొక్కరోజు "రాత్రి పది దాటుతున్నా ఇంకా ఆ టైపు రైటర్ టకటకలు ఏమిటి లలితా! ఇంక ఈ రోజుకి ఆపేయి" అనేవాడు ప్రకాశం.

"మీకేం అదృష్టవంతులు. పదిమంది అబ్బాయిల్ని, అమ్మాయిల్ని ముందేసుకొని నోటికొచ్చిన నాలుగు ముక్కలు "పాఠం" అంటూ చెప్పివస్తే తీరిపోతుంది. అందరికీ అలా కుదురుతుందా ?" అనేది లలిత నవ్వుతూ.

"ఓ .... మహా గొప్ప ఉద్యోగం నువ్వే చేస్తున్నావు ? అందంగా అలంకరించుకొని కూర్చుని వచ్చేపోయే వాళ్ళందర్నీ "హల్లో" అంటూ పలకరించడమే కదా నీ పని .... హాయిగా పంకాకింద కూర్చుని ఆ పని చెయ్యడానికి ఎంత అలసిపోతున్నావు పాపం" అంటూ ఉడికించేవాడు ప్రకాశం.

రాజమ్మ రామాయణ పుస్తకం మూసి, గూటిలోపెట్టి వచ్చేసరికి లలిత ఇంకా టైపురైటరు ముందేఉంది. ప్రకాశం పక్కన కూర్చుని ఏమో చెప్తున్నాడు. వారి ఏకాగ్రతనిబట్టి అది ఏదో ముఖ్యమైన విషయం అయి ఉంటుందనుకొని పలకరించకుండా బైటికి వచ్చింది. వరండాలో తన మంచంమీద పడుకొని కృష్ణా, రామా అనుకొంటూ కళ్ళు మూసుకొంది.

పక్కవాటాలోని సుందరమ్మ మొగుడికి తమలపాకులకి సున్నం రాసిస్తూ, ఏమేమో కబుర్లు చెప్తున్నది. వినకూడదనుకున్నా తడిక మాత్రమే అడ్డం ఉండడంచేత రాజమ్మ చెవుల్లో ఒకటీ అరా, మాటలు పడుతూనే ఉన్నాయి.

"రాజమ్మ కొడుకూ, కోడలూ, ప్రేమించి పెళ్ళి చేసుకొన్నారంటావు. నా మొహం ప్రేమ. అదేమి ప్రేమట! ఉదయం లేచిన దగ్గరనుంచి కాళ్లు తొక్కుకుంటూ ఆఫీసుకి పరుగులు; ఇంక జాముారాత్రిదాకా ఈవిడ ఆ టైపుమిషన్ ముందు; ఆయన పుస్తకాలు ముందేసుకుని" "లేకపోతే ఎలా ఉండాలంటావు ? సినిమాల్లో నాయికా నాయకుల్లా పార్కులంటా, రోడ్లంట ఇతడి చెయ్యి పట్టుకుని ఆమె, ఆమె కొంగు పట్టుకొని ఇతడు, పరుగులు పెయ్యాలంటావా ? ప్రేమించి పెళ్ళి చేసుకున్నారు కాబట్టే, కష్టం, సుఖం పంచుకుంటున్నారు. కలిసి ఆనందం అనుభవిస్తున్నారు. మొన్న చూడలేదూ అతడికి తలభారంగా ఉందని పడుకుంటే, ఆ పుస్తకాలన్నీ చదివి అతడి లెక్చర్‌కి నోట్సు తయారుచేసింది ఆ అమ్మాయి. అదే నువ్వయితే ? నేను అర్ధరాత్రిదాకా ఆఫీసు పనితో చస్తుంటే, హాయిగా ఏడు కాకుండానే గుర్రు ప్రారంభిస్తావు"

"ఆ .... మహా చెప్పొచ్చేరులెండి. పండగకి, పబ్బాలకి నేను పని తెమలక చస్తుంటే మీరు ఏపాటి సాయంచేసి పెట్టేరు నాకు ? ఇచ్చేది పుచ్చుకునేది రెండువేపుల నుంచి ఉండాలి" అంటూ అక్కడనుంచి లేచి పోయింది సుందరమ్మ.

మొదట్లో జగన్నాధరావుగారి సంబంధం తప్పిపోయినందుకు మనసులో కొంత బాధ పడింది రాజమ్మ. కాని లలిత తమ ఇంట్లో కాలు పెట్టేక తన నిర్ణయం కన్నా కొడుకు ఎన్నికే సరియైనదని తెలుకొని తృప్తి పడింది. పక్కింటి పద్మనాభంగారు తని కోడలిని గురించి గొప్పగా అలా మాట్లాడుతుంటే తృప్తిగా వింటూ ఎప్పుడో నిద్రలోకి జారిపోయింది రాజమ్మ.

బాగా తెల్లవారినా లలిత ఇంకా నిద్రలేవలేదు. ఆరోజు ఏదో ముస్లిముల పండగ. సెలవు రోజు. చాలా రాత్రి దాకా మేలుకొని ఏదో చేస్తూనే ఉంది మరి కాస్తసేపు పడుకోనీ.... పోయేదేముంది. అనుకొంది రాజమ్మ బిందె పట్టుకొని నీళ్ళకి వెళుతూ.

ఉండిందికి ఆ ఇంటి పెరట్లో ఒకకొళాయి ఉంది. కాని దానిలోంచి, ధారాళంగాఎప్పుడూనీళ్ళురావు. వచ్చినకాడికైనా ఎవరుపడితేవాళ్లు, ఎప్పుడు పడితే అప్పుడు పట్టుకోడానికి వీలు లేదు. దానికీఒక వరసా వావీ ఉంది.

ముందు ఇల్లుగల వారి అవసరాలు పూర్తికావాలి. ఆ వెనక ఇరవై ఏళ్ళకి పైగా ఆ ఇంట్లో అద్దెకుంటూ, ఆ విధంగా స్థానబలిమి సంపాదించుకొన్న గంగమ్మగారి గంగాళాలు, కాగులు నిండాలి. అప్పుడు మిగతా వాటాల వాళ్ళవంతు. ఎవరు ముందువస్తే వారు పట్టుకుపోవచ్చు కాని, సాధారణంగా అప్పటికే ధార సన్నబడి బొట్టు బొట్టుగా నీళ్ళు పడ్తుంటాయి. పావుగంటకో బిందె నిండడం అపురూపం, దానితో కేకలు, దెబ్బలాటలు....

లలిత అయితే వాళ్ళతో సరిగ్గా వాదులాడి ముందరికి తోసుకుపోయి, ఒక బిందెడు నీళ్ళు, ఎత్తుకొస్తుంది. లేదంటే గంగమ్మగారిగంగాళంలోంచి ఆమె ఇంట్లోకి వెళ్ళగా చూసి నీళ్ళు ముంచుకొస్తుంది. కాని రాజమ్మవల్ల అటువంటివి అయే పనులు కావు. అందుకే బిందె పట్టుకొని వీధికొళాయికి బైలు దేరింది. అది నాలుగిళ్ళ అవతలవుంది. అక్కడా దొమ్మిఉంటుంది. అయినా నీళ్ళు బాగా వస్తాయి. త్వరగా బిందెలు నిండిపోతాయి. పెద్దావిడ చిన్నబిందె, అన్న కారణంగా రాజమ్మకి ఎవరో ఒకరు ధార విడుస్తారు.

రాజమ్మ నీళ్ళబిందెతో తిరిగి వచ్చేసరికి వంట ఇంటి తలుపు బార్లా తీసివుంది. గడియపెట్టి వెళ్ళడం మరచిపోయేను, గాలికి తీసుకు పోయిందిలా వుంది. ఏ కుక్కో, పిల్లో జొరబడి పాలు తాగేయలేదుకదా ? అనుకొంటూ గబగబ అడుగులు వేసింది.

వంట ఇంట్లోకి కుక్కా, పిల్లీ రాలేదు. కుంపటి మీద కాగినపాలు గిన్నె నిండుగా ఉన్నాయి. పక్క పెరట్లో ఇంటావిడతో దేనికో కసాలా పడుతున్నది లలిత. పైటకొంగుని నడ్డిచుట్టూ దోపుకొని, ముక్కుపుటాలు ఎగురవేస్తూ "నువ్వెంత అంటె నువ్వెంత" అంటూ పార్వతమ్మ నోట్లో నోరుపెట్టి దెబ్బలాడుతున్నది. అంత ధైర్యంగా ఆవిడతో పోరాడుతున్న లలితని ఇరుగుపొరుగు వాటాల్లోవాళ్ళు ఆశ్చర్యంగా చూస్తున్నారు.

"ఏం ఊరకే ఇచ్చేరా ఇల్లు. షష్ఠాతారీకు ఉదయం కాకుండా అద్దె కోసం నెత్తిమీదకూర్చుంటారే.... మరి ఆ డబ్బు ఇచ్చుకొంటున్నవాళ్ళు మనుషులు కారూ! వారికి కంపు, గంధం, దోమల వల్ల బాధ, ఈగలవల్ల రోగాలు ఇవేం రావా?"

ముప్ఫయి ఏళ్ళుగా మా యిల్లు అద్దెకిస్తున్నాం.... ఈఇంట్లో ఇన్ని వాటాలవాళ్ళు ఉన్నారు. మీ అత్తగారు ఆ వాటాలో అంత కాలంగా ఉంటున్నది. ఎవరకీ లేని అభ్యంతరం ఈ నాటికి నీకు వచ్చిందా? గుడ్డొచ్చి పిల్లని వెక్కిరించింది అన్నట్లు నాకే పాఠాలు చెప్తావా? ఎవరను కొన్నావో ఈ పార్వతమ్మ అంటే....

"ఆ పెంటకుప్ప మూడుతరాలై అక్కడేఉంది. అక్కడేఉంటుంది. నీకిష్టమైతేఉండు, లేకపోతే ఇల్లుకాళీచేసివెళ్ళు. మహాచదువుకొన్నదాన్నని మిడిసిపడ్తున్నావు.... నీలాంటి వాళ్ళని ఇంతమందిని చూసేను" అంటూ ఆవేశంతో ఊగిపోతూ గుప్పెట నిండా జుట్టు పట్టుకొని చూపిస్తున్నది పార్వతమ్మ.

రాజమ్మ కలగజేసుకొని లలితని ఇంటిలోకి లాక్కొచ్చింది. పార్వతమ్మ మరినాలుగైదు నిమిషాలు తారాజువ్వలా ఎగిరిపడి.... "ఏమనుకొంటున్నారో నాతడాకా" అన్నట్టు అద్దెలవాళ్ళవైపు ఓ చూపు విసిరి అక్కడి నుంచి వెళ్ళిపోయింది.

"అనవసరంగా ఆవిడ నోట్లో నోరెందుకు పెట్టేవు లలితా" అంటూ మందలించింది రాజమ్మ.

"అనవసరం ఏమిటి అత్తయ్యా, నాలుగు రోజులుగా వర్షాలకి కుళ్ళిన ఆ పేడంతా తెచ్చి, మన గది పక్క పోస్తున్నాది. రెండు నెలలు కుళ్ళితే మంచి ఎరువు అవుతుందిట. అప్పుడు ఆవిడకి బండికి నాలుగు రూపాయలు చొప్పున సొమ్ము వస్తుందట. ఆవిడకి ఆ సొమ్ము రావడం కోసం ఇటు అద్దెకున్న వాటాలవాళ్లు, ఆ కంపు, దోమలు భరించాలిట, అందంగా వుందికదూ. పైగా అంటుంది; మూడు తరాలై మా పెంటకుప్ప అక్కడే ఉన్నదని .... కావచ్చు, అప్పుడు ఇంటివాళ్ళు అయుంటు

భాగంలో ఉండి ఉంటారు. అద్దెలకిచ్చిన ఈ భవనాలు పశువుల కొట్టాలో, దంపుళ్ళ చావిళ్లో అయివుంటాయి. ఇప్పుడు అలా కాదుగా.... ఎంత అద్దె వాళ్ళయినా, వీళ్ళూ మనుష్యులేగా .... ఆమాత్రం జ్ఞానం లేకపోతే ఉన్న వాళ్ళు చెప్పాలి. ఇటువంటివి మళ్లా జరక్కుండా చూడాలి....అంతేకాని.... ఆవిడ అన్నదానికల్లా భళి ....భళీ అంటూ కూర్చోడమేనా ?"

"కూర్చోక ఏం చేస్తావో నేనూ చూస్తాను" అన్నట్లు, ఆ సాయం కాలమే ఫస్టుకి ఇల్లు ఖాళీ చెయ్యమని కొడుకుచేత ఫర్మానా జారీ చేయించింది పార్వతమ్మ.

పదిహేనేళ్ళనాడు పాతిక రూపాయల బాడుగమీద రెండుగదులు, వంట ఇల్లు, పక్క వసారా ఉన్న ఆ భాగంలో ప్రవేశించింది రాజమ్మ. దరిమిలా అయిదు, పది మిగిలిన అన్ని వాటాలకి అద్దె పెంచినా, మగ దిక్కులేని ఆడది, ఒంటరిగా పిల్లడిని చదివించుకొంటున్నదని పార్వతమ్మ మామగారు దయదలిచి రాజమ్మ వాటా అద్దె పెంచలేదు. అతడు కాలం చేసేక రెండుసార్లు రెండేసి రూపాయల చొప్పున అద్దె పెంచి, నాలుగు నెలల క్రిందటే పూర్ణాంకం ముప్పయి చేసింది పార్వతమ్మ.

పదిహేనేళ్ళకాలం, దేశాన్ని ఒక ఊపు ఊపి వదలిపెట్టింది. వస్తున్న డబ్బుకి విలువలేకుండా పోయింది. నెల నెలకీ పొత్తిళ్ళలో పసివాడిలా నిత్యావసర వస్తువుల ధరలు పెరిగిపోయేయి. పెరుగుతున్న ధరలతోపాటు మనుషుల అవసరాలు కూడా పెరిగిపోయేయి. పట్నవాసపు జీవితంలోని సులువు బలువుల్ని, పల్లీయులు రుచి చూసేరు. పొట్టకూటికి పనులకోసం, జీవితంలో మార్పుకోసం, పల్లెల నుండి పట్నాలకి ప్రజలు వలస రావడం మొదలయింది. హద్దుమీరి పెరిగిపోతున్న జనాభాకి పట్నాలలో ఇళ్లులేవు. ఉన్న ఇళ్ళ అద్దెలు సామాన్య సంసార్లకి అందుబాటులో లేవు — అన్నట్లు తయారయింది పరిస్థితి.

వయసులో ఉన్న మనసు, పొంగుతున్న పాలవంటిది. ఆవేశంతో ఉత్సాహంగా పొంగి పోవడమేకాని ఎక్కడికి చేరబోయేది చూడదు.

"పోనీపోయిందే. ఇంత మహాపట్నంలో ఆపాటి మురికికొంప దొరక్కపోదు" అంది లలిత హాస్యంగా.

* * *

రెండురోజులు సెలవుపెట్టి, దంపతులిద్దరూ ఊరంతా ఇంటికోసం గాలించేరు. కాస్త పరిశుభ్రంగా ఉన్న వీధిలో రెండుగదుల ఇల్లుందంటే నూరు, నూటఏభై అద్దె. ముందుగా మూడునెలల అద్దె ముడుపు కట్టాలి.

చిన్న చిన్న సందుల్లోఉన్న ఇళ్ళు పార్వతమ్మ ఇంటికన్న అధ్వాన్నంగా ఉన్నాయి. అద్దెమాత్రం అరవైకి తక్కువలేదు. ఇంటిముందు బురదలో పందులు ఈదులాడుతున్నా, ఇంటాయన ఇంటి పరిశుభ్రత గురించి చెప్పే మాటలకి లోటులేదు.

"విశాఖపట్నంఅంతా గాలించినా మా ఇంటిలాంటి ఇల్లు మీకు దొరకదు. వీధి చిన్నదైతేనేమి బస్సులు, కారుల బెడద ఉండదు. నూతిలో నీరు ఉప్పగా ఉంటేనేమి — పదిపైసలకి బిందె చొప్పున మీకు ఎన్ని బిందెలు కావాలన్నా కొళాయి నీళ్ల తెచ్చిపోసేవాళ్ళు ఈ వీధిలో కావలసినంతమంది ఉన్నారు. ఇంటికి మరీ పది కిటికీలు, గుమ్మాలు ఉండగానే సరా.... వీధిలో దుమ్మంతా ఇంట్లోనే ఉంటుంది. ఆ ఒక్క తలుపు వేసుకొని పడుకొన్నారంటే బైట ఎండ నిప్పులు చెరుగుతున్నా నిశిరాత్రిలా ఉంటుంది ఇంట్లో .... నిజంగా ఇది ఇల్లుకాదు....ఇనప్పెట్టే అనుకోండి"

ఆ ఇంటి సదుపాయాలు గురించి ఇంక వినలేక బైటికి వచ్చేరు లలితా, ప్రకాశం.

వారంరోజులపాటు ఇల్లుకోసం చేసిన ప్రయత్నాలు వ్యర్థంకాగా అనుభవంతోకూడిన అత్తగారిమాటల్లో ఉన్న యథార్థాన్ని గుర్తించింది లలిత. ఏది ఏమైనా పార్వతమ్మముందు తలవంచి, మమ్మల్ని మీ ఇంటిలో ఉండనీయమని అడగడానికి మాత్రం ఆమె సిద్ధంగాలేదు. ఇంకా టైము ఉందికదా. ఆ వేళకి ఏదో ఒకటి దొరక్కపోదు — అనే నమ్మకతోనే ఉంది.

అటువంటి పరిస్థితిలో ప్రకాశానికి ఒక మిత్రుడు తమాషా అయిన సలహా ఇచ్చేడు.

సింహాచలం వెళ్ళేదారిలో ఎవరో మార్వాడి వాయిదాల పద్ధతిమీద ఇళ్ళస్థలాలు అమ్ముతున్నాడట, ఒక స్థలం తీసుకుని ఒక చిన్న పాక వేసు కొన్నా ప్రశాంతంగా ఉండవచ్చు. సింహాచలం విశాఖపట్నం మధ్య, సిటీ బస్సులు తిరుగుతూనేఉంటాయి. అంతా ఆశిస్తున్నట్లు విశాఖపట్నానికి ఉక్కు కర్మాగారమే వస్తే ఇటు సింహాచలం అటు భీమునిపట్నం వరకు ఊరు పెరక్కఎలాగా తప్పదు. అక్కర్లేదనుకొంటే అప్పుడు అమ్మేసినా బాగా పలుకుతుంది అన్నాడు.

లలితకి ఆ సలహా ఎంతగానో నచ్చింది. భర్తని, అత్తగారిని వెంట బెట్టుకొని ఆ స్థలాలు చూడ్డానికి వెళ్ళింది. అదంతా బంజరుభూమి. అక్కడో తాటిచెట్టు ఇక్కడో ఈతమొక్క అన్నట్టు ఉంది. అప్పటికే కొందరు ఎగ బడి రోడ్డు నానుకుని ఉన్న స్థలాన్ని కొనేసేరు. చుట్టుపక్కల నాలుగైదు పాకలుకూడా కన్పిస్తున్నాయి.

విశాఖపట్నం మున్సిపల్ హద్దులు దాటిఉండడంచేత కొళాయిలు కాని ఎలక్ట్రిసిటీకాని లేదు. ఆ పొలాల మధ్యనుంచి ఒకటి రెండు ఫర్లాం గులు నడుస్తేకాని రోడ్డురాదు.

అక్కడి ప్రశాంత ప్రకృతి, పరిశుభ్రమైన గాలి, లలిత మనసుని ఇట్టే ఆకట్టుకున్నాయి. మిగిలిన ఇబ్బందులు ఎన్నిఉన్నా ఆ రెండింటి కోసం సరిపెట్టుకోవచ్చు ననుకొంది.

ప్రకాశం డబ్బుగురించి వెనక్కి తీసేడు. "ముందుగా కనీసం వెయ్యి రూపాయలైనా చెల్లించవలసి ఉంటుంది" అన్నాడు.

"ఫరవాలేదు. నా మెడలోఉన్న గొలుసు, చేతిగాజులు అమ్మేస్తే అధమపక్షం తొమ్మిది వందలైనా వస్తుంది. నా బ్యాంకు ఎకౌంటులో నాలుగు వందలదాకా ఉంది. మొదట చెల్లించిందికి ఇదిచాలు. మిగిలిన సొమ్ముతో ఒక నిట్రాడి పాక వేసుకొని చుట్టూ తడికెలు కట్టుకొన్నా సరి పోతుంది. తరువాత తాపీగా ఒకటొకటి చూసుకోవచ్చు" అంది లలిత.

"ఊరికి దూరంగా ఇల్లు అంటే, అందువల్ల ఏర్పడే సాధక బాధకాలు చూసుకోవలసిన వాళ్ళు మీరు. మీకు నచ్చితే తీసుకోండి" అంది రాజమ్మ.

అంతలో లలితకి ఏదో అడ్డంకి కన్పించిందిలాగుంది, నిరాశగా ముఖంపెట్టి "లాభంలేదు. ఉదయమనగా మనిద్దరం వెళ్ళిపోతే, అత్తయ్య ఒక్కర్తే ఇంట్లో ఉండవలసివస్తుంది" అంది.

"నాకేం భయంలేదు. నా రామాయణ పుస్తకం దగ్గరఉంటే ఎక్కడ ఉన్నా నాకు ఒంటరితనం అన్నమాటకూడా తలపుకి రాదు" అంది రాజమ్మ.

* * *

మనసులోకి వచ్చిన ఆలోచనల్ని మాటలమధ్య నానబెట్టడం లలితకి అలవాటులేదు. అనుకొన్నాక దాని అంతు చూడందే ఆమెకి నిద్ర రాదు. మరునాటినుంచి ఆ స్థలం కొనడానికి అవసరమైన సమాచారం సేకరించడం మొదలుపెట్టింది.

స్నేహితుని సహాయంవల్ల అట్టే అడ్డంకులు లేకుండానే ఆ స్థలం తన పేర రిజిష్టరీ చేయించుకో గలిగేడు ప్రకాశం. రెండు పక్షాలవారు ఎగ్రిమెంటుమీద సంతకాలు పెట్టడం వగైరా కార్యక్రమాలన్నీ పూర్తిఅయేక ఒక మంచిరోజున ఆశ్రమ నిర్మాణానికి ప్రారంభోత్సవం జరిగించేరు.

వారం పది రోజుల్లో పర్ణకుటీరం తయారయింది. ఆ వారంలో రెండురోజులు లలిత సెలవుపెట్టి అక్కడి పనిపాట్లు చూసింది. మరి నాలుగు రోజులు ప్రకాశం సెలవు తీసుకొన్నాడు.

పాకపని పూర్తి అయేక కూలివాళ్ళచేత, ఇంటిచుట్టూ నాలుగైదు గోతులు తీయించి మొక్కలునాటించింది లలిత.

"మనకే తాగిందికి సరిగా నీళ్ళులేవు. ఇప్పుడప్పుడే మొక్కలు, పాదులు అంటు పెట్టుకోకు. కొళాయిలు వచ్చేక అటువంటివన్నీ చూసుకోవచ్చు" అన్నాడు ప్రకాశం.

అక్కడికి నాలుగు ఫర్లాంగుల దూరంలో ఒక మంచినీళ్ళ నుయ్యి ఉంది. రోజూ ఉదయం అక్కడే స్నానంచేసి ఒక బిందెడు నీళ్ళు తోడు కొచ్చేది లలిత. రాజమ్మ తన వంటికి నీళ్ళు తెచ్చుకొనేది. ప్రకాశం మరి రెండు బాల్చీలతో తెచ్చేవాడు. సాధారణంగా ఆ నీళ్ళు రోజూ వాడికలకి సరిపోయేవి. ఎప్పుడైనా కొరతపడితే సాయకాలం మరో బిందె తెచ్చు కోవలసివచ్చేది. బియ్యం, కూరలు కడిగిన నీళ్ళు, చెంబులు తోలిచిన నీళ్లు ఒక బాల్చీలోకి పోసి ఉంచి, సాయంకాలం పూలమొక్కలకి పోసేది లలిత.

నెలరోజులవరకు ఆ ఇంటికి చిన్న, పెద్ద హంగులు సమకూర్చు కోడంతో సరిపోయింది వారికి. కొంత సర్దుబాటు అయేక "మా ఇల్లు చూద్దురుగాని రండని" మిత్రుల్ని అహ్వానించేరు. పట్నం రొదకి దూరంగా, ప్రశాంతంగాఉన్న ఆ ప్రదేశాన్ని చూసి "దివ్యంగాఉంది మీ ఆనందధామం" అంటూ ప్రశంసించేరు వచ్చినవాళ్ళు.

మిత్రుల పొగడ్తలు అందుని ఆ రాత్రి తృప్తిగా నిద్రపోయేరు లలితా, ప్రకాశం.

* * *

రెండు నెలలు గడిచి కొత్తయింటి ముచ్చటతీరి, పాతజీవితం గాడి లోకి పడేసరికి ఉత్సాహంపాలు కాస్త తగ్గి, ఈతిబాధలు కన్పించసాగేయి.

ఏ కారణం వల్లనైనా లలితకి నాలుగు గంటలకి తెలివిరాకపోతే ఆ రోజు ఆమెకి మరి స్నానం చేసే అవకాశం ఉండేది కాదు. మరుగు లేని ఆ నూతి దగ్గర వెలుతురు వచ్చేక ఆడవాళ్ళు స్నానం చెయ్యడానికి వీలయేది కాదు. చుట్టుపక్కల పొలాల్లో రైతులు, దారిన వచ్చి పోయే మనుషులు కనుచీకటి ఉండగానే తిరుగాడ్డం మొదలుపెట్టేవారు. అలా మనుషులు, తిరుగుతూంటే బట్ట తడుపుకొని స్నానం చేయలేక, ఇంటికి నీళ్ళు ఎత్తి తెచ్చుకొనే ఓపికా లేక రెండు, మూడుసార్లు స్నానం చెయ్య కుండానే భోజనం చేసి ఆఫీసుకి వెళ్ళిపోవలసివచ్చింది లలితకి.

ఒక్కొక్కరోజు లలిత లేచినా ప్రకాశం కదిలేవాడు కాదు. ఒంట రిగా ఆ చీకటిలో పోవడం లలిత వల్ల అయే పని కాదు. "మీకేం మగాళ్ల ఎంత పొద్దు ఎక్కినా, చుట్టు ఎంతమంది తిరుగుతున్నా పట్టించుకోకుండా స్నానం చేసి వస్తారు. నేను నిన్నకూడా నీళ్ల పోసుకోలేదు" అంటూ కోపగించుకొనేది లలిత.

రాత్రి పన్నెండు గంటలవరకు ఆ పరీక్ష పేపర్లు దిద్దుతూ కూర్చు న్నాను. ఇంకా నా కళ్ళమంటలు తీరలేదు. కావాలంటే ఇంకో బాల్చీడు నీళ్ల ఇంటికి తెస్తాను. పొద్దెక్కి పోసుకోవచ్చు" అనేవాడు ప్రకాశం.

కాని ప్రకాశానికి తన పనులు పూర్తి చేసుకొని అలవాటుగా తెచ్చే రెండు బాల్చీల నీళ్ల తెచ్చేసరికే వేళయిపోయేది. ఇంక మూడో బాల్చీకి పోయేసమయం ఉండేది కాదు. చీదరించుకొంటూనే చెంబుడునీళ్ళతో చేతుల్, ముఖం కడుక్కొని బట్టలు వేసుకొనేది లలిత.

నీళ్ళకోసం కొడుకు, కోడలు చిర్రుబుర్రు లాడుకోడం రాజమ్మకి కష్టంగా ఉండేది. ఊరికిదూరంగా ఇల్లన్నప్పుడు ఈ కష్టసుఖాల్ని చూసుకో వలసింది. ఇప్పుడు చికాకుపడి ఏం లాభం? అవకాశం ఉన్నంతలో పనులు సవ్యంగా జరిగేమార్గం చూసుకోవాలి కాని— అని ఇద్దరికి సర్ది చెప్పేది.

అత్తగారు చెప్పిన మాట సరిగ్గా ఉందనుకొంది లలిత. అనవ సరంగా తను, భర్త కీచులాడుకొని లాభంలేదు. దీనికేదో మార్గం చూడాలి— అనుకొంది.

ఆ సమస్యా పరిష్కారానికి అప్పటికి కనిపించిన మార్గం ఒక్కటే ఇంటివెనుక భాగంలో నుయ్యి తవ్వించుకోవాలి. ఆ ప్రదేశంలో కొంచెం లోతుతవ్వగానే నీళ్ళుపడ్తాయట. ఎంతకొద్దిలో నీళ్లపడినా నుయ్యి తవ్వించు కోడం అంటే డబ్బుతో కూడినపని. ఉన్న కాస్త బంగారం స్థలం కోసం అప్పుడే అమ్మేసేరు. ఇప్పుడు డబ్బు కావాలంటే ఎలా వస్తుంది ? ఎవ రిస్తారు? ఏ మార్వాడీ దగ్గరో అప్పుతెస్తే అది తీరే మార్గం ఏమిటి ?

ఆ రోజంతా ఆలోచిస్తూనే ఉంది లలిత. సాయంకాలం ఆఫీసు వదిలే సమయానికి ఒక ఆలోచన వచ్చింది.

ఆఫీసులో ప్రతినెలా జీతంలోంచి ఇంత అని కోసుకొనేలా అప్పు తీసుకుంటే ? 'అటువంటి అవకాశం ఏమైనా ఉందా?-' అని క్యాషియర్ని అడిగింది.

"అధికార్ల అనుగ్రహం ఉంటే ప్రయివేటు సంస్థల్లో అన్ని అవకాశాలు ఉంటాయి" అన్నాడు అతడు.

అప్పుడు అతడి వ్యంగ్యోక్తిని పట్టించుకొని వాదులాటకి దిగే స్థితిలోలేదు లలిత. ఎలాగైనా సొమ్ము పుట్టించుకొని నుయ్యి తవ్వించుకోవాలి. అది ఎంత త్వరలో జరుగుతే అంత మంచిది.

అప్పటికే రామలింగం ఆఫీసునుంచి ఇంటికి వెళ్ళిపోయాడు. మరునాడు ఆదివారం, సోమవారం దాకా ఎటూ తేలని ఆ పరిస్థితిలో ఉండడం లలితకి ఇష్టంలేదు.

రామలింగం ఇల్లు పక్కవీధిలో ఉంది. ఒకసారి వారి అమ్మాయి పుట్టినరోజు చేసిన పార్టీకి వెళ్ళింది లలిత. అంతకు మించిన పరిచయం మిసెస్ రామలింగంతో లేదు.

లలిత వెళ్ళేసరికి రామలింగం, భార్య లాన్‌లో కూర్చుని ఏదో మాట్లాడుకుంటున్నారు.

"ఏమిలా వచ్చేవు లలితా" అన్నాడు అతడు.

అతడు ఎప్పుడూ లలితని నువ్వు అనే అంటాడు. అలా అంటేనే లలితకి బాగుంటుంది. ఆమె తండ్రి ఈడు వాడు అతడు. "అమ్మా" అని అతడు పిలుస్తుంటే కష్టం సుఖం చెప్పుకొనే చనువు ఉంటుంది.

"మీతో కొంచెం పనుంది" అంది లలిత.

"చెప్పు .... ఫరవాలేదు. మాలతిని నీకు తెలుసుగా" అన్నాడు.

కొత్త ఇంటిలో తాము ఎదుర్కొంటున్న నీటి ఎద్దడిని తెలియచేసి, అప్పు విషయం ప్రస్తావించింది లలిత.

"సరే....అలాగే తీసుకోవచ్చు, కాని వడ్డీకూడా కట్టవలసిఉంటుంది. బ్యాంకురేటే అనుకో" అన్నాడు.

"మీరెలా నిర్ణయిస్తే అలా వెళ్లిస్తాను. ముందు సొమ్ము సర్దుబాటు చేస్తే చాలు" అంది.

"క్యాషియర్‌తో చెప్తాను. సోమవారంనాడు ఆఫీసులో తీసుకో" అన్నాడు రామలింగం.

రామలింగానికి థాంక్సు చెప్పి, ఇద్దరికీ నమస్కారాలు పెట్టి బైటకి వచ్చింది లలిత.

సాయంకాలంవేళ బస్సులన్నీ రద్దీగా ఉన్నాయి. ఆఫీసు స్పెషల్స్ వెళ్ళిపోయేయి. ఎంత తొందరపడ్డా లలితకు ఏడు దాటేవరకు బస్సు దొరక లేదు.

చీకటిలో బస్సు దిగి ఆ రెండు ఫర్లాంగుల మార్గం నడవడానికి కాస్త బితుకుగానే అనిపించినా, మనసులో రేగుతున్న ఉత్సాహవంతమైన ఆలోచనలు అడుగుల్ని ముందుకు వేయించేయి.

చక్కగా ఇంటివెనుక నుయ్యి ఉంటే ఎంత సుఖంగా వుంటుంది.

ఇంటిచుట్టూ అందమైన తోట పెంచుకోవచ్చు. వేసవిలో కావలసి నన్ని నీళ్ళతో స్నానం చేయవచ్చు. ఇంటిచుట్టూ బోగన్‌విల్లా మొక్కలు కంచెలా వేస్తే మరుగుకి మరుగు అందానికి అందం వుంటుంది. కుడిపక్క వరండా పెణకమీదికి కాశీరత్నం లత పాకిస్తే వీధిలోకి ఇల్లు పూలపంది రిలా కన్పిస్తుంది. ఎడమపక్క మల్లి, జాజి, గులాబి వంటి సువాసనలు వెదజల్లే మొక్కలు వేసుకొంటే పడకటింటిలోకి అందంగా కనిపిస్తూ వాస నలు వెదజల్లుతూ వుంటాయి. మధ్యగదిలో అడ్డుగాఉన్న రాటకి చిన్న కుండీలోపెట్టి మనీప్లాంటి పాకిస్తే ఇంటికే కళ వస్తుంది. ఇలా ఆలోచి స్తూనే గుమ్మంలో కాలు పెట్టింది లలిత. ప్రకాశం విసుగుదలతో గుమ్మంలో పచార్లు చేస్తున్నాడు. "ఏమయిందండీ!" ఏదో జరిగిందన్న విషయం అతడి మొఖం చూస్తేనే తెలుస్తున్నది.

"అమ్మకి కాలు బెణికింది కదలలేకుండా ఉంది."

"అదెప్పుడు? ఉదయం నేను వెళ్ళేసరికి బాగానేఉన్నారే."

"మనం వెళ్ళిపోయేక మళ్ళీ నూతికి వెళ్ళిందట. అక్కడ కాలు జారి పడింది."

"మళ్ళీ నూతికెందుకు వెళ్ళడం ?"

"ఎందుకేమిటి రోజూ మన రుసరుసలు విసవిసలు చూడలేక, నాలుగు బిందెలు నీళ్ళు తెచ్చి నిల్వ చెయ్యాలనుకొని వుంటుంది."

ఆ మాటని అలా ఆక్కసుగా చెప్పడంలో మీ ఉద్దేశం ఏమిటి ?" కాస్త అసహనంగానే అంది లలిత.

"ఊహలు లేవు. ఉద్దేశాలు లేవు. రేపే పట్నంలో ఇల్లు చూడబోతున్నాను. మన ఆలోచనలన్నీ తాటాకు మంటలు. ఆ వేడి అట్టే కాలం నిలవదని తేలిపోయింది." అన్నాడు ప్రకాశం నిశ్చలంగా.

అనుమానించని చోటునుంచి బాణం వచ్చి గుచ్చుకుంటే విలవిల్లాడే లేడిపిల్లలా క్షణకాలం గింజుకొంది లలిత మనసు. వెంటనే అక్కడినుంచి అత్తగారి దగ్గరికి వెళ్ళిపోయింది.

రాజమ్మ కాలు ఎర్రగా వాచివుంది. బాధతో చిన్నగా మూలుగుతున్నది.

"అత్తయ్యా" మెల్లగా పిలుస్తూ కాలుమీద చెయ్యి వేసింది లలిత.

"అమ్మో" అంటూ బాధతో గట్టిగా కేకపెట్టింది రాజమ్మ.

లలిత వెనుకనే ప్రకాశం లోపలికి వచ్చేడు.

"ఇంటిలో ఇలాఉంటే ఈరోజే నువ్వు ఆలస్యం చేసేవు"

"..............."

"ఎప్పుడైనా మామ్మూలు వేళకు రానని తెలిస్తే ముందుగా ఇంట్లో చెప్పి వెళ్ళడం మంచిది."

"...............".

"చీకటిపడ్డాక నీకోసం మూడుసార్లు ఆ బస్సు స్టాపుదాకవెళ్ళి తిరిగి వచ్చేను."

లలిత ఒక్కమాటకికూడా జవాబు చెప్పలేదు. మౌనంగా అక్కడి

నుంచి లోపలికి వెళ్ళిపోయి, వంట పని మొదలెట్టింది. భోజనాలు కూడా అదేరీతిలో పూర్తిఅయేయి.

ప్రకాశాన్ని పెళ్ళి చేసుకొన్నాక లలిత మనసు మొదటిసారిగా ఆ రోజు వికలమయింది. అత్తగారి కాలు బెణకడానికి తను కారణం అన్నట్లు భర్త మాట్లాడ్డం ఆమెకి కష్టం కలిగించింది.

భార్య మౌనంతో ప్రకాశం, తనతప్పు తెలుసుకొన్నాడు. ఆ విసుగులో అనవసరంగా ఆమె మనసు బాధపెట్టేనని చికాకుపడ్డాడు. ఒంటరిగా వరండాలో కూర్చుని ఆకాశంలోకి చూస్తున్న ఆమెని చేతుల్లోకి తీసుకొని "చికాకులో ఏదో అన్నాను. నన్ను క్షమించు లలితా" అన్నాడు లాలనగా.

అతని కళ్ళలో నిర్మలత, మాటలో నిజాయితీ కొట్టవచ్చినట్లు కన్పిస్తున్నాయి.

'ఇతడు నేను వలచి పెళ్ళిచేసుకున్న ప్రకాశం. తల్లికాలుకి దెబ్బ తగిలింది; అన్న ఆరాటంలో అతడు ఏదోఅంటే అతడి ఆందోళనని అర్థం చేసుకోకుండా అలక సాగించడమేమిటి' అనుకొంది లలిత.

"మనం ఇచ్చుకోవలసినవి పుచ్చుకోవలసినవి క్షమలు. శిక్షలుకావు ప్రకాశం....ఇంకేవో ఉన్నాయి" అంది అతని జుట్టులోకి వేళ్ళు పోనిచ్చి ప్రేమగా నిమురుతూ.

ఆ రాత్రి కమ్మని మాటలమధ్య నీటిబెడద తీరిందికి, తనుచేసిన ఆలోచన, డబ్బుకోసం చేసిన ప్రయత్నం అంతా చెప్పింది లలిత.

వారం నాటికే రాజమ్మకాలు కుదుటపడింది.

నెలనాటికి పెరటి నూతిలో ఊటపడింది.

"ఇంక నీటి తగవులు తప్పినట్లే" అన్నాడు ప్రకాశం నూతిలో బాల్చీవేస్తూ.

"ఈ తగువు తప్పితే ఇటువంటిదే ఇంకొకటి రాదని గ్యారంటీ ఏమిటి?" అంది లలిత అతన్ని కవ్విస్తూ.

"ఊహూ. పోట్లాడిందికి నీకు ఓపిక ఉన్నా, ఇంక ఆ పని నా వల్ల కాదు." అన్నాడు ప్రకాశం చేతిలోని బాల్చీలో నీళ్ళు, లలిత మీద పోస్తూ.

"మీవల్ల కాదంటూ మహా బుద్ధిమంతుడిలా కబుర్లుచెప్తూ మళ్ళీ అప్పుడే మొదలు పెట్టున్నారు, పోట్లాట.... నిష్కారణంగా చాకింటి చీర తడిసి ముద్దయింది" అంది లలిత కృత్రిమ కోపం నటిస్తూ.

లలిత బుంగమూతిచూసి పైకి లాగేడు ప్రకాశం. ఒడుపుగా అతడి చేతిలోని బాల్చీ లాక్కుని అతడి బుర్రమీద చిమ్మరించింది లలిత.

ప్రకాశం మరో బాల్చీనీళ్ళు పొయ్యబోతుంటే లలిత ఇంటిలోకి పరుగుతీసింది. ఆమె వెంటపడ్డాడు ప్రకాశం.

"అవేం సరదాలర్రా.... ఇల్లంతా బురదై పోతున్నది" అంది రాజమ్మ చిన్నగా నవ్వుతూ.

నిజానికి ఆ విధంగా కొడుకునీ, కోడల్నీ చూడ్డం ఆమెకి సరదాగానే ఉంది.

* * *

ముచ్చటగా మూడుకాలాలు కదిలిపోయేయి. రాజమ్మగారింటిచుట్టు పట్ల, రెండు పుంజీలు పాకలు, నాలుగైదు పెంకుటిళ్లు లేచాయి. అన్ని ఇళ్ళనీ మెయిన్‌రోడ్డుతో కలుపుతూ, మట్టిరోడ్డు పడ్డది. రోడ్డు మొదట్లో ఒక కిల్లీకొట్టు కూలి నాలీ జనం నోరు తడుపుకోడానికి వీలుగా ఒక టీ దుకాణం వెలిసేయి. సింహాచలంనుండి పాలు, పెరుగు, కూరా నారా తెచ్చి అమ్ముకొనే వాళ్ళు దారిలో బస్సు దిగి ఈ పాకలలో కూడా, బేరసారాలు మొదలుపెట్టారు.

పట్నంలో పలుకుబడి ఉన్న ఒకరిద్దరు పెద్దలు అక్కడ స్థలాలు కొనబోతున్నారనీ, ఇంక ఎలక్ట్రిక్ దీపాలు, కొళాయిలు వచ్చిందికి ఎట్టే కాలం పట్టదనీ వదంతులు ప్రబలంగా ప్రచారంలోకి వచ్చేయి.

జీవితం ఒక గాడిలో పడిందనిపించింది లలితకి. మధ్యకాలంలో రామకోటి ఒక్కసారి వచ్చి పదిరోజులుండి వెళ్ళేడు.

"ఇక్కడ మీ యిల్లు ఎంత చక్కగా ఉందే అక్కా.... కదలబుద్ధి కావడంలేదు" అన్నాడు.

"కదలబుద్ది కాకపోతే ....ఉండిపో.... పోయిందేమిటి" అన్నాడు. ప్రకాశం.

"మా అక్క మెడలో తాళి కట్టినప్పుడు, నా మెడలో కూడా ఒక పసుపుతాడు కట్టేస్తే అలాగే ఉండిపోదును" అన్నాడు నవ్వుతో రామకోటి.

సాంబమూర్తి దగ్గరనుంచి చాలాకాలంగా ఉత్తరం లేదు. లలిత రాసిన నాలుగైదు ఉత్తరాలకి జవాబు రాలేదు. ఒకసారి వెళ్ళిచూసి రావాలనుకొంది. కాని ఆఫీసులో సెలవు అంత సులువుగా దొరకలేదు. అవునూ కాదూ అనుకొంటూనే మరికొన్నిరోజులు గడిచిపోయేయి.

ఆ ఏడాదిలో ఆఫీసులో చిన్నా పెద్దా మార్పులు చాలా వచ్చేయి. క్రింది ఉద్యోగస్థులంతా మంచివాడు అని గౌరవించే రామలింగానికి ప్రమోషన్ మీద ఇంకో ఊరికి బదిలీ అయింది. అతడి స్థానంలో వచ్చిన వెంకటరాముడు ముక్కోపి. తూ చ తప్పకుండా రూల్సు ప్రకారం నడవాలనే తత్వం కలవాడు. తను ఆఫీసు టైముకి పది నిముషాలు ముందుగానే వచ్చి ముందుచావిట్లో కూర్చుంటాడు. చిన్నా, పెద్దా ఉద్యోగులంతా వచ్చి రిజిష్టర్‌లో సంతకాలు పెట్టేవరకు అక్కడినుంచి కదలడు. అయిదు పది నిముషాలు ఆలస్యంగా వచ్చినా ఎదుట నిలచి కారణం చెప్పుకోవలసిందే. వాళ్ళు చెప్పే చాలా కారణాలు అతడికి సాకుల్లా కన్పిస్తాయి.

ఎన్నడూ లేనిది ఇతడు వచ్చేక లలిత రెండుసార్లు చీవాట్లు తినవలసివచ్చింది. ఎవరిచేతా మాట పడని లలితకి అది కష్టంగా తోచింది. ఇక ముందు ఎన్నడూ జరగకూడదనుకొంది.

ఇంటినుంచి ఎంతముందుగా బయలుదేరినా సకాలంలో బస్సులు రాకపోతే ఆఫీసుకి ఆలస్యంగా చేరకతప్పదు. ఇంకో విధమైన వాహనమేదీ దొరికే ప్రదేశం కాదు. నడచిపోయేందుకు వీలయే దూరంకాదు.

రెండురోజులు ఆఫీసరు చేత చీవాట్లు తిన్న లలిత మూడోనాడు ఎనిమిది కాకుండానే బస్సు స్టాపుకి వచ్చి నిలబడింది. నిండా పది నిముషాలు కాకుండానే సిటీబస్సు దూరంగా కంటపడింది.

హమ్మయ్య అనుకొని హేండ్ బ్యాగ్‌లోంచి సొమ్ము తీసి పట్టుకొని బస్సు ఎక్కడానికి సిద్ధంగా నిలచింది లలిత.

బస్సు రానూ వచ్చింది. వెళ్ళనూ వెళ్ళింది.

ఆవకాయలో పిండిలా బస్సు నిండుగా కిక్కిరిసి ఉన్నారు ప్రయాణీకులు.

లలిత చెయ్యి నిరాశతో వాలిపోయింది.

ఇంకో బస్సు రాకముందే ప్రకాశం వచ్చేడు.

"అప్పుడనగా వచ్చావు....ఇంకా ఇక్కడే ఉన్నావా?" అన్నాడు.

"ఈ రోజేమయిందో....బస్సు ఇక్కడ ఆగకుండా నిండుగా వెళ్ళిపోయింది" అంది లలిత.

"నాకన్న ముందుగా వెళ్ళిపోవాలనుకుంటే .... మరి అంతే అవుతుంది.." ప్రకాశం లలితని ఆట పట్టించేడు.

మరో పావుగంటకి ఇంకో బస్సు రావడం, మొదటిదాని మాదిరే ఆగకుండా వెళ్ళిపోవడం జరిగింది. ప్రకాశం వేసిన కేకకి సమాధానంగా, "స్థలం లేదు సార్" అంటూ కేక పెట్టేడు. పరుగు తీస్తున్న బస్సులోంచి కండక్టర్.

తెల్లబోయి చూస్తున్న ప్రకాశంవంక కొంటెగా చూసింది లలిత—"అయిందా అయ్యగారి పని" అన్నట్లు.

ఎండ చిటపట లాడుతున్నది .... వాచి ముల్లు తొమ్మిది దాటింది.

"పది గంటలకల్లా కాలేజీలో వుండాలే .... ఎలా" అంటూ చిందులు తొక్కేడు ప్రకాశం.

మొదటిబస్సు తప్పిపోగానే ఎలాగా ఆఫీసుకి ఆలస్యంగా వెళ్ళడం ఖాయం అన్న సంగతి తేలిపోయింది లలితకి. ఆలస్యం పదినిముషాలైనా; అరగంటైనా తినవలసిన చీవాట్లలో అట్టే తేడా వుండదు కానీ.... నిండా మునిగినవాడికి చలేమిటి — అనే మొండితనంతో నిలబడింది. అందుకే ప్రకాశం ఆరాటం చూస్తే ఆమెకి నవ్వు వచ్చింది. దాన్ని లోపలే అణచు

కొంటూ "ఇంకా పైము ఉందికదా ....ఈసారి బస్సు కాశీగానే రావచ్చు" అంది అతనికి ధైర్యం చెప్తున్నట్లు.

అయిదు నిముషాల్లో బస్సయితే వచ్చింది. ఆ దంపతులమీద తట్టెడు దుమ్ము రిమ్మకొంటూ అదీ ఆగకుండా మాసుకుపోయింది.

"ఈ రోజేమయింది ? బుకీ ఇంత రొమ్ము ఏమిటి" అన్నాడు ప్రకాశం.

"కన్పించడంలేదూ .... సింహాచలం బోడిగుళ్ళు.... నిన్న చందన యాత్ర .... అక్కడ గుడిలో దేవుణ్ణి దర్శించుకొన్నవాళ్ళు, ఇక్కడ పట్నంలో సినిమాలు చిత్తగించకుండా ఎలా వెళ్ళిపోతారు. ఇక రెండు, మూడు రోజులు విశాఖవీధులన్నీ వీళ్ళవే...." అంది లలిత.

అంతలో బుర్ ....బుర్ మని శబ్దం వినిపించింది. కాని వస్తున్నది బస్సు కాదు .... ఎవరో యువకుడు నీటుగా బట్టలు వేసుకొని, కళ్ళకి కూలింగ్‌గ్లాసెస్ పెట్టుకొని హుషారుగా స్కూటరు నడుపుకొంటూ వస్తున్నాడు.

అతడు అల్లంత దూరంలో ఉండగానే, తప్పట్లు కొడుతూ "ఏయ్ .... మిష్టర్ .... మిష్టర్" అంటూ కేక పెట్టేడు ప్రకాశం.

అతని ఆత్రతచూసి లలితచెయ్యి ముందుకి పెట్టింది. స్కూటరుమీద వ్యక్తి పదిగజాల ముందుకిపోయి, వెనక్కి తిరిగివచ్చేడు.

"లిఫ్ట్ కావాలా" అన్నాడు వారిముందు స్కూటరు ఆపుతూ.

"అవునండీ .... గంటకుపైగా అయింది ఇక్కడ బస్సుకోసం చూస్తూ ఉండి. వచ్చినబస్సు ఒక్కటీ ఆగడంలేదు."

"ఈ రోజు మీకు బస్సు దొరకదు....రండి" అన్నాడు లలితవైపు చూస్తూ ఆ యువకుడు.

"థాంక్సండీ .... నాకు తొందరలేదు....ఆయన్ని తీసుకువెళ్ళండి" అంది లలిత.

'నువ్వా' అన్నట్లు ప్రకాశంవైపు చూస్తూ "అలవాటు ఉందా ?"

అంటూ ప్రశ్నించేడు. ఉంది అన్నట్లు తల ఊపి వెనుక సీటుమీద కూర్చు న్నాడు ప్రకాశం.

స్కూటరు కదిలిపోయింది.

మాట వరుసకైనా తన గురించి ఆలోచించకుండా ప్రకాశం అలా వెళ్ళిపోవడంతో లలితకి ఉడుకుమోత్తనం పుట్టుకొచ్చింది.

"పోతే ....పోనీ వెధవ ఉద్యోగం ఎవడికి లక్ష్యముండి ఏడ్చింది" అనుకొంటూ ఇంటిముఖం పట్టింది.

ఎండలో వాడిన ముఖంతో అప్పుడే ఇంటికి తిరిగివచ్చిన కోడల్ని చూసి "ఈ రోజు ఆఫీసుకి పోలేదా ?" అంటూ ప్రశ్నించింది రాజమ్మ.

జరిగిన సంగతంతా తెలియజేసింది లలిత.

"అయ్యో .... అయితే .... ఎలా .... మరి...."

"ఎలా ఏమిటి ! ఉంటే వుంటుంది .... పోతే .... పోతుంది.... ఈ నౌకరీ మనకో లెక్కా?" అంది లలిత విసురుగా.

"అలాగంటే ఎలాగమ్మా ! ఇద్దరూ ఇంత తెచ్చుకొంటున్నా ఇల్లు గడవటం కష్టంగా ఉంటుంటే...."

"ఆపాటి తెలివి మీ అబ్బాయికి ఉందా మరి—"

"వాడేం జేసేడు?"

"ఏం చెయ్యలేదనే నే చెప్తున్నది. పూర్వం ఆఫీసరైతే కొంచెం అటూ ఇటూగా ఆఫీసుకు పోయినా ఫరవాలేకపోయేది. నా నెత్తిమీదికి ఈ వెంకటరాయుడు శనిలా దాపురించేడు. అసలే నిన్నా, మొన్న ఆలస్యం అయిందని చిందులు తొక్కేడు. ఈ రోజు ఆఫీసుకి పోనూలేదు. సెలవు చీటి పంపనూ లేదు. ఈ విషయాలన్నీ మీ అబ్బాయికి తెలియవూ. తెలిసే స్కూటరుమీద కూర్చుని చక్కగా వెళ్ళిపోయేరు.

"తన కాలేజికి ఓ గంట, గడియ అటూ ఇటూగా వెళ్ళినా అడిగే వారు లేరు. ఇప్పుడు ముంచుకుపోతున్నంత పని కూడా లేదు. గవర్న మెంటు ఉద్యోగాలైతే అధికారికి కోపం వచ్చినా అంత సులువుగా ఉద్యోగం

లోంచి తొలగించే అవకాశం ఉండదు. ప్రయివేటు సంస్థల్లో అటువంటి అడ్డంకులు ఉండవు....ఒక నెలదో.... మూడు నెల్లదో జీతం టేబిలుమీద పెట్టి ఇంక నువ్వు వెళ్ళవచ్చు" అంటే నోరు మూసుకొని ఇంటిముఖం పట్టవలసిందే.

"ఈపాటి ఆలోచన ఆయనకి కలగలేదంటే నేను నమ్మను. కావాలనే.... నన్నూ .... నా ఉద్యోగాన్నీ...."

"అదేమిటి లలితా .... అలా అంటావు? వాడిని తీసుకువెళ్ళమని నువ్వే చెప్పేనంటున్నావు. ఈరోజు నీకు తొందర లేదేమోని అనుకొని ఉంటాడు"

"అలా కొడుకుని వెనకేసుకు రాకండి అత్తయ్యా, ఏరోజు కారోజు ఆఫీసులోని విషయాలన్నీ ఆయనతో చెప్తూనే వుంటాను. ఈ రోజు ఉదయాన్నే అతడు వచ్చేవరకైనా ఆగకుండా బస్సుకి పోయిందికి కారణం అతనికి తెలియందికాదు."

"ఒకవేళ — ఆడపిల్లవికదా —పరాయి మగాడి వెనక కూర్చుని వెళ్ళడం బాగుండదని ఊరుకొన్నాడేమోనే —"

చిన్నగా నవ్వింది లలిత.

"అత్తయ్యా — మిమ్మల్ని చూస్తుంటే, తల్లిని కోల్పోయి నేను నష్టపోయింది ఏమిటో తెలుసుకొంటున్నాను" అంది మెప్పుదలగా ఆమె వైపు చూస్తూ.

రాజమ్మ మాట్లాడలేదు. ఆ మాట దేనికి ఉపోద్ఘాతం అని ఆలోచిస్తున్నది.

"అత్తయ్యా నేను తెలివితక్కువగా ఒకమాట అన్నా మీరు కోపగించుకోరని నాకు తెలుసు. చాలమంది అత్తలమాదిరి, కోడలు అవుతున్న దానికల్లా కాదనడమే జవాబుగా మీరూ పెట్టుకొంటే నేను మీతో వాదించే దాన్ని కాదు. నా మనసులోకివచ్చే ఆలోచనలు చెప్పేదాన్నికాదు. మీరు సూటిగా ఆలోచించి మంచి చెడ్డలు తెలుసుకోగలరనీ, మీ మాటలవల్ల

నేను ఏదో ఉపయోగం పొందగలననే అభిప్రాయం వుండబట్టే ఏదో ఒకటి అంటుంటాను.

"అత్తయ్యా, ఆడపిల్ల మగపిల్లడితో సమానంగా కాలేజీ చదువు చదివి, ఉద్యోగం చెయ్యడం తప్పులేదు. కిక్కిరిసిన బస్సుల్లో, రైళ్ళలో మొగవారి మోచేతి పోట్లు తింటూ, ప్రయాణం చెయ్యడం తప్పుకాదు. ఉత్సవాల్లో, దేవుడుగుళ్ళలో, గుంపుల్లో, క్యూల్లో రాసుకు, తోసుకు నిలబడ్డం తప్పులేదు — నడిరోడ్డుమీద నాలుగుమైళ్ళ దూరం పరాయిమగాడి స్కూటరుమీద కూర్చుని ప్రయాణం చెయ్యడం— ఎంత అవసరం పడినా తప్పంటారా? అంతమాత్రానే ఆడదాని పాతివ్రత్యం, శీలం చెడిపోతుందంటారా ? ఆడది నడిమింటి నాలుగు గోడలు దాటి, బైటికిరాని రోజుల్లో ఏర్పరచిన ఆచారాలనే, తప్పొప్పులనే, ఈనాటి సమాజంలో, మగవారితో పాటు మగువలు అన్ని రంగాల్లో ముందుకి చొచ్చుకుపోతున్న ఈరోజుల్లో, పాటించాలంటారా ? చెప్పండి అత్తయ్యా, ఈధర్మాలు న్యాయాలు మార్చవలసినరోజు ఇంకా రాలేదంటారా " ఆవేశంతో ప్రశ్నించింది లలిత.

కావాలనుకొంటే ఆమె వాదనలోని లోటుపాట్లను, మంచి చెడ్డలను చక్కగా విడమరచి చెప్పగలదు రాజమ్మ. కాని ఆవేశంతో బుగ్గలెర్ర పరచుకొని అలా మాట్లాడుతున్న కోడల్నిచూసి అది తగిన సమయం కాదనుకొంది. చిన్నగానవ్వి ఊరుకొంది.

అత్తగారినవ్వుతో లలితలోపుట్టుకొచ్చిన ఉడుకుమోత్తనం రెట్టింపు అయింది. కోపంతో విసురుగా గదిలోకిపోయి పడుకొంది.

కోపం కర్తవ్యాన్నిఅట్టేకాలం అణచివుంచలేకపోయింది. జ్వరంగా ఉండడంవల్ల ఆ రోజుకి సెలవుకావాలంటూ అర్జీరాసి సైకిలుమీద పట్నం పోతున్న పొరుగింటి కుర్రాడిచేతిలోపెట్టింది దారిలో పోస్టుచెయ్యమంటూ.

* * *

సాయంకాలం ప్రకాశం ఇంటికి తిరిగివచ్చేసరికికూడా లలిత ముఖం మీద, కోప చిహ్నాలు ఇంకా పూర్తిగా మాసిపోలేదు. ఆపూట వంటకాల్లో కూడా అవి ప్రత్యక్షమయింది.

ఒక్క కూరముక్క నోట్లో పెట్టుకొని అరగ్లాసుడు మంచినీళ్ళు త్రాగేడు ప్రకాశం.

"ఈ రోజు కొత్తగా పచ్చిమిరపకాయలు కొన్నావులాగుంది" అన్నాడు నవ్వుతూ.

"అనదలుచుకొన్నదేదో సూటిగా అనండి" లలిత నోటిమాట సూటిగానే వచ్చింది.

పరిహాసాలకి అనువుగా పరిస్థితి లేదని గ్రహించేడు ప్రకాశం.

"వంకాయకూరలో కారం కాస్త ఎక్కువగా ఉంది" అంతమాత్రం అని ఊరుకున్నాడు.

"మరేం ఫరవాలేదు. నెలకి ఇరవై తొమ్మిది రోజులు మీ కోసం నేను చప్పిడితిండి తినగా లేంది, నా కోసం ఒకరోజు ఆ పాటి కారం తింటే మరేం మొక్కమొలచిపోరు" అంది విసురుగా లలిత.

నిజానికి ఆమె కూరలో అంతకారం కావాలని వెయ్యలేదు. మరచి ఒకటికి రెండుసార్లు వేసి ఉంటుంది. అంతాసరిగా ఉండే రోజుల్లో అయితే ఆ పొరపాటుని ఒప్పుకొని ఉండేది. కాని ఆనాడు ఆమె వాదనకి సిద్ధంగా ఉంది. అందుకే కస్సుమని అంతలా అనేసింది.

మాటకి మాటతెగులు, నీటికి నాచుతెగులు అంటారు. అనవసరంగా కోపాలు పెంచుకొని కలహించుకొంటే, కలహకారణాలు సమసిపోయినా, ఆవేశంలో అనుకొన్న మాటలు అంత త్వరగా మరపుకిరావు. అటువంటి సమయంలో మాటని పెంచకుండా తుంచడమే ఉత్తమం— అనుకొన్నాడు ప్రకాశం. మౌనంగా భోజనం పూర్తిచేసి గదిలోకి వెళ్ళిపోయేడు. లలిత కోపానికి కారణం మాత్రం ఎంత ఆలోచించినా అతడికి తెలిసిరాలేదు.

వంట ఇంట్లో పనిపాట్లు పూర్తిచేసుకొని ; నిండా పదినిముషాలు

గడువకముందే గదిలోకి వచ్చింది లలిత. సున్నంరాసి చీల్చిపెట్టిన తమల పాకుల్ని, చెక్కల్ని చిన్నపళ్ళెంలో ఉంచి, మంచం పక్కగా ఉన్న బల్ల మీదపెడుతూ, "తీసుకోండి" అంది అంటీ ముట్టనట్లు.

రాత్రి భోజనం అయేక కాచు, చెక్కతో తాంబూలం వేసుకోడం ప్రకాశానికి చాలా కాలంగాఉన్న అలవాటు. దానిని తప్పించడానికి లలిత విశ్వ ప్రయత్నం చేసేది. ఎప్పుడైనా మనసుపుడితే సరదాకి వేసుకోవచ్చు కాని, రోజూ విధిగా తాంబూలం వేసుకుంటే పళ్ళు గారపట్టి చూసిందికి అసహ్యంగాతయారవుతాయని వేసుకోనిచ్చేదికాదు. ఏరోజు కారోజు దాని కోసం వాదులాట— చివరకి బ్రతిమాలించుకొని, బామాలించుకొని ఎలా గో లాగ రెండో, మూడో ఆకులు కాచువెయ్యకుండా ఇచ్చేది.

తమలపాకుల పళ్ళెం బల్లమీదపెట్టి, నీళ్లు తేవడానికి లోపలికి వెళ్ళిపోతున్న భార్యవైపు, ఎదురుగా ఉన్న తమలపాకులవైపు చూసేడు. పళ్ళెంలో పది, పదిహేను ఆకులుచీల్చిఉన్నాయి. పక్కనేఉప్పుచెక్కలు- కాచుగుండ డబ్బా.

లలితాదేవిగారి కోపానికి ఇంతకన్న నిదర్శనం ఏం కావాలి? అను కొంటూ ఆకుల్ని, చెక్కల్ని చేతులోకి తీసుకొన్నాడు.

లలిత చెంబుతో నీళ్లుతెచ్చి మంచం పక్కన పెడుతూ క్రీగంట తమలపాకుల పళ్ళెంవైపు చూసింది. ఆమె చూస్తున్నట్లు గ్రహించిన ప్రకాశం అదే అదను అనుకొంటూ కాచుగుండ డబ్బా చేతిలోకి తీసు కొన్నాడు.

చంటిపిల్లాడి చేతిలో తాయిలాన్ని పొంచున్న కాకి తన్నుకుపోయి నట్లు ఆ డబ్బా లాక్కొంది లలిత.

"ఏమా కోపం? ఏమిటీ కథ! పాళ్ళు సరిగ్గా పడ్డ చుచ్చుబుడ్డిలా ఉందే వ్యవహారం" అన్నాడు ప్రకాశం నవ్వుతూ.

"తెలివితేటలకి సంతోషించేం" అంది లలిత అక్కసుగా.

ఇంకా లాగుతే తాడు తెగేలా ఉందని చేతిలోని ఆకుల్ని, చెక్కల్ని పక్కనున్న పళ్ళెంలోకి జారవిడిచి ఆమెని దగ్గరికి తీసుకొన్నాడు ప్రకాశం.

"ఆఫీసుకి వెళ్ళేవా ? తరువాత ఎంత సేపటికి బస్సు వచ్చింది" అంటూ ఏదో మాటల్లోకి దింపాలన్నట్లు ప్రశ్నించేడు.

అప్పుడే ద్రవరూపం దాలుస్తున్న లలితకోపం ప్రకాశం ప్రశ్నతో మళ్ళీ ఘనీభవించింది.

"మీ వంటి భర్తగారు కష్టసుఖాలు ఆలోచిస్తూ పక్కనేఉంటే ఆఫీసుకే అన్న మాటేముంది, రెక్కలు కట్టుకొని ఆ దేవలోకానికే ఏకంగా ఎగిరిపోతాను" అంది అక్కసుగా.

"ఆ పరిస్థితిలో నేనేం చేసేది చెప్పు, నువ్వు ఆడదానివి. ఆఫీసుకి కాస్త ఆలస్యంగా వెళ్ళినా మీ బాస్ ఏమీ అనడు ...."

"ఆ బాస్ మారిపోయేడని —ఈ దామోదరుడు సెకండ్లని, నిముషాల్ని పనిలో కొలుస్తాడనీ ఎన్నిసార్లు చెప్పేను ? అయినా ఆడవాళ్ళ ఉద్యోగాలంటే అంత అలుసేం మీకు ? మీ కాలేజీలో ఆడవాళ్ళు పని చెయ్యడం లేదూ; వాళ్ళు పాఠాలు చెప్పకుండానే జీతాలు ఇస్తున్నారేమిటి? ఆడది గడించిన రూపాయికి నూరుపైసలు రావా— ?"

"ఎందుకురావు? నీలాంటి అందమైన అమ్మాయి చేతిలోంచి అందుకోగల అదృష్టమే పడితే .... నూరన్న మాటేమిటి నూటపాతికన్నా ఇచ్చి తీసుకొంటారు" కొంటెగా లలిత ముఖంలోకి చూస్తూ అన్నాడు ప్రకాశం.

"మీరెప్పుడూ ఇంతే వాదనకి సూటిగా నిలచి మాట్లాడరు" అంది లలిత చిరుకోపంతో.

"కడవంత గుమ్మడికాయ — కత్తిపీటకి లోకువట. బైట ఎంత అధికారి అయినా, ఎందర్ని శాసిస్తున్నా, ఇంట్లో ఇల్లాలి ఆజ్ఞలకి "జీ హుకుం" అనవలసిందేకదా — అటువంటప్పుడు అర్ధాంగితో వాదనలేమిటి పోనిద్దూ — అర్థంలేని పనికాని" అన్నాడు.

అది వాదించుకోవడంవల్ల, కోపగించుకోడంవల్ల తేలే సమస్యకాదు. ఇద్దరూ కలిసికట్టుగా ఆలోచించి పరిష్కారమార్గం కనుక్కోవలసిన విషయం. అందులో తిరుగులేకుండా గుర్తించవలసిన విషయాలు మూడు ఉన్నాయి.

ఇద్దరూ పదిగంటలు కాకుండా ఆఫీసుల్లో ఉండాలి. ఊరుకి ఇల్లు దూరం. ఒక్కొక్కరోజు సకాలంలో బస్సులు రావు. వచ్చినా నిండుగా వుంటే అక్కడ ఆగవు.

ఆ ముడి విప్పడానికి రెండుకొనలు కన్పించేయి.

ఒకటి ఆ ఇల్లు విడిచిపెట్టి పట్నంలో ఇంకో ఇల్లు అద్దెకి తీసుకోవడం, రెండోది రాకపోకలకి ఒక చిన్న వాహనం కొనుక్కోవడం.

రెండో ఆలోచన లలితకి నచ్చింది. చవకలో ఏద్తైనా సెకెండ్ హాండ్ స్కూటరు కొనుక్కొంటే ఈ సమస్యే తీరిపోతుంది. హాయిగా కావాలనుకొన్న చోటికి సరియైన వేళకి వెళ్ళిరావచ్చు— అనుకొంది సంతోషంగా.

ఆ రాత్రి చాలా సేపటివరకు స్కూటరు కొంటే అయే ఖర్చు వెచ్చాలకి, తామిద్దరూ బస్సులకి చెల్లిస్తున్న చార్జీలక తైపారు వేసుకొంటూ ఏది లాభం, ఏది నష్టం అని చర్చించుకుంటూ, అప్పు పుట్టే మార్గాన్ని అన్వేషిస్తూ గడిపివేసేరు.

అప్పుడే స్కూటరు కొనేసినట్లు, దానిమీద భర్తా, తనూ సినిమాలకి, షికార్లకి, ఆఫీసుకి, బజార్లకి కలసి తిరుగుతున్నట్లు కమ్మని కలలు కంటూ నిద్రపోయింది లలిత.

# 4

రాజమ్మ వంకాయలు బేరంచేసి తూయించుకొంటుంటే ఎవరో కుర్రాడు వచ్చి, "ప్రకాశం మేష్టరుగారి ఇల్లు ఇదేనాండీ" అని ప్రశ్నించేడు.

"అవును నాయనా ! ఏం కావాలి ?" అంది రాజమ్మ.

"ఈ కవరు అక్కడనిలబడ్డ ఆయన యిచ్చి రమ్మన్నాడండీ" అంటూ వీధి చివరకు చూపేడు.

ఆ కుర్రాడు చూపినవైపు రాజమ్మ చూసింది.

అక్కడ ఎవ్వరూ లేరు.

కవరు ఆమె చేతిలో పెట్టి కుర్రాడూ వెళ్ళిపోయేడు.

తూయించుకొన్న వంకాయలు వంట యింట్లో పోసివచ్చి, కొడుకు దగ్గర డబ్బులు తీసుకొని కూరలమ్మిని పంపివేసి వచ్చింది రాజమ్మ.

అలారం టైంపీసులో చిన్న ముల్లు పదిని చేరుకున్నది.

"శీతకాలం పొద్దు— ఇప్పుడు తెల్లారినట్లుంది—అప్పుడే పది.... ఎంత వేళయిపోయింది!"

పొయ్యికింద మంట ఎగదోసి, పప్పుకి ఎసరు పడేసి, కత్తిపీట, కూరలబుట్ట ముందేసుకొని కూర్చుంది రాజమ్మ.

ముళ్ళ వంకాయలు తరిగి నీళ్ళలో వేస్తుంటే గుర్తుకొచ్చింది. ఆ పిల్లాడిచ్చిన కవరు తను కొడుక్కి ఇయ్యలేదని, తడిచెయ్యి కొంగుకి తుడుచుకొంటూ, చావిట్లో కావిడి పెట్టె దగ్గరికి వచ్చింది. ఆకవరుఅక్కడ పెట్టింది అనుకొంది. కాని, అది అక్కడలేదు. ఏమైనట్లు? పెట్టిమీద పడి వున్న పుస్తకాల్ని, కాగితాల్ని ఒకటికి రెండుసార్లు ఇటు అటు తిప్పి చూసింది. అయినా అది కన్పించలేదు.

"వెధవ మతి.... ఈక్షణంలో పెట్టిన వస్తువు మరుక్షణం గుర్తుకు రావడం లేదు.... ఎడంచేత్తో ఎక్కడపడేసి ఎక్కడ వెతుకుతున్నానో....

వయసు తన్నుకొస్తుంటే వచ్చే బెడదలే ఇవన్నీ" తనలో తనే గొణుక్కొంటూ ఇంకా ఆ కవరుకోసం చూస్తూనే వుంది.

"దేనికోసమమ్మా అంతలా వెతుకుతున్నావు?" పేపరు చూస్తూ ప్రశ్నించేడు ప్రకాశం.

"ఏదో కవర్రా.... ఇందాక వంకాయలు కొంటుంటే...."

"లలిత దగ్గరినుంచి ఉత్తరం వచ్చిందా?" ఆత్రంగా అడిగాడు ప్రకాశం.

ఆ ఆత్రంలో ఆ రోజు ఆదివారం అనీ, ఎక్స్‌ప్రెస్‌డెలివరీ వంటిది

వస్తే సంతకం చేసి పుచ్చుకోవలసిన వ్యక్తి తనే అని మొదలైన విష యాలు మరచి పోయేడు.

"ఎవరో కుర్రాడు ఇచ్చి పోయాడ్రా........ నీకియ్యాలను కొంటూనే ఎక్కడో పెట్టి మరచి పోయేను."

రాజమ్మ ఆ కవరు కోసం వెతుకుతూనే ఉంది.

పొయ్యి మీద పప్పుకి పెట్టిన ఎసరు తెర్లి తెర్లి మంటలో పడి చుయ్ చుయ్ మంటున్నది.మంట దిగజార్చిరావాలని;వంటఇంట్లోకివెళ్ళింది. రాజమ్మ కాళ్ళకి అడ్డుపడ్డది విసనకర్ర. దానిని తీసి పక్కన పెడ్తుంటే దాని కింద కనిపించింది ఆ కవరు.

"ఇదిగోరా! ఇక్కడ పడేసి అక్కడ వెతికితే ఎలా దొరుకు తుంది" అంటూ దాన్ని పట్టుకు వెళ్ళి కొడుక్కి ఇచ్చింది.

ఎవరు పంపి ఉంటారు.

కవర్ని ఇటుఅటు తిప్పి చూసేడు ప్రకాశం.

దస్తూరి ఎవరిదో తెలియడంలేదు. పైన రాసిన వారి పేరు లేదు.

కవర్ని చించి చూస్తే అందులో ఒక దళసరి కాగితం లాంటిది చేతికి తగిలింది. ఏదో ఇన్విటేషన్ అయి ఉంటుంది.... ఎవరు పంపేరు చెప్మా ఆలోచిస్తూనే దాన్ని పైకి తీసేడు.

దానిమీద పరిచయం లేని దస్తూరిలో ఒకే ఒక వాక్యం ఉంది.

ఒకసారి దాన్ని చదివి తెల్లబోయి చూసేడు ప్రకాశం. క్రింద పడేసిన కాళీకవర్ని తీసి, మళ్ళాచూసేడు. దానిమీద అతనిపేరు, ఇంటినెంబరు స్పష్టంగా వున్నాయి.

ఆ కాగితం మీద ఉన్న వాక్యం చదువుతే కడుపులో కలిపినట్లు అయింది అతడికి.

"మగాడివైతే భార్యను జాగ్రత్త పెట్టుకో" అదీ దాని మీదవున్న వాక్యం. తనకి అటువంటి రాతలెవరు రాసేరు? లలిత గురించి ఇలా అస భ్యంగా రాయవలసిన అవసరం ఎవరికి కలిగింది?

ఏదైనా ఆ చూకీ దొరుకుతుందేమోనని కాగితాన్ని ఇటునుంచిఅటు తిప్పి చూసేడు.

అది ఒక ఫొటో....కాగితం కాదు. దానికి వెనుకవైపున ఆ వాక్యం ఉంది. ఆఫొటోలో— స్కూటరుమీద జోరుగాపోతున్న ఒకఅబ్బాయి— అమ్మాయి— లలితలావుంది.

లా—ఉండటమేమిటి—ఆ పిల్ల లలితే—

ఫొటోలో ఉన్న ఆ కుర్రాడు అందంగా ఉన్నాడు— ఖరీదైన సూట్‌లో ఉన్నాడు— కళ్ళకి గాగుల్స్ పెట్టుకొన్నాడు—

ఆ ఫొటో వెనుకగా రాసిన మాటకి అప్పటికి అర్థం బోధపడింది ప్రకాశానికి.

గాలికి లలిత ముంగురులు ఎగురుతున్నాయి. చీర కుచ్చెళ్ళు పాదాల మీద నాట్యం చేస్తున్నాయి.... ఒకచేయి ఆ యువకుడి భుజంమీద ఉంచి, రెండోచేత్తో వయ్యారంగా జుట్టు సవరించుకొంటున్నాది.

మతిపోయిన వాడిలా ఆ ఫొటోని కన్నార్పకుండా చూస్తున్నాడు ప్రకాశం.

ఆ జంట ఎంతో అందంగా వుంది.

అమరలోకంలో విహరిస్తున్నంత ఆనందంగా వుంది.

ముచ్చటగా చూస్తున్నాడు ప్రకాశం.

— కాని – కాని ఆమె ఎవరో అందమైన అమ్మాయి మాత్రమే కాదు – తన భార్య – లలిత.

"మగాడివైతే నీ పెళ్ళాన్ని జాగ్రత్త పెట్టుకో—"

ఫొటో వెనుకభాగంలో రాసినమాట మనసుని రెచ్చకొడుతున్నాది.

మెదడుకి సుత్తి దెబ్బల్లా తగులుతున్నాయి. ఆ మాటలో అక్షరాలు.

"ఎక్కడినుంచిరా .... ఎవరు పంపేరు ?" మూడోసారి కంఠం హెచ్చరించి మరికాస్త గట్టిగా అడిగింది రాజమ్మ.

"అద్బే ఉత్తరం కాదమ్మా .... ఇది .... ఇది"

ఎన్నడూలేని కొడుకు తడబాటు కొత్తగా అనిపించింది రాజమ్మకి.

"ఉత్తరం కాదూ....మరి—" మాట పూర్తి చేయకుండానే తొంగి చూసింది.

అందులోవున్న లలిత బొమ్మమీద ఆమె దృష్టి పడింది. కొడుకు తడబాటుకి ఆమెకి కారణం కనిపించింది.

"పిచ్చిసన్నాసీ" తనలో తనే అనుకొంటూ చిన్నగా నవ్వుకొంది.

ఫొటో తల్లి చూసిందేమో అన్న కంగారులో పక్కకి తీయబోయేడు ప్రకాశం.

అంతకుపూర్వం కనిపించని ఆ యువకుడి బొమ్మ అప్పుడు చూసింది రాజమ్మ.

"లలిత పక్కన ఆ కుర్రా డెవర్రా ?"

అది తెలియకే ప్రకాశం అంతసేపట్నుంచి గింజుకొంటున్నాడు.

"ఎవరో తెలియదు —బహుశా లలిత స్నేహితుడు ఎవరో అయి ఉంటాడు"

ఏడవలేక నవ్వుతూ అన్నాడు ప్రకాశం.

"అయితే ఫొటో దానికి పంపక నీ కెందుకు పంపినట్లు ? ఆ కుర్రాడు నీ పేరే అడిగేడే."

"లలిత ఊరికెళ్ళిందని తెలిసి వుంటుంది." ఫొటోకి వెనుకగావున్న వాక్యం తల్లికంట పడకుండా జాగ్రత్త పడుతూ అన్నాడు ప్రకాశం.

సమయానికి సరిగ్గా ఆ పాటిమాట అనగలిగినందుకు తన్ను తనే అభినందించుకొన్నాడు.

రాజమ్మ ఇంకేం ప్రశ్నించలేదు.

పెరట్లో గడపలో నిలబడి కాకి 'కావు....కావు' —మంటూ అరుస్తున్నాది.

"మా కోడలు వస్తుందిచే" అంటూ అటు వెళ్ళిపోయింది రాజమ్మ.

ఆమె రావడంచూసి కాకి ఎగిరిపోయింది.

రాజమ్మ వంట ప్రయత్నంలో పొయ్యిలో మరో కర్ర పేడు తగిల్చింది.

వాకిలో చిన్నముల్లు పదకొండు అంకె దగ్గరికి పరుగు పెట్టుంటే వచ్చింది లలిత. రిక్షావాడికి డబ్బులు లెక్కచూసి ఇచ్చి, సూటుకేసు పట్టుకొని ఇంట్లో అడుగు పెట్టింది. ఎదురుగా ఎవ్వరూ కన్పించలేదు. వంట ఇంట్లోంచి పోపులఘాటు గుప్పుమని చావిట్లోకి వస్తున్నాది. ప్రకాశంకోసం ఇటు అటు చూస్తుంటే మిరపకాయ ఘాటుకి పొరపడి దగ్గు వచ్చింది.

దగ్గు వినవచ్చిన దిక్కుగా చూసేడు ప్రకాశం వచ్చింది ఎవరా — అని.

ఎదురుగా లలిత — రెండురోజులై ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూస్తున్న లలిత.

మామయ్యని చూసొస్తానని వెళ్ళి, ఇన్ని రోజులు చేసే సే వేం— అంటూ అలక సాగించాలనుకొన్నాడు ప్రకాశం.

ఇంత కాలానికి మొగుడు గుర్తుకి వచ్చేడా — అని నిష్ఠూరా లాడాలనుకొన్నాడు.

నువు ఈరోజూ రావేమో అని ఎంత కంగారు పడ్డాను—అని ఆత్రం చూపాలనుకొన్నాడు.

కాని అందులో ఏ ఒక్కటీ అనలేకపోయేడు.

చేతిలో ఫొటో నీటిలోతడిసిన దూదిలా దిగలాగింది.

మనసులో ఉత్సాహం గాలిలో కలసిన పొగలా మాయమయింది.

మాటా మంతీ లేకుండా అలా మిడుతూ, నిడుతూ చూస్తున్న భర్తవంక వింతగా చూసింది లా; "ఏం అలా వున్నారు. వంట్లో బాగా లేదా ?" అంటూ దగ్గరికి వచ్చింది.

ప్రకాశం అప్పటికీ మాట్లాడలేదు. అలాగే లలితవంక చూస్తూ కూర్చున్నాడు.

"అన్నరోజుకి రాలేదని కోపం వచ్చిందా పంతులుగారికి" చొరవగా ముందుకి వచ్చింది లలిత.

ఆడది అలక తీర్చాలంటే ఏం చెయ్యాలో ఆమెకి బాగా తెలుసు.

మోకాళ్ళమీద పడి, ముందుకి వంగుతూ రెండు చేతుల్లోకి అతడి తల తీసుకొంది.

ప్రకాశం విసురుగా ముఖం అటు తిప్పుకొన్నాడు.

భర్తగారి కారణం ఏమిటోకాని గుంటూరి నూతిలో నీరులా చాలా లోతుగా ఉందే .... అనుకొంది లలిత.

"ఏమిటి ప్రకాశం .... ఏమైంది!" అంది సూటిగా చూస్తూ.

అప్పటికి ప్రకాశం నోరు విడింది .... కాదు .... బలవంతాన విడదీసు కున్నాడు.

"ఇది చూడు" అన్నాడు చేతిలో పెడుతూ.

"ఏమిటి అంటూ అందుకొంది లలిత.

"ఓహో....ఇదా" అంది దాన్ని చూస్తూ.

"కాపీ పంపేడన్నమాట" తనలో తను అనుకొంటున్నట్లు మెల్లగా అంది.

"లలితా" అన్నాడు ప్రకాశం.

కంఠం కాస్త గట్టిగా పలికింది.

"ఏమిటి ?" అన్నట్లు చూసింది లలిత ఫొటో మీద దృష్టి తిప్పి.

"ఎవరా కుర్రాడు ?"

ప్రకాశంలో మొగుడు గర్జించేడు.

ప్రకాశంలో మొగాడు వత్తాసు పలికేడు.

అసలు విషయం అర్థమయింది లలితకి.

ఆత్మాభిమానం అడ్డు తగిలింది అతడి మాటకి సూటిగా జవాబు

చెప్పడానికి. "ఏం" అంది సాధ్యమైనంత నెమ్మదిగా, సహజంగా ఆ మాట అనడానికి ప్రయత్నిస్తూ.

"ఏమో .... దాన్ని వెనక్కి తిప్పిచూడు." ప్రకాశం కంఠంలో జుగుప్స తొణికిసలాడింది.

ఫొటో వెనుక రాసిన మాట చూసింది లలిత.

"దీనికేనా," అన్నట్లు తేలిగ్గా నవ్వేసి ఊరుకుంది.

"ఎవరా కుర్రాడు ?" ప్రకాశం మనసు అంతుతేల్చుకో అంటూ సలహా సరఫరా చేసింది.

"ఆ కుర్రాడు ఎవరో యిప్పుడు చెప్పను. కాని ఇంకో మాట చెప్పాలనుకొంటున్నాను. భార్యని భర్త, భర్తని భార్య జాగ్రత్త పెట్టుకో వలసిన పరిస్థితే వస్తే, వారు కలిసి ఒక ఇంట్లో వుండడంకన్న వేరుపడ్డం మంచిది"

ప్రకాశం ఉలకలేదు.... పలకలేదు.

గుళ్లో దేవుడిలా కూర్చున్నాడు,

ఇంక చెప్పడానికి ఏమీ లేదన్నట్లు విసురుగా వెళ్ళిపోయింది లలిత.

* * *

వారం పది రోజులపాటు దంపతులమధ్య ఎడముఖం పెడముఖం గానే గడిచింది కాలం—

లలిత—ప్రకాశం అంతకుపూర్వం ఎప్పుడైనా చిలిపి కజ్జాలతో అలా మూతులు ముడుచుకొని కూర్చుంటే వారిమధ్య రాజీ కుదర్చడానికి ఏదో ప్రయత్నం చేసేది రాజమ్మ. కాని ఈసారి ఆమెకూడా ముభావంగా ఆ విషయమేదో వారిద్దరే తేల్చుకోవాలి అన్నట్లు తల వంచుకొని, తన పని పాట్లు చేసుకుపోసాగింది. అలవాటుప్రకారం సాయంకాలం కోడలిపిల్లతో పిచ్చాపాటీ వేసుకోడానికి బదులు, పొరుగింట్లో పురాణం చదువుతున్నారని అక్కడికిపోయి కూర్చోడం మొదలుపెట్టింది.

అత్తగారికి కోపం వచ్చిందని లలిత అర్థం చేసుకుంది. కారణం కోసం వెతకవలసిన పనేలేదు. కొడుకు ఎందుకు అలిగి కూర్చున్నాడో, తల్లీ అందుకే ముభావంగా వుంది.

ఆరోజు లలిత స్నానంచేసి తిరిగివచ్చేసరికి ప్రకాశం చించిపోసిన ఫొటో ముక్కల్ని ఎత్తి చిత్తుకాగితాల బుట్టలోకి పోస్తున్నాది రాజమ్మ. తడివంటిమీద చీర లుమ్మచుట్టుకొని గదిలోకి వెళ్తున్న కోడలివైపు ఒక సారి నిదానంగాచూసి వంటయింటిలోకి వెళ్ళిపోయింది.

లోకం పోకడ తెలిసిన రాజమ్మ కాబట్టి అంతటితో ఊరుకొంది. కోడలి మనస్తత్వాన్ని అర్థం చేసుకోడానికి ప్రయత్నించసాగింది.

లలిత తెలివైనపిల్లే – ఎందుకిలా చేసింది ? కావాలని వలచి ప్రకాశాన్ని పెళ్ళి చేసుకొంటే వాడి నెందుకిలా యాతన పెడుతున్నాది? అంతకు పూర్వం ఆమె అనే మాటల్ని చేసే చేతల్ని అటు ఇటు తిప్పి తిరగేసి, మరగేసి ఏదేనా సూచన దొరుకుతుందేమోనని వెతకసాగింది.

అంతవరకు ఆర్థికంగా ఏవో ఒడుదుడుకులు ఉన్నా, ఆత్మీయతా, అభిమానం ఆ ఇంట కరువుకాలేదు. రాజమ్మకి కొడుకు, కోడలు రెండు కళ్ళు. ప్రకాశానికే కాక లలితకికూడా ఆమె తల్లి వంటిదే.

రాత్రిపూట నిద్రరాక ఒంటరిగా అలా ఆలోచిస్తూంటే, తను చేజేతులా మెడకి తగిలించుకొన్న ఉచ్చు, రోజులు గడుస్తున్న కొద్దీ బిగిసిపోతున్నట్లు, చివరికి ఊపిరి ఆడనంత గట్టిగా పీటముడి పడిపోయినట్లు అన్పించేది లలితకి.

నిద్రపోతున్న భర్తని లేపి మొదటినుండి జరిగినదంతా తూ. చ. తప్పకుండా చెప్పేయాలనిపించింది. నిజానికి ఆరోజు ప్రకాశం ముఖమంతగా కందబెట్టుకుని ఆవేశంతో అలా నిలదీసి అడక్కపోతే, లలిత తనంతట తనే చెప్పివుండేది. ఆ ఫొటో వెనకవున్న కథ. చిన్ననాటినుంచి ఆమె ఎదుటివారి అభిమానానికి, ఆత్మీయతకి జోహార్లు చేసింది కాని, అధికారానికి తలవంచలేదు. అందువల్లనే భర్తననే అహంకారంతో గర్జిస్తూ

న్నట్లు అడుగుతున్న ప్రకాశం ప్రశ్నకి సూటిగా జవాబు చెప్పడానికి ఎదురు తిరిగింది ఆమె మనసు.

అతడిగురించి ఆమె ఎన్నో ఆకాశరామన్న ఉత్తరాలు అందుకొంది. క్లాసులో ఆడపిల్లలవేపు తినేసేలా చూస్తాడనీ, బైట కన్పిస్తే వెకిలిగా నవ్వుతూ పలకరిస్తాడనీ, కొందరు ఆడపిల్లలతో అతడికి అక్రమ సంబంధాలు ఉన్నాయని – ఇలాగే ఏవో అయినవీ – కానివీ రాస్తూ -- ఎవరో మహానుభావుడు ఎంతో కష్టపడి ప్రకాశం ఒక ఆడపిల్లతో చేతులు కలిపి నవ్వుతూ బీచీలో నడుస్తున్నట్లు ఒక ఫొటో కూడా తీసి పంపేడు. ఆ పిల్ల ఎవరో -- ఆమె ప్రవర్తన ఎటువంటిదో లలితకి తెలియదు. కాని ఏరికోరి పెళ్ళి చేసుకొని కాపురం చేస్తున్న భర్త గురించి, ఆమెకి క్షుణ్ణంగా తెలుసు. అందుకే ఆ ఉత్తరాల్ని, ఫోటోల్ని రెండోసారి చూడకుండా చింపి పారవేసింది. ఆ విషయం గురించి ప్రకాశం దగ్గర మాట వరసకైనా ఎత్తడం కాని, తన మనసులో మరోసారి అనుకోవడంగాని చెయ్యలేదు.

భార్యగా అతడి నీతి నిజాయితీలపట్ల, నిష్కల్మష ప్రేమాభిమానాల పట్ల తను అంతనమ్మకతో ఉండగా, ఎవడో కొయిన్‌కిస్కాయిగాడు ఏదో రాసేడని అతడు తనని ఎందుకు అనుమానించాలి?.... ఎందుకుఅనుమానించాలి ? పురుషుడననే అహంకారమా ? - భర్తననే అధికారమా ? అంతా ప్రకాశంతో చెప్పేసి రాజీ పడదామనుకొంటూ మెత్తబడుతున్న లలిత మనసు, ఇటువంటి ఆలోచనలతో మళ్ళా బిగుసుకు పోయేది.

పగలంతా ఆఫీసులో పని; రాత్రంతా తుదీ....మొదలూలేని ఆలోచనలు.... ఈ రకమైన దినచర్యకి అలసిపోయింది లలిత.

మనిషి జీవితకాలంలో ఒక రోజు అంటే ఎంతో అమూల్యమైనది. దాటిపోయిన క్షణం తిరిగిరాదు. ఇటువంటి పట్టు పంతాలతో సంతోషంగా గడపవలసిన కాలాన్ని నిరర్ధకంగా, నిరుత్సాహంగా కరగిపోనీయడంలో అర్థం లేదు. ఏమైనా మరు రోజు చెప్పేయాలనుకొంది.

ఆ రోజు ఆదివారం. సావకాశంగా కూర్చుని ప్రకాశంతో అసలు

విషయం ఏమిటో వివరంగాచెప్పేయాలి....ఆపైన ఆతడు తనని ఏమన్నా సరే....ఏమనుకొన్నా సరే... గుండెల మీద పేరుకొన్న ఆ బరువు దిగి పోతే అంతేచాలు. ఇంటిలో అలముకొన్న ఈ నిర్లప్త వాతావరణం సదలి పోతే అంతేచాలు—అనుకొంది లలిత.

స్నానం చేసి తల దువ్వుకొంటూనే భర్త వంక క్రీగంట చూసింది. ప్రకాశం వరండాలో వాలు కుర్చీలో నాలుగైదు పత్రికలు ముందేసుకుని కూర్చున్నాడు. పత్రికల్లో పేజీలు తిరుగుతున్నా, పేజీలలోని అక్షరాలు కళ్ళముందు కదలాడుతున్న మనసుమాత్రం గడచిపోయిన మంచిరోజుల్ని మననం చేస్తున్నది.

ఆదివారం వచ్చిందంటే ఇంట్లో ఎంత సంతోషంగా ఉండేది. ఆ రోజు లలిత, అమ్మని వంట పొయ్యి దగ్గరికి రానిచ్చేదికాదు. నాకు సెలవు రోజు, మీకూ సెలవే అనేది. మొదట్లో అమ్మ మడీ తడీ అనేది. ఆ వెనుక లలితతో వాదించలేక, తనకే నమ్మకం లేని ఆచారాన్ని పట్టుకు పాకులాడ లేక రాజీ పడిపోయింది.

లలిత వంట మొదలు పెట్టిందంటే ఒక పట్టున తెమిలేది కాదు. స్వీటు, హాటు; ముద్దకూర వేపుడు; పచ్చడి, పులుసు అంటూ ఎన్నోరకాలు చేసేది. ఒక్కొక్కసారి పుస్తకాల్లో చదివినవీ ఎవరో చెప్పినవీ, మచ్చుకి అంటూ మొదలు పెట్టేది. కొన్నిసార్లు బాగా వచ్చేవి. మరి కొన్నిసార్లు విరుచుకుతినవలసిన వంటకం కప్పులోపోసుకు తాగవలసివచ్చేది. కూరలు పచ్చళ్ళు ఆర్భాటం ఎక్కువ. ఆదరువు తక్కువ అన్నట్లు తయారయేవి.

అటువంటి సమయాల్లో తను లలితనుఉడికించేవాడు. కాని ఓపట్టాన ఉడుక్కొనే తత్వం కాదు లలితది. 'వంటయింట్లో పనిచెయ్యడం రాని మగాడికి, వంటగురించి ఆక్షేపించే అధికారం లేదు' అనేది.

ఓ రోజు పత్రికలో పడ్డ ఏదో కథ చదవటంపూర్తిచేసి, ఉట్టి చెత్త, ఇటువంటివి ఎందుకు రాస్తారో తెలియదు' అంటూ పుస్తకాన్ని టేబిల్ మీదకి విసిరికొట్టింది లలిత.

"ఏమిటి?" అన్నాడు తను విననట్లు.

"ఇందులో ఈ మొదటి కథ చూడండి" అంది ఆముదం తాగు తున్నట్లు ముఖం పెడ్తూ.

"కథలు రాయడం రానివాళ్ళకి వాటిని విమర్శించే హక్కులేదు." అన్నాడతను నిదానంగా నెమ్మదిగా మాట పూర్తిచేస్తూ.

తెల్లబోయి చూసింది లలిత. ఇతను ఇంత అసందర్భంగా మాట్లాడు తున్నాడేమిటా అన్నట్లు. ఆ వెనుక ఆవేశంతో ఏదోఅనబోయింది. అంతలో తెలుసుకుంది. తను పప్పులో కాలు వేసేనని. కిలకిల నవ్వేసింది.

"మాటని మరచిపోకుండా సమయం చూసి అప్పచెప్పటంలో మీకు మీరే సాటి" అంటూ ఒక యోగ్యతా పత్రాన్ని కూడా పారేసింది.

ఏం రోజులవి? ఎంత ఉత్సాహంగాఉండేది, సెలవురోజు వస్తోందన్న దంటే? మరి....మరి ఇప్పుడెందుకిలా అయింది ? పాడుపడ్డ కొంపలా ముఖాన కళాకాంతులు లేకుండా ఈ మూల కుర్చీలో నేను, ప్రాణమున్న మరబొమ్మలా ఇంట్లో తిరుగాడుతూ లలిత.... ఇద్దరికిద్దరు నేరోచేసో ఉరి కంబం ఎక్కనున్న దోషుల్లా ముఖాలు మాడ్చుకుని పృష్టైప దుఃఖాన్ని, బాధని మనసులో మోసూ.

"ఎందుకేమిటి ? ఈ పరిస్థితికి నువ్వే కారణం. నిర్జీవంగా ఇలా రోజులు గడచిపోడానికి నువ్వే కారణం. పొంగుతున్న కుండెడు పాలలో ఒక మజ్జిగ బొట్టులా మాట జారేవు. కాస్త నింపాదిగా "ఏమిటి సంగతి?" అని అడిగితే లలిత చెప్పక పోయిందా ? ఏ నాడు ఏ విషయం నీ దగ్గర దాచింది కాబట్టి?

"మొనగాడిలా బయలుదేరి, మంచీ చెడ్డా చూడకుండా మొగుడిననే అధికారం చెలాయించబోతే, ఆత్మాభిమానం కల ఏ ఆడపిల్ల వస్తుంది ఈ రోజుల్లో? పిచ్చిగా పట్టుపంతాలకి పోయి బంగారంలాంటి కాలాన్ని పాడు చేసుకోక, ఏదో విధంగా లలితతో రాజీపడు".... మనసు సన్న సన్నగా ప్రకాశాన్ని చీవాట్లు పెట్టింది.

ప్రకాశం పత్రికలోంచి చూపు తిప్పి లలిత వంక చూసేడు. ఆమె జడ అల్లుకోవడం అప్పటికి పూర్తి అయింది. పెరట్లో పూచిన ఎర్రగులాబీ పువ్వు కోసి, పెట్టుకొని ఒక పక్కగా అలంకరించుకొంటున్నాది. ఎర్రని చిన్నచిన్నపువ్వుల ఫుల్ వాయిల్ చీర కట్టింది. అదంటే ప్రకాశానికెంతో ఇష్టం. దాన్ని అడిగి కొన్నాడు. లలిత కాపురానికి వచ్చేక మొదటి నెల జీతం పుచ్చుకొని.

లలిత ఒక్కొక్క మెట్టే దిగి వస్తున్నాది.... ఇంక బిగదీసుకు కూర్చోవడంలో అర్థంలేదు. తనూ దిగాలి....ఇటునుంచి, మధ్యలో ఎప్పుడో ఇద్దరూ కలుసుకోవాలి....మనసులు విప్పి మాట్లాడుకోవాలి. మళ్ళా ఒకటి కావాలి.

అడుగు ముందుకు వెయ్యడానికి కుర్చీలోంచి లేచేడు ప్రకాశం. గేటుముందు బంట్రోతు కన్పించాడు.

ఇటు వెయ్యబోయే అడుగు అటు వేసేడు.

"ఎక్స్‌ప్రెస్ లెటర్ సార్.... లలితాదేవిగారికి" అన్నాడు పోస్టు బంట్రోతు అటువస్తున్న ప్రకాశాన్ని చూసి.

ప్రకాశం సంతకం పెట్టి ఉత్తరంఅందుకొన్నాడు.

అప్రయత్నంగా వెనక్కి తిప్పి చూసేడు.

"ఎస్. పూర్ణచంద్రరావు."

"ఎవరీ పూర్ణచంద్రరావు ? పరిచితమైన పేరు లాగాలేదే" ఊరు పేరు కోసం చూస్తూ తనలో తనే అనుకున్నాడు.

"పోస్టు బంట్రోతు కేక విని లలిత అటుగా వచ్చింది.

"ఎక్కడనుండి ఉత్తరం" ప్రకాశం చేతిలో కవరు చూసి ప్రశ్నించింది.

"సికే" ఉత్తరం లలిత చేతిలో పెట్టేడు ప్రకాశం.

కవరు చించి చదువుతుంటే క్రీగంట చూసేడు ఆమె వైపు.

# కొ వ్వొ త్తి

వెయ్యి వాట్ల ఎలక్ట్రిక్ బల్బులా వెలిగిపోతున్నాది లలిత ముఖం. స్కూటరుమీద యువకుడు ఉంగరాల జుత్తుతో.... ఖరీదైన సూటులో.... నల్ల కళ్ళద్దాలతో తిరిగి ప్రకాశం మనసులోకి జొరబడ్డాడు.

అతడూ ఇతడూ— ఒకడేనా? లేక—ఇతడు యింకొకడా?

లలిత ముఖంలోని ఉత్సాహం చూస్తుంటే ప్రకాశం మనసు చిట పటలాడింది వేసవికాలపు ఎండలా—కారం తగిలిన ఒళ్ళులా—

"ఎక్కడి నుంచి?" మనసులోంచి తన్నుకొస్తున్న అక్కసుని అణచుంటూ అడిగేడు.

"ఆఫీసునుంచి— ఏవో అర్జంటు పని ఉందిట—రమ్మని...."

ప్రకాశం నోటిలో పళ్ళు గిట్టకరుచుకుపోయేయి.

పిడికిళ్ళు బిగిసిపోయేయి.

కణతల దగ్గర నరాలు ఉబ్బిపోయేయి.

వేడిగాల్పులా వచ్చింది ముక్కులోంచి ఊపిరి ....

"అబద్ధం .... పచ్చి అబద్ధం...."

గట్టిగా అరవాలనుకొన్నాడు ప్రకాశం. లలిత గుండె రెండుగా విరిగి పడేలా అరచే ననుకొన్నాడు.

ప్రకాశం పెదవి కదలలేదు.

లలిత కాళ్ళు కదిలేయి—పక్క గదిలోకి. పది నిముషాల్లో వచ్చింది లలిత, కట్టుబొట్టు మార్చుకొని.

"పని అయిపోగానే వచ్చేస్తాను" అత్తకి భర్తకి వినిపించేలా చెప్పి వెళ్ళిపోయింది.

ఆ చెప్పింది తమకికాక ఏ తలుపుకో.... గోడకో అన్నట్లు ఊ.... ఆ.... అనకుండా ఉండిపోయేరు ఆ తల్లీ కొడుకులు.

* * *

సాయంకాలం అయిదుగంట లయింది.

లలిత ఇంటినుంచి వెళ్ళి, ఏడు గంటలయింది.

ఆ ఏడు గంటలు ఏడు యుగాలుగా ఉంది ప్రకాశానికి.

లలిత ఇంటలేని సమయంలో ధైర్యాన్ని కూడగట్టుకొన్నాడు ప్రకాశం. ముఖాముఖిని అన్ని విషయాలు ఆమెని అడిగి తేల్చుకోవాలనుకున్నాడు. ఈ ముసుగులో గుద్దులాట వ్యవహారాన్ని అంతం చెయ్యాలనుకొన్నాడు.

లలిత తను, ప్రేమించుకొని, ఒకరికొకరు కావాలని నిర్ణయించుకొని పెళ్ళిచేసుకొన్నారు. ఆ ప్రేమని ద్వేషంగా, ఆ ఇష్టాన్ని అసూయగా మార్చుకొని, అడుగడుగునా అనుమానించుకొంటూ, అవమానించుకొంటూ కాపురం చెయ్యడంలో అర్థంలేదు.

ప్రకాశం ఒక నిశ్చయానికి వచ్చేడు. రాజమ్మ ఇంట్లో పని పూర్తి చేసుకొనివచ్చి, గడపలో స్తంభానికి చేరబడి కూర్చుంది. కనుచీకటి పడే వరకు రామాయణంలో పద్యాలు సన్నగా చదువుకొంటూ, అక్షరాలు తిన్నగా ఇక అగుపడ్డంలేదు అనిపించేక పుస్తకం మూసి పక్కనపెట్టింది.

"లలిత ఇంకా రాలేదు" అంది తను అనుకొంటునట్టుగా, ప్రకాశం జవాబు చెప్పలేదు.

చెప్పవలసి వుంటుందని కూడా అనుకోలేదు. లలిత ఇంకా రాకపోడానికి కారణం ఆమెకి ఎంతతెలుసో తనకీ అంతేతెలుసు.

బైట పువ్వుల మొక్కలమధ్య అటునుంచి ఇటు, ఇటునుంచి అటు, బోనులో పులిలాగా తిరుగుతున్నాడు. చూపు ఆనినంతవరకు లలిత రాక కోసం వీధిలోకి చూస్తున్నాడు. లలిత రాగానే అడగవలసిననాలుగు మాటల్ని మననం చేసుకొంటున్నాడు. ఆమె చెప్పబోయే జవాబులు ఊహించుకొంటున్నాడు.

మరో పావుగంటలో దూరంగా స్కూటరు చప్పుడు వినిపించింది. తుళ్ళిపడి అటు చూసేడు ప్రకాశం.

ఆ వీధిలో వున్నవారిలో ఇద్దరి ముగ్గురికి స్కూటర్లు వున్నాయి. ఆ రోడ్డుమీద స్కూటరు రావడం కొత్తకాదు.

కాని, ఆరోజు స్కూటరు శబ్దం అలన్ని తుళ్ళిపడేలా చేసింది. అరేపు అప్పుడు వస్తున్న వ్యక్తికి స్కూటరుకి అవినాభావ సంబంధం ఉండ డమే దానికి కారణం. మనసులోంచి ఎంతగా పారద్రోలాలనుకున్నా, ఉదయంనుంచి ఆ ఫొటోలో వున్న స్కూటరుమీది యువకుడు, ఉంగ రాల జుట్టు, ఖరీదైన సూటు, నల్లకళ్ళద్దాలతో కదలకుండా వున్నాడు.

స్కూటరు మెయిన్‌రోడ్డు వదలి కంకరబాట పట్టింది. నాలుగిళ్ళ ముందు నిలబడ్డ ఆడంగులు స్కూటరుమీద వస్తున్న లలితను వింతగా చూసేరు.

"ఆ పిల్ల లలితే.... మరి ఆ కుర్రాడు ప్రకాశంలా లేడే" చెవులు కొరుక్కున్నారు.

తమ ఇంటిముందు స్కూటరు ఆగడంతోనే ప్రకాశం గుర్తించేడు. దాన్ని నడుపుకొచ్చిన వ్యక్తిని, అతడు లలితతోపాటు ఆ ఫొటోలో ఉన్న యువకుడే.

'ఎంత ధైర్యం ? తిన్నగా ఇంటికే పిలుచుకొచ్చింది.' పొగలు కక్కింది ప్రకాశం మనస్సు.

"ఎవరొచ్చేర్రా ప్రకాశం ?" అప్పుడే ఇంటిలోకి వెళ్ళిన రాజమ్మ లోనుండి కేకపెట్టింది.

ప్రకాశం తల్లిమాటకి జవాబు చెప్పే స్థితిలో లేడు.

తన్నుతాను అదుపులో పెట్టుకొని సభ్యతతో ప్రవర్తించడానికి బలం చేకూర్చుకొంటున్నాడు.

"రండి" సాదరంగా ఇంట్లోకి ఆహ్వానించింది లలిత.

ఆ యువకుడు మెల్లిగా ఏమో అన్నాడు. వినాలనుకున్నా ప్రకాశా నికి వినబడలేదు ఆ మాట.

"ఇంతదూరం వచ్చి మా శ్రీవార్ని చూడకుండా వెళ్ళిపోతారా ?" రాక తప్పదు అన్నట్లు అంది లలిత.

అతను ఆమె వెనుకనే లోపలికి వచ్చాడు.

ప్రకాశం మనసులోంచి ఉబికివస్తున్న కోపాన్ని అదుపులో పెట్టుకోడానికి ప్రయత్నిస్తూ ముందుకు వచ్చాడు.

"మా శ్రీవారు — పేరు ప్రకాశరావు" — అంటూ లలిత — అతనికి ప్రకాశాన్ని పరిచయం చేస్తూ.

"ఇతను పూర్ణచంద్రరావుగారు. నీలకంఠంగారి మేనల్లుడు."

నీలకంఠం లలిత పనిచేస్తున్న ఆఫీసులో క్యాషియర్. ప్రకాశానికి అతను బాగా తెలుసు. అతనికి చాలామంది మేనల్లుళ్ళు, మేనగోడళ్ళు ఉన్నారు. అందులో ఇతనెవరో ....

పరిచయాలు పూర్తయేక కాఫీ తెస్తానంటూ లలిత లోపలికి వెళ్ళింది. ఇద్దరూ మౌనంగా రెండునిముషాలపాటు అలా కూర్చున్నారు. ఎవరు ముందు మాట్లాడాలి .... ఏం మాట్లాడాలి అన్న విషయం తేలనట్లు ఒకర్నొకరు చూసుకుంటూ ఉండిపోయారు. చివరికి ఆ మౌనాన్ని పూర్ణచంద్రరావే పగలకొట్టేడు.

"కంగ్రాట్యులేషన్స్ ప్రకాశరావుగారు" అన్నాడు నాటకీయంగా.

"దేనికి" అన్నాడు అదోలా ముఖంపెట్టి ప్రకాశం.

నా పెళ్ళాన్ని వెంటేసుకొని నువ్వు తిరుగుతూంటే వాజమ్మలా చూస్తూ ఊరుకొన్నందుకా? అనుకొన్నాడు మనసులో.

"దేనికేమిటి? ఇంత చవగ్గా వస్తున్నదైన స్కూటరు కొట్టేసినందుకు!!"

"స్కూటరేమిటి? చవగ్గా కొట్టేయడమేమిటి? మీరేమంటున్నారో ....!!"

"అయితే లలితగారు ఇప్పటివరకూ మీతో ఈ విషయం చెప్పనే లేదన్నమాట అబ్బో ... మా గట్టివారే."

"ఏ విషయం — లలిత నాతో, ఏం చెప్పలేదు" సంగతేమిటో తెలుసుకోవాలన్న కుతూహలం ప్రకాశం గొంతుకలో గురగురమన్నాది.

"ఒకనాడు ఏం జరిగిందంటే ...." పూర్ణచంద్రరావు విషయ వివ

రణ మొదలుపెట్టబోయేసరికి కాఫీ కప్పులతో అక్కడికి వచ్చింది లలిత. అతడు చెప్పబోతున్న విషయాన్ని గమనించి "చుప్" అన్నట్లు నోటిమీద చెయ్యి పెట్టుకొంది !

సడన్ బ్రేక్ పడ్డ కారులా ఆగిపోయింది అతడి వాగ్ధోరణి.

భార్యముందు స్కూటరు విషయంలో కుతూహలం చూపడం ప్రకాశానికి ఇష్టంలేదు. "ఆపేసేరేం" అన్నట్లు ఒక్కసారి అతడివైపు చూసి ఊరుకొన్నాడు.

ఆ చూపుకి అర్థం తెలిసినా గమనించనట్లు ఇంకేవో మాటల్లోకి సంభాషణ లాక్కుపోయేడు పూర్ణచంద్రరావు. సాధ్యమైనంత త్వరలో కాఫీ ముగించి వారిద్దరి దగ్గర శలవు పుచ్చుకొని వెళ్ళిపోడానికి లేచేడు.

అతణ్ణి సాగనంపడానికి లలిత గేటుదాకా వెళ్ళింది.

అతడు నవ్వుతూ ఏదో అన్నాడు.

ఆమె ఒకసారి వెనుదిరిగి ప్రకాశం వంక చూసి నెమ్మదిగా సమాధానం చెప్పింది.

ప్రకాశం ఆ ఇద్దరివైపు గుర్రుగా చూసేడు. జోరుగా పోతున్న స్కూటరు మీద ఒయ్యారంగా ఒకచెయ్యి అతడిభుజంమీదవేసి కూర్చున్న లలిత బొమ్మ మరుపుకి రాకుండా ఉంది. లలిత గురించి చెడ్డగా అనుకోటానికి మనసు సహకరించడం లేదు. అన్వయం కుదరని ఆలోచనలతో తను అవస్థ పడ్తుంటే స్కూటరు చవగ్గా కొట్టేసేరు అంటాడుఅతడు. ప్రకాశం మనసులోని ఆలోచనలు అడవిలో ముళ్ళపొదల్లా గజిబిజిగా అల్లుకుపోతున్నాయి. ఎటునుంచి తుంచాలనుకున్నా సందు దొరకడం లేదు.

ఆ యువకుడు స్కూటరుని ఆతాలో ఒక పక్కగా పార్కుచేసి, తాళం వేసి, ఆ తాళంచెవులు లలిత చేతిలో పెట్టేడు. లలిత థాంక్సు చెప్తూ వాటిని తీసుకుని, రెండుచేతులు జోడించి వీడ్కోలు పలికింది.

ఇంక లలిత వస్తుంది....అంతా చెప్తుంది. అని ఎదురు చూసిన

ప్రకాశం అలా, ఆమె తిన్నగా వంట యింట్లోకి వెళ్ళి, భోజనాల ఏర్పాట్లు చెయ్యడంతో సరిపోయింది.

ఎంతోకాలంగా ఎదురు చూస్తున్న వస్తువు ఎదురుగా ఉంటే, దానికి హక్కుదారుడివి నువ్వే అంటూ మనసు ఉత్సాహపడుతుంటే, మనిషన్నవాడు ఎంతకని కుతూహలాన్ని అరికట్టుకోగలడు. భోజనాల దగ్గర ప్రకాశానికి నోరు విప్పి అడక్క తప్పలేదు.

సమయంకోసం ఎదురు చూస్తున్న లలిత ఆ అవకాశాన్ని వదులుకోలేదు. ఆ స్కూటరు వెనుక ఉన్న కథంతా వివరంగా చెప్పింది.

ఒకరోజు లలిత మామూలుగా ఆఫీసులో పని చేసుకొంటుంటే నీలకంఠంగారి మేనల్లుడు పూర్ణచంద్రరావు వచ్చేడు.

"ఒక్క నిమిషం మీకు వీలుగా ఉంటే కొంచెం మాట్లాడాలి" అన్నాడు.

"ఏమిటో చెప్పండి" అంది లలిత, పక్కనున్న కుర్చీ చూపిస్తూ.

అతడి చేతిలో ఒక పేపరు ఉంది. దానిలో ఒక ప్రకటన ఉంది. అది ఒక ఫోటో కాంపిటీషన్‌కు సంబంధించినది. జె. అండ్. జె. కంపెనీ వాళ్ళది. వాళ్ళ కంపెనీలో తయారైన స్కూటర్లు అప్పుడే మార్కెట్టులోకి వస్తున్నాయి. వాటికి అడ్వర్‌టైజ్‌మెంట్ కోసం ఈ కాంపిటీషన్ పెట్టేరు.

"కల్పకాన్ని అడిగేను; తనకి స్కూటరంటే చచ్చేభయమంది. మీరు సహకరిస్తే మా రామ్మూర్తిచేత ఒక ఫోటో తీయించి దీనికి పంపాలనుకొంటున్నాను. మీ వీలుని బట్టి ఏరోజైన సరే, సాయంకాలం ఒక పది నిముషాలు" అన్నాడు అతడు.

పూర్ణచంద్రరావుభార్య కల్పకం. ఎంతో అందంగా, దంతపుబొమ్మలా ఉంటుంది. ఒకసారి నీలకంఠంగారి అబ్బాయి పుట్టిన రోజుకి వెళ్ళినప్పుడు ఆ పిల్లని చూసింది లలిత.

అతడు కోరినదానికి వెంటనే అవుననడానికి లలిత కొంచెం సంకో

-చించింది. ఆడవాళ్ళ స్వాతంత్ర్యం అంటూ కథల్లో, ఉపన్యాసాల్లో ఎంత హంగామా జరుగుతున్నా, పరాయి మగాడి పక్కన ఆడది కూర్చుంటే అపార్థాలు కల్పించకుండా ఉండే స్థితికి ఇంకాపెరగలేదు నేడున్న సంఘం. ముఖ్యంగా అత్తగారు భర్తగారు ఏమనుకుంటారో....?

లలిత మౌనాన్ని అతడు మరోలా అర్థం చేసుకున్నాడు.

"రోజులు కలసొచ్చి నా ఫొటోకి బహూమతి అంటూ వస్తే మీకు సగం నాకు సగం" అన్నాడు.

ప్రకటనలో ఉన్న బహుమతుల వివరాలు చూస్తూ "ఏం బహూమతి వస్తుందంటారు" అంది లలిత.

"ఏదంటే ఏం చెప్పగలను? అదృష్టం బాగుంటే ఏదైనా రావచ్చు. ఏదో అన్నమాటేముంది, మొదటి బహూమతే అందుకోవచ్చు." అన్నాడు పూర్ణచంద్రరావు ఉత్సాహంగా.

"అయితే ఒక షరతు" అంది లలిత.

"ఏమిటో చెప్పండి."

"ఇందులో మొదటి బహూమతి వాళ్ళ కంపెనీది, కొత్త స్కూటరు అని ఉంది. మీరన్నట్లు అదృష్టం బాగుండి ప్రథమ బహూమతి కాని వస్తే స్కూటరు నాకిచ్చేయాలి. మీ వాటాకి రావలసిన సొమ్ము వాయిదాలమీద నేను ఇచ్చుకుంటాను" అంది.

"నిరాక్షేపణీయంగా" అన్నాడు అతడు నవ్వుతూ.

అతడికి పెళ్ళినాడు మామగారు ఇచ్చిన స్కూటరు ఉండనే ఉంది. రెండోది ఎలాగూ అవసరంలేదు.

ఈ విషయం ముందుగా ఇంట్లోచెప్తే అత్తగారు, భర్త ఒప్పుకోక పోవచ్చుననుకొందిలలిత. నిజానికితప్పకుండా బహూమతి వస్తుందన్ననమ్మకం మాత్రంఏముంది? ఏమీజరక్కపోతే చెప్పనేఅక్కరలేదు. ఏదైనాబహూమతి వస్తే అప్పుడే చెప్పవచ్చు అనుకొంది.

లలిత చెప్పకుండానే ఎవడో కుళ్లుమనసు రాలుగాయి తీసుకున్న శ్రద్ధమూలంగా ఆ విషయం ఇంట్లో తెలిసిపోయింది. దానితో పరిస్థితి ఆమె అనుకోని విధంగా తయారయింది. ఇంక అప్పుడు ఏం చెప్పినా ప్రకాశం నమ్మేస్థితిలో లేడని ఆమె గ్రహించింది.

అందుకే అటునుంచి నరుక్కు రావాలనుకొంది ఏదో విధంగా ఒక పదిహేను రోజులు గడచిపోతే భగవంతుడి దయవల్ల ఆ ఫొటోకి చిన్నదో, పెద్దదో ఒక బహుమతి అంటూ వస్తే అది చూపించి ఈ చిక్కుముడి విప్పడం, తేలిక అని భావించింది.

లలిత తను కన్న కలలు ఫలించేయని, ఉదయం పూర్ణచంద్రరావు దగ్గరనుంచి వచ్చిన ఉత్తరంవల్ల తెలుసుకొంది. "ఈమధ్య రెండు మూడు రోజులై నేను ఊళ్లోలేకపోవడంవల్ల ఈవిషయం మీకు తెలియజెయ్యడం కాలేదు. ఈ రోజే బహుమతి ఇస్తారుట.... ఇద్దరం కలసి వెళ్ళిస్కూటరు తెచ్చుకొందాం రండి" అంటూ రాసేడు అతడు.

లలితకి తెలుసు ప్రకాశం కోపం, తాటాకుల మంట వంటిదని.... క్షణంలో దాన్ని ఆర్పడానికి కావలసిన సరుకు తనదగ్గర ఉందని. అందుకే ఆ ఉదయం వెళ్ళగలిగింది అంత ఉత్సాహంగా. సాయంకాలం పరాయి మగాడి పక్కన కూర్చుని రాగలిగింది అంత ధైర్యంగా.

ఊఁ....ఆ.... అనకుండా వడ్డన చేస్తూ అంతా వింది రాజమ్మ. లలిత ముఖతా కథంతా విపులంగా విన్నాక ఆమె మనసు తేలికపడింది. కోడలి ముఖంలోకి పరీక్షగా చూసింది. అది నిర్మలంగా అప్పుడే చెరువు లోంచి కోసిన తామర పువ్వులా ఉంది. చెప్పిన విషయం నిజమా — కాదా అని అనుమానించడానికి ఏపాటి అవకాశం ఆమె మాటల్లో కాని, ముఖంలో కాని కన్పించలేదు.

"ఈపాటి దానికి ఎంత హడలగొట్టావే తల్లీ....ఈ సంగతి ఆనాడే చెప్తే...." అంది మజ్జిగ వడ్డిస్తూ.

"చెప్పాలనే అనుకొన్నాను. కాని, మీ అబ్బాయి వాటం చూసేక కాస్తసేపు ఏడిపించాలని బుద్ధిపుట్టింది" ఓరిపిగా భర్తవంక చూస్తూ అంది లలిత.

ఆ రాత్రి చాలా సేపటిదాకా ఆ మాట, ఈ మాట చెప్పుకొంటూ ఉత్సాహంగా గడిపేసేరు ముగ్గురూ. చాల రోజుల తరువాత ఆదమరచి కంటినిండుగా నిద్రపోయింది రాజమ్మ.

* * *

విశాఖపట్నం నుంచి సింహాచలం వైపుగా తారురోడ్డు మీంచి స్కూటరు జోరుగా పోతున్నది. శీతాకాలం ఎండ వెచ్చ వెచ్చగా ఒంటి మీద తగులుతున్నాది. గాలికి చెదురుతున్న ముంగురుల్ని ఒక చేత్తో ఒయ్యారంగా సరిచేసుకొంటూ "ఇంతకీ మీఅమ్మగారు పట్టుపట్టి మనిద్దర్నీ పంపడానికి కారణం ఏమిటో మీకు తెలుసా?" అంది లలిత.

"చెప్పిందిగా ఎప్పుడో మొక్కుకొన్నానని" అన్నాడు ప్రకాశం ఎదురుగా వస్తున్న ఎద్దులబండిని తప్పిస్తూ.

"అదే ఆ మొక్కు ఏమిటి....ఎందుకు—అని?"

"నాకేం తెలుసు?" అన్నాడు ప్రకాశం.

"నాకు తెలుసు" అంది లలిత.

"నీకు తెలిస్తే చెప్పక మరి నన్నెందుకు అడిగేవు?"

"ఊహించి చెప్పగల రేమోని"

"అంత శ్రమతీసుకుని ఊహించిచెప్పే ఓపిక ప్రస్తుతం నాకు లేదు. అమ్మ ఎందుకు వెళ్ళి రమ్మన్నా, ఆదివారంకదా హాయిగా గడిపిరావచ్చని నేను బయలుదేరేను. అంతకంటె దీనికో అర్థం....పరమార్థం...."

"ఉందనే నా అభిప్రాయం, ఆ మధ్య చాలా రోజులు మనిద్దరం

ఏకముఖం వేరేముఖంగా ఉండడం చూసి పెద్దావిడ, ఏమవుతుందో అని కంగారుపడి ఉంటుంది. దగ్గరలో ఉన్న దేవుడు కదా సింహాద్రి అప్పన్న.

"అప్పన్నా వీళ్ళ తిక్కలు కుదిరి తిన్నగా ఉంటే నీ కొండకి పంపుతాను. అని మొక్కుకొనివుంటారు."

లలిత అన్న మాటలో నిజం లేకపోలేదనిపించింది ప్రకాశానికి. ఆ రోజుల్లో లల్లి ముఖాన కళన్నమాట లేకుండా జీవచ్ఛవంలా ఇంట్లో తిరుగాడ్డం, రాత్రిపూట తిన్నగా నిద్రపోక పక్కమీద పొర్లుతుండడం చాలా సార్లు చూసేడు తను. ఎండువల్లో అమ్మ ఒంట్లో బాగులేదు —అని అనుకొన్నాడే కాని .... ఆ బాధకి కారణం తనే అని తెలుసుకోలేకపోయేడు. లలిత అన్నట్లు తను ఉట్టి ఆవేశపరుడు. గోళ్ళతో గిళ్ళితే పోయేదానికి అనవసరంగా గొడ్డళ్ళు తెచ్చేను, అనుకొన్నాడు ప్రకాశం.

వాహనం గాలిని చీల్చుకొంటూ ముందుకి పోతున్నాది. తారురోడ్డు చకచకా వెనక్కి నడుస్తున్నాది. ఆదివారం కావడంవల్ల బళ్ళు, బస్సుల రద్దీ ఆ రోడ్డుమీద ఎక్కువగానే ఉంది. ఊరు సమీపిస్తుంటే చుట్టుపక్కల గ్రామాలనుంచి కాలినడకను వస్తున్న యాత్రికుల జట్లు ఎదురు పడసాగేయి.

రోడ్డుమీద అట్టే రద్దీ లేకుంటే, రాత్రిపూట దీపాల వెలుగులో కాకుంటే, ప్రకాశం స్వేచ్ఛగా స్కూటరు నడపగలడు. కాని బజారు వీధిలోను జనసమ్మర్దం ఎక్కువగా ఉండే సమయాల్లోను స్కూటరు నడపడానికి కాస్త తికమకపడ్తాడు. అటువంటి సమయాల్లో ఆ పనిని లలిత అందుకోవాలి.

నిజానికి లలిత, ప్రకాశం, స్కూటరు నడపడానికి కావలసిన శిక్షణ ఒక మిత్రుడు దగ్గర జతగా నేర్చుకున్నారు. కాని లైసెన్సు తీసుకోడానికి వెళ్ళేసరికి లలితకి వెళ్ళినమాటే దొరికింది. ప్రకాశం మరికొంత కాలం

'ఎల్' బోర్డు తగిలించుకొని తిరగవలసివచ్చింది. ఇద్దరు కలిసి స్కూటరు మీద ఆఫీసుకు పోతుంటే ఊరిబయట ప్రకాశం నడిపేవాడు. బజారులో లలిత నడిపేది.

మొగాడు ముందుండి నడపడం ఆడది వెనుకగా కూర్చోడం అలవాటుగా జరిగేపని. ఇక్కడ పరిస్థితి ఇటునుండి అటు తిరిగేసరికి, మొదట్లో రోడ్డుమీద తిరుగాడే మనుష్యులు వింతగా చూడసాగేరు. అటు తరువాత లలితని చూసి కొందరు ఆడపిల్లలు అన్నల స్కూటర్లని హస్తగతం చేసుకొన్నారు. కాని 'స్కూటరు నడిపే అమ్మాయి' అన్న బిరుదు లలితకి మాత్రమే దక్కింది.

సింహాచలం రోడ్డుమీద ఆడపిల్ల స్కూటరు నడపడం, మగాడు వెనక కూర్చోడం చెప్పుకోవలసినంత సంచలనాన్నే కలిగించింది. ఇళ్ళలోంచి ఆడంగులు, రోడ్డుమీద యాత్రికులు తిరిగి తిరిగి చూడసాగేరు.

"వద్దంటే విన్నావుకాదు. చూసేవా వాళ్ళంతా ఎలా చూస్తున్నారో" అన్నాడు ప్రకాశం.

"చూడనీండి .... మనకి పోయిందేమిటి ? ఏ కొత్త పని అయినా మొదట నలుగురి కళ్ళల్లో పడి, నలుగురి నోళ్ళలో నలిగి, అప్పటికికాని అలవాటుగా మారదు" అంది లలిత.

దేవస్థానం ఆఫీసుముందు స్కూటరు పార్కుచేసి అక్కడవున్న కావలావాడి చేతిలో ఒక రూపాయి పెట్టి హవేలీ, పువ్వులతోట అంతా తిరిగివచ్చేరు. పేరుకి పువ్వులతోటే కాని పువ్వులేమంతగా లేవు. కొండవైపు చెట్లకి ఆకు సంపెంగ పువ్వులు వున్నాయి. ముందు మళ్ళలో చామంతిమొక్కలు వున్నాయి. అక్కడా అక్కడా గులాబీలు ——

మాలివాడి చేతిలో డబ్బులు పెట్టి చామంతిపువ్వులు సంపెంగ

పువ్వులు తీసుకుంది లలిత. వాటిని అరటినారతో మాలగా గుచ్చి పెట్టు కొంది.

కొండమీదికి స్కూటరుమీద వెళ్ళడమా, బస్సుమీద వెళ్ళడమా అని అరగంటకి పైగా వాదులాడుకున్నాక మెట్లమీదుగా నడచిపోవడానికి నిర్ణ యించుకున్నారు. రోడ్డుపడ్డాక మెట్లమీంచి వెళ్ళే యాత్రికుల సంఖ్య పలచ బడింది. మెట్లని ఇటుఅటు కూర్చుండే ముష్టివాళ్ళకి, దారిలో చిన్న చిన్న గుళ్ళలో దేవుళ్ళకి, ఆ దేవుళ్ళని నమ్ముకొని బ్రతికే పూజార్లకి రాబడులు తగ్గిపోయేయి.

ఆంజనేయస్వామి ఆలయానికి ఎదురుగా మెట్లమీద ఒక చక్కని గుడ్డ పరుచుకుని కూర్చుంది ఓ ముసలమ్మ. కళ్ళు తిన్నగా కన్పించవు లాగుంది, మెట్లమీద మనుషుల అలికిడి కాగానే కళ్ళు చిట్లించి చూడ్డానికి ప్రయత్నిస్తూ "ధర్మం చెయ్యండి బాబులు, దానం చెయ్యండి అమ్మలు. కళ్లులేని కబోదిని సాములు" అంటూ అరుస్తున్నది. ఆ వస్తున్న మను షులు తనని దాటిపోగానే గుడ్డలో తడుముకొని చేతికి పైసలు తగిలితే కొంగులో మూట కట్టుకొంటున్నది. లేకపోతే నోట్లోనే ఏమో గొణు క్కొంటూ ఇంకో జట్టు ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూస్తున్నాది.

లలిత బ్యాగ్‌లోంచి ఒక రూపాయినోటు తీసి ఆ గుడ్డలో వేసింది. ముష్టిది చేతితో తడుముకొని రూపాయికాగితం తగలగానే "మా అమ్మే మా తల్లే నూరేళ్ళు సల్లగా బతుకు...." అంటూ దీవించింది. "ఇదెప్పటి నుంచి ?" అన్నాడు ప్రకాశం లలితవంక వింతగా చూస్తూ.

లలితకి ముష్టివాళ్ళంటే ఏమంత సానుభూతి లేదు. అశక్తతవల్ల కాక, చాలమంది సోమరితనం వల్లనే ముష్టివాళ్ళుగా తయారవుతారని ఆమె అభిప్రాయం. వాళ్ళకి డబ్బులు వెయ్యడం అంటే, ఆ వృత్తి చేపట్టే వాళ్ళని ప్రోత్సహించినట్లే అవుతుంది అనేది.

"ఎందుకో ఈ ముసలివాన్ని చూస్తుంటే మా అమ్మమ్మ జ్ఞాపకం వచ్చింది. అమ్మమ్మ ఇలా వీధినపడి అడుక్కోలేదు. కాని ఆఖరి దశలో ఇంతకన్న సుఖపడింది కూడాలేదు."

చివరి మాట అంటుంటే లలిత కంఠం జీరపోయింది. కళ్ళు చెమ్మగిల్లేయి.

అవ్వ రూపాయినోటుని పదిలంగా కొంగులో ముడి కట్టుకొంటున్నాది. అటు చూసేడు ప్రకాశం. అందులో అన్నీ ఒక పైసా నాణేలే. ముసలిది అంత ఉత్సాహంగా లలితని ఎందుకు దీవించిందో అర్థమయింది. బహుశ అది రూపాయినోటు చూసి చాలాకాలం అయివుంటుంది.

"రోజు కేపాటి దొరుకుతుంది అవ్వా" కుతూహలంగా ప్రశ్నించేడు ప్రకాశం.

"ఏటి దొరుకుతాది బాబు, ఈ బస్సొచ్చి మా కడుపు కాల్చేయి. డబ్బున్న మారాజులు, దానం చెయ్యగల తల్లులు, కారులమీద బస్సులమీద అటునుంచి పోతారు. ఇటునుంచి నడిచి పోయేరకం మానాబోళ్ళే, ఆళ్లేం పెడ్తారు.... మేమేటి తింటాం?" అంది ముసలిది; కొండమీదికి రోడ్డు పడ్డం వల్ల ముష్టివాళ్ళకి కలిగిన కష్టాన్ని ఎత్తిచూపుతూ.

"వెళ్ళొస్తాం అవ్వా" ఎవరో బంధువులకి చెప్తున్నట్లు అంది లలిత.

"సల్లగా ఎల్లి సామి దరిసెనం చేసుకురా తల్లీ" అంది ముష్టిది.

"మీ అమ్మమ్మ అంటే నీకు చాలా అభిమానం అనుకొంటాను" అన్నాడు ప్రకాశం దారిలో.

"అమ్మ పోయేక నన్ను, రామకోటిని అమ్మమ్మే పెంచింది. ఆ రోజుల్లో నాకు ఒక్కటే కోరిక ఉండేది. నేను బాగా చదువుకొని ఉద్యోగం చేసి డబ్బు సంపాదిస్తూ అమ్మమ్మని సుఖపెట్టాలని. కాని ఆ అవకాశం ఆవిడ నా కియ్యలేదు. నేను ఎలిమెంట్రీ స్కూలు చదువైనా పూర్తిచెయ్యక ముందే తరలిపోయింది." అంది లలిత భారంగా.

మెట్లదారిలో బస్సుదారి కలిసింది. యాత్రికుల కోలాహలం

హెచ్చింది. చోడిగుళ్ళతో, బంతిపువ్వుల దండలతో ఇటునుంచి అటు, అటునుంచి యిటు ఉత్సాహంగా తిరుగుతున్నారు యాత్రికులు.

లలిత కోవెలముందు బజార్లో పళ్ళు, పువ్వులు, ఊదొత్తులు, కర్పూరంవంటి పూజా సామగ్రి కొంది. ఇద్దరూ గర్భగుడిలోకి వెళ్ళి దేవుడి దర్శనం చేసుకొచ్చేరు.

"కాస్త సేపు కల్యాణమండపంలో కూర్చుందాము రండి" అంది లలిత అటు దారి తీస్తూ.

"అటువెళ్ళి పులిహోరా, దద్దోజనం కొనుక్కొందాం ....ఆకలవు తున్నది" అన్నాడు ప్రకాశం.

"కోవెల గార్లు చాలా బాగుంటాయి"

"అమ్మాయిగారికి ఎప్పుడూ లేనిది తిండిమీద కోర్కెలు పుడ్తున్నా యేం ?" కొంటెగా చూస్తూ అన్నాడు ప్రకాశం.

"తీర్చే భర్తగారు ఎదురుగా ఉన్నారని" చురుకుగా జవాబు చెప్పింది లలిత.

పొద్దు నడుస్తుంటే యాత్రికుల రాకపోకలు ఎక్కువయేయి. ఒంట రిగా, జంటలుగా, జట్లు జట్లుగా దేవుణ్ణి దర్శించుకొని తిరిగి వస్తున్నారు. ముందు మనుషుల్ని తప్పించుకొంటూ లలిత, ప్రకాశం, ప్రసాదాలు అమ్మే చోటుకి దారితీసేరు. ఎదురుగా కన్పించింది కప్పస్తంభం. వివిధ వయ స్సుల్లో వున్న ఆడవాళ్ళు పిల్లలు కలుగుతారనే నమ్మకంతో దానిని కౌగ లించుకొంటున్నారు.

కరువు కాటకాలతో దేశంలో తిండిలేక చస్తుంటే, జనాభా తగ్గాలని ప్రభుత్వంవారు ఒక మూలనుంచి గోల పెడ్తుంటే, ఇంకా పిల్లలకోసం ఆ స్తంభాన్ని కౌగలించుకొంటున్న ఆ స్త్రీలవంక చూసింది లలిత. విజ్ఞానం ఇంతగా పెరిగిన ఈకాలంలోకూడా జీవంలేని ఆ రాతి స్తంభం ప్రాణమున్న మనుషులకి కలిగిస్తున్న ఆశని, నమ్మకాన్ని చూస్తుంటే వింతగా అనిపించింది లలితకి.

"నీకూ ఓ టిక్కెట్టు తీసుకోమంటావేమిటి?" కొంటెగా చూస్తూ ప్రశ్నించేడు ప్రకాశం.

లలిత అతడి మాటకి జవాబు చెప్పలేదు. వేలెత్తి స్తంభంవైపు చూపించింది, ఆమె చూపించిన దిక్కుగా చూసేడు ప్రకాశం.

స్తంభానికి కాస్త మీదుగా ఒక కాగితం అంటించివుంది. దాని మీద ఎర్రని త్రికోణం "అగ్‌లా బచ్చా, అభీనహీ ....తీన్‌కే బాద్, కభీనహీ" అని హిందీలో రాసుంది. ఎవరో అల్లరికి చేసిన పని అది. బిడ్డలకోసం కప్ప స్తంభాన్ని కౌగలించుకొంటున్న స్త్రీలు కన్నెత్తి ఆకాగితాన్ని చూసి ఉండరు. ఏ ఒకరో ఇద్దరో చూసినా అది కప్ప స్తంభానికి సంబంధించిన ఏదో నోటీసు అనుకొని ఉంటారు. లలిత, ప్రకాశం లాంటి వాళ్ళు చూస్తే చిన్నగా నవ్వుకొని అక్కడినుంచి వెళ్ళిపోయి వుంటారు.

దద్ధోజనం పులిహోర పొట్లాలు కట్టించుకొని, కోవెల గార్లని కర కర లాడిస్తూ అరగంటలోనే తిరిగి అక్కడికి వచ్చేరు. ఆ కాగితం ఇంకా అక్కడే ఉందా అని చూసింది లలిత. అది అక్కడ లేదు. దేవస్థానం ఉద్యోగులు ఎవరో చూసి తీసివేసి ఉంటారు.

తిన్న ప్రసాదాలు అరిగిపోయే వరకు రాళ్ల, గుట్టలు ఎక్కుతూ దిగుతూ, అలసిపోయేరు దంపతులు. తిరుగు ప్రయాణంలో మెట్లు, దిగి రావడానికి ఇద్దరికీ ఓపిక లేదు. మెల్లిగా కాళ్ళీడ్చుకొంటూ బస్సు ఆగే చోటుకి వచ్చేరు. పది నిమిషాల్లో బస్సు వచ్చింది. అరగంట కాకుండానే వారిని మెట్ల మొదటికి తీసుకొచ్చి వదిలింది.

దగ్గరగా ఉన్న హోటలు, కాఫీ సేవించి పొండంటూ ఆహ్వానిం చింది. కాఫీ సేవనం పూర్తయ్యేక కిల్లీ వేసుకుంటావా అన్నాడు ప్రకాశం. "ఆ పక్కనే తెల్ల సంపెంగ పువ్వులు అమ్ముతున్నాడు. ఓ పొట్లాం కొని తెండి" అంటూ స్కూటరు ఉంచిన దగ్గరికి నడిచింది లలిత.

అప్పుడే పక్కనున్న ఆటస్థలం లోంచి, పది పన్నెండేళ్ళలోపు ఆడపిల్లలు గుంపుగా వస్తున్నారు. స్కూటరు పక్కగా నిలచిన లలితను

చూసేరు. ఆమె ఎవరో వారికి అర్థమయింది. ఒక్కరొక్కరే మెల్లిమెల్లిగా అక్కడికి చేరబాకేరు.

"ఏం కావాలమ్మా" అంది లలిత తన వంకే రెప్పవెయ్యకుండా చూస్తోన్న ఒక అమ్మాయితో.

ఆ పిల్ల జవాబుచెప్పలేదు. సిగ్గుతో ముఖం కందబెట్టుకుని మూకలో కలిసిపోయింది.

వెనకనున్న పిల్లలు ముందుకి తోసుకొస్తున్నారు. ముందున్నవాళ్ళు వారిని, వెనక్కి నెట్టుతున్నారు. వారి కుతూహలానికి కారణం ఏమిటో లలితకి తోచలేదు. ఆ పిల్లల్లో కాస్త వయసులో పెద్దదిలా ఉన్న పిల్లని చూసి,

"ఎందుకిలా నా చుట్టూమూగుతున్నారు. మీకేం కావాలి" అంది.

ఆ పిల్ల కాస్తసేపు పెదవులుతడుపుకొని, "మరే....మరేం మీరు.... మీరే సినీమాలో వేషం వేస్తారుకదా ?" అంది. ఎవరో వెంటబడి తరుము కొస్తున్నట్లు ఆ కాస్తమాట అనేసి తుర్రుమని పారిపోయింది.

తన పట్ల ఆ చిన్నపిల్లలు చూపుతున్న కుతూహలానికి కారణం తెలియవచ్చింది లలితకి. ఆమె ఏదో జవాబు చెప్పేలోపునే ప్రకాశం కిల్లీలు, పువ్వులు పట్టుకొని అక్కడికి వచ్చేడు. అతడు రావడంచూసి గాలికి చెదిరిన మేఘంలా పిల్లలంతా పరుగు లంకించు కొన్నారు.

"ఎవరీ పిల్లలంతా? నీ చుట్టూ ఏం చేస్తున్నారు?" అన్నాడుప్రకాశం.

"నేను సినీమా స్టారునేమోనని కనుక్కోడానికి వచ్చేరు" అంది లలిత నవ్వుతూ.

"అవు ననలేకపోయావా.... వాళ్ళ అక్కల్ని అమ్మల్ని వెంట పెట్టుకొని వచ్చేవారు" అన్నాడు ప్రకాశం.

ఇంకా ఆరుగంటలు కాకున్నా శీతాకాలం పొద్దుమూలాన దారిలోనే చీకటిపడింది. పైగా రోడ్డుమీద అడుగడుక్కీ సరుకులబళ్ళు, ఎంత

తొందరలో ఇల్లు చేరుకోవాలనుకొన్నా అవ వలసిన ఆలస్యం అవనే అయింది.

స్కూటరు చప్పుడు విని గడపలోకి వచ్చింది రాజమ్మ. ఆమె ముఖం వాడి ఉంది. ఎందుకో కంగారు పడ్తున్నట్లు "వచ్చారా?" అంది వాళ్ళని చూడగానే నిటూరుస్తూ.

తాము రావడం అన్న సమయం కంటె ఆలస్యం అయిందనీ, అందుకే అత్తగారు కంగారుపడ్తున్నారని అనుకొంది లలిత.

ఉదయం వెళ్తుంటే చీకటిపడకుండా వచ్చేయమని మరీ మరీ చెప్పింది. కొండమీదికి స్కూటరు తీసుకుపోవద్దని కొసదాకా చెప్తూనే ఉంది. ఇంతకాలంగా స్కూటరుమీద వెళ్ళి వస్తున్నా, అమ్మకి ఇంకా భయం పోలేదు అనుకొన్నాడు ప్రకాశం.

"ఏం అలా ఉన్నారు? ఒంట్లో బాగాలేదా" అని అడిగిన కోడలుకి సమాధానం చెప్పకుండానే "కాళ్ళూ, చేతులూ కడుక్కురండి.... వడ్డించేస్తాను" అంటూ వంట ఇంటిలోకి దారితీసింది.

కొండమీద తిన్న ప్రసాదాలు అప్పుడే అరిగిపోయాయి. దారిలో తాగిన కాఫీ ఎప్పుడో ఇగిరిపోయింది. కడుపులో ఆకలి కరకర మంటున్నాది. ప్రకాశానికి అంతగా ఇష్టంలేని కాకరకాయ పచ్చడి, ఆ రోజు బలే రుచిగా కుదిరింది. ఇంకో ఆలోచనా, మాటా మంతీ లేకుండా తిండిమీద దండయాత్ర సాగించేరు లలిత ప్రకాశం.

వాళ్ళు భోజనాలు చేస్తున్నంతసేపు వారికేమి కావాలో చూస్తూ, మౌనంగా వడ్డన సాగించింది రాజమ్మ.

కడుపులో కాస్త చల్లబడి ఆత్మారాముడు శాంతించేక అత్తగారి మౌనానికి ఏదోకారణం ఉంటుందన్న ఆలోచన లలితమనసులోకివచ్చింది. ఇంట్లోకాలుపెట్టగానే అడిగిన ప్రశ్నే మళ్ళావేసింది. "ఒంట్లోసరిగాలేదా?"

క్షణకాలం రాజమ్మ జవాబుచెప్పలేదు. పక్కకితిరిగి పైటకొంగుతో కళ్ళు తుడుచుకొంది.

అప్పటికి ఇద్దరి భోజనాలు పూర్తి అయేయి. ప్రకాశం పీటమీంచి లేచి చెయ్యి కడుక్కొంటున్నాడు. అలిశ ఎంగిలి కంచాల్ని ఎత్తి, పక్కగా పెడ్తున్నాడి.

ఉదయంనుంచి ఒంటరిగా అనుభవిస్తున్న దుఃఖాన్ని ఇంక ఆపుకో లేకపోయింది రాజమ్మ. పగిలిన కుండలోంచి నీళ్ళలా కన్నీళ్ళు ఒక్కసారి భళ్ళున పైకి ఉబికివచ్చాయి.

"అనసూయ బ్రతుకు అధ్వాన్నమై పోయిందర్రా" అంది గోడు గోడున ఏడుస్తూ.

అయిందికి అనసూయ, సవితికూతురు కూతురైనా, కన్నకూతురికి మించినఅభిమానం ఆపిల్లపట్లరాజమ్మకుంది. భర్తపోయినా సవతికూతురు అని ఎడపెట్టక తొలిచూలు పురిటికి తన ఇంటికి సావిత్రిని తీసుకొచ్చింది రాజమ్మ. ఆ కానుపు సావిత్రికి చచ్చిబ్రతికినంత పని అయింది. మూడు నెలలదాకా మంచందిగకూడదన్నాడు డాక్టరు. ఏడాదివరకు బరువులెత్తడం పనికిరాదన్నాడు.

"ఆ మంచో చెడ్డో మా ఇంట్లోనే చూస్తాం సావిత్రిని పంపండి" అంటూ అరుణాచలం ఎన్ని సార్లు వచ్చినా, రాజమ్మ ఇష్టపడలేదు. ఆ పల్లెటూరులో మంచీ చెడ్డా ఏదైనా చూసే దిక్కులేకుండా అయిపోతుంది. మీరు ఎంత పథ్యపానాలు జరిపిస్తామన్నా అత్తింట ఆడపిల్లకి పుట్టింట్లో జరిగినట్టు జరుగుతుందా? మీ ఇబ్బందులేవో మీరు పడండి. చంటిదానికి అన్నప్రాశన అయేక తీసుకుపోదురుగాని అంటూ సర్ది చెప్పేది.

"కన్నతల్లికన్న ఎక్కువగా ఇంత చేస్తున్నావు పిన్నీ, నీ ఋణం ఎలా తీర్చుకోను?" అనేది సావిత్రి కృతజ్ఞత నిండిన కంఠంతో.

"ఋణాలకి తీర్చుకోడానికి ఎవరో పరాయివాళ్ళకి చేస్తున్నానుటే, నా కూతురు నా మనుమరాలు చెయ్యకపోతే చెప్పుకోవాలి కాని చేస్తే అనుకోడానికి ఏముంది?" అనేది రాజమ్మ.

రమా రమి ఏడాది వయసు వచ్చేవరకు అనసూయ రాజమ్మ చేతుల్లోనే పెరిగింది. జ్ఞానంవచ్చి వావివరసలుతెలిసేవరకు రాజమ్మని "అమ్మ" అనీ, సావిత్రిని "అక్క" అని పిలుస్తుండేది.

ముక్కు పచ్చలారని ఆ పిల్ల బ్రతుకు ముక్కలై పోయిందన్న వార్త, ఆఉదయమే రాజమ్మ చెవిల్లో పడింది. లలిత, ప్రకాశం అటు వెళ్ళగానే వచ్చింది ఆ ఘోరాన్ని మోసుకొంటూ టెలిగ్రాం. వణుకుతున్న చేతులతో సంతకంపెట్టి, దాన్ని అందుకొంది. దారిని పోతున్న పొరుగింటి వారి అబ్బాయిని పిలిచి చదివించుకొంది. అప్పటినుంచి ఈ దుఃఖంలో తనతో భాగంపంచుకోడానికి ప్రకాశం, లలిత ఎప్పుడువస్తారా అని ఎదురు చూస్తోనే వుంది.

"ఏమిటమ్మా నువ్వంటున్నది.... అనసూయ కేమయింది? చేతిలో చెంబు అలాగే దిగవిడిచి వచ్చేడు ప్రకాశం. అది బడబడమని చప్పుడు చేస్తూ దొర్లుకొంటూ పోయి నూతి చపటా దగ్గర ఆగిపోయింది.

అలా ఏడుస్తూనే వెళ్ళి గదిలో బల్లమీద పెట్టిన టెలిగ్రాం తెచ్చి, కొడుకు చేతిలో పెట్టింది రాజమ్మ.

అప్పుడే జీవితంలో అడుగు పెడ్తున్న రామం ఒక్కరోజు జ్వరంతో నూరేళ్ళు నింపుకొని వెళ్ళిపోయేడు. మొగ్గవిచ్చకుండానే రేకులు మాడి, వూడిపోయినట్లు అయింది అనసూయ వైవాహిక జీవితం.

ముగ్గురూ తడి మట్టిబొమ్మల్లా వున్న చోటనే అలా ఎంతసేపు కూర్చుండిపోయేరో తెలియదు. తెరచివున్న గుమ్మంలోంచి చలిగాలి వీచి, రాత్రి చాలా మీరిందని వారిని హెచ్చరించింది.

"నేనొకసారి వెళ్ళి వస్తారా?" అంది రాజమ్మ పైటకొంగుతో కళ్ళు తుడుచుకొంటూ.

"సెలవులేకదా.... నేనూ వస్తాను.... ఉదయం పాసెంజరులోనో, బస్సులోనో బయలుదేరి వెళ్దాం" అన్నాడు ప్రకాశం.

మంచాలమీద పడుకొని కళ్ళు మూసేరన్న మాటేకాని మిగిలిన రాత్రంతా ఆ ముగ్గురి మనసుల్లో విషాద సంఘటన సుళ్ళు తిరుగుతూనే ఉంది.

# 5

చలిగాలికి తెలివి వచ్చింది లలితకి. వరండాలోకి తెరచివున్న కిటికీ తలుపులు దగ్గరగా వేసివచ్చి, మళ్ళా మంచంమీద పడుకొంది. కళ్లు తేలిగ్గా ఉన్నా, ఇంకా ఆ రాత్రి అప్పుడే తెల్లవారేలా లేదు. లైటు వేసి వాచీ చూసుకుంది. చిన్నముల్లు ఇంకా మూడు చుట్టుపక్కలే తచ్చాడుతున్నది. శీతాకాలం రాత్రి. ఎంతలేదన్నా మరి మూడు గంటలన్నా గడపందే తూరుపు ఎర్రపడదు.

దూరంగా పొలాల్లో ఉండుండి నక్కలు కూస్తున్నాయి. వెనకనున్న తాటితోపులోంచి కీచురాళ్ళు గీ మంటూ రొద పెడుతున్నాయి. నిద్రరాని పక్షులు చెట్టుకొమ్మలమీద టపటప రెక్కలు కొట్టుకొంటున్నాయి.

అరగంటకి పైగా పక్కమీద అటు ఇటు దొర్లినా, తేలిపోయిన నిద్ర, మళ్ళా తొంగిచూడలేదు. అంతగా రానని భీష్మించుకొని కూర్చున్న నిద్రకోసం అంగలార్చడంలో అర్థం లేదనుకొంది లలిత. టేబిల్ లైటు స్విచ్ వేసి, రాత్రి సగం చదువుతూ వదలిపెట్టిన పుస్తకాన్ని చేతిలోకి తీసుకొంది.

పుస్తకంలో పేజీలు తిప్పుతుంటే అందులోంచి జారిపడింది, రెండు రోజుల క్రిందట రాజమ్మ రాసిన ఉత్తరం. ఆ వుత్తరం, లలిత మరిచిపోవాలని ప్రయత్నిస్తున్న విషయాన్ని మళ్ళీ మనసులోకి తోడింది.

లలితకి అనసూయ తలపుకి వచ్చినప్పుడల్లా మొదటిసారి తను ఇంట్లో చూసిన చూపే గుర్తుకివస్తుంటుంది. నిర్మలంగా నవ్వుతూ "అత్తా నువ్వూ....నేనూ జట్టు" అని ఆ పిల్ల అంటున్నట్లే ఉంటుంది ఈ మధ్యకాలంలో అనసూయ పెరిగి పెద్దదయింది. అందాలు దిద్దుకొని అత్తింట కాలు పెట్టింది. కాని లలితకి ఆ చిన్నారి అనసూయ రూపే, మనసులో హత్తుకుపోయింది. పన్నెండేళ్లు నిండిన పల్లెటూరి పడుచు, ప్రతి చిన్న విషయానికి విస్తుపోయి చూసే అందమైన కళ్లు, బొట్టు కాటుకా, తలనిండా పూలూ, నోటినిండా నవ్వులు——"

ఆ పిల్ల ఏం పాపం చేసిందని భగవంతుడా ఇంత శిక్ష విధించేవు ? తమకి ఏం అపకారం చేసిందని ఇంతగా పగ పట్టేరు ?

అత్తవారి ఉత్తరంలో వాక్యాలు కళ్ళముందు కదులాడేయి. "నేను ఇక్కడికి రాకుండా ఉంటేనే బాగుండేదనిపిస్తున్నదే లలితా ! కానని కళ్ళకి కష్టం అదొక తీరు. ఇక్కడ ఉంటూ, వీరి మాటలు వింటూ ఏమీ చెయ్యలేక, చూస్తూ ఊరుకోలేక బాధపడ్డం మినహా నా రాకవల్ల ప్రయోజనం లేకుండాపోయింది.

ఈ ఊరు వచ్చేముందు ఏమేమో అనుకొన్నాను. అనసూయకి అన్యాయం జరగకుండా చూడాలనీ, సావిత్రికి ఆసరాగా నిలవాలనీ ....కాని .... అదేం లాభం లేదు. 'గోతిలోపడ్డ నక్కమీద నాలుగు బెడ్డలు వేసేవారేకాని తీసేవారు లేరు' అన్న సామెతలా ఉంది ఇక్కడి పరిస్థితి.

పిల్ల నుదిటి పసుపు, కుంకం చెరిగి మనం ఏడుస్తుంటే, అత్తింట కాలుపెట్టి పెట్టకుండానే పిల్లణ్ణి పొట్టనపెట్టుకున్నాదని వాళ్ళు తిట్టిపోస్తున్నారు.

పైగా ఆ పిల్లడి పెద్దమేనత్తట. పదేళ్ళ వయసుకే ముండమోసి పుట్టింటికి చేరింది. ప్రస్తుతం తమ్ముడు పంచన కాలంగడుపుతున్న అరవై దాటిన ఆవిడ, ఆనాడు తనకి జరిగిన విధంగానే అన్ని విధులు జరగాలని పట్టుపడ్తున్నాది.

ఆవిడకి అత్తవారినుంచి సంక్రమించిన పొలం, పుట్రా ఉందిట. ఆవిడ అన్నదానికి కాదంటే, ఆ స్తి తమకి దక్కదేమోని ఇంట్లో మిగిలిన వాళ్ళంతా తల లాడిస్తున్నారు.

పట్నంలో నీలాంటి చదువుకొన్న అమ్మాయిలంతా కాలం మారింది. ఆడదానికీ ఏవో హక్కులు వచ్చేయి, శాసనాలు వచ్చేయి, అంటే అవును కామోసు అనుకొనేదాన్ని. కాని ఇక్కడి పరిస్థితి చూస్తే, వచ్చిన ఆ మార్పులవల్ల ఏ కొద్దిమంది స్త్రీలో లబ్ధి పొందారేమోకాని మామ్మూలు ఆడదాని పరిస్థితి ఆనాటికీ, ఈనాటికీ ఒక్కలాగే ఉందనిపిస్తున్నాది.

మీ మామగారు పోయిననాడు పిల్లడు బెదిరిపోతాడని మావాళ్ళు తలమీద జుట్టు తీయించలేదు. దాన్ని ఆధారంగా తీసుకొని మా అత్తారి వంకవాళ్ళు నన్నూ, మా అమ్మనీ నోటికిరాని మాటలన్నారు. కాని మా అమ్మ మొండిది. వాళ్ళకి మాటకి మాట జవాబు ఇచ్చి, నెగ్గించుకు రాగలిగింది.

సావిత్రికి అటువంటి ధైర్యంలేదు. పెరిగి పెద్దవారు కావలసిన మగపిల్లలు, పెళ్ళిళ్ళు కావలసిన ఆడపిల్లలు ఉన్నారు. ఉన్న ఊళ్లో మనుష్యుల్ని, బంధువుల్ని కాదని ఎదిర్చి నిలచే పరిస్థితి దానికి లేదు.

ఎవరెలా అనుకొంటే మనకేం అని నెట్టుకుపోయే పరిస్థితి పట్నాల్లో అయితే చెల్లుతుంది. ఇటువంటి కుగ్రామాల్లో వ్యక్తిగత ఆలోచనలకి, ఆశయాలకి అవకాశం పూజ్యం. అవసరానికి ఆదుకోకపోయినా అదను దొరికితే నొక్కిపెట్టడానికి అంతా తయారే.

ఇటు పెద్దల సిద్ధాంతాన్ని కాదనలేక, అటు కన్నబిడ్డకి అన్యాయం చెయ్యలేక, కంటనీరు కట్టకుండా ఏడుస్తున్నాది సావిత్రి. అల్లుడి మనసులో ఏముందో .... .... కానున్నది కాక మానదు అన్నట్లు విరక్తిగా తిరుగుతున్నాడు.

ఈ స్థితిలో అబ్బాయి అయినా దగ్గరఉంటే కొంత బాగుండేది. ఇక్కడ మనుషులు వాటం చూసి ఇంక ఉండలేక ఏలూరులో ఎవరో స్నేహితుణ్ణి చూసి వస్తానంటూ చల్లగా జారుకొన్నాడు. నాకూ వచ్చేయాలనేఉంది. కాని అనసూయని అలా వదలి రాబుద్ధి కావడంలేదు. ఉండి చెయ్యగలిగేదికూడా ఏమీ లేదనుకో...."

వీధి తలుపు గాలికి టకటక చప్పుడయింది. రెండో రెక్కకివున్న గడియ తిన్నగా వెయ్యకపోతే అది అలాగే కొట్టుకొంటుంది. అప్పుడు పక్కమీంచిలేచి గడియ సరిచేసి రావటానికి లలితకి ఓపికకూడా లేకుండా పోయింది.

వారం రోజులుగా అనసూయ గురించిన ఆలోచనలు ఒంటిలో శక్తిని మనసులో ఉత్సాహాన్ని హరించి వేస్తున్నాయి. తప్పనిసరి కాబట్టి యాంత్రికంగా ఆఫీసుకి వెళ్ళివస్తున్నాది. ఇంట్లో వండిపెట్టే అత్తగారు లేదు. కాబట్టి ఇంత ఉడకేసుకుని తింటున్నాది.

పగటిపూట ఏదోవిధంగా గడచిపోతున్నాది. రాత్రివేళ కాళ్ళుతెగిన జర్రిలా ఎంతకీ కదలడంలేదు. ఊరికి దూరంగా ఉన్న ఆ కొంపలో ఒంటరిగా ఒక రాత్రి గడిచిందంటే ఒకయుగం గడిచినట్లు ఉంటున్నాది. కన్నుమూస్తే ఏవేవో పీడకలలు, కళ్ళుతెరుస్తే అర్థంకాని భయాలు, ఆలోచనలు, మనసులోని ధైర్యాన్ని కుళ్ళబెడ్తున్నాయి.

ఈసారి తలుపు మరికాస్త గట్టిగా కొట్టుకొంది. ఇంక దాని సంగతి ఏదో చూడకపోతే లాభంలేదని పక్కమీంచి లేచింది. నిండా రెండు అడుగులు వేసిందోలేదో వెలుగుతున్న టేబిలులైటు హఠాత్తుగా ఆరిపోయింది. ఆ ఈదురుగాలిలో ఎక్కడో తీగె తెగిపోయి వుంటుంది. ఇంక తెల్లవారితేనెగాని లైట్లు వచ్చే అవకాశంలేదు. మెల్లగా గోడ పట్టుకొని వెతుక్కుంటూ వెళ్ళి గూటిలోంచి అగ్గిపెట్టెతీసి కొవ్వొత్తి వెలిగించి బల్లమీద పెట్టింది.

లలిత తలుపు గడియ సరిచెయ్యబోతుంటే ఆ చప్పుడు మళ్ళీ వినిపించింది. అది గాలికి తలుపురెక్కలు కొట్టుకోడంకాదు. అటునుంచి ఎవరో తలుపు తట్టి పిలుస్తున్నారు. ఈ వేళప్పుడు ఈ చీకటిలో ఊరి చివరగాఉన్న తమఇంటికి ఎవరు వచ్చిఉంటారు? తలుపు తియ్యడమా? మానడమా? క్షణకాలం ఆలోచించింది.

ఒకవేళ అత్తయ్య కాని ఇంక అక్కడ ఉండలేక వచ్చేసేరేమో! ఈ వేళకి అటునుంచి వచ్చే రైలుకూడా ఉంది.

ఆవిడే అయితే పేరుపెట్టి పిలవరూ! గట్టిగా తలుపుతట్టరూ? ఆవిడ అయి ఉండరు. అత్తగారు కాకపోతే ఇంకెవరు? ఇంత రాత్రప్పుడు ఇల్లు వెతుక్కురావలసిన అవసరం ఎవరికుంది?

అవతలవ్యక్తి ఎవరైనది తెలియలేదు.

తలుపు తెరవడమా మానడమా అన్న విషయం తేలలేదు.

మళ్ళీ విన్పించింది ఆ చప్పుడు. ముందులాగే కాస్త గట్టిగా, ఈసారి తలుపు తట్టడంతోపాటు సన్నగా ఏదో కంఠంకూడా వినిపించింది. ఫలాని వారిది అని తెలియకపోయినా పరిచయమైన కంఠమే అది.

మెల్లిగా తలుపు తీసింది లలిత.

నల్లసిరా ఒలకపోసినట్లుంది పైట చీకటి. మబ్బుగా ఉండడంవల్ల నక్షత్రకాంతికూడాలేదు. తలుపుతట్టిన వ్యక్తికన్న ముందుగా ఈదురుగాలి లోపలికి ప్రవేశించింది. ఆ గాలి వెనువెంటనే నడచివచ్చిందో ఆకృతి, అడుగులో అడుగు వేసుకొంటూ. తలమీదుగా ముసుగుఉంది.

"ఎవరండీ ఎవరు కావాలి?" ధైర్యాన్ని కూడగట్టుకొంటూ ప్రశ్నించింది లలిత.

ముసుగులోవున్న వ్యక్తిని పోల్చుకోడానికి ప్రయత్నిస్తూ దగ్గరకి వచ్చింది.

ఆ వ్యక్తి జవాబు చెప్పలేదు....ఇంకా అడుగుముందుకు వెయ్యలేదు. అప్పటివరకు ఏడ్చి ఏడ్చి అలసినట్లు ఎక్కిళ్ళు వస్తున్నాయి.

"ఎవరంటే మాట్లాడరేం? కాస్త దగ్గరగా వస్తూ గట్టిగా అడిగింది లలిత.

"అత్తయ్యా" అంటూ లలిత కాళ్ళని చుట్టేసుకొంది అనసూయ.

లలిత నోటమాట రాలేదు.

రెండుచేతులా అనసూయని పొదివి పట్టుకొని లేవతీసింది.

ఇద్దరూ నోటమాటరాని ఆ స్థితిలో, మనసు మొద్దుబారిన పరిస్థితిలో అలా ఒకరి చేతుల్లో ఒకరు నిలిచిపోయేరు.

కొన్ని క్షణాలా....కొన్ని నిముషాలా .... కొన్నిగంటలా .... రోజులా....లేక సంవత్సరాలా....యుగాలా?....నడచిపోతున్న ఆ సమయపు లెక్కలు కాలపురుషుడు కట్టుకోవాలి.

గుండెల్లో మంట చల్లారి, అది కన్నీరుగామారి, ఆ తడితో చెంపలు చెమ్మగిల్లి, ఆ చల్లదనం మనసుకు, మెదడుకి సరఫరా కాగా తేరుకొంది లలిత. తేరుకొన్న మెదడు, తేలికపడ్డ మనసు ఆమెకి కర్తవ్యాన్ని గుర్తు చేసేయి.

ఎదురుగా ఉన్నది...."అత్తా నువ్వు, నేను జట్టు" అనే ఆనాటి చిన్నారి అనసూయ కాదు. పుట్టెడు వైధవ్యదుఃఖాన్ని నెత్తిన మోస్తున్న ఆడది.

తెల్లవారితే పదవరోజు, పసుపుకుంకాలు ఆ పిల్ల జీవితంలోంచి శాశ్వతంగా తరలిపోయే పాడురోజు. ఆత్మీయుల కళ్ళవెంట కన్నీటికి బదులు రక్తం కారేరోజు. అటువంటి సమయంలో ఇంటినుంచి అనసూయ కాలుకదిపి ఎలా వచ్చింది? ఎందుకు వచ్చింది?

"అనసూయా!"అంది లలిత. ధైర్యాన్నంతా కూడగట్టుకొని అసలు విషయం తెలుసుకొనే ఉద్దేశంతో.

అనసూయ మాట్లాడలేదు. అంతవరకు మౌనంగా కళ్ళంట నీళ్ళు మాత్రమే కారుస్తున్న పిల్ల, వెక్కి వెక్కి బైటకి ఏడవడం మొదలు పెట్టింది.

"ఏమిటమ్మా....ఏం జరిగింది?" లాలనగా ప్రశ్నించింది లలిత.

"నన్ను....వాళ్ళంతా బ్రతికుండగా పూడ్చిపెట్టాలనుకొంటున్నారు. అత్తా! నాకు—నాకు ఇంకా చచ్చిపోవాలనిలేదు" ఏడుస్తూనే బెక్కుతూనే ఆ రెండుమాటలు అతికష్టంతో చెప్పింది.

ఆ మాటలకి అర్థం లలితకి తెలుసు. రాజమ్మరాసిన ఉత్తరంలో ఉంది దానికి వ్యాఖ్యానం. సజీవంగా పాతిపెట్టడం కన్న తక్కువదేంకాదు. వారు తలపెట్టిన చర్య.

"ఎవరితోనైనా చెప్పి వచ్చేవా?"

కళ్ళు తుడుచుకొంది అనసూయ.

పరపరా పొంగుకొస్తున్న దుఃఖాన్ని పెదవులుమధ్య బిగపట్టి ఆపుకొంది.

"చెప్తే రానిస్తారా? కాళ్లూ, చేతులూ కట్టి గదిలో పడేస్తారు. వాళ్ళ ముచ్చటతీరా చిత్రవధచేసి మరీ విడిచిపెడ్తారు."

అనసూయ మాటల్లో ఆవేశం ప్రవేశించింది. క్షణకాలం క్రితం ఉబికివస్తున్న దుఃఖం స్థానంలో అక్కసు చోటు చేసుకొంది.

"నా కింకోత్రోవ కన్పించలేదు అత్తయ్యా! అక్కడ వాళ్ళతో వాదించి నెగ్గుకు రాగలననే ఆశలేదు. ఆ విధమైన జీవితం గడుపుతూ బ్రతకాలనే కోరికాలేదు.

"బావ పోయేక నాలుగైదు రోజులు నోట పచ్చి మంచినీళ్ళు పొయ్యకుండా, కంటిమీద కునుకు లేకుండా రాత్రీ పగలూ అన్న భేదం లేకుండా ఏడ్చేను బావకోసం. అప్పుడే తెలిసింది నాకు. ఇంక నేను ఏడవ వలసింది చచ్చిపోయిన బావకోసంకాదని, బ్రతికిఉన్న నా కోసమని.

"బావంటే నా కభిమానం ఉంది. చిన్నప్పటినుంచి కలసి మెలసి పెరిగాము. బొమ్మల ఆటలనాటినుంచీ మొగుడూ, పెళ్ళాలనుకొన్నాం. బావని పెళ్ళి చేసుకొని నేనూ అందరిలా కాపురం చేసుకొంటూ సుఖంగా ఉండాలనుకొన్నాను.

"కాని దేవుడు మమ్మల్ని దీవించలేదు. ఆయువుతీరి బావ వెళ్ళి పోయేడు. ఆ క్షణంలో అతడితోపాటు నేనూ చచ్చిపోగలిగితే నాకు చింత లేదు. కాని బ్రతికుండగా నన్ను జీవచ్ఛంలా ఉండమంటున్నారు. అమ్మా నాన్నా ఆదుకొంటారనుకొన్నాను. వాళ్ళు తమ స్వార్థానికి నన్ను బలిపెట్ట డానికి సిద్ధపడ్డారు. అవునూ కాదూ అనకుండా కర్రబొమ్మల్లా చూస్తూ ఊరుకొన్నారు.

"ఈ పరిస్థితిలో నేనేం చేసేది అత్తయ్యా....నువ్వే చెప్పు. మంచి మనసుతో నువ్వు ఆదరిస్తావని, అండగా నిలుస్తావని ఆశతో ఇక్కడికి వచ్చేను. అందరిలాగే నువ్వూ కాదంటే—అలాగే బ్రతకాలని విర్ణ

యిస్తే—" జరిగేదేమిటో తన నోటితో చెప్పలేకపోయింది అనసూయ. రెండు చేతులతో కళ్ళు మూసుకొని వెక్కి వెక్కి ఏడ్చింది.

అప్పుడు అనసూయ చచ్చిపోయిన బావకోసం ఏడవడంలేదు. బ్రతికున్న తనకోసం ఏడుస్తున్నది.

పిందెలోనే ముగిసిపోతున్న తన జీవితాన్ని తలుచుకొని ఏడుస్తున్నది. ఆ సమయంలో ఏవో బుద్ధులుచెప్పడంలో అర్థంలేదు. వెనక్కి తిప్పి పంపడం అంతకన్నా మంచిదికాదు. తెగించి ఇల్లువదలి వచ్చిన ఆ పిల్లకి ఏదో మార్గం చూపించాలి. మనిషిగా బ్రతకడానికి ఆధారం కల్పించాలి.

కాని అది తన ఒక్కతెవల్ల అయ్యే పనికాదు. అత్త, భర్త, సహకారం చూపాలి. ఇందు మూలంగా ఎదురయే సమస్యల్ని ఎదుర్కోడానికి కుటుంబంలో అంతా సిద్ధపడాలి.

ఒకవేళ వాళ్ళు కాదంటే, ఆ పిల్ల జీవితం తీర్చిదిద్దే శక్తి తనకి ఉందా? దానివల్ల సాఫీగా సాగుతున్న తన జీవితం గాడి తప్పినా లక్ష్యపెట్టకుండా ఈ బరువు మొయ్యడానికి తను సిద్ధంగా ఉందా?

అవును, కాదు అనకుండా లలిత ఆలోచిస్తున్నది.

లలిత మౌనం అనసూయ మనసుమీద బండరాళ్ళని పేరుస్తున్నాది. క్షణాలు గడుస్తుంటే ఇంక ఆ బరువు ఎంతమాత్రం మొయ్యలేని స్థితికి వచ్చింది ఆమె మనసు.

"అత్తయ్యా! చెప్పు అత్తయ్యా, వచ్చినదారినే వెళ్ళిపోమంటావా? ఆ నరకంలోనే బ్రతకమంటావా? ఆ మాట ఏదో త్వరగా చెప్పు. మీ కెవ్వరికి భారంకాకుండా వెళ్ళిపోతాను" హృదయవిదారకంగా అందిఅనసూయ.

అనసూయ రోదనతో లలితలోని తిరుగుబాటుతత్వం మేలుకొంది. ఇది అన్యాయం. ఇది అక్రమం. తరతరాలుగా ఆడదానిమీద జరుగుతున్న అత్యాచారం. ఎదిరించి నిలబడుతున్న అనసూయకి చెయ్యి అందియ్యాలి. అర్థంలేని ఈ ఆచారాల కుళ్ళులోంచి ఆ పిల్లని పైకి లాగాలి.

లలిత ఒక నిశ్చయానికి వచ్చింది. ఏది ఏమైనాసరే ఎవరేమన్నాసరే అనసూయని ఆదుకోడానికి నిర్ణయించుకొంది.

"ఏమైతేనేం అనసూయా, ఇక్కడే ఉందువుగాని, కష్టమో సుఖమో నీకోసం నాకోసం దేవుడు ఏవి దాచిపెట్టి ఉన్నాడో, జంటగా అనుభవిద్దాం" అంది లలిత నిశ్చలంగా.

అనసూయ తేలిగ్గా ఊపిరి పీల్చుకొంది.

పైటకొంగుతో కళ్లు తుడుచుకొంది.

"ఉండు ఆవిణ్ణి పిలుచుకొస్తా" నంటూ వీధిగుమ్మం వైపు వెళ్ళబోయింది.

"ఎవరు ?" అంది లలిత అర్థం కానట్లు చూస్తూ.

"మా ఊరి సెంటరులో ఉండే శాంతమ్మగారి గురించి చెప్పేదాన్నే .... ఆవిడ...."

"ఆవిడ నీతో కూడా వచ్చేరా ?"

అవునన్నట్లు తల ఊపింది అనసూయ.

"లోపలికి పిలుచుకు రాకుండా ఇంతసేపు ఆవిణ్ణి అక్కడ చలిలో నిలబెట్టేవా ?"

"ఆవిడ అక్కడ ఉంటానన్నారు. నీ అభిప్రాయం తెలుసుకొని, నువ్వు కాదంటే అక్కడెక్కడో నాలాంటి వాళ్ళు ఉండిందికి ఆశ్రమం ఉందిట, అక్కడికి తీసుకుపోతానన్నారు."

చీకట్లో నిలచివున్న ఆ స్త్రీకి చేయెత్తి నమస్కారం పెట్టింది లలిత.

"రండమ్మా ! లోపలికి రండి" అంది గుమ్మం ముందుకి వెళ్తూ.

వరండాలో గోడప్రక్కనే నిల్చి ఉంది ఆమె. లలిత ఆహ్వానం అందుకొని లోపలికి వచ్చింది. "నమస్కారం అండి" అంది రెండు చేతులూ జోడిస్తూ.

"క్షమించండి. మీరు బైట వున్నారని నాకు తెలియదు" అంది లలిత.

"అనసూయని నేనే చెప్పవద్దన్నాను. ఇటువంటి పరిస్థితుల్లో మూడో వ్యక్తి ప్రమేయం అంత మంచిదికాదు. ఎవరికి వారు ఆలోచించి తీసుకోవలసిన నిర్ణయాలు ఇటువంటివి.

"అనసూయ చెప్తుందేది మీ గురించి. ఇంతకిపూర్వం మిమ్మల్ని చూడకపోయినా మీ గురించి, అంతా నాకు తెలిసినట్లే అనిపించింది. అందుకే ధైర్యంగా ఆ పిల్లని ఇక్కడికి తీసుకువచ్చేసు. మీరు ఆశ్రయ మిస్తామన్నారు నా పని అయిపోయినట్లే .... ఇంక నేను వెళ్ళొస్తాను." అంది శాంతమ్మ.

"ఒక్కగడియ ఉండండి. పాలవాడు వచ్చే వేళయింది. కాస్త కాఫీ అయినా పుచ్చుకొని వెళ్లుదురుగాని."

"మీరు మరోలా అనుకోకండి. నేను వెంటనేవెళితే ఉదయం పాసెంజరు అందుకోడానికి సమయం ఉంది. దానిలో వెళ్తే మామూలుగా పదింటికి సెంటరులో వుండడం అవుతుంది. నేను అనసూయ ఇద్దరం ఒక్కసారే కన్పించకుండాపోతే అనుమానాలకి కారణం అవుతుంది. నేను మళ్ళీ వాళ్ళమధ్య వుండి పని చెయ్యవలసినదాన్ని." అంది ఆవిడ.

పరిస్థితి అర్ధం చేసుకొన్న లలిత మరి ఆవిణ్ణి బలవంత పెట్టలేదు.

"అక్కడి పరిస్థితి ఎలా ఉందో, అంతా ఏమనుకొంటున్నారో ఉత్తరం రాయండి. వీలైతే అనసూయ ఇక్కడ ఉన్నట్లు మా అత్తగారితో చెప్పండి" అంది లలిత ఆవిడకి వీడ్కోలు పలుకుతూ.

అనసూయకి ధైర్యం చెప్పి, లలిత దగ్గర సెలవు తీసుకొని, వీధిలో నిలిపిఉంచిన రిక్షాలో ఆమె వెళ్ళిపోయింది.

అనసూయకి అంత ధైర్యం ఎలా వచ్చిందో, ఆ కిరాతక చర్యనుంచి తప్పించుకోవాలనే ఆలోచన ఎలా వచ్చిందో అర్ధమయింది లలితకి. తనకి ఏమీకాని అనసూయకోసం శాంతమ్మగారు తీసుకొన్న శ్రమ, వహించిన బాధ్యత చూశాక తను చేయ సమకట్టిన సహాయం ఏపాటిది అనిపించింది లలితకి.

అనసూయ గుమ్మంలో నిలచి, ఆవిడ వెళ్ళినవైపే చూస్తున్నాది గౌరవం నిండిన కళ్ళతో. సమయానికి ఆవిడే ఆదుకోకపోతే ఈపరికి తన

గతి ఏమై ఉండేది ? ఆ ఆలోచన మనసులోకి వచ్చినందుకే కాళ్లు గడగడ లాడేయి. కళ్ళు చీకట్లు కమ్మేయి. పక్కగా ఉన్న రాట ఆసరాకోసం అందుకోబోయింది.

తూలిపడబోతున్న అనసూయకి లలిత చెయ్యి అందించింది.

"లోపలికి రా.... తలుపేస్తాను. నువ్వు ఇంట్లో కన్పించలేదనగానే వెతకడానికి ముందుగా ఇక్కడికే వస్తారు" అంది లలిత కంగారుగా.

చిన్నగా నవ్వింది అనసూయ.

అంతసేపు ఏడ్చి ఎర్రబడిన కళ్ళలో ఆ నవ్వు వింతగా మెరిసింది. పాకుడు పట్టిన బండలమధ్యగా ఏ రెమ్మనో ఆసరా చేసుకొని అప్పుడే పూచిన గడ్డిపువ్వులా ఉంది.

ఏటి ఒడ్డు చెలమలోని బురదనీటిలో తుప్పు తుప్పు తుళ్ళుతున్న చిరుచేపలా ఉంది.

"ఈ చీర ఆవిడది. నేను కట్టిన చీర పాటిచెరువు నీళ్ళలో తేలుతూ వుంటుంది."

"అదేమిటి ?" అర్థంకాక తెల్లబోయింది లలిత.

"అది అంతే .... మాకు కాస్త సమయం దొరకడానికి, ఆ చెరువులో నేలబావులు ఉన్నాయంటారు. వాటిలో చిక్కుకుపోతే శవాన్ని బైటకి తియ్యడానికి గజ ఈతగాళ్ళకికూడా ఒక పూటకి పైగా పడ్తుంది."

లలిత అనసూయవంక ఆశ్చర్యంగా చూసింది.

"ఈ ఆలోచన నీకే వచ్చిందా ?"

"అవును" అన్నట్లు తల ఆడించింది అనసూయ.

ఫరవాలేదు, అనసూయ బుర్రలో ఈ కాలంలో బ్రతకడానికి కావలసిన తెలివితేటలు వున్నాయి. కాస్త చెయ్యి ఆసరా ఇచ్చి, వాటిని సరియైన దారిలో పెట్టడం వరకే తనపని — అనుకొంది లలిత.

* * *

ఆరోజు శాంతమ్మగారిదగ్గరనుంచి ఉత్తరం వచ్చింది.

ఆత్రంగా కవరు చించి ఉత్తరం పైకి తీసింది లలిత.

గౌరవనీయులైన లలిత గారికి,

నమస్కారములు.

సకాలంలో నేను ఇక్కడికి చేరుకోగలిగాను. అప్పటికే ఊరంతా గుప్పుమంది, అనసూయ ఇంట్లో కన్పించలేదన్న వార్తతో. నూతులు, గోతులు, చెరువులు గాలించడం తెల్లవారుజామునుంచి మొదలు పెట్టేరట. వెలుగు వచ్చి, అనసూయ ముందురోజు కట్టిన చీర పాటిచెరువు నీటిమీద తేలేసరికి అత్తింటా, పుట్టింటా అంతా గొల్లుమన్నారట.

పదకొండు గంటలదాకా పాటిచెరువులో గజ ఈతగాళ్ళు శవం కోసం గాలిస్తూనే ఉన్నారు. అనసూయకి బావపట్ల గల ప్రేమ, ఆ పిల్లని ఆత్మహత్యకి పురికొల్పిందని ఊళ్లో అంతా అనుకొంటూనేఉన్నారు. అప రాహ్ణం తిరిగేసరికి వెతికి వేసారి అలసటతో బయటపడ్డారు జాలర్లు — చెరువులో ఏ మూలా శవం కన్పించలేదంటూ.

అది మొదలు గాలి ఇంకో దిశగా తిరిగింది.

"అందులో పడి చస్తేకద శవం దొరకడానికి ? ఎక్కడికో పాతి పోయి వుంటుంది. ఎవడితోనో లేచిపోయి వుంటుంది. వయసు వచ్చి నప్పటినుంచీ చూడ్డంలేదూ దాని వగలు, వాటం" అంటూ మొదలుపెట్టేరు కొందరు.

"అది అలాటి పిల్ల కాదర్రా, ఈ చిన్న వయస్సులో ముండమోసి బ్రతకలేక ఆ చెరువులోపడి నిజంగానే చచ్చిపోయి ఉంటుంది. పాటి చెరు వులో నేల నూతులు, పాకుడు బండలు ఉన్నాయంటారు. మూడేండ్ల క్రిందట ఆ చెరువులో పడ్డ కరణంగారి కోడలి శవం ఈనాటికీ తేలలేదు. ఇది అలాగే ఏ బండల మధ్యనో ఇరుక్కుపోయి ఉంటుంది." అంటూ ఆ వాదానికి ప్రతివాదం చెయ్యడం మొదలుపెట్టారు కొందరు.

పరోపకార బుద్ధికల కొందరు పెద్దలు శరీరశ్రమకి, డబ్బు ఖర్చుకి కూడా వెనుదీయకుండా అప్పటికప్పుడే, అనసూయ ఒకవేళ పారిపోవడమే జరుగుతే ఎక్కడికి వెళ్ళడానికి అవకాశం ఉంటుందో ఆ స్థలాలన్నీ వెతకడానికి బయలుదేరేరు.

మీ ఇంటికి కూడా వచ్చి చూసేరని వేరుగా చెప్పనక్కరలేదు కదా.

ఇంటికి తాళం వేసి ఉండడంవల్ల ఇరుగు పొరుగు ఇళ్ళలో అడిగేరుట.

"ఆ పిల్ల ఉదయాన్నే ఆఫీసుకి వెళ్ళిపోయింది. ఆ అమ్మాయి భర్త, అత్తగారు ఏదో ఊరికి వెళ్ళేరు. వారం పది రోజులు కావస్తున్నది." అన్నారుట.

ఇంక చేసేది లేక ఉసూరుమంటూ తిరిగివచ్చేరు ప్రబుద్ధులు.

ఒకరికి మంచి చెయ్యడానికి ఎడం కాలిగోరు కదపమంటే మావల్ల కాదంటారు. చెడు చెయ్యడానికి ఎక్కడలేని ఉత్సాహం, శక్తి, పుట్టుకొస్తాయి. ఏమిటో ఈ మనుషుల తత్వం !

ఏమైనా అనసూయ ఆత్మహత్య చేసుకొనిఉంటుంది అన్న వార్తకన్నా ఎక్కడికో పారిపోయి వుంటుంది అన్నదానికే బలం జాస్తిగాఉంది. కాని, ఎలా వెళ్ళింది .... ఎక్కడికి వెళ్ళింది ....అన్న విషయం మాత్రం ఇప్పటివరకు ఎవరూ పసికట్టినట్లు కన్పించలేదు.

అల్లుడు పోయిన పరామర్శతోపాటు కూతురి గురించిన సూటీపోటీ మాటలతో మీ వదినగారి మనసుకి తూట్లు పొడుస్తున్నారు అడంగులు. జోరీగల రొదలా వారి మాటలు వింటూ భరించలేక "అది బ్రతికి ఉన్నా, చచ్చినా నాకు వకటే. మంచీ మర్యాదా లేకుండా మొగుడు చచ్చిన పదోనాడు ఇల్లువదలిన ఆడది బ్రతికి మాత్రం ఎవర్ని ఉద్ధరించాలి" అంటూ ఆ బాధని వదలగొట్టుకోడానికి అన్నారు ఆవిడ.

కన్నకూతురి గురించి అటువంటి మాటలు అలా అనవలసి రావడంలో ఉన్నకష్టం, అనడానికి ఆవిడపడ్డ బాధ, ఆ సమయంలో ఆవిడ

ముఖం పరీక్షగాచూస్తే ఎవరికైనా అర్థమవుతుంది. పై వారి వ్యాఖ్యానాల నుంచి తప్పుకోడానికే ఆవిడ అలా అని ఉంటారని నా అభిప్రాయం.

అందరితోపాటు నేనూ ఒకసారి వెళ్ళి ఆవిణ్ణి పలకరించి, ఓదార్చి వచ్చేను. మీ అత్తగారు ఓన్పిస్తే మీరు చెప్పమన్నమాట చెప్పాలనే అభిప్రాయం ఒకటి. కాని ఆవిడ సావిత్రమ్మగార్ని వదలి బైటికిరాలేదు. ఆ చుట్టూ చాలమంది అమ్మలక్కలు కూర్చున్నారు.

సరే, ఇంకో సమయం చూసి చెప్పవచ్చని బైటికి వస్తుంటే అరుణాచలంగారు కన్పించేరు. ఒక్కక్షణం నా వంక తేరిపారచూసి, ఆత్రంగా ఇటు అటు పరికిస్తూ "క్షేమంగా చేరుకొంది కదా" అన్నారు.

క్షణకాలం నేను కొయ్యబారిపోయేను. ఏం చెప్పాలో....ఏం చెప్పకూడదో అర్థంకాలేదు నాకు.

ఆయన నా పరిస్థితిని అర్థం చేసుకొన్నారు.

"మీ మేలు ఈ జన్మలో మరువలేను" అంటూ చేతులు జోడించి, వెంటనే అక్కడినుంచి గబగబా ఎవరో తరుముకొస్తున్నట్లు వెళ్ళిపోయేరు.

ఆయన ఆ మాట అన్నతీరు చూస్తుంటే మొదటినుంచీ అంతా అతనికి తెలుసు అనిపించింది. సంఘ నియమాలకి, చుట్టుపక్కలవుండే మనుషుల విమర్శలకి వెరచి తమంత తాముగా ఏమీ చెయ్యలేకపోయినా, తమ పిల్ల ఈ విధంగా ఆ నరకంలోంచి బైటపడ్డందుకు ఆ దంపతులు ఆనందిస్తున్నారనే నా అభిప్రాయం.

ఇంకోసారి వీలు కల్పించుకొని అనసూయ విషయం మీ అత్తగారితో చెప్తాను. నా సహాయం ఏ సమయంలో ఏ విధంగా అవసరమైనా తెలియజెయ్యండి నా శక్తిలో ఉన్నంతవరకు తోడుపడ్తాను. అనసూయ నా బిడ్డలాంటిది. ఆ పిల్లకి మేలుజరిగితే సంతోషించవలసిన వారిలో నేను ఒకత్తెను...."

ఆ ఉత్తరం చూసేక లలిత మనసు తేలికపడింది. ఈవిషయంలో అరుణాచలంగారి సహకారంకూడా ఉంటుంది. మంచిఅయినా చెడుఅయినా

ఈ బరువు, బాధ్యత అంతా తనుఒక్కతే భరించనక్కరలేదు. అని ధైర్యం కలిగింది.

పక్షంరోజుల తరువాత ఆ రాత్రి కళ్ళనిండుగా నిద్రపోయింది లలిత.

నక్కల కూతలు, కీచురాళ్ళ రొద వినపడనంతగాఢంగా నిద్ర పోయింది.

తెల్లవారి పాలవాడు తలుపు ఎంతకీ తియ్యలేదని విసుక్కొని వెళ్ళి పోయేదాకా నిద్రపోయింది.

*　　　*　　　*

లలిత తలపెట్టిన పనికి రాజమ్మ, ప్రకాశం ఆమోదించేరు.

"పట్నంలో ఉండి నాలుగుముక్కలు కష్టపడి నేర్చుకొంటె ఏదో విధంగా పొనిపొట్ట అది పోషించుకొంటుంది. ఆ కుగ్రామంలో ఆ కుళ్ళు మనుషులమధ్య అలా ఉండిపోతే దానిబ్రతుకు కుక్కబ్రతుకే అయేది" అంది రాజమ్మ.

"ఆ ముసలి నక్కలకి బుద్ధివచ్చేలా చాలామంచి పనే చేసేవు అనసూయా" అంటూ మేనగోడల్ని మెచ్చుకొన్నాడు ప్రకాశం.

ఆ ఇంటఉన్న ముగ్గురిలో అనసూయని ఆదుకోడం విషయంలో రెండు అభిప్రాయాలంటూలేవు. ఉన్న చిక్కంతా ఆర్థికంగా ఏర్పడే ఒడి దుడుకుల గురించే.

పొలాల్లో పంటలు, దొడ్లోపాడి, పెరట్లో కూరగాయలు సమృద్ధిగా ఉండేరోజుల్లో ఒక కుటుంబంలో ఒకమనిషి కొత్తగా చేరితే కన్పించే మార్పేమీ ఉండేదికాదు. కాని, ప్రతివస్తువకీ రూపాయి, పైసల్లో విలువ చూసుకోవలసి వస్తున్న రోజుల్లో, బజారులో నిత్యావసర వస్తువులన్నీ వెలుగులోంచి సన్న సన్నగా చీకటిలోకిజారుకొని ధరలు పెంచుకొంటున్న తరుణంలో, ఇంట్లో ఒకమనిషికి ఇంకోమనిషి పెరగడం అంటే బరువే అవి చెప్పవలసివస్తుంది.

అందునా ఆ మనిషి ఏ ఒకటి, రెండురోజులకో చుట్టపు చూపుగా వచ్చి, ఇంత తినిపోవడంకాక, ఆ వ్యక్తితాలూకు అన్ని అవసరాలు తామే చూడాలన్నప్పుడు, మంచిఅయినా, చెడుఅయినా ఆ వ్యక్తి మనుగడకి బాధ్యత తామే వహించవలసి ఉండవన్నప్పుడు ఆ భారం మరికాస్త పెరుగుతుందేకాని తగ్గుముఖం చూపదు.

మిగిలిన విషయాలు ఎలాఉన్నా వెంటనే ఎదురునిలిచింది ఇంటి సమస్య. ఆ ఇంటికి ఉన్నది ఒక్కటేగది. మిగిలినవన్నీ గదులపేరుతో వాడబడే వసారాలు.

రాజమ్మ అయితే వేసవికాలంలో ముందువాకిట్లోను, చలికాలంలో తడికలుకట్టిన చక్కావసారాలోనూ పడుకొనేది. ఆవిడ పెద్దది; ఎక్కడ ఎలా పడుకొన్నా సరిపోయేది. ఇంటికి ప్రహరీగోడ అంటూలేదు. రోడ్డున నడిచే మనుషులు కావాలనుకొంటే, కోరడిలా పాతిన బోగన్‌విల్లా మొక్కల మధ్యనుంచి, ఇంటి ఆవరణలోకి స్వేచ్ఛగా చూడగలుగుతారు. వయసులో ఉన్నపిల్ల అనసూయని ఆరుబయట అక్కడ ఎలా పడుకోబెట్టడం?

మొదట్లో ముగ్గురి పక్కలు గదిలోనే ఏర్పాటుచేసింది లలిత.

అయిందికి కొద్దికాలమే అయినా భర్తతో కాపురంచేసిన అనసూయకి అత్తా మామలమధ్య అలా పడుకోడం కష్టంగాఉండేది. లలిత ప్రకాశాల సంగతి సరేసరి.

ఈ పద్ధతి బాగాలేదు—అనుకొంది రాజమ్మ.

ఈ సమస్యకి ఏదో ఒకమార్గం చూడాలి—అనుకొంది లలిత.

ఒక ఆదివారంనాడు ఇన్నిరాటలు వెదుళ్లు, తాడు, తడిక కొన్ని, కూలీలని వెంటపెట్టుకొచ్చేడు ప్రకాశం.

పెరటివైపు పెణక మరికాస్త పొడిగించి, రెండురాటలు పాతి, వెదురుతడికెలు కట్టి, తాటి కమ్మలతో అలంకరించేసరికి సాయంకాలానికలా మరొక గదిలాంటిది తయారయింది.

అనసూయకి సాయంగా రాజమ్మ తన పక్క అక్కడికి మార్చుకొంది.

"ఎంత సొమ్మయింది?" ప్రశ్నించింది లలిత.

"ఎంతయినా నువ్వేం తీర్చనక్కరలేదు" అన్నాడు ప్రకాశం.

"అక్కడికి మీది, నాది ఆర్జన వేర్వేరైనట్లు" లలిత రెట్టించింది.

అంతమైన ఆ రాత్రి భార్యతో వాదులాడుతూ కూర్చోడానికి ప్రకాశం అప్పుచేసి అగడి కట్టించలేడు. ఆ విషయం తెలిసిఉన్న లలిత ఇంకా ఆ వాదన పెంచనూలేదు.

# 6

దొరికితే అప్పు చెయ్యడం అంత సులువైన పని ఇంకొకటిలేదు. కాని, దాన్ని తీర్చవలసి వచ్చేసరికి వస్తుంది అసలు చిక్కు.

స్కూటరుకి కట్టవలసిన సొమ్ము ఇంకా పూర్తిగా తీరనేలేదు. ఇంతలో ఇంటి మరామత్తుకోసం మళ్ళీ అప్పు. ఆ ఏడు కమ్మతిరగేస్తేనే కాని, ఆ వర్షాకాలం గడవదని మట్టిగోడలు పూర్తిగా విరిగిపడే ప్రమాదం ఉందనీ, చూసినవాళ్ళంతా హెచ్చరించేక ఇంక ఆలసిస్తే లాభంలేదని అప్పులో కాలుపెట్టేడు ప్రకాశం, అది తీరాలంటే ఆ దంపతులకి వస్తున్న నెలసరి ఆదాయం చాలదు. అసలు అనసూయ వచ్చేక నెల గడవడమే కటకటగా ఉంది.

అంతకుపూర్వం ఒకసారి కాకుంటే ఇంకోసారైనా దంపతులిద్దరూ కలసి సినిమాకివెళ్ళడమో పువ్వులో పళ్లో కొనుక్కురావడమో జరుగుతూండేది. అనుకోకుండా తరుముకొచ్చే ఖర్చులకంటూ అయిదూ, పదీ ఓ డబ్బాలో వేస్తుండేది లలిత. ఇంటిలో ఇంకోమనిషి పెరిగేసరికి

ఆ అలవాట్లన్నీ వాటంతటవే పక్కకి తప్పుకొన్నాయి. నెలాఖర్ని నిత్యావసరాలకి తడుముకోవలసిన పరిస్థితి ఏర్పడింది.

ఎడపడిపోతున్న ఈ రెండు కొసల్నీ దగ్గరికి లాగి ముడి వేసేందుకు లలిత ఆఫీసులో పని పూర్తిఅయాక ఒకటి, రెండుబట్టలకొట్లలో వాళ్ళ ఉత్తరాలు వ్రాసిపెట్టే పనికి ఒప్పుకొంది.

ఆపని, ఈపని చేసుకొని ఇంటికి తిరిగి వచ్చేసరికి బాగా అలసిపోయేది లలిత. లేచి ముఖంకడుక్కొని బట్టలు మార్చుకొనేపాటి ఓపిక కూడా మిగిలి ఉండేదికాదు.

అనసూయ వచ్చేక లలితకి రాత్రిపూట వంటపని తప్పిపోయింది. ఒకరోజు ఆమె ఆఫీసునుంచి తిరిగి వచ్చేసరికి అనసూయ వంటప్రయత్నంలో ఉంది. "ఉండనీ అనసూయా.... నే చూసుకొంటాలే....నా కది అలవాటు" అంది లలిత.

"ఇంట్లో చేతులు ముడుచుకొని రోజంతా కూర్చుంటున్న నన్ను మరేం చెయ్యమంటావు?" అంది అనసూయ.

అనసూయ అన్నమాటతో లలితకి వేడిపుట్టింది. అనసూయని తన ఇంట వంటపూటిగా ఉంచుకోడానికి తెచ్చుకోలేదు కదా; ఆ పిల్ల ఏ నాటికైనా తన కాళ్ళమీద తను నిలవగలిగేస్థితికి రావాలంటే ఏదో రకమైన వృత్తిలోపెట్టాలి. గౌరవప్రదమైన ఏ వృత్తి చేపట్టాలన్నా దానికి అంతో ఇంతో చదువు వచ్చివుండాలి.

అంతకుపూర్వం అనసూయ వచ్చినప్పుడు నేను పెంటయ్యవాళ్ళదగ్గర చదువుకొంటున్నాను. వాళ్ళు లెక్కలు, తెలుగు, ఇంగ్లీషు అన్నీ చెప్తున్నారని అనేది. వాళ్ళేం నేర్పేరో, ఇదేం నేర్చిందో—తెలుసుకోవాలనుకొని ఒకరోజు తీరుబడి చేసుకొనికూర్చుంది లలిత.

పరీక్షలంటూ పాసు కాకపోయినా మామూలుగా స్కూళ్ళల్లో ఆరోక్లాసు పిల్లలకి చెప్పేపాటి చదువు నేర్చుకొంది అనసూయ. ఫరవాలేదు. తను, ప్రకాశం కాస్త కష్టపడితే రెండు మూడేళ్ళలో మెట్రిక్యు

లేషన్ పరీక్షకి కూర్చోపెట్టవచ్చు—అనుకొందిలలిత. మరునాడే ఆ ఆలో చనకి ప్రారంభోత్సవం చేస్తూ, కావలసిన పుస్తకాలు, పలక, బలపం, నోట్సుపుస్తకాలు, పెన్ను వగైరాలన్నీ కొని తెచ్చింది.

ఉదయం ఆఫీసుకి వెళ్లేముందు ఒకఅరగంట తీరుబడి చేసుకొని పాఠంచెప్పేది లలిత. సాయంకాలం కాలేజీనుంచి వచ్చేక మరోగంట అన సూయ చదువువిషయం చూసేవాడు ప్రకాశం.

అనసూయకి తెలివితేటలున్నాయి. చదువుకోవాలనే ఉత్సాహం, శ్రద్ధ ఉన్నాయి. ఏరోజుఇచ్చిన పాఠం క్రమం తప్పకుండా ఆరోజు అప్ప గిస్తూఉండేది. చదువులో ఆపిల్ల చూపుతున్న ఉత్సాహంతో లలిత తన మనసులో గీసిన అనసూయ జీవితచిత్రాన్ని, చిన్న తెల్లకాగితంమీంచి పెద్ద కేన్వాసుమీదికి మార్చింది. అనసూయగురించి తము కష్టపడ్డా ఫలం దక్కుతుంది అన్ననమ్మకం ఏర్పడింది ఆమె మనసులో.

ఒకరోజు సాయంకాలం ఆఫీసులో పనికాస్త త్వరగా పూర్తి చేసు కొని రోజుకన్నా ముందుగా ఇల్లుచేరిన లలిత, తమఇంటి వసారాలో చాప మీద నలుగురైదుగురుపిల్లలుకూర్చుని ఏదో రాసుకొంటుండడం చూసింది. ప్రకాశం, అనసూయ నోటుపుస్తకంలో చేసిన లెక్కలు దిద్దుతున్నాడు.

వాళ్ళని తప్పించుకొని లోపలికి వెళుతూ "ఇదంతా ఏమిటి?" అంది మెల్లగా ప్రకాశానికి మాత్రమే విన్పించేలా.

"అబ్బే....మరేంలేదు. ఎలాగా సాయంకాలం రోజూ అనసూయకి ఓగంట పాఠం చెప్తున్నానుకదా? రాజారాంగారు, నరసయ్యగారు వాళ్ళ పిల్లలగురించి కాస్త చూడమంటే...."

ఆ చూడ్డానికి అర్థం ఏమిటో ఆ నెలాఖరున తెలుసుకొంది లలిత. షష్ఠతారీకునాడు సాయంకాలం ప్రకాశం కాలేజీనుంచి వస్తూ మూడుచీరలు కొని తెచ్చేడు.

లలిత నీళ్ళునిండిన కళ్ళతో భర్తవంకచూసింది. వెలిసిపోతూ అక్కడక్కడ చిన్నగా చిరుగుపట్టిన తన చీరవంక చూసుకొంది.

అసలే ఆమెకున్న చీరలు అంతంతమాత్రం. వాటిలో కొన్ని కట్టుబట్టతో వచ్చిన అనసూయకి పంచు పెట్టవలసివచ్చింది. కట్టినవాటినే మళ్లా తిప్పి తిప్పి కట్టడంతో ఏడాదికే పాతబడిపోయేయి మిగిలిన చీరలు.

ఆఫీసులో తనని, తనబట్టల్నిచూసి మిగిలిన ఆడపిల్లలు ముఖాలు చిట్లించడం, మూతులు విరచడం లలిత గ్రహించకపోలేదు.

"అబ్బో నేను ఈ ఆఫీసులో చేరిన మొదట్లో ఈవిడగారు ఎలా వుండేదని....కట్టినచీర కట్టకుండా మొగుడిని వెనకేసుకొని స్కూటరుమీద ఊరంతా తిరుగుతూండేది. మరిప్పుడేమయిందో కాని...." అంటూ కబుర్లు చెప్పుకొనేవారు.

తన కేమయిందో వాళ్ళతో చెప్పవలసిన అవసరం లలితకి కన్పించ లేదు. వాళ్ళు ఆర్చేవాళ్ళు, తీర్చేవాళ్ళు అయితే చెప్పినా బాగుంది. అటు వంటిపరిస్థితి లేనప్పుడు ఇంటివిషయాలు ఆఫీసులో వెళ్ళబోసుకోడంలో అర్థంలేదు. తన్నుతాను చులకన చేసుకోడంతప్ప; అందువల్ల ఉపయోగం కూడా లేదు.

"అదంటే బయటికి నలుగురిలోకి వెళ్ళొచ్చేపిల్ల. దానికి కొన్నా బాగుంది. నా కెందుకురా ఇప్పుడు .... ఉన్నవాటితో కాలక్షేపం కాక పోయిందా?" అంది రాజమ్మ.

"నీది ఇంకో పాతచీర నాకిచ్చి ఇదికూడా నువ్వు ఉంచుకో అత్తా" అంది అనసూయ.

"అలాగేం కుదరదు. ఎవరికి తెచ్చినబట్టలు వారు తీసుకోవల సిందే" అన్నాడు ప్రకాశం.

"మరి మీకో" అంది లలిత.

"ఎవరికి వాళ్ళు కొనుక్కొంటారేమిటి, ఎదుటివారు కొనిపెట్టాలి కాని" అన్నాడు ప్రకాశం నవ్వుతూ.

ఆ మాటతో లలితముఖం చిన్నబోయింది.

ఆ నెలలో ప్రకాశంపుట్టినరోజు వచ్చివెళ్ళింది. అతడికి ఆ నాటికి ఏదైనా కొనితేవాలని ఎంతప్రయత్నించినా సొమ్ము జతపడలేదు.

"ఈరోజు మీ పుట్టినరోజు. మీకేం ఇయ్యలేకపోతున్నాను. శుభాకాంక్షలు తప్ప" అంది దిగులుగా.

"అవిఇస్తే అన్నీ ఇచ్చినట్లే లలితా! అయినా ఇంకా మనకి పుట్టినరోజులేమిటి? అమ్మాయో, అబ్బాయో పుడితే వాళ్ళకి చెయ్యాలి కాని" అన్నాడు ప్రకాశం.

లలిత ముఖం సిగ్గుతో ఎర్రబడింది.

మనసులో తీయతీయని కోర్కె ఏదో మసలసాగింది.

అంతలో గుర్తుకొచ్చింది కప్పస్తంభంమీద ఆనాడు చూచిన కాగితం. "అగ్‌లా బచ్చా అభీనహీ! తీన్ కే బాద్ కభీనహీ" అక్షరాలు కళ్ళముందు కదులాడేయి.

"ఇప్పుడే కాదు....ఇప్పుడప్పుడేకాదు" అనుకొంది లలిత.

మరెప్పుడు? ఇంకా ఎప్పుడు? మనసు నిలతీసింది. చేసిన అప్పులు తీరిపోవాలి, అనసూయచదువు పూర్తి కావాలి, అప్పుడు.... అప్పుడు.

* * *

అదనంగా వచ్చిన ఖర్చులకి భార్యాభర్తల జీతాలు కాక అదనంగా అంతో, ఇంతో సొమ్ము చేతిలో పడ్తుండడవల్ల బండి మళ్ళా దారిలోపడి సాఫీగా నడవసాగింది. చాలాకాలం తరువాత ఆరోజున జమాఖర్చులు లెక్క చూసుకొంటుంటే లలితకి మామయ్యసంగతి గుర్తుకు వచ్చింది.

అక్కగారు అతడి భోజనం బట్టలు వగైరా ఖర్చులన్నీ చూస్తున్నా నల్లమందు ఖర్చు భరించడం మాత్రం నావల్ల కాదంటూ మొండికేసిందిట, అక్కడికి వెళ్ళేక ఆ విషయం లలితకు రాస్తూ "ఇంతకాలంగా అయిన అలవాటు ఒక్కసారిగా ఎలా మానుకోగలను. నువ్వయినా వీలున్నప్పుడు ఓ పదీ, పాతిక పంపుతుండు తల్లీ, దానితోనే ఏదోలా సరిపెట్టుకుంటాను" అంటూ బ్రతిమాలుకున్నాడు.

అతడి వుత్తరం చూస్తే లలితకి జాలివేసింది. "పాపం ముసలివాడు బ్రతికినన్నాళ్ళు బ్రతికిపోడు ... ఎందుకు అతన్ని బాధ పెట్టడం, అయినా అతడు అన్నట్లు ఈనాటి అలవాటా అది. ఒక్కసారిగా మానుకోమంటే ఎలా మానుకొంటాడు" అనుకొంది.

అతడు కోరినట్లు ప్రతినెలా తనకి అవకాశం ఉన్నంతవుట్టుకి సొమ్ము పంపడం మొదలుపెట్టింది. ఒక్కో నెలలో నాలుగైదు రోజులు ఏ కారణంగా అయినా సొమ్ము పంపడం ఆలస్యమైతే అటునుంచి విధిగా ఉత్తరం వచ్చేది.

"మీ మామయ్యా దగ్గరినుంచి ఉత్తరం రావాలనుకొంటే మరి నాలుగు రోజులు ఆగి సొమ్ము పంపు" అనేవాడు ప్రకాశం.

"పోనిద్దురూ —పెద్దవాడు —అతడితో నాకు పట్టింపులేమిటి ?" అంటూ తను మాత్రం అప్పుడప్పుడు వుత్తరాలు రాస్తుండేది లలిత.

అనసూయ వచ్చేక మొదటి ఒకటి, రెండు నెలలు ఎలాగో ఉన్న దానిలో ఉన్నంత అన్నట్టు కొద్దిగానైనా సాంబమూర్తికి సొమ్ము పంపుతూ వచ్చింది లలిత. మూడోనెలలో ఆపాటి అవకాశం కూడా లేకుండా పోయింది.

ఒకటి తరువాత ఇంకొకటిగా రెండు, మూడు వుత్తరాలు వచ్చేయి సాంబమూర్తి దగ్గరనుంచి. సొమ్ము పంపడంలేదు అన్న విషయం రాయడం ఇష్టంలేక అసలు వుత్తరాలకి జవాబులే రాయడం మానేసింది లలిత.

తన సాధకబాధకాలన్నీ తమ్ముడు రామకోటికి రాస్తూ "కొంతకాలం దాకా ఏదో ఒక ఖర్చు తగ్గించుకొని నువ్వయినా కొంచెం పంపుతుండరా" అంది. దానికి జవాబుగా అక్కగారికి చీవాట్లు పెడుతూ వుత్తరం రాసేడు రామకోటి. "ముసలాడిని అలా తయారుచేసింది నువ్వే' అన్నాడు. తిండి బట్టా పెట్టి పోషిస్తున్న ఆవిడ ఆపాటి సొమ్ము అతడికి ఇవ్వలేకనే మానేసిందా ! అతడిచేత ఆ పాడు అలవాటు మాన్పించాలని ఆవిడ ప్రయత్ని

స్తుంటే నువ్వు సొమ్ముపంపి ఆ పని కాకుండా చేస్తున్నావు" అంటూ కోపం వెలిబుచ్చేడు.

ఇంక చేసేదేం లేదు అన్నట్లు ఊరుకొంది లలిత. ఆ వెనుక సాంబ మూర్తి దగ్గరనుంచి మరి వుత్తరాలు లేవు. ఆ విషయం తలపుకి వచ్చి నప్పుడల్లా లలితకి బాధగానే ఉండేది.

తనగురించి ఏమనుకున్నాడో మామయ్య ? కావాలనే తను సొమ్ము పంపడం మానేసిందని అనుకొని వుంటాడు. పోనీ, "ఉన్నవిషయం ఇదీ మామయ్యా ! అవకాశం ఉన్నప్పుడు మళ్ళా పంపుతాను" అని రాస్తే .... కాని దానివల్ల అతనికి ఒరిగిందేమిటి ? ఆవుత్తరం చూపిస్తే కొట్టువాడు నల్ల మందు యియ్యడుకదా ?

తిండిలేక అమ్మమ్మ చస్తుంటే చేతిలో వున్న సొమ్ముని పేకాట లకి, నల్లమందుకి మామయ్య తగలెయ్యడం లలితకి కొద్దిగా గుర్తుంది. 'అప్పుడు అమ్మమ్మ తిండికి వాచిపోయింది. ఇప్పుడు మామయ్య నల్ల మందుకి ముఖం వాస్తున్నాడు. తల్లిని పెట్టిన వుసురు తప్పదంటారు. ఇందుకే కామోసు' అనుకొంది లలిత.

ఆ నెలలో స్కూటరుకు కట్టవలసిన సొమ్ము తేలిపోయింది. చాలా కాలం తరువాత నెలాఖరుకి చేతిలో కాస్త సొమ్ము మిగిలింది. అనసూయ వారింట కాలుపెట్టిన మూడేళ్ళ తరువాత సాంబమూర్తికి మళ్ళా సొమ్ము పంపాలన్న అభిప్రాయంతో పోస్టాఫీసుకి వెళ్ళింది లలిత. మనిఆర్డరు ఫారం అందుకొని నింపుతుంటే పంకజం కనిపించింది.

"ఎంతకాలమయిందో నిన్నుచూసి, ఒకే ఊళ్లో ఉన్నామన్న మాటే కాని, మీరు అక్కడికి వెళ్ళిపోయాక పొరుగూరిలో ఉన్నట్లే ఉంది" అంటూ పలకరించింది.

"నాకైతే వంటా, పనీ, పిల్లలూకాని, నీకేం హాయిగా వండిపెట్టేం దుకు అత్తగారు ఉంది. ఆదివారల్లో అయినా ఒకసారి మావంక తొంగి చూస్తే తప్పా ?" అంటూ నిష్ఠూరాలాడింది.

"తప్పు, ఒప్పు అంటూ అంతలేసి మాటలెందుకు పంకజం. నీకు చిక్కక కానీ, లేకుంటే రానూ?" అంది లలిత.

"ఏం కబుర్లు చెప్తావమ్మా! ఏడ్చి వెంట పడేందికి పిల్లా, జెల్లా! హాయిగా కావలసినచోటికల్లా తిరగడానికి స్కూటరుకూడా కొన్నారటకదా .... వెధవ బస్సులకోసం పడిగాపులు పడవలసిన అవసరంకూడా లేదు. అదృష్టంఅంటే నీదే అదృష్టమే లలితా" అంటూ సోది మొదలుపెట్టింది.

లలిత పెళ్ళికాకపూర్వం యిద్దరూ ఇరుగుపొరుగు యిళ్ళలో వుండేవారు. లలిత వుద్యోగంలో చేరడం, పంకజం పండంటి కొడుకును కని అత్తింటికి రావడం ఒక్కసారే జరిగాయి. లలితకి చిన్నపిల్లలంటే ఎంతో యిష్టం అందునా పంకజం కొడుకు బుచ్చిగాడు పనసతొనలా పచ్చగా, చూడముచ్చటగా వుండేవాడు. పంకజం ఇంట్లో పనిపాట్లు చేసుకొంటుంటే తనకి తీరిక ఉన్నప్పుడల్లా ఆ పిల్లడిని పెట్టుకొని ఆడిస్తుండేది లలిత. నిజానికి వారిద్దరిమధ్య స్నేహం వృద్ధికావడానికి బుచ్చిగాడే కారణం అన్నా అతిశయోక్తి కాదు.

"పిల్లలంటే అంత ముచ్చట పడుతున్నావు వేగిరం పెళ్ళి చేసుకో. ఎంత ముద్దు చేసినా పరాయిబిడ్డ నీ బిడ్డ కాడుకదా" అనేది పంకజం అ తగారు రామ యమ్మ.

"చేసుకో అంటే ఎలా చేసుకొంటుంది? ఆ నల్లమందు రామయ్య మనసులో ఈడొచ్చిన మేనగోడలికి పెళ్ళిచెయ్యాలంటూ ఆ విషయం దూరాలికదా" అనేది పంకజం.

"ఆ సంగతి నాకొదిలేయి .... ఆర్నెల్లు తిరిగేసరికల్లా నిన్ను పెళ్ళి కూతుర్ని చెయ్యకపోతే .... అప్పుడడుగు" అనేది రామాయమ్మ.

"ఎవరికి వదిలేయడానికి యిప్పుడప్పుడే అటువంటి అభిప్రాయం నాకులేదు మామ్మగారూ! ముందు రామకోటి చదువుకోవాలి, అప్పుడు ఆలోచించాలి నా పెళ్ళి విషయం" అనేది లలిత.

ఆ బుచ్చిగాడివెనుక పంకజానికి ముగ్గురు పిల్లలు ఈ ఏటా, ఆ

ఏటా పుట్టుకొచ్చారు. ప్రతిపురుడూ ఆ పిల్లకో గండం. ముఖం పీక్కు-పోయి ముప్పయిఏళ్ళకే ముసలిరూపు వచ్చిపోయింది మనిషి.

"సరే ....ఎవరికి తగిన బాధలు వాళ్ళకు వుంటాయిలెద్దు....అనుభవించినవాళ్ళకే కాని తెలిసిరావు" అంటూ ఆ పరమైన సంభాషణను ఆపు చేసేందుకు ప్రయత్నించింది లలిత.

చేతిలోవున్న కవరు పోస్టుబాక్సులో వేస్తూ "ఏమిటిలా వచ్చావు ఈరోజు ఆఫీసు లేదా ?" అంటూ ప్రశ్నించింది పంకజం.

"గురువారం కదా.... ఆఫీసు లేకుండా ఎందుకుపోతుంది ? —లంచ్ టైములో మామయ్యకు మనియార్డరు కడదామని ఇలావచ్చేను" అంది లలిత.

"ఆ....అన్నట్లు అడగడమే మరచిపోయాను. మీ మామయ్యకు యిప్పుడు ఎలావుంది ?"

బ్యాగులోంచి సొమ్ముతీసి లెక్క-పెడుతున్న లలిత పంకజం ప్రశ్న సరిగా వినలేదు, "ఎవరికీ —ఎలా ఉండడం ?" అంది .

"మీ మామయ్యకేనే. ఆమధ్య మావారు ఆఫీసు పనిమీద నెల్లూరు వెళ్ళినప్పుడు అటువెళ్ళి చూసివచ్చారుట .... పాపం చాలా సుస్తీగా ఉన్నాడని .... మంచంమీంచి లేవడంకూడా లేదని చెప్పారు. ఇప్పుడు కాస్త తేలికగా వున్నట్లేనా ?"

"అలాగా .... ఆ విషయం నాకు తెలియదే ! ఈమధ్య చాలా కాలంగా మామయ్య దగ్గరినుంచి ఉత్తరాలు లేవు" అంది లలిత.

"సర్దుకొని వుంటుందిలే— ఏమయినా చికాకు అయితే నీకు తెలియ జెయ్యకుండా ఉంటారా ?" అంది పంకజం ఓదార్పుగా.

ఎడ్రసు నింపిన మనియార్డరు ఫారాన్ని, సొమ్మునూ తిరిగి బ్యాగులో వేసుకుంది లలిత.

మరునాడు ఏదో ముస్లిముల పండుగ. ఆఫీసుకు వెళ్ళనక్కరలేదు. శనివారం ఒకరోజు సెలవుపెడితే .... ఆదివారం కలిసివస్తుంది. ఒకసారి

స్వయంగా వెళ్ళి ఆ డబ్బు అతడి చేతిలో పెట్టివస్తే అతనికీ,తనకూ తృప్తిగా వుంటుంది అనుకొంది.

"ఎల్లుండి ఆదివారం తీరుబడిగావుంటే ఓసారి మాఇంటివేపు రా. ఆరోజు పాప పుట్టిన రోజు, నలుగురు పేరంటాళ్ళను పిలిచి హారతి ఇయ్యాలనుకొంటున్నాను...." అంది పంకజం వెళ్ళిపోతూ.

"ఈ ఆదివారం కుదరదు. ఇంకోరోజు వస్తాను. రేపు మామయ్యని చూడ్డానికి వెళ్ళాలనుకొంటున్నాను" అంది లలిత.

ముసిలాడు ఈ మేనగోడలిని గురించి ఏనాడూ పట్టించుకోకపోయినా ఈ పిల్లకి అతడంటే ఎంత అభిమానమో అనుకొంది పంకజం.

* * *

రోజు కన్న కాస్తముందుగా ఆఫీసులో పని తెముల్చుకుని బైటపడింది లలిత. అదృష్టం బాగుండి ఆ వేళకి సరిగా బస్సు వచ్చి స్టాపులో నిలబడింది.

లలిత, ప్రకాశం ఇంటినుంచి స్కూటరుమీదకలసివచ్చినా, సాయంకాలం ప్రకాశంపని అయిదులోపుగానే అయిపోవడం, ఒక్కొక్కరోజు లలిత పని ఆరు దాటేవరకు పూర్తి కాకపోవడంతో అతడికి స్కూటరు వదిలిపెట్టి ఇంటికి వెళ్లేటప్పుడు తను బస్సుమీద వెళ్ళడం అలవాటు చేసుకొంది లలిత. ఇటీవల కాలంలో బస్సులసంఖ్య పెరగడం, ప్రత్యేకం ఆ కాలనీవైపు వెళ్లేబస్సులు ఒకటి,రెండు ఏర్పాటుకావడంతో అట్టే ఇబ్బంది లేకుండానే ఇల్లు చేరుకోగలిగేది.

లలిత ఇల్లు చేరేసరికి అప్పటికే ప్రకాశం వచ్చి ఉన్నాడు.

"వచ్చేసేవా, నీ కోసమే ఎదురు చూస్తున్నాను. ఇంకా ఎప్పటికి వస్తావో....అని" అన్నాడు.

"ఏం....ఏమిటి విశేషం?" అంది లలిత చేతిలో ఉన్న బ్యాగ్, గొడుగు బల్లమీద పెడ్తూ.

"మీ మామయ్యకి సుస్తీగా ఉందిట" అంది రాజమ్మ.

"అవునట....ఆ విషయం ఈ మధ్యాహ్నమే నేనూ విన్నాను. పంకజం కన్పించి చెప్పింది. చాలా రోజులయింది ఆయన్ని చూసి. రేపు ఒకసారి వెళ్ళిరావాలనుకొంటున్నాను" అంది లలిత.

"ఎలాగా వెళ్ళాలనుకొన్నప్పుడు ఈ రాత్రికి వెళ్ళడమే మంచిది" అన్నాడు ప్రకాశం.

"ఏడుగంటలికి అటువెళ్ళే రైలు ఉంది. నేనిప్పుడే తిరిగివస్తాను. నువ్వు భోజనంచేసి, సిద్ధంగా ఉండు" అన్నాడు.

అప్పుడు అతడు దేనికోసం బైటికి వెళ్తున్నాడో లలితకి తెలుసు. నెలాఖరు రోజులు. ప్రయాణపు ఖర్చులకి ఏ మిత్రుడి దగ్గరో అప్పు చేసే ప్రయత్నం.

"మీరు ఎక్కడికీవెళ్ళనక్కరలేదు. నాదగ్గిర కొంచెంసొమ్ముఉంది" అంది లలిత.

ఆమె భోజనం అయేక చూపించేడు ప్రకాశం; ఆ సాయంకాలం వచ్చిన టెలిగ్రాం.

అన్నదే తడవుగా రాత్రికి రాత్రి భర్త తన్ని ఎందుకు ప్రయాణం కట్టేడో అర్థమయింది లలితకి.

మామయ్యని చూడగలనా? కడసారి చూపుకైనా అందుకోగలనా? రైలులో ప్రయాణిస్తున్నంతసేపు ఆరాటపడ్తూనే ఉంది లలిత.

ఒక వ్యక్తిలో మనం ద్వేషించే ఎన్నో చెడుగుణాలు ఉండవచ్చు. కాని, వాటి అన్నిటి నడుమ అంతర్లీనంగా ఏదో ఒకమంచిగుణం మనల్ని ఆకర్షించవచ్చు. అన్ని సరిపడని గుణాలుగల ఆ వ్యక్తి అంటే, ఇష్టపడడానికి, అభిమానించడానికి అదే కారణం కావచ్చు.

సాంబమూర్తితో లలితకు గల అనుబంధం అటువంటిదే. స్వార్థం గూడు కట్టుకున్న ఆ వ్యక్తి హృదయంలో అట్టడుగున పూడుకుపోయి,

అప్పుడప్పుడు అణుమాత్రంగా పైకికనిపించే అతి సన్నిహితమైన మైత్రీభావం లలితని అతడి దగ్గరికి చేర్చింది.

పెద్దవాడని లలిత, మామయ్య దగ్గర ఎప్పుడూ భయపడలేదు. తన ఈడువాడు అన్నట్లే మనసులోని కష్టసుఖాలు అన్నీ చెప్తూండేది. అన్నీ వినీ వినకుండా అతడునల్లమందుమత్తులో అతితేలిగ్గానవ్వేస్తూ "నేనుండగా నీకేం భయమే లలితా" అనేవాడు.

ఆ భరోసా మాటమాత్రమే. క్రియలో జరిగేది కాదని ఆమెకీ తెలుసు. అయినా ఆ మాట కోసమే అతన్నిఅంటిపెట్టుకుని వుండేది లలిత.

మామయ్య నోటవచ్చే ఆమాటతో మానసికంగా ఆమెలో ఏదో విధమైన ధైర్యం, ఉత్సాహం పొరలుకొనేవి. మామయ్య తనకి అండగాఉంటే యెదురుపడ్డ కొండనైనా పిండిచేసి పారేస్తాను అన్నంత ధీమాతో అడుగు ముందుకి వేసేది.

ఈనాడు ఆ మామయ్య ఈ లోకంనుంచి వెళ్ళిపోనున్నాడు అన్న మాట, అనుకోడానికి కూడా ఆమె మనసు యిష్టపడలేదు.

చివరికి చితిలో ఆ కట్టె కాలిపోతున్నప్పుడు కూడా ఆ మాట అనుకోలేకపోయింది లలిత.

పది, పన్నెండు అయేవరకు అక్కడేవుంది లలిత. తను మామయ్య కోసం తీసుకువెళ్ళిన సొమ్ము అతడి అంత్యక్రియలకు ఉపయోగిస్తే, ఆ విధంగా కొంత తృప్తిపొందే అవకాశం వుంటుందన్న అభిప్రాయంతో ఆ సొమ్మును సాంబమూర్తి అక్కగారి చేతిలో పెట్టబోయింది.

"ఇంతకాలం తిండి, బట్ట పెట్టి పోషించగా లేంది, ఈ కాస్త కర్మ మేము చెయ్యలేమేమిటి? నువ్వేం ఇవ్వనక్కరలేదు" అంది ఈసడింపుగా ఆవిడ.

"వాడి వంట్లో శక్తి, చేతిలో డబ్బు వున్నంత వరకు చుట్టాలమంటూ అంతా తయారయేరు. చివరికి ఆ రెండు తరిగిపోగానే యెవరి

మట్టుకి వారు చల్లగా జారుకొన్నారు. అప్పటికి మేము గుర్తుకొచ్చేంవాడికి" అంటూ ఆవిడ వచ్చే పోయే వారి ముందర పదేపదే వర్ణించడం లలితకి బాధ కలిగించింది.

మనిషి ఒక మంచి పనిచేస్తే, ఇంకొకర్ని దూషించకుండా, ఈస డించకుండా చెయ్యలేడా? తను ఒక మంచిపని చేసేను అన్న తృప్తికన్నా, యెదుటి వారిని నిందించడంలోనే హెచ్చు ఆనందాన్ని పొందుతాడా?

ఈవిడకు మామయ్య పరాయివాడు కాడే; దత్తుపోయినా రక్తం పంచుకు పుట్టిన అన్నతమ్ముడు. అతడికి అవసానదశలో చేసినదానికి యిత రుల మెప్పు, మెహర్బానీలు అందుకోడం కోసం యింతగా గొంతు చించు కొని గోల చెయ్యాలా?

ఆ విధంగా చూస్తే తనూ చాలాకాలమే మామయ్యకి చేసింది. కొంతకాలం అతడు సొమ్ము తెచ్చిపెడ్తుంటే వండిపెట్టి, యిల్లుదిద్దుకొనేది. మరి కొంతకాలానికి ఆ సొమ్ముకూడా తనే సమకూర్చుకోవలసిన స్థితికి దిగజారింది సంసారం. మామయ్య దుబారా ఖర్చులవల్ల, వ్యవహార దక్షత లోపించడంవల్ల, తమ ఆర్థికపరిస్థితి అలా దిగజారిందని తెలిసినప్పటికీ ఒక్కసారి కూడా తను ఆయనతో పరుషంగా మాట్లాడలేదు.

రామకోటి అన్నట్లు మామయ్య తన ముల్లె యేదీ విప్పి మేన గోడలికి, మేనల్లుడికిపెట్టలేదు. ఆసంగతి ఈవిడకుతెలుసు. అతడిని [illegible] వల్ల తగలబడిన ఆస్తి అంతా తమదే. అందు మూలంగా అగచాట్లు పడిందీ తామే. అన్నీ తెలిసివుండి ఈవిడ దేనికింతగా అక్కసు పడిపోతు న్నది.

ఎంత అలోచించినా లలితకి అర్థంకాలేదు. ఏమైనా ఆ సమయంలో ఆవిడతో వాదన పెట్టుకొనే అభిప్రాయం ఆమెకు లేదు. సాంబమూర్తి బ్రతికివుంటే యింకోసారి యెప్పుడైనా ఆ యింటికి రావలసి వుండేదేమో

కాని, యిప్పుడు అతడు తరలిపోవడం వల్ల అదే ఆఖరుసారి ఆ యింటి ని స్తరివెయ్యడం. ఆపాటిదానికి అనవసరంగా ఆవిడితోతనకి వాదనెందుకు. మాటామాటా అనుకోడం యెందుకు? ఈవిడ, ఈ ఊళ్లో అమ్మలక్కలు, తనగురించి యేమనుకొన్నా తనకిపోయేదేమిటి? యేదోవిధంగా ఈ నాలుగు రోజులు గడుప్తుకుపోతే,ఆవెనుక ఆవిడెవరో....తనెవరో అనుకుని సర్దుకుపోసాగింది.

పన్నెండవరోజున లలిత రైలుకి బయలుదేరి వెళుతుంటే, "ఇదిగో.... ఈ కవరు మీ మామయ్య నీకిమ్మన్నాడు" అంటూ చేతిలో పెట్టింది ఆవిడ.

ఆ కవరు తెరిచేవుంది. దానిలో నిధినిక్షేపాలు వుండవన్న సంగతి లలితకి తెలుసు. తనకోసం మామయ్య యేం దాచేడా అని కుతూహలంగా తీసి చూసింది.

అందులో పాతపడి మరకలుతో వున్న ఒక చిన్న ఫొటోవుంది. మరో చిన్న కాగితం మడత కూడావుంది. ఆ ఫొటో లలితని, రామకోటిని రెండు తొడలమీద కూర్చోపెట్టుకుని సాంబమూ_ర్తి తీయించుకొన్నది.

ఇల్లు కాళీచేసి అ_త్తవారింటికి వెళ్ళిపోయేముందు ఆ ఫొటో కోసం వెతికింది లలిత. ఎక్కడా కనిపించక పోవడంతో యే చె_త్తలోనో కలిసిపోయిందనుకుంది. దానిని సాంబమూ_ర్తి యెప్పుడు తీసేడో, యెందుకు దాచుకున్నాడో లలితకి పాలుపోలేదు. ఆ ఫొటో వెనుక అతడి మనసులో దాచుకొన్న జ్ఞాపకాలేమిటో ఆమె ఊహించలేకపోయింది.

సాంబమూ_ర్తి రాసి ఉంచిన ఉ_త్తరం చాలా చిన్నది. చాల రోజుల క్రిందట రాసిందికూడా.

"లలితా నీకు ఉ_త్తరాలు వ్రాయడం మానేశాను. ఎందుకోతెలుసా? రాశానంటే నల్లమందు, డబ్బు. ఈ రెండు విషయాల మించి ఇంకొకటి

రాయనీయదు నా మనసు. ఎంతకాలం నిన్ను బాధపెట్టను. అత్తింట ఉన్న పిల్లవి. ఎంతకాలమని ఈ ముసలి మామయ్య నల్లమందు ఖర్చు భరించ గలవు? అందుకే ఉత్తరాలు రాయడం మానేశాను. మరోలా అనుకో కేం.... ఈ మామయ్య మీద కోపం తెచ్చుకోకేం........" అంతమాత్రం ఉందిమడిచి ఉన్న కాగితంలో.

లలిత కళ్లతుడుకుని ఆ రెండింటిని బ్యాగ్‌లో పదిలంగా పెట్టుకొంది. ఎప్పుడూ సాంబమూర్తి మంచం వుండే స్థలం కాళీగా ఉంది. వెళ్ళొస్తాను మామయ్యా అన్నట్లు ఆ వైపు ఒకసారి చూసి బండి ఎక్కింది.

* * *

ఎన్నో లంకణాలు చేసినట్లుంది లలిత పరిస్థితి. ఉదయం లేచి ఆఫీసుకి వెళ్ళడానికి ఏపాటి ఉత్సాహం, బలం, ఒంట్లో మిగలలేదు. కాని వెళ్ళక తప్పదు. వారం రోజులకు పైగా సెలవు పెట్టింది. అప్పటికే ఆఫీసరు మండి పడ్తూ ఉంటాడు.

తొమ్మది గంటలు అవుతుంటే. ఇంక తప్పదన్నట్లు బలవంతంగా వీధి బడికి లాక్కుపోతున్న పల్లెటూరి పిల్లడిలా కాళ్ళీడ్చుకొంటూ బయలు దేరింది.

అయిదేళ్ళ క్రిందట ఎంతో ఉత్సాహంగా తుళ్ళుతూ, నవ్వుతూ పరుగులు తీసే లలితేనా ఇది—అనుకొంది రాజమ్మ, అలా వెళ్తున్న కోడల్ని చూసి. ఆడవాళ్ళు చదువులు, ఉద్యోగాలు అంటూ ఎగబడుతున్నారే కాని మగాళ్ళలా ఆ ఢక్కామొక్కీలకి ఓర్చి నెగ్గుకురాలేరు. అది వారి తత్వానికి పడే పనికాదు. ఇటు ఇల్లు! అటు ఉద్యోగం, ఈరోజుల్లో ఆడదాని బ్రతుకు అడకత్తెరలో పోకలా నొక్కేస్తున్నాయి. తాళి కట్టిన భర్త ఒక మాటంటే పడలేని ఆడది, అధికార్ల చెప్పుకింద తేలులా పడిఉండి అవును,

కాదు, అనకుండా పని చేసుకు వస్తున్నదంటే ఆర్థికంగా మొగుడికి తోడ్ప డాలి అన్న అభిప్రాయంకాక, అందులో ఆమె అందుకుంటున్న ఆనందం ఏముంటుంది ?

అప్పులు, సప్పులు అన్నీ తీరేయి కాబట్టి, ఇంక కొంత కాలమైనా లలిత ఉద్యోగం మానేసి ఇంటిపట్టున ఉంటే బాగుండును. "పిల్లా పాపా అని లేక ఎంతకాలం ఇద్దరికిద్దరూ ఇలా యంత్రాల్లా తిరుగుతుంటారు ? మొగుడు పెళ్ళాం అన్నాక ఓ అచ్చటా, ముచ్చటా అంటూ లేకపోతే. ఇంక ఆ సంపాదన ఎందుకు....సంసారం ఎందుకు ?

ఇటీవలకాలంలో ఆఫీసునుంచి వచ్చేసరికే మరీ తోటకూర కాడలా వాడిపోతున్నాది పిల్ల. ఏమయిందో ఓసారి డాక్టరుకిచూపించుకోవే అంటే నా ఒంట్లో ఏం చికాకు లేదంటుంది.

వాడికి వాడూ అంతే. ఎంత సేపు ఆ బడిలో పాఠాలు. ఇంటిదగ్గర మేనగోడలి చదువు తప్పిస్తే పెళ్ళాంగురించి మంచీ, చెడ్డా పట్టించుకొంటు న్నట్లే కన్పించడంలేదు. తను ఏమైనా పైకి అంటే అనసూయ బాధపడ్తుంది.

"నావల్లే మీకంతా ఈ రంధి పట్టుకొంది నే నెక్కడికైనా వెళ్ళి పోతాను. నా కర్మ ఎలా ఉంటే అలా అవుతుంది." అంటుంది.

అటుచూస్తే మనుమరాలు. ఇటుచూస్తే కోడలు. ఎవరి మంచికోసం ఎవరిని కష్టపెట్టాలి? ఎవరి పురోభివృద్ధికోసం ఎవరి జీవితాన్ని బలిపెట్టాలి? కక్కాలేక మింగాలేక అన్న సామెతలా తయారయింది రాజమ్మ పరిస్థితి.

లలిత ఆఫీసులో కాలు పెడుతూ ఎవరికంట పడకూడ దనుకుందో ఆతడి దర్శనమే ముందుగా అయింది.

"ఏమమ్మా ఎంత సేపు మేము మీ కష్టసుఖాలు చూడవలసిందేగాని, మా పనిపాట్లు లాభనష్టాలు మీకేం పట్టవా ? మూడురోజుల కనిపోయి వారందాకా అదే పోవడమా?" అన్నాడు మేనేజరు లలిత రిజిష్టరులోసంతకం పెడుంటె.

"హఠాత్తుగా మామయ్య పోయారండి లేకపోతే ఇంతకుముందు ఎప్పుడైనా ఇలా జరిగిందా ? నా టెలిగ్రాం అందే ఉంటుంది—" అంది లలిత నెమ్మదిగా.

"ఆ, టెలిగ్రాం దేముంది. మనం ఎట్టా రాసిస్తే అట్టా కొట్టి పారేస్తాడు వాడు. దానితో ఇక్కడ పని జరగిపోతుందా ! చీటికిమాటికి ఇట్టా సెలవు పెట్టే వాళ్ళంటే—"

అతడు ఇంకా ఏదో గొణుగుతూనేఉన్నాడు. నెమ్మదిగా అక్కడి నుంచి కాలుకదిపి తన సీటు దగ్గరికి వచ్చింది లలిత. అర్జంటు అనుకొన్న కొన్ని వుత్తరాలు, కాగితాలు వీళ్ళు వాళ్ళు టైపు చేసేరేమోకాని మొత్తం మీద మిగిలిన కాగితాలన్నీ ఆ వారం రోజులివీ అలాగే పడివున్నాయి.

అదంతా తనే పూర్తి చెయ్యాలి అన్న ఆలోచనకే, లలితకి ముచ్చెమటలు పోసేయి. ఆరోజుమామ్మూలు పనిచేసిందికే ఆమెకి ఓపిక లేదు. అయినా తప్పేదేముంది ? తనకున్నపని తినకున్నా తప్పదన్నట్లు ఏడుస్తూనో, మొత్తుకొంటూనో ఎలాగోలాగ ఆ పనంతా తను చెయ్యవలసిందే. ఎప్పటికి తెములుతాయిరా బాబూ ఈ కాగితాలు అనుకొంటూ టైపురైటర్ ముందు కూలబడింది లలిత.

వంచిన తల ఎత్తకుండా, మధ్యాహ్నం లంచ్కైనా లేవకుండా గోడగడియారం అయిదు కొట్టేవరకు అలా విసువులేక పనిచేస్తే ఆ కాగితాలగుట్టలో కొంచెం ఖాళీ అగుపడింది. ఆమె అలా చెయ్యి ఆపకుండా పని చేస్తుంటే ఉదయం చిరబురలాడిన మేనేజరు ఒకటి, రెండుసార్లు అటు వైపుగా వచ్చి చూసిపోయేడు.

తృప్తిగా పిలక సవరించుకొంటూ "అందుకే ఈ పిల్లంటే నాకు చాలా ఇష్టం—ఆఫీసుకి వచ్చిందంటే ఒళ్లు దాచుకోకుండా పని చేస్తది." అంటూ హెడ్గుమాస్తాదగ్గర తన మెప్పుదల కనబరిచేడు.

ఆరుగంటల ప్రాంతంలో ఆఫీసులో అందరికన్న చివరగా బైట పడ్డ లలిత; అక్కడనుంచి తిన్నగా 'జైన్ అండ్ సన్స్' బట్టలకొట్టుకి వెళ్ళింది; మరునాటినుండి పనిలోకి వస్తానని చెప్పవానికి.

అప్పటికే వాళ్ళు ఇంకోమనిషిని పెట్టేసుకొన్నారు. "కావలసిన కాగితాలు రోజులతరబడి కదలకుండా నిలిచిపోతే మేమేం వ్యాపారం చేస్తామమ్మా; మొన్ననే ఇంకోమనిషిని పెట్టేసుకొన్నాం" అన్నాడు.

సత్యనారాయణ అండ్ కోలోనూ అదేవిధమైన జవాబు ఎదురయింది. ఆరోజు అన్నివిధాలా అలసిపోయిఉన్న లలిత "పీడాపోయింది. వీళ్ళిచ్చే ఈ పాతికరూపాయలు లేకపోతే పస్తుపడి చచ్చిపోము" అనుకొంది విసుగుతో

ఇంటికి వెళ్ళేసరికి ఇల్లంతా చీకటిగాఉంది. ఎక్కడో లైన్ పాడయిందిట ఆ వీధంతటికీ దీపాలులేవు. అదే పట్నం మధ్యలో అయితే వెంటనేవచ్చి సరిచేస్తారు. ఊరిచివరికి ఆ సమయంలో వచ్చిచూసే ఓపిక ఎవరికుంటుంది? 'ఇంక తెల్లవారేవరకు ఈ చీకటిలో ఉండవలసిందే' అనుకొంది లలిత.

పెరటిగదిలో అనసూయ కొవ్వొత్తిముందు కూర్చుని చదువుకొంటున్నాది. లలిత రావడం చూసి, చావిట్లోఉన్న కొవ్వొత్తిని వంటఇంట్లోకి తీసుకువెళ్ళి భోజనాల ఏర్పాటు చేసింది రాజమ్మ. రెండుపీటలు, రెండుకంచాలు ఉండడంచూసి "అనసూయ తినేసిందా" అంది లలిత.

"చదువుకొంటానంటే దానికి వెలుగుండగానే పెట్టేసేను. మధ్యాహ్నంకూడా తిన్నగా తిండి తినలేదు. నువ్వుకూడా రారా అంటే నీకోసం కనిపెట్టుకొని వాడుకూర్చున్నాడు" అంది రాజమ్మ ప్రకాశంవైపు చూస్తూ.

"మీరు తినేయవలసింది" అంది లలిత.

"అమ్మ ఊరకే అలా అంటుందికాని .... ఏమంత రాత్రి అయిందనీ" అన్నాడు ప్రకాశం.

గోడగడియారం ఎనిమిదిగంటలు కొట్టింది.

"అప్పుడే ఎనిమిదయిందా" తనలో తనే అనుకొందిలలిత. ఆరోజు ఆలస్యంగా ఆఫీసు వదలడంవేత స్టేషన్‌బస్సు తప్పిపోయింది. అటునుంచి బజారువీధికివెళ్ళి, మళ్ళా అక్కడ బస్సుకోసం నిరీక్షించి, స్టాపులో బస్సు దిగి, చీకట్లో కాళ్ళీడ్చుకొంటూ యిల్లుచేరేసరికి ఆ వేళయింది.

"వేసవికాలం పొద్దు....యేడుదాకా వెలుగే వుంటుంది" అంది రాజమ్మ కోడలిమాటకి జవాబుగా.

భోజనం పూర్తిచేసి లలిత అలవాటుగా గిన్నెలు, కంచాలు యెత్తి పెట్టబోయింది.

"వాటిని అలా ఒదిలేయి. నేను చూసుకొంటాను. వారంరోజులైె వేళకిసరిగా తిండీ తిప్పలూలేక వడలిపోయివున్నావు....పోయి పడుకో" అంది రాజమ్మ అప్యాయంగా.

తన కష్టసుఖాన్ని తల్లికన్న మిన్నగా నిండుమనసుతో అర్థం చేసుకొని ఆదరంగా మాట్లాడే అత్తగారికి మనసులోనే నమస్కరించిందిలలిత. తనెంత అదృష్టవంతురాలు. 'ఇటువంటి అత్తగారు, అటువంటిభర్త యెంత మందికి లభ్యమౌతారు? తాత్కాలికంగా యేవో ఒడుదుడుకులు యెదురయేయని తనుదిగులుపడకూడదు....యింకొంచెంరోజులు ఓపికపడితే యివన్నీ సర్దుకుపోతాయి....వీటికోసం కంగారుపడకూడదు'అనుకొందిలలిత మంచం మీద నడుంవాలుస్తూ.

ఆమె వెనుకనే గదిలోకివచ్చిన ప్రకాశం "యిదుగో లలితా నీకు వుత్తరం వచ్చింది. ఉదయంచెప్పడం మరచిపోయేను"అన్నాడు ఒకకవరు చేతిలోపెడుతూ.

"ఎక్కడనుంచి. యెవరు రాసేరు?" అంది లలిత అప్పుడు దాన్ని తెరచిచదివే ఓపికలేక.

"మీ తమ్ముడు రామకోటి రాసేడు. నువ్వువెళ్ళిన మరునాడే వచ్చింది."

"ఈ కొవ్వొత్తి వెలుగుముందు వాడి బ్రహ్మలిపి చదివే ఓపిక లేదు, ఏం రాసేడేమిటి?" అంది లలిత.

"పెద్దగా విశేషాలేం లేవు. ఆమధ్యరాసేడుకదూ, కొత్తగా వచ్చిన అధికారితో అంతసుఖంగాలేదని. ఆమాటేమళ్ళారాస్తూ 'అయిదేళ్ళ ఎగ్రిమెంటు యెలాగా అయిపోతున్నది కాబట్టి, నువ్వుఅన్నట్టు ఆ వియ్యే కాస్తా పూర్తిచేసేద్దామనుకుంటున్నాను' అంటూరాసేడు. నీ దగ్గరనుంచి ఉత్తరం చూచుకొని, మూటాముల్లేపట్టుకొని బయలుదేరి వచ్చేస్తాట్ట" అన్నాడు ప్రకాశం రామకోటి వుత్తరం విషయాన్ని చెప్తూ.

లలిత ఏమీ మాట్లాడలేదు. ఎప్పుడో అన్నీసవ్యంగా ఉన్నప్పుడు, నిత్యావసర వస్తువులన్నీ ధరలు ఇంతగా కొండెక్కి కూర్చోనప్పుడు, ఆమె ఆమాటఅనటంనిజమే. కాని, దానిని ఇప్పుడు ముదలకిస్తూ, తనంతటివాడు తానైన తమ్ముడు, అక్కమీదవచ్చి వాల్తానని రాయడం అసహజంగా అనిపించింది లలితకి.

ఒంటరిగాడు, ఇంతకాలంగా ఆర్జించుకొంటున్నాడు. అంతో,ఇంతో మిగుల్చుకొని దానితో చదువుకుంటాననడంలో అందం, ఆనందం ఉంది. అంతేకాని, నీ మాటమీద ఉద్యోగం మానేస్తున్నాను, నువ్వే అంతాచూడాలి అన్నట్లు ఈ వుత్తరం ఏమిటి?—అనుకొంది.

"ఇప్పటికే ఆలస్యమయింది. తనురావడం ఇష్టంలేక జవాబు రాయలేదనుకోగలడు. లేపోఉత్తరంరాసిపడేయి. రెండేళ్ళుఎంతలోగడచిపోతాయి. మనతోపాటే ఏండుంటేఅదేతనూతింటాడు, మరేం పైవాడు,మన్ననచుట్టం కాడుగదా" అన్నాడు ప్రకాశం.

"ఎప్పుడో ఏదో అన్నామని ఇప్పుడు ఈ బరువు నెత్తి కెత్తుకోవాలని నాకులేదు. ఒకవంక అనసూయని చదువులోపెట్టేం, దానికోదారి చూపించవలసిఉంది. మళ్లావేసిన ఆ పెరటివంక పెణక,దిగజారిపోతున్నది, దాన్నిపీకించి, తిన్నగా గోడపెట్టి మరీకట్టించాలి. నూతికి ఓ వందో యాభయ్యో ఖర్చుపెట్టి మన్నుతీయిస్తేగాని ఈ ఏడు వేసవి గడిచేలాలేదు.

"వస్తున్న జీతం రాళ్ళకి ఉన్నఖర్చులే అత్తిసరులా ఉన్నాయి. పైగా ఆ బట్టలకొట్టువాళ్ళు నాలుగురోజులు వెళ్ళకపోయేసరికి ఇంకెవర్నో

పనికి కుదుర్చుకున్నారు. నెలనెలా చేతిలోపడే ఆ సొమ్ముకూడా నిలచి పోయింది. మనబాధల్లో మనం మునుగుతూ, తేలుతూ ఇలాఉంటే వంటరి వాడు తను, అక్క చెల్లిలికి పదో పరకో పంపి ఆదుకోటంపోయి, చదువు నెపంతో మనమీ త్తిమీదవచ్చి వాలతాననడం ఏమిటి? ఈ పద్ధతి నాకేం బాగులేదు. ఆమాటే రేపు రాసిపడేస్తాను" అంది లలిత.

"అదిబాగుండదులలితా. మొదట అతడిమనసులో అటువంటి ఆలో చన పెట్టిందిమనమే. నువ్వన్నట్లు అప్పటికీ, ఇప్పటికీ పరిస్థితి ఒక్కలా లేదనుకో....అయినా అక్కా బావా అప్పుడు అంతగా చెప్పి ఇప్పుడు తన గురించి పట్టించుకొన్నారు కారనుకొంటాడు.

"అంతగాగడవకపోతే, అప్పో, సప్పోచేద్దాం. ఆ వెనక అతడో- మనమో ఎవరో ఒకరు తీర్చుకోవచ్చు. ఒక్కరెండేళ్ళు గడిచిపోతే అన సూయ బాధ్యత తీరిపోతుంది. రామకోటి చదువు అయిపోతుంది. అప్పుడు మనకి అవసరంపడితే ఈ ఇద్దరిలో ఎవరో ఒకరు ఆదుకోపోరు. కాస్త ఆలోచించి మరీరాయి. తొందరపడకు." అంతమాత్రం చెప్పి అక్కడ నుంచి వెళ్ళిపోయేడు ప్రకాశం.

# 7

చాలాకాలం తరువాత ఆ ఇంట్లో అందరిముఖాల్లో ఉత్సాహం కన బడింది. ముందురోజంతా కుండపోతగా కురిసినవర్షం తెల్లవారేసరికి తెరిపి ఇచ్చింది. వర్షపునీటితో దుమ్ము కడుక్కుపోయిన చెట్లచిగుళ్ళు ఎండపడి ఎర్రగా మెరుస్తున్నాయి.

తనతోపాటు ప్రకృతికూడా సంతోషిస్తున్నట్లు అన్పించింది అన సూయకి. ఆరోజు ఆమె తనజీవితంలో మరువలేని రోజు.

లలిత, ప్రకాశం పడ్డ శ్రమకి ఫలితం అందినరోజు.

ఆ దంపతుల చేయి ఆసరాతో అనసూయజీవితంలో ఒక అడుగు ముందుకి వేసినరోజు. చిన్నతనంలో మనసులోపడ్డ విత్తు మొలకెత్తి, మారాకు వేసినరోజు.

అనుకొన్న దానికన్న మంచి మార్కులతోనే అనసూయ మెట్రిక్యు లేషన్ పరీక్ష పాసయింది. కోడలినోట ఆమాట వినగానే ఇంత పంచ దారతెచ్చి అక్కడఉన్న అందరినోళ్ళలో పోసింది రాజమ్మ.

అనసూయ అత్తని అమాంతంగా కౌగలించుకొంది. నేల తగిలేలా తలవంచి అమ్మమ్మ కాళ్ళకి నమస్కరించింది.

"ఆనందం, ఆప్యాయతా అంతా అత్తకి, అమ్మమ్మకీ పంచిపెట్టడ మేనా? ఇంతా కష్టపడి చదువు చెప్పిన గురువుగారికి పంగనామాలేనా?" అన్నాడు ప్రకాశం నవ్వుతూ.

"నీ ఋణం ఈ జన్మలో తీర్చుకోలేను మామయ్యా! తీర్చలేమని తెలిసిన అప్పుల గురించి మరచిపోవడం మానవ సహజం కదా" అంది అనసూయ.

"అమ్మో....అమ్మో....అటునుండి ఇటు గురువుగారికే పాఠాలు చెప్తున్నాదే మీ మేనగోడలు" అంది లలిత.

"మరేం అత్తయ్యా! ఆరునెల్లు సహవాసంచేస్తే వారు వీరవుతారట. ఇంతకాలం నీ సహవాసం చేసేక ఆపాటి నేర్చుకోకపోతే నా బుర్రలో మట్టి నిండుగా ఉంది అనుకోవాలి" అంది అనసూయ.

వేసవికాలపు వేడిగాలిలా వీధితలుపు తోసుకొని వచ్చిపడ్డాడు రామ కోటి. "కంగ్రాచ్యులేషన్స్....అనసూయ" అంటూ.

"థాంక్యూ" అంది అనసూయ అతడు అందించిన ఆకుపొట్లం అందుకొంటూ.

అందులో ఉంది జెర్రిపోతులా ఇంతలావుగా అరగజం పొడుగున ఉన్న, మల్లెలు మరువం కలిపి కట్టిన మాల.

ఆకు పొట్లంలోంచి దాన్ని పైకితీస్తూ వెలవెలపోయిందిఅనసూయ. రాజమ్మ ఏదో మాట అనబోతున్నదల్లా అలాగే నోరుతెరచి ఉండిపోయింది. లలిత, ప్రకాశం దీని భావమేమి—అన్నట్లు ముఖాలు చూసుకొన్నారు.

అనసూయ చేతిలో రామకోటి పువ్వులు తెచ్చిపెట్టడంతో ఒక్క సారిగా అక్కడవున్న మనుషుల్లో ఇంత మార్పు కన్పించడానికి ఆ పిల్ల విధవ అన్నభావం వారి మనసుల్లో ఇంకా పచ్చిగా ఉండడమే. పునిస్త్రీ తనానికి పువ్వులకి ఉన్న అనుబంధమే కారణం.

అనసూయ నుదుటిమీద బొట్టు, వారింటికి వచ్చేసరికే ప్రయాణంలో చెరిగిపోయింది. ఆ పిల్ల తిరిగి దాన్ని దిద్దుకోలేదు. తెల్లని, రంగులవి, అన్ని రకాల చీరలు కడ్తున్నా తలలో పువ్వులు మాత్రం యెప్పుడూ పెట్టు కోలేదు.

రాజమ్మ ముఖంచూడగానే తన తప్పు తెలుసుకొన్నాడు రామకోటి. ఎదురుగా పువ్వులు కనిపిస్తే తన ఆనందాన్ని తెలియజెయ్యడానికి యేదో ఒకటి యివ్వాలన్న అభిప్రాయంతో తీసుకొన్నాడే గాని, ఈ విషయం గురించి అంతకన్న లోతుగా ఆలోచించలేదు.

అనసూయని పునిస్త్రీగా అట్టేసార్లుచూడలేదు. ఈ కాలంలో బొట్టు పెట్టుకోకపోవడం వైధవ్యచిహ్నంగా భావించనక్కరలేదు. స్కూళ్ళలో, కాలేజీల్లో చదువుకొంటున్న చాలమంది ఆడపిల్లలు, బొట్టు పెట్టుకోక పోవడం ఫ్యాషన్‌గా భావించి మానేస్తుంటారు. అనసూయ మొగుడు పోవడం గురించి, అప్పుడెప్పుడో లలిత అతడికి ఉత్తరం రాసినమాట నిజమే. కాని ఆ విషయం అతడి మనసులో అంతగా పట్టలేదు. కారణం అప్పటికి అనసూయ అంటే ఆపిల్ల మొగుడుయెవరో రామకోటికి అంతగా తెలిసి వుండకపోవడమే.

లలిత పెళ్ళిలో అనసూయను రామకోటి చూడక పోలేదు. మెడలో కంటె, దొరుగేలి, కాళ్ళకి గజ్జల వట్టీలు, పులిచేరు, గొలుసులు, తలమీద

నాగరం, ఒటికి జడగంటలతో బొమ్మలకొలువుకోసం అలంకరించి పెట్టిన తెల్లపంపసం బొమ్మలా ఉండేది. అప్పటి ఆ పిల్లకి, ఇప్పటి ఈ అనసూయకి పోలికే లేదు. పొట్టిగా గుమ్మటంలా ఉండేదిఅప్పుడు. పొడుగ్గా, సన్నగా మొగ్గ తొడిగిన లతలా ఉంది ఇప్పుడు.

అక్కగారి ఉత్తరం అందుకొని రామకోటి పెట్టా బేడాతో దిగబడ్డప్పుడు అతణ్ణిచూసి అనసూయకూడా పోల్చుకోలేకపోయింది. ఎవరా ఈ ఆగంతకుడు—అనుకొంది.

అతడి వెనుకగా రిక్షావాడు పట్టుకొస్తున్న సామానుల్ని చూసి, అతిథి అభ్యాగతులజాతికి చెందినవాడే అయిఉంటాడని నిర్ణయించుకొంది. అతడు ఆ యింటితో, ఇంటిలోని మనుషులతో ఎంతో పరిచయం ఉన్నవాడిలా లోపలికొచ్చి "సామాన్లు ఆ పక్కగా పెట్టు" అంటూ రిక్షావాడికి ఆజ్ఞ జారీ చేస్తుంటే ఎవరో అత్తా మామయ్యలకి బాగా తెలిసిన వాడే అయిఉండాలని తేల్చుకొంది.

వెంటనే పెరట్లో బట్టలు ఆరవేస్తున్న లలిత దగ్గరికి వెళ్ళి "అత్తా ఎవరో వచ్చేరు....చూడు" అంది.

"ఎవరు" అంటూ చేస్తున్న పనిని అలా వదలి గడపలోకివచ్చింది లలిత. ఎదురుగా రామకోటి.

"బాగున్నావా అక్కా" అంటూ ముందుకి వచ్చేడు.

తనకన్న పొడుగ్గా, బలంగా ఉన్న తమ్ముణ్ణి, తన చేతులమీదుగా పెంచి, పెద్దచేసిన తమ్ముణ్ణి, ఆప్యాయంగా దగ్గరికి తీసుకొంటూ "వచ్చేవా రామూ—ఇలావస్తున్నట్లు ఓ ఉత్తరంముక్క రాసి పడేయలేకపోయావా" అంది.

"మీ యింటికి రావడానికి ఉత్తరం రాయాలికే" అన్నాడు రామంకోటి.

లలిత పెళ్ళినాటికి రామకోటి పొట్టిగా నిక్కర్లు తొడుక్కొంటూ చిన్నకుర్రాడిలా ఉండేవాడు. అతన్ని చూసినవాళ్ళు కాలేజీలో చదువుతున్నాడంటే నమ్మేవారుకారు. తీరా ఉద్యోగం వచ్చి రామకోటి పనిలో ప్రవేశి

చేక అక్కడ అందరికీ ఇంత చిన్నకుర్రాడికి ఉద్యోగం ఎలాఇచ్చేరా అని ఒకటే ఆశ్చర్యం. రామకోటి తన వయస్సు చెప్పినా నమ్మేవారు కారు. స్కూలు ఫైనల్ సర్టిఫికెటు చూపిస్తే, "కాలేజీలో సీటు కోసం వయస్సు పెంచి వేసిఉంటారు" అనేవారు.

అటువంటి రామకోటి అయిదారేళ్ళు ఉత్తరాదినిఉండి తిరిగి వచ్చే సరికి బాగా పెరిగేడు. పొడుక్కి తగ్గట్టు ఒళ్లుకూడా చేసేడు. మనిషికూడా రంగుతేలి చూడముచ్చటగా ఉన్నాడు.

అక్కాతమ్ముల పరామర్శలు జరుగుతుండగానే వాకిట్లో అలికిడి విని రాజమ్మ అటు వచ్చింది.

"ఎవరే అమ్మమ్మా" అంది అనసూయ మెల్లిగా.

"మీ అత్తయ్య తమ్ముడే........రామకోటి" అంది రాజమ్మ.

"అయ్యో చెప్పడం మరచేపోయేను. అనసూయ గురించి అప్పుడు రాసేను కదూ....ఇదుగో ఈ పిల్లే గుర్తుందోలేదో కాని" అంది లలిత. లలిత అనసూయని తమ్ముడికి పరిచయం చేస్తూ.

"గుర్తుంది కాని అప్పుడు గజ్జల గుర్రంలా వుండేది" అన్నాడు రామకోటి.

"అప్పుడు మీరు పొట్టిబుడం కాయలా ఇంతుండేవారు" అంది అనసూయ మాటకి మాట అప్పగిస్తూ.

తను అనసూయని నువ్వు అనడం ఆ పిల్ల అతనిని మీరుఅనడం గుర్తించేడు. రామకోటి.

"క్షమించాలి. నేనుకూడా మిమ్మల్ని మీరు అనాలనుకొంటాను.... పొరపాటున...."

"మరేం ఫరవాలేదు నాయనా! అనసూయ నీకన్న చిన్నది. నువ్వు అనడమే సరిగావుంది" అంది రాజమ్మ.

రామకోటి వచ్చేక అనసూయకి పొద్దుపోక పోవడం అన్నమాట లేకుండా పోయింది. అసలే వాగుడుకాయ రామకోటి. తన మాటల్ని

శ్రద్ధగా వినడానికి మనుషులు సిద్ధంగా ఉన్నారంటే ఇంక ఆ ప్రవాహానికి అడ్డు, అదుపు వుండవు. మనిషికి ఆకలి, నిద్ర, విసుగు అంటూ వుండవు.

చదువు, పరీక్షలుఅంటూ పూర్తయినకాలం అనసూయకి రోజుకి మరి కొన్ని గంటలువుంటే బాగుండు ననిపించింది. అవి కాస్తా అయిపోయేక రోజు గడవడమే కష్టంగా తయారయింది.

ఏ కాలంలోను తొమ్మిది గంటలకల్లా ఆఫీసుకిపోకతప్పదు లలితకి. సెలవలు వచ్చేక మొదటి నెలరోజులు పరీక్ష పేపర్లుదిద్దుకొంటూ కూర్చునే వాడు ప్రకాశం. అమ్మమ్మతో వెంకటని కబుర్లు చెప్తూ కూర్చుంటుంది ఇరుగు, పొరుగు యిళ్ళలో ఈడూజోడూ పిల్లలులేరు. ఉన్నా పై యిళ్ళకి పెత్తనాలకి వెళ్ళే అలవాటు లలితకి లేకపోవడంవల్ల వారింటికి యెవరూ రారు. మామయ్య లైబ్రరీనుంచి తెచ్చిపడేసిన నవలలు, కథలపుస్తకాలు చదివిచదివి విసిగిపోయింది అనసూయ.

అటువంటి సమయంలో రామకోటిరాక, ఎండి బీటలువారిన నేలపై పడ్డ తొలకరిజల్లులా అనిపించింది అనసూయకి. సమారమి తనఈడువాడు, తనలాగే మాటలంటే యిష్టమున్నవాడు, పైగా యెన్నో ప్రాంతాలు తిరిగి, యెన్నో వింతలుచూసి, రకరకాల విషయాలు తెలుసుకున్నవాడు. రామ కోటి అక్కడి మనుషులగురించి, వారి అలవాట్లు, పనిపాట్లు, అగచాట్లు అలా చెప్పుకుపోతుంటే నాగస్వరానికి పడిగెత్తిన పాములా అలా వింటూ కూర్చునేది అనసూయ.

ఇంట్లో పనిలేనప్పుడు, ఒంట్లో ఓపికఉన్నప్పుడు తనుకూడా వచ్చి కూర్చునేది రాజమ్మ, సెలవురోజుల్లో' రాత్రిసమయాల్లో లలిత, ప్రకాశం కూడా మాట కలిపేవారు.

ఒక్క నెలనాటికే యెంతో కాలంగా పరిచయంవున్న వ్యక్తుల్లా అయిపోయేరు రామకోటి, అనసూయ. అనసూయదగ్గరయేర్పడ్డ ఆ చనువు తోటే తన హృదయపూర్వక అభినందనలతోపాటు సువాసనలు వెదజల్లే మల్లెచెండుకూడా చేతిలోపెట్టేడు రామకోటి.

కానీ దాన్ని నవ్వుతూ అందుకొనే సాహసంలేక అనసూయ వెల వెల పోగానే తన తప్పిదాన్ని అతడు తెలుసుకున్నాడు. "సారీ .... సారీ

అయామ్ వెరీసారీ" అని తడబడుతూ ఆ కొ_త్తమాట అని అక్కడినుంచి వెళ్ళిపోయేడు.

చేతిలోని మల్లెదండని ఎదురుగావున్న వేణుగోపాలుడిఫొటోకి వేసి వచ్చింది అనసూయ.

ఎంతకాదని దులపరించుకొందామన్నా, ర_క్తంలో జీర్ణించుకుపోయిన కొన్ని అలవాట్లు, ఆచారాలు అడుగడుగునా మనిషి మనుగడని ఎలా అదుపులో పెడ్తాయో తెలుసుకొని చిన్నగా నవ్వుకొంది లలిత.

మొగుడుపోతే అతడితోపాటు చితిలోపడి సహగమనం చెయ్యనక్కరలేదని .... తల గొరిగించుకొని వికృతరూపం పొందనక్కరలేదని, ఓపూటే ఇంత తిండితింటూ మాడనక్కరలేదనీ ........ అనాదిగావస్తున్న ఈ ఆచారాల్లో మార్పులకి మనుషులు అలవాటుపడ్డారు. అందువల్లనే వాటిగురించి ఎవ్వరూ పట్టించకోడంలేదు. కాని వితంతువు పువ్వులు, బొట్టు పెట్టుకోడం అన్నది ఇంకా ఆ జాబితాలోకి చేరలేదు. దాన్ని మనస్ఫూ_ర్తిగా అంతాకాకున్నా కొందరై నా మనదేశంలో అంగీకరించదానికి ఇంకా మరికొంతకాలం పడవచ్చు—అనుకొన్నాడు ప్రకాశం.

అనసూయ పరీక్ష పాసయిందన్న ఉత్సాహంతో మరికొన్నిరోజులు గడచిపోయేయి అప్పుడు వచ్చింది....ఆ తరువాత సంగతి ఏమిటి అన్న ప్రశ్న.

"టీచరు ట్రయినింగుకు వెళ్ళు" అన్నాడు ప్రకాశం.

"నర్స్ ట్రయినింగ్ అయితే మంచిదేమో....సులువుగా వుద్యోగం దొరుకుతుంది" అంది లలిత.

"అనసూయకి ఆ రెండూ యిష్టమున్నట్లు లేదు" అన్నాడు రామకోటి.

మరేం చేయాలనుకొంటున్నది ? అందరిచూపులు అనసూయమీద వాలేయి.

అనసూయ తన మనసులో మాట వెలిబుచ్చటానికి తటపటాయించింది.

"ఏం చేద్దాం అనుకొంటున్నావో చెప్పు, చెప్పకుండా అలా వూరు కొంటే ఎలా తెలుస్తుంది" అంది రాజమ్మ.

చెప్పనా, మాననా అని అనసూయ ఆలోచిస్తున్నది. తీరా చెప్పేక అత్తా, మామయ్యా కాదంటే యేం చెయ్యాలి? వాళ్ళు అన్నట్లు యేదో ఒక ట్రైనింగుకి వెళ్ళడమా?.... లేక కాదు కూడదు అని

వాళ్ళ యిష్టాన్ని కాదని తనకోర్కె చెల్లించుకోడానికి తనకి ఆ యింటగల హక్కేమిటి? అటు కట్టినయిల్లా, ఇటు పెట్టినయిల్లా. వాళ్లు మంచిమనసుకలవాళ్లుకాబట్టి తాము యిబ్బందులు పడుతున్నా యింతకాలం భరించేరు; ఈపాటి చదువు చెప్పించేరు. ఇంక తమవల్ల కాదంటే :

అనసూయ మౌనం లలిత మనసులో "ఏదో అనుమానాన్ని లేపింది. ఆమెకి బదులుగా ఆమెమనసులోనిమాటను రామకోటి చెప్పడం దానికి బలం చేకూర్చింది, అంతకుపూర్వం వారిద్దర్నీ దగ్గర దగ్గరగా చూస్తున్నప్పుడు తనమనసులో కదలిన ఆలోచనలకి ఏదో ఒక రూపు ఏర్పడినట్లు అనిపించింది.

"చెప్పు అనసూయా! మాతో చెప్పడానికి నీకుభయం ఎందుకూ?" అంది లలిత మనసులో రేగుతున్న భావాల్ని బయటపడనీకుండా జాగ్రత్త పడుతూ.

"కాలేజీలోచేరి పి. యు. సి. చదవాలని ఉంది" నెమ్మదిగా మనసులోని కోరిక జారవిడిచింది అనసూయ.

"ఇంతేకదా" అనుకొంది లలిత.

"ఆ తరువాత" అన్నాడు ప్రకాశం.

"అప్పటిసంగతి అప్పుడు చూసుకోవచ్చు"

"ఇది సరియైన పద్ధతికాదు అనసూయా! ఉద్యోగంకోసమే చదువు అనుకొంటే మెట్రిక్యులేషన్‌కి, పి. యు. సి. కి పెద్దగా తేడా ఏమీలేదు. అలాకాక ఏ బియ్యేనో, బియ్యస్సీనో చదవాలనుకొంటే అది వేరేసంగతి. అంచేత....ఆ తరువాత ఏం చేస్తావు అన్నదికూడా ముందుగా తేల్చుకోడం మంచిది."

అనసూయకి బియ్యే డిగ్రీఅందుకొని బి. ఇడి, ట్రెయినింగ్‌కి వెళ్లాలనిఉంది. కాని దానిఅర్థం కనీసం మరి నాలుగేళ్ళు అత్తా, మామలమీద తనబరువు మోపడం, ఆ విషయాన్ని వారితో స్పష్టంగా చెప్పలేకనే అలా మాట దాటవేసింది.

అనసూయ తిరిగి మాట్లాడలేదు. కంఠంలోఉన్న అన్నం కెలుకుతూ అలా ఉండిపోయింది.

"మామయ్య చెప్పినట్లు ఆ టీచరు ట్రయినింగ్‌కి వెళ్ళు అనసూయా, ఏడాదో, రెండేళ్ళో గడిచిపోతే పరువుగా ఏ బడిలోనో పంతులమ్మపని చేసుకొంటూ నీపొట్ట నువ్వు పోషించుకోవచ్చు. చదువుకిఅంతం ఎక్కడ? ఎంతచదివినా ఇంకా ఉంటూనే ఉంటుంది" అంది రాజమ్మ.

అనసూయ అవును, కాదు అనలేదు. తిన్నకంచం కడిగే మిషతో అక్కడినుంచి లేచి పెరట్లోకి వెళ్ళిపోయింది.

"దాన్ని ఆలోచించుకోనిండి. ఇంకా సమయం ఉందికదా" అంది లలిత ఆఫీసుకి వెళ్ళిపోతూ.

లలిత ఆఫీసునుంచి తిరిగి వచ్చేసరికి ఏదోపుస్తకం పట్టుకొని వాలుకుర్చీలో పడుకొనిఉంది అనసూయ. చేతిలోపుస్తకంఉన్నా కళ్ళుమాత్రం మూతపడే ఉన్నాయి.

"ఈ వేళప్పుడు నిద్రపోతున్నావేం ? ఒంట్లో సరిగా ఉందా !" అంటూ ప్రశ్నించింది లలిత.

అనసూయ నిద్రపోవడంలేదు. ఆలోచిస్తున్నది. లలితమాట విని త్రుళ్ళిపడి కళ్ళు విప్పింది.

"లేదత్తా చికాకేం లేదు, ఊరకే అలా కళ్లు మూసుకొన్నాను" అంది కుర్చీలో సరిగాసర్దుకొని కూర్చుంటు.

వాడిఉంది ఆ పిల్లముఖం : కళ్ళు ఎర్రగా, భారంగా ఉన్నాయి. ఆ ఉదయంవరకు ముఖంలో కన్పించిన ఉత్సాహాన్నంతా ఎవరో చీపురుపెట్టి ఒక్కరవ్వంతకూడా మిగులకుండా తుడిచివేసినట్లుంది.

లలితకి తను మెడిసిన్ చదవాలని ఉబలాటపడ్డరోజులు గుర్తుకు వచ్చేయి. అది జరిగేపనికాదని తెలుసుకొన్ననాడు పడ్డ వ్యధ గుర్తుకి వచ్చింది.

తానుఅనుభవించినబాధ,ఎదుటివారికికలుగకుండాచూడ్డంలోనే మంచి, మానవత ఉందంటారు. ఈ ఒక్కఏడు ఏదోలా బండి సాగిందంటే, అనసూయ అన్నట్లు ముందుసంగతి అప్పుడు చూసుకోవచ్చు. కాలేజీకివెళ్లడం మోజుకోసమే చదవాలనుకొంటే అప్పటికి అదికాస్తా తీరి, అనసూయ తనంతటతానే మానేస్తాననవచ్చు, లేదా మంచిమార్కులతో పి. యు. సి. పాసైతే, ఈ రోజుల్లో ప్రభుత్వంవారు ఇస్తున్నవి, ఇంకా ప్రయివేటు సంస్థలు ఇస్తున్నవి ఎన్నో స్కాలరుషిప్పులు వుంటున్నాయి. అదృష్టం కలసొచ్చి అటువంటిదేదైనావస్తే ఇంక దానిచదువుకి, ఉనికికీచూడనక్కర లేదు. ఇంతకాలంచేసి ఈ కొద్దిలో దానిమనసు చిన్నబుచ్చడం ఎందుకు— అనుకుంది లలిత.

ప్రకాశం మాత్రం, "అనసూయకి చదువుమీదకన్న కాలేజీకి వెళ్ళి రావాలన్న సరదామీదే మక్కువ ఎక్కువగావున్నట్లు కన్పిస్తున్నది. నిజంగా అందుకే అది చదువుతానంటే ఇటుమనసొమ్ము. అటు దాని సమయం దండుగకావడం మినహా ఉపయోగంలేదు" అన్నాడు.

"బరువు మోసేవారు మీరు. మీ ఇష్టం నాయనా నేనేం చెప్పను." అంది రాజమ్మ.

మరికొన్నిరోజుల తర్జన భర్జనలు జరిగేక అనసూయని కాలేజీలో చేర్పించి చదివించడానికే నిశ్చయం జరిగింది.

"నాకోసం మీరెంత శ్రమపడ్తున్నారు అత్తా.... మీ అందరిఋణం ఎలా తీర్చను?" అంది అనసూయ కళ్ళనీళ్ళతో.

"నువ్వు జాగ్రత్తగా చదువుకొని మంచిమార్కులతోపరీక్షపాసైతే మాఅప్పు ఆఖరిపైసతోసహా తీరిపోయినట్లే" అంది లలిత.

* * *

అనసూయతో చదువుకొన్న కొంధరు అమ్మాయిల పరీక్షలు పోయేయి. మరికొందరు పెళ్ళిళ్లు చేసుకొని చదువుకి ఉద్వాసనచెప్పేసేరు. ఇంకొందరు టీచరు ట్రయినింగుకి, నర్సుకోర్సుకి వెళ్ళిపోయారు. దానా దీనా ప్రకాశం దగ్గరికివచ్చి ప్రయివేటు చెప్పకొనే ఆడపిల్లలసంఖ్య తగ్గ పోయింది. మిగిలిన ఒకరిద్దరుకూడా 'యిప్పటినుంచి ఎందుకు? పరీక్షలు దగ్గరికివచ్చేక, ఒకనెలో, రెండునెలలో ప్రయివేటు చెప్పించుకొంటే సరి పోతుంది' అని ఊరుకొన్నారు.

మొదట్లోలా అనసూయని ఒక్కదాన్ని కూర్చోపెట్టుకొని పాఠం చెప్పడానికి ప్రకాశానికి విసుగనిపించసాగింది "నువ్వు చదువుకొని తెలియ నివి యేమైనావుంటే అడుగు" అనేవాడు.

తెలియనివి యేమైనావుంటే మామయ్యనికాక రామకోటిని . అడి గేది అనసూయ, "ఇదేమిటి అలా....ఎదురుగా మామయ్యావుంటే చదువు కొంటున్న ఆ పిల్లడి నెందుకలా మాట్లాడిస్తావు" అని రాజమ్మ అంటే, "కాలేజీలో పాఠాలుచెప్పి మామయ్య యింటికి అలసివస్తాడు అమ్మమ్మా, అయినప్పుడు కానప్పుడు అతన్ని యెందుకు బాధపెట్టడం" అనేది అన సూయ.

అసలుసంగతి అదేంకాదు. మామయ్య దగ్గరకన్నా రామకోటిదగ్గర పాఠం చెప్పించుకోడం అంటే అనసూయకి యెందువల్లో బాగుండేది. విద్యార్థి మనస్తత్వం విద్యార్థికే తెలుస్తుందన్నట్లు, అసలువిషయం దగ్గరికి పోకుండా, చిట్కాలతో ప్రశ్నలకి సమాధానాలు యెలా కనుక్కోవచ్చో, ప్రోబ్లమ్స్ యెలా గుర్తుంచుకోవచ్చో చెప్పేవాడు రామకోటి.

అక్కడగ్గర పుస్తకాలకంటూ పుచ్చుకొన్నసొమ్ముతో అతడు ఒక్క టెస్టుపుస్తకం ఆయినాకొనలేదు. అన్నీగైడ్లు, క్వశ్చెన్, ఆన్సర్ రకానిక చెందిన పుస్తకాలు కొన్నాడు. ఒకసారి అతడి పుస్తకాన్ని, అనసూయ వద్ద ఉండడంచూసింది. అంతేకాక అనసూయకి పాఠం చెప్తున్న తీరుని చూసేక తమ్ముడి చదువుమీద అట్టే ఆశలు పెట్టుకోకూడదనుకొంది లలిత.

దసరా సెలవలు అయిపోవచ్చేయి. ఇంక కాలేజీలు తెరవడానికి రెండు మూడురోజులు వుంది. ఆదివారంకావడాన తీరికగా పేపరు చూస్తూ కూర్చున్న లలితదగ్గరకు నెమ్మదిగా చేరజారేడు రామకోటి.

"ఏంరా....ఏం కావాలి?" అంది లలిత.

ఏదో తగినంతపని వుంటేనేకాని తమ్ముడు అలా తనదగ్గరికిరాడని ఆమెకు చిన్ననాటినుండి అనుభవంలోవున్న విషయమే.

"మరేం లేదక్కా! ఇక్కడినుంచి కాలేజీకి వెళ్ళిరావడానికి అనవసరంగా బోలెడుసొమ్ము, సమయం ఖర్చవుతున్నాయి. ఒక్కొక్కరోజు వేళకి తిన్నగా బస్సుఅందకపోతే క్లాసుకి వెళ్ళడంకూడా సరిగా జరగడంలేదు." అన్నాడు నెమ్మదిగా నీళ్ళు నములుతున్నట్లు.

"అయితే ఏమంటావు. నీకోసం ఇంకో ఇల్లుతీసుకొని పట్నంలో కాపురం పెట్టమంటావా ?" తమ్ముడిమనసులో తిరుగుతున్న ఆలోచన ఏమిటో పసికట్టడానికి ప్రయత్నిస్తూ ప్రశ్నించింది లలిత.

"అదికాదు.... కాలేజీకి దగ్గరగా నా స్నేహితు డొకడున్నాడు. కావాలంటే తమఇంట్లో ఉండమన్నాడు."

"మరి భోజనమో?"

"భోజనానికేముంది.... ఏదో ఒకటి తినవచ్చు. తినాలనుకొంటే వాళ్ళ ఇంట్లోనే తినవచ్చు" అన్నాడు అతడు.

లలితకి ఆ మాట నమ్మబుద్ధి కాలేదు. ఈ కరువురోజుల్లో అయిన వాళ్ళకే ఇంకో మనిషి ఇంట్లో ఉంటే, బరువు అన్నట్లుగా ఉంటే- ఎవరో స్నేహితుడు ఇల్లిచ్చి, తిండి పెడ్తాడా? ఇదేదో కట్టుకథ దీనివెనుక ఉన్న సంగతేమిటో తెలుసుకోవాలి-అనుకొంది.

"అంత గొప్ప స్నేహితుడే నీకుంటే నేనెందుకు వద్దంటాను. తప్పకుండా వెళ్ళి ఉండు" అంది.

"ఉండడం అంటె....ఊరకే ఉండడంకాదు.... ఏదో కొంత ముట్టచెప్పి...."

రామకోటి మాటవల్ల కాకపోయినా అనసూయ మంచికోసమైనా, అతడు కొంచెం దూరంగా ఉండడం మంచి దనుకొంది లలిత. చదువు నెపంతో ఇద్దరు దగ్గరికి చేరుతున్నారు. ఆ చదువు ఏ చదువులకి దారి తీస్తుందో అని ఆమెకి భయంగా ఉంది. తను ఉదయమనగా ఆఫీసుకి పోతే మళ్ళా సాయంకాలం దీపాలు పెట్టే వేళకి కాని ఇంటికి రాదు. అత్తగారికి వంటా, పనితోటే అయిపోతుంది. ఆ గదిలో వారిద్దరి మధ్య ఏం జరిగినా వంటఇంట్లో ఉండే ఆమెకు తెలిసే అవకాశం లేదు. ఇద్దరూ వయసులో ఉన్న పిల్లలు. ఏ వేళకి ఏ బుద్ధి పుట్టునో....?

ఈ సమస్యకి ఒకమార్గం చూడాలని ఆమె అనుకొంటుండగానే రామకోటి తనంత తాను దారి చూపడానికి కారణం ఏమిటో లలితకి అర్థం కాకుండాపోయింది.

'నువ్వు ఒకందుకు పోస్తున్నావు. నేను ఒకందుకు తాగుతున్నాను.' అన్న సామెతలా తయారయింది పరిస్థితి. ఇంటిలో ఉన్నంతసేపు సిగరెట్లు ముఖంచూసే అవకాశంలేక, గిలగిల్లాడిపోతున్న రామకోటి, అందుకు అనువుగా ఈ ఏర్పాటు చేసుకొన్నాడని లలితకి తెలియదు. అక్క మనసులో ఇంకేదో ఆలోచన ఉండబట్టే తన పని ఇంత సులువుగా నెరవేరిందని రామకోటికి తెలియదు.

సొమ్ము ఎత్తియ్యడం ఆర్థికంగా కొంత అదనపు భారమైనా, ఈ ఏర్పాటు జరిగేక కొండంత బరువు దింపుకొన్నట్లు అనిపించింది లలితకి.

ఆరు నెల్ల పరీక్షల్లో అనసూయ మార్కులు, ఆ పిల్లకి చదువుపట్ల ఉన్నదనుకున్న శ్రద్ధ, లేదని నిరూపించేయి.

"అప్పుడే చెప్పాను నా మాట విన్నావు కావు. దానికి విద్య నేర్చుకోవాలని, పరీక్షలు పేసవాలని కోరికలేదు. కేవలం కాలేజీ కెళ్ళిరావాలన్న సరదా తప్ప" అన్నాడు ప్రకాశం.

ఈ రకమైన అనసూయ మనస్తత్వాన్ని అంతకు పూర్వమే లలిత గ్రహించినా యిలా ప్రవేశపెట్టేక ఇంక అప్పుడు చేసేది ఏమీ లేదన్నట్టు ఊరుకొంది.

అంతవరకు అమ్మానాన్నల దగ్గర, అత్తా మామయ్యల వద్ద పంజరంలో పక్షిలా పెరిగింది అనసూయ. అప్పుడప్పుడే ఆశగా భవిష్యత్తులోకి చూస్తూ రెక్కలు విప్పుకొంటున్న వయసు స్వేచ్ఛకోరింది. ఇంటి నాలుగు గోడలుదాటి మిగిలిన ప్రపంచాన్నిచూడాలంటే కాలేజీలో చేరడం ఒక్కటే మార్గంగా ఆ పిల్లకి కనిపించింది. ఆ రెండు మూడేళ్ళు ప్రకాశంపడ్డ శ్రమ ఫలితంగా పరీక్షల్లో మంచి మార్కులు రావడంకూడ ఒకవిధంగా చదువు కొనసాగించాలనే ఆమె ఆలోచనకి బలం చేకూర్చింది.

కాని రోజులు గడుస్తున్నకొద్దీ ఆమె దృష్టి చదువుమీదనుంచి ఆడపిల్లల వేషభాషల మీదికి మళ్ళింది. అటువంటి అందమైన బట్టలు, నగలు, అలంకరణలు, వాటికినోచుకోని తను ఎంత దురదృష్టవంతురాలు-అన్నబాధ మనసులో బయలుదేరింది.

జీవితం గురించి, వ్యక్తి విధులగురించి అత్త చెప్పే కబుర్లు శ్రీరంగనీతుల్లాగ, అమ్మమ్మ అనే మాటలు చాదస్తంలాగ అనిపించసాగేయి అనసూయకి.

పట్నంలో ఉండి చదువుకొని ఉద్యోగం చేస్తున్నదన్నమాటే కానీ, నిజానికి అత్త జీవితంలో ఏం చూచింది? గానుగెద్దులా ఇంటినుండి ఆఫీసుకి, ఆఫీసునుండి ఇంటికి తిరగడం. రూపాయలు పైసలు లెక్కపెట్టుకొంటూ నెల గడపడం. అత్త దినచర్య తలచుకొని జాలిపడింది అనసూయ.

అత్త తనగురించే ఆలోచించుకొంటే, తన సుఖసంతోషాలు సంసారంగురించి పట్టించుకొంటే, అనసూయ అనే ఈ అమ్మాయి ఈ పరికి ఎక్కడ ఉండేది? ఏ పరిస్థితుల్లో ఉండేది——అనే ఆలోచన ఆ సమయంలో ఆ పిల మనసులోకి రాలేదు.

తమశక్తిలో ఉన్నంతవరకూ ఇతరులకి ఇంత మేలు చెయ్యడం లోనే మానవజన్మ సార్థకత ఉందని నమ్మే లలిత, ఈ బాధ్యతలు మీద వేసుకోడంవల్ల తానేదో నష్టపోయిందని, ఎప్పుడూ అనుకోలేదు. కాదంటే ఈ అవసరాల్ని గడుపుకోడానికి తగినంత ఆర్థిక స్తోమతు తమకి లేక పోయిందే అని దిగులుపడేది.

రామకోటి ఉద్యోగాన్ని వదలిపెట్టి చదువుకొంటానంటూ ఉత్తరం రాసినప్పుడు, పెద్దది అన్న గౌరవంతో తనకి ముందుగాతెలియజేసి ఉంటాడనుకొందే కాని, ఆ చదువు సంధ్యలకి బాధ్యత అంతా తాను భరించాలనుకోలేదు లలిత. ఆ ఉద్యోగంకోసం కట్టిన డిపాజిట్ నాలుగువందలుదాకా ఉంది. పైగా ఆ కాలంలో ఆదా చేసింది అంతో ఇంతో ఉండకపోదు. అది చాలనికాడికి తాము నిలుస్తే సరిపోతుంది అనుకొంది.

రామకోటి ఇంటికి వచ్చేక అసలు విషయం బయట పడింది. రెండు మూడు నెలలకి ముందరే ఉద్యోగంనుండి ఉద్వాసన లభించిందని, అప్పటినుంచి ఇంకో దానికోసం ప్రయత్నిస్తూ ఉన్న సొమ్ము ఖర్చుపెట్టుకొని తింటున్నాడని.

"అయిదారేళ్ళుగా చేస్తున్నవాడివి. ఉద్యోగంలోంచి ఎందుకు తీసేసేర్రా" అని లలిత ప్రశ్నిస్తే, రామకోటి నోటిలోనుంచి సరియైన జవాబురాలేదు. అధికారి మంచివాడు కాడనీ, తనంటే ఇష్టంలేదనీ. ఇలాగే ఏవేవో చెప్పేడు.

ఆర్నెల్లనాటికి అసలు విషయం బయటపడింది. తమ్ముడు ఆఫీసులో సొమ్ము వాడేసుకొన్నాడనీ. దానిని తీర్చడానికి ఇంకెక్కడో అప్పుచేసేడని....ఆ అప్పు అసలు, వడ్డీలతో పెరుగుతోందని.

ఆ రాత్రి తిన్నగా నిద్రపోలేకపోయింది లలిత. రెండు మూడు రోజులదాకా ఆఫీసులో తిన్నగా పనిచెయ్యలేకపోయింది.

తన చేతుల్లో పెరిగిన రామకోటి ఎందుకిలా తయారయేడు ? తన పెంపకంలో లోపమా, లేక వాడి వ్యక్తిత్వంలో లోపమా ? దీన్ని సరి

చెయ్యడం ఎలా ? మనిషి జీవితంలో ఏమున్నా లేకున్నా, నీతీ, నిజాయితీ ఉంటే బాగుపడ్తాడని వాడికి బోధపర్చడం ఎలా ?

రామకోటిని చూసినప్పుడల్లా లలిత మనసులో ఇవే విషయాలు సుళ్ళు తిరుగుతుండేవి. అక్కలో వచ్చిన ఈ మార్పుని కనిపెట్టిన రామకోటి కావాలనే ఆమెని తప్పించుకొని తిరుగుతుండేవాడు. పని పడినప్పుడు తప్ప మిగతా సమయాల్లో ఇంటికే వచ్చేవాడుకాడు. సొమ్ము అవసరం పడితే బావగార్ని అడిగిపుచ్చుకొని అక్క కంటపడకుండా సన్నగా జారిపోయేవాడు.

"చాలా రోజులయింది రామకోటిని చూసి. ఒకసారి వాడి గదివేపు వెళ్ళి వస్తాను" అంటూ బయలుదేరింది లలిత.

"పాపం .... రెండు రోజులై జ్వరంగా వుందిట" అంది అనసూయ.

"నీ కెలా తెలుసు?"

ఆ ప్రశ్నకి జవాబు చెప్పడానికి అనసూయ కాస్త తడబడింది.

"కాలేజీలో ఎవరో అనుకుంటుంటే విన్నాను" అంది నెమ్మదిగా.

రామకోటికి రెండురోజులు జ్వరం వస్తే కాలేజీలో చెప్పుకోవలసినంత గొప్ప విషయమా ? ఇది సరియైన సమాధానం కాదు, ఇందులో ఇంకేదో మెలిక ఉండి ఉంటుంది అనుకొంది లలిత.

కాలేజీలో ఎవరనుకొంటున్నారు ? నువ్వు వినడం ఎలా తటస్థించింది? ఇంట్లో ఎందుకు చెప్పలేదు? వంటి ప్రశ్నలు వేస్తే జవాబు చెప్పడానికి అనసూయ మనసులో ఏదో కథ అల్లుతున్నది.

కాని లలిత అటువంటిదేమీ అడగలేదు. ఒక్కసారి ఆ పిల్లవంక పరీక్షగా చూసి బయలుదేరింది.

రామకోటి చెప్పిన గుర్తుల్నిబట్టి, అతడు ఉండే చోటుని సులువు

గానే పోల్చుకుంది లలిత. ఒక నడివయసు ఆవిడ తలుపు తీసింది. లలిత తన పేరు చెప్పి 'రామకోటి ఇంట్లో ఉన్నాడా?' అని అడిగింది.

"మీరు రామకోటి అక్కగారా ?" అని ప్రశ్నించి – "మీ తమ్ముడికి మూడు రోజులై జ్వరంగా ఉంది. ఈరోజే కొంచెం పథ్యం తీసుకున్నాడు" అంది ఆవిడ గదివైపు చూస్తూ.

"అవునుట.... అనసూయ చెప్పింది" అంది లలిత ఆవిడ ముఖంలోకి సూటిగా చూస్తూ.

"అనసూయ అంటె సన్నగా పొడుగ్గా ఉండే ఆ అమ్మాయేగా?"

"మరేం ? .... ఆ పిల్లే .... మా మేనగోడలు"

"నిన్నా, మొన్నా చాలాసేపు ఇక్కడే కూర్చుంది. కాలేజీకి సెలవంట కదా ?"

"కావచ్చు—నాకు సరిగా తెలియదు అంది." లలిత ఆ విషయమై అంతకుమించి ఆవిడతో మాట్లాడ్డం ఇష్టంలేక.

రామకోటి గదితలుపు ఓరవాకిలిగా తెరచిఉంది.

"రామూ" అంటూ పిలుస్తూ లోపలికి అడుగుపెట్టింది లలిత. ఆ విధంగా చెప్పాచెయ్యకుండా అక్కడికి అక్క రావడం రామకోటికి కొంచెం ఇబ్బందిగానే అనిపించింది. ఎప్పుడూ లేనిది ఈ రోజు ఈవిడ ఇక్కడికి ఎందుకు ఇలా దిగబడిందా అన్నట్లు చూసేడు.

"ఏరా .... జ్వరమట కదా .... ఇంటికి వచ్చేయలేకపోయేవా .... ఈ గదిలో ఒక్కడివి పడిఉండకపోతే" అంది దగ్గరగాఉన్న పెట్టెమీద కూర్చుంటూ.

తనకి జ్వరమని అక్కకి ఎలా తెలిసివుంటుంది ? నిజంగా అందుకే చూడ్డానికి వచ్చిందా ?

వెలవెలపోతున్న తమ్ముడి ముఖంవంక పరీక్షగా చూసింది లలిత.

"ఏదో పనిమీద ఈదారిని వెడుతూ, నువ్వు గదిలో ఉన్నావేమోని ఓసారి ఇలా వచ్చేను. మీ స్నేహితుడి తల్లి అనుకుంటాను .... ఆవిడ

గుమ్మంలో కన్పించి చెప్పింది నీకు రెండు రోజులై జ్వరం వస్తున్నా దని''

'హమ్మయ్య .... అంతేకదా' అనుకొన్నాడు రామకోటి.

"అబ్బే పెద్దగా జ్వరం ఏం లేదే.... ఇప్పుడందరికీ వస్తున్నదే..... ఫ్లూ." అన్నాడు.

"ఇదిగో నా కేరాఫ్ ఎడ్రసుకి నీకేదో ఉత్తరం వచ్చింది. నిన్నా మొన్న అటుకాని వస్తావేమో ఇచ్చేయవచ్చు అనుకొన్నాను" అంటూ బ్యాగ్‌లోనుంచి ఒక కవరుతీసి రామకోటి చేతిలో పెట్టింది.

అతడు దాన్ని చదువుతుంటే రెప్పవేయకుండా అతడి ముఖంవంకే చూస్తూ అలా కూర్చుంది.

ఏదో అతిమామూలి ఉత్తరం అన్నట్లు దాన్ని చదవడం ముగించి తిరిగి కవర్లో పెట్టి పక్కమీద పడేసేడు రామకోటి.

తమ్ముడు ఏమైనా చెప్తాడేమో అని క్షణకాలం చూసింది లలిత. అతడు అటువంటి ప్రయత్నం ఏమీ చెయ్యకుండా ఇంకేదో మాట్లాడ్డం మొదలుపెట్టబోయేడు.

"ఆ చిత్తరంజన్ ఎవరో — నాకూ ఓ ఉత్తరం రాసేడు" అంది తనే ఆ విషయం కదుపుతూ.

త్రుళ్ళిపడి చూసేడు రామకోటి.

నీళ్ళు జల్లిన కొరకంచులా అయింది అతడి ముఖం.

"అంతాకలిపి అతడికి ఎంతియ్యాలి?" మళ్ళీ లలితే అడిగింది. ఈసారీ జవాబు చెప్పలేదు రామకోటి.

"మనిషికి డబ్బులేక పోయినా, నీతి, నిజాయితీ ఉంటే ఎలాగో లాగ బ్రతకవచ్చురా ... కనీసం తనమంచి కోరేవారితోనైనా మనసులోని కష్టం సుఖం చెప్పుకోగలిగేపాటి స్వచ్ఛత ఉండాలి బ్రతుకులో .... లేక పోతే, నెలకోసారైనా పారా నీళ్లు పోసి కడగని గచ్చునేలలా ఎక్కడి కక్కడ పేరుకుపోయి కంపుకొట్టిపోతుంది."

ఈసారి తమ్ముడి దగ్గరనుంచి జవాబు ఆశించలేదు లలిత. ఆ రెండు మాటలు అని, పక్కబల్లమీద పెట్టిన బ్యాగ్ చేతిలోకి తీసుకొని లేచింది. అప్పటికీ రామకోటి నోటివెంట మాట రాలేదు.

మౌనంగా గుమ్మందాకా వెళ్ళి వెనుతిరిగి చూస్తూ "రేపటికి సులువుగా లేకపోతే ఇంటికి వచ్చేయి. ఈగదిలో ఒక్కడివీ పడుండకు" అంది.

"అలాగే" అన్నాడు అప్పటికి నోరు పెగల్చుకొని రామకోటి.

ఆరోజు లలిత ఎప్పుడూ లేనంత సంతోషంగా ఉంది. నిజానికి ఆ ఆనందానికి నాంది, ఆ ఉదయం కళ్ళు తెరవడంతోనే మొదలయింది.

పళ్ళు తోముకొని, కాఫీ డికాషన్ తీసి, రెండుసార్లు కుంపట్లో బొగ్గులు పూచిపోందే, రోజూ పాలు తీసుకునిరాని గొల్లవాడు, ఆ రోజు ఇంకా చీకటి వుండగానే 'అమ్మగారు' అంటూ గుమ్మంలో కేకపెట్టేడు

"ఈరో జేమయిందిరా పెంటయ్యా .... ఇంత ఉదయాన్నే పాలు తెచ్చేవు; సూర్యుడు తూర్పున కాక పడమట ఉదయించడు కదా" అంది లలిత పాలు కొలిపించుకొంటూ.

"అదికాదమ్మగారూ ! ఈఏల మా ఇంటిది బొట్టిసీత సత్తెనారాయణ వ్రతం సేయిత్తున్నాది. 'బేగి పని తెముల్చుకొని రా మావా' అంది .... అందుకని —" అన్నాడు పాలకావిడి ఎత్తుకొని వెళ్తూ పెంటయ్య. "రోజూ నీ ఇంట వ్రతం కానూ." అనుకొంది లలిత వేకువజామునే వేడి వేడి కాఫీ తాగుతూ.

తెల్లవారి అత్తగారి పూజ పువ్వులకి సెజ్జ పట్టుకొని పెరట్లోకి వచ్చేసరికి ఎంతోకాలంగా ఎదురుచూస్తున్న పచ్చగులాబి మొగ్గ అందాలు చిందుతూ ఆరవిచ్చి "అక్కా" అని పలకరించింది.

ముత్యాల్లాంటి మంచుబిందువులతో ముగ్ధమోహన సుందరిలా మెరసిపోతున్నది. మోకాళ్ళమీదపడి అప్యాయంగా అరవిచ్చిన ఆ పువ్వు వంక చూసింది లలిత.

అది ఉట్టి గొడ్డుమొక్క అనీ — ఇంక ఎన్నటికీ పువ్వులే పుయ్య దనీ, అదనీ ....ఇదనీ చూసినవాళ్ళంతా ఏమేమో అన్నారు. అయినా లలి తకి వారి మాటలు నమ్మబుద్ధికాలేదు. తన జీవనసాఫల్యంకోసం ఆకుకి, మారాకు వేసుకొని పెరుగుతున్న ఆ లత పూత పట్టకుండా, ఎందుకు మిగిలిపోతుంది ? నాలుగురోజులు అటో ఇటో తప్పక పూస్తుంది — అనుకుంది.

ఈ రోజుల్లో మనుషుల్లాగే మొక్కలుకూడా ఫామిలీప్లానింగ్ మొదలుపెట్టేయేమో? తనలాగే ఆ గులాబి తీగెకూడా 'అభీనహీ అభీనహీ' అని వాయిదా వేసిందేమో ?

లలిత తన మనసులో కదలిన ఆలోచనకి చిన్నగా నవ్వుకొంటూ పువ్వులు కోసుకొని ఇంటిలోకి వెళ్ళిపోయింది.

"ఉదయానె ఎందుకే అలా నవ్వుతున్నావు" అంది రాజమ్మ కోడలి చేతిలో పువ్వులు అందుకొంటూ.

"ఇన్నాళ్ళకి పచ్చగులాబిపువ్వు పూసింది" అంది లలిత.

"దానికి నవ్వడం ఎందుకూ ?" అంది రాజమ్మ లలితవంక వింతగా చూస్తూ. తనకి నవ్వు ఎందుకొచ్చిందో ఆ కారణం లలిత చెప్పలేదు." ఏం లే దత్తయ్యా ఊరికే ....ఏదోమాట తలుపుకొచ్చి" అంది.

ఆమాట ఏమిటని రాజమ్మ అడగనూ లేదు. లలిత చెప్పనూలేదు.

ఉదయం మొదలైన ఉత్సాహం ఎండతోపాటు పెరుగుతూ బలం పుంజుకొందే కాని వడిలిపోయి తరగిపోలేదు. స్కూటరు సర్వీసుకు వెళ్ళింది. ఆ ఉదయం పూట బస్సుకోసం ఎంత పడిగాపులు పడాలో అని అనుకొంటుంటే ఆమెకోసమే నిరీక్షిస్తున్నట్లు లలిత, బస్సుస్టాపులో కాలు పెట్టేసరికి టంచన్‌గా వచ్చి నిల్చింది ఇరవై నెంబరు బస్సు.

లలిత అఫీసు చేరుకొనేసరికి ఇంకా అధికారి కారు, గుమ్మంముందు కన్పించలేదు. గోడగడియారంలో చిన్నముల్లు పది అంకెకి బాగాదూరంలో ఉంది.

ఆమె తన సీటులో కూర్చుని ముందురోజు విడిచిపెట్టిన కాగితాలు పైను చేస్తుంటే కారులోంచి దిగేడు ఆఫీసరు. గడియారంలో చిన్నముల్లు పదికి దగ్గరగా పరుగుపెట్టింది. అయినా ఆఫీసుకి అరడజను మందైనా అప్పటికి రాలేదు. వచ్చిన వాళ్ళుకూడా వరండాలో తిరుగుతూ దేశ రాజకీయాలు చర్చించుకొంటున్నారు.

అధికారి రాక గమనించి ఒకరిద్దరు ఆదరా బాదరావచ్చి అయినవీ, కానివీ ఫైళ్ళు మహాదీక్షగా పరిశీలించడం మొదలుపెట్టేరు. మేనేజరు దేవాంతకుడు, ఎవరు పని చేస్తున్నది.... ఎవరు పనిచేస్తునట్లు నటిస్తున్నది ఇట్టే గ్రహించగలడు.

లలిత టేబిలు ముందుకివచ్చి ఆమెచేస్తున్న పనిచూసి తృప్తిగా తల పంకించేడు. పక్క సీటులో ఉన్న సుబ్బారావు చేతిలో తల్ల కిందులుగా ఉన్న పైలుని అటునుంచి ఇటు తిప్పి పెట్టేడు.

"మీ సంగతి నాకు తెలియదా!" అన్నట్లు అక్కడఉన్న అందరి వంక ఒకసారిచూసి తన గదిలోకి వెళ్ళిపోయేడు. అతడితోపాటు రిజిష్టర్ కూడా అటు కాలు కదిపింది. అటు తరువాత వచ్చిన వారంతా ఆ గదిలో ఉన్న స్వామిని దర్శించుకొని తీర్థప్రసాదాలు అందుకొని అప్పుడు పనిలో వెయ్యి పెట్టవలసి ఉంటుంది.

లంచ్ టైములో తెలిసింది లలితకి. ఆ ఏడు తనకి రెండు ఇంక్రిమెంట్లు వచ్చినట్లు. ఆ సంవత్సరం కంపెనీకి బాగా లాభాలు వచ్చేయిట. అన్ని బ్రాంచీల్లో పని చేసేవాళ్ళకి రెండు నెలల జీతం బోనస్‌గా ఇచ్చేరు. ఒక్కసారిగా ఆఫీసులో వాతావరణమే మారిపోయింది. నెల మధ్యలో చేతిలో అంత సొమ్ము పడ్డంవల్ల ముఖాల్లోపేరుకొన్న జిడ్డుకాస్తాపోయింది.

అయిదు గంటలకి ఇంకా పది నిమిషాలు ఉంవనగానే లలిత పని

పూర్తయింది. "కొంచెంపనుంది వెళ్తానుఅనిఅడిగితే, 'దేనికి, ఎందుకు.... ఇంకా ఆఫీసు టైము పూర్తికాలేదే' వంటి మాటలతో నాన్చక "ఓ....కె" అంటూ అనుమతి ఇచ్చేడు మేనేజరు.

నెల మధ్యలో అంతసొమ్ము లలిత హాండ్‌బ్యాగ్‌లో కొత్తగా కద లాడుతున్నాది. ఏం చెయ్యడం?.... ఈ సొమ్ముతో ఏం చెయ్యడం ? రక రకాల ఆలోచనలు మనసులో తిరుగుతున్నాయి. నేను....నేను.... అంటూ ఎన్నో కోర్కెలు, అవసరాలు తోసుకొంటూ, తొర్లుకొంటూ ముందుకి వస్తున్నాయి.

అలా ఆలోచిస్తూనే ఒక బస్సుమారి రెండో బస్సుకోసం స్టాపులో నిలబడింది లలిత. అప్పుడే బస్సులోంచి దిగిన రామకోటి "అక్కా" అని పిలిచేవరకు ఆలోచనలు ఆమెచుట్టూ జోరీగల్లా అలా ముసురుతూనే ఉన్నాయి.

"ఈ రోజు ఇంత త్వరగా బైటపడ్డావేం?" అన్నాడు రామకోటి ఆశ్చర్యంగా.

"పనయి పోయిందిరా" అంది లలిత.

"పని ఉన్నా లేకున్నా అయిదు కానిదే కదలనివ్వడుగా ఆ దామో దరుడు"

"అది నిజమే అనుకో.... ఈ రోజు ఏ కళనున్నాడో కాదనలేదు. అంతేకాదు. ఈ రోజు ఇంకో వింతకూడా జరిగింది. ఏమిటో తెలుసా. నేను అతడికన్న ముందుగా ఆఫీసులో కాలుపెట్టడం"

"నిజంగా అది ఆశ్చర్యకరమైన విషయమే."

"ఇటువంటి వింతలు ఇంకా మరికొన్ని వున్నాయి."

"అయితే నా గదికిరా.... నేనూ ఒక విశేషం చెప్తాను." అన్నాడు రామకోటి కుడిపక్కకి దారితీస్తూ.

"అసెటు.... రిక్షామీద వెళ్దామా?" అంది లలిత.

"రిక్షా ఎందుకు ఈ పక్క సందులోనే ఉంటున్నాను. పూర్వం మనం వుంటూఉండే వాళ్ళమే ఆ వీధిలోనే.... మొన్ననేఅక్కడికిమారేను.. ఇంకా ఈ రోజు మీ ఇంటికివచ్చి చెప్పాలనుకొంటుండగానే నువ్వు ఇలా అనుకోకుండా కన్పించేవు."

ఇల్లు చేరేక అప్పుడు చెప్పేడు రామకోటి తనకి కాల్‌టెక్స్‌లో ఉద్యోగం వచ్చిందని.

"ఆ మధ్య ఇంటర్వ్యూకి వెళ్ళేనన్నావు....అదేనా ?"

"అదే....అదే....ఎల్లుండి సోమవారం వచ్చి చేరమన్నారు"

"ఎంతఅదృష్టవంతుడివిరా....ఈరోజుల్లో రికమండేషన్లు, లంచాలు లేందే ఇటువంటి ఉద్యోగాలు రావడం అరుదు. నిజంగా నువ్వు అదృష్టవంతుడివి" అంది లలిత ఉత్సాహం, తృప్తి, సంతోషం ముప్పిరిగొన్న స్వరంతో.

తనకి డబుల్ ఇంక్రిమెంట్లు రావడం గురించి, బోనస్ విషయం చెప్పింది లలిత. మరి కాస్తసేపు అక్కా తమ్ముళ్ళు ఆ మాట ఈ మాట అనుకొన్నాక.

"ఇంక వెళ్తారా" అంటూ లేచింది లలిత.

వీధి గుమ్మం దిగి వస్తుంటే పంకజం అత్తగారు కన్పించింది.

"ఇంతకాలానికి మా వీధికివచ్చి మా ఇంటికి రాకుండా వెళ్ళిపోతావా?" అంటూ అటకాయించింది.

ఆవిడ అంతలా అంటుంటే కాదని వెళ్ళిపోవటం మర్యాదగా ఉండదని వాళ్ళ గడపలో కాలుపెట్టింది లలిత.

ఇల్లంతా ఖాళీగా ఉంది. పంకజం పిల్లలు ఉన్న అలికిడిలేదు. "పంకజం ఇంట్లో లేదా?" అంది అటు ఇటు చూస్తూ.

"పురిటికి పుట్టింటికెళ్ళింది."

"మళ్ళీనా?" ఆందోళనగా అడిగింది లలిత.

"మళ్ళానా అనడానికి ఏ పదిమంది పుట్టేరని ? నిండా ముప్ఫయి ఏళ్ళు లేవు....అప్పుడే కానుపు ఎత్తికట్టి కూర్చుంటుందనుకున్నావా?"

"అదికాదు మామ్మగారూ; అసలే పంకజం ఆరోగ్యం అంతంత మాత్రం. ప్రతి పురుడూ ఓ గండం.... నలుగురు పిల్లలు ఉన్నారు కదా చాలదా....?"

"చాలు....చాలదు అనుకోడానికి మనఇష్టమా. కావాలంటే పుట్టుకు వస్తున్నారు కాబట్టా, ఒద్దంటే మానేయడానికి.... ఆరోగ్యంగా మహారాజులా ఉన్నావు, కాపురానికి వెళ్ళి ఇన్నేళ్ళయింది.... ఏదీ నీ కడుపులో కాయ కాసిందా ? ఏదీ మన చేతిల్లో లేదే తల్లీ."

"ఉంది ....ఉంది... అంతా మనచేతిలోనే ఉంది. కావాలనుకుంటే నాకూ పుడ్తారు పిల్లలు. మీరు అనుకొంటున్నట్లు నేను గొడ్రాలును కాదు. కాని, నేనింకా కావాలనుకోలేదు. ఆ సమయం ఇంకా రాలేదు."

లలిత తన మనసులోనే అనుకొంది. ఆమె మాట్లాడకపోవడం చూసి అనవసరంగా ఆ పిల్ల మనసు నొప్పించేను అనుకొంది రామాయమ్మ. అందుకే మాట మారుస్తూ "మీ అత్తగారు బాగుందా ? — చూసి చాలా రోజులయింది. ఎప్పటికప్పుడు అటు రావాలనుకొంటూనే పట్టంలేదు. అదొక ఊరు, ఇదొక ఊరు అన్నట్లు తయారయింది" అంది.

"బాగున్నారండీ — ఆవిడా ఓసారి ఇటు రావాలనే అనుకొంటున్నారు" అంటూ జవాబు చెప్పింది లలిత. మరి అయిదు నిముషాలు గడచేక "ఇంక వస్తానండి" అంటూ లేచింది.

"మంచిదమ్మా, వెళ్ళిరా—ఎప్పుడైనా ఇటు వచ్చినప్పుడు ఓసారి తొంగి చూసిపోతుండు." అంటూ గుమ్మంవరకు అంపకం పెట్టడానికి వచ్చింది. లలిత మెట్లు దిగుతుంటే "ఇదిగో అమ్మాయి — నేను పూర్ణ యాత్రా రైల్లో తీర్థయాత్రలకి వెళ్తున్నానని మీ అత్తగారితో చెప్పు. ఎక్కడనుంచైనా ఆవిడకి ఏమైనా కావాలంటే తెచ్చిపెడ్తానని చెప్పు" అంది.

ఎంతోకాలంగా దారీతెన్నూ తెలియక చీకటిలో కొట్టు, మిట్టాడుతున్న బాటసారికి, ఒక్కసారిగా మెరుపుమెరిసి ముందుదారి కళ్ళముందు నిల్చినట్లు అనిపించింది లలితకి ఆవిడ మాటతో.

వెళ్తున్నదల్లా వెనక్కి తిరిగివచ్చి "ఎవరెవరు వెళ్తున్నారు — ఎప్పుడు వెళ్తున్నారు ?" వంటిప్రశ్నలు వేసింది.

"అంతా పది పదిహేనుమందిమి ఇక్కడినుంచి వెళ్తున్నాం. నేను, పక్కింటి అన్నపూర్ణమ్మ, జోగి పంతులు తల్లి, పుల్లమ్మగారి వెంకాయమ్మ, అమ్మన్నగారి సత్తెమ్మ — —" ప్రయాణీకుల పేర్లని వేళ్ళ లెక్కిస్తూ చెప్పింది ఆవిడ.

"ఎప్పుడు వెళ్తున్నారు ?" మళ్ళా అడిగింది లలిత.

"ఈ పున్నం వెళ్ళిన పంచమినాడు"

"అంటే ఏవారం అయింది?"

'ఎల్లుండి శనివారం ఏకాదశి అయితే పున్నం వెళ్ళిన పంచమి ఏ వారం అయిందో ఆపాటి లెక్కకట్టుకోలేవా ?' — అన్నట్లు చూసింది రామాయమ్మ.

"రేపు సోమవారంకాక వచ్చే సోమవారం" లెక్క కట్టుకోడం ఎలాగా లలితకి చాతకాదని నిర్ధారించుకొని ఆవిడే చెప్పేసింది.

"వచ్చే సోమవారం — ఏ తేదీ అయింది చెప్మా" లలిత తనలో తనే అనుకొంది.

"ఆ తారీఖులు ....గీరీఖులు నాకే తెలియవు సుమా" అంది ఆవిడ అదీ తనే చెప్పాలని లలిత అడిగిందనుకొని.

"అది సరే ? దానికిటిక్కెట్లు వగైరా కొనడం. ఆగేచోట్ల బసలు, ఆ ఏర్పాట్లు —"

"అవన్నీ మావాడు చూస్తున్నాడు. వాడుకూడా మాతోపాటే ఉంటాడుగా." అంది ఆవిడ.

క్షణకాలం ఆలోచించింది లలిత. రాజమ్మకి యాత్రలు జరగా

అంటే ఇంతకిమించిన మంచి అవకాశం రాదు. పదిమంది తెలిసిన వాళ్లు న్నారు. ఏర్పాట్లు వగైరాలన్నీ చూసుకోడానికి ఒక మగాడంటూ ఉన్నాడు. అన్నిటికీమించి నెలమధ్యలో అనుకోకుండా చేతిలో సొమ్ము పడింది.

గంగలో ఒకసారి మునగాలనీ, విశ్వేశ్వరుణ్ణి ఒకసారి దర్శించుకు రావాలనీ, ఎంతోకాలంగా అనుకొంటున్నాది ఆమె. ఎప్పటికప్పుడు ఏదో రకమైన అవకాశం కలసివచ్చినా తమ ఆర్థిక చిక్కులు చూస్తూ, నోరువిడిచి ఆ మాట అనలేక ఊరుకొంటున్నాది, నిర్మలమైన మనసుతో ఆవిడ కోరుకుంటున్న కోరిక ఆ విశ్వేశ్వరుడి చెవులవరకు చేరిందేమో ? అతడే ఈ రోజున ఈ విధంగా ప్రయాణానికి ఏర్పాటు చేసేడేమో ? అనిపించింది లలితకి.

ఇంక వెనుకముందు ఆలోచించవలసిన పనిలేదు. అయాచితంగా తన చేతిలోపడ్డ సొమ్ముకి ఇంతకుమించిన సదుపయోగం తను కల్పించలేదు. తనకి తల్లిలేని లోటుని తీర్చిన మాతృమూర్తి రాజమ్మ. ఈ సొమ్ముతో ఆవిడ మనసుకి ఆపాటి తృప్తి కలిగించితే తనకి అంతకుమించి కోరవలసింది లేదు.

"మామ్మగారూ" అంది లలిత తన ఆలోచన పూర్తిచేసి.

"ఏమమ్మా" అంది ఆవిడ ఏం కావాలి అన్నట్లు చూస్తూ.

"మీ అందరితోపాటు మా అత్తగారినికూడా యాత్రలు చేయించి తీసుకురావాలి."

"అయ్యో — అదేం భాగ్యం. ఆవిడ సొమ్ము ఆవిడ పెట్టుకువస్తానంటే తీసుకువెళ్ళడానికి నాదేం పోయింది. ఒకరికొకరు తోడుగా వుంటే మాకే మంచిది" అంది రామాయమ్మ.

"మీ అబ్బాయితో ఈమాట చెప్పండి. నేను రేపు సాయంకాలం మళ్ళీ వస్తాను. టిక్కెట్టుకి దానికి సొమ్ము ఎంతఖతే అంతా ఇచ్చేస్తాను. మా అత్తగారి పేరుతోకూడా ఒక టిక్కెట్టు తీసుకోమనండి ...."

"మీ అత్తగార్ని అడగవద్దూ ?"

"అక్కర్లేదు....ఎంతోకాలంగా ఆవిడ వెళ్ళాలనే అనుకుంటు న్నారు. సాయంలేక ఊరుకున్నారు. కాని...."

"నిజమేలే....డబ్బుపెడ్తాను అత్తా తీర్థయాత్రలు చేసుకురా—అని కోడలంటే ఏ అత్త కాదంటుంది—ఏమిటో అనుకొన్నాను కాని, మా రాజమ్మ నిజంగా అదృష్టవంతురాలు—మణిపూసలాంటి కోడల్ని సంపా దించింది—ఎందుకూ—నాకూవుంది ఓ కోడలు—ఎంతసేపు ఆ పుట్టింటి వారికి దోచి పెట్టాలనే కాని—"

"మరి నే వెళ్ళొస్తానండి —మీ అబ్బాయితో చెప్పడంమాత్రం మరచిపోకండి" అని మరొకసారి ఆవిడకి గుర్తుచేసి ఇంటిదారి పట్టింది లలిత.

* * *

లలిత ఇంటికి చేరేసరికి రాజమ్మ ఒక్కతే వరండాలో కూర్చుని ఉంది. అనసూయగదిలో లైటులేదు. ఇంట్లో మరెక్కడా ఉన్న అలికిడి లేదు.

"అనసూయ కన్పించదేం" మంచినీళ్ళుతాగిన గ్లాసుని బల్లమీద పెడుతూ అడిగింది.

"దానిపరీక్ష పోయిందిట. చూసేవా" అంది రాజమ్మ విచారం, నిరాశా వ్యక్తంచేస్తూ.

"అయ్యో—అలాగా" అంది లలిత దిగులుగా.

ఆ రోజు ఉదయం లలిత ఆఫీసుకి వెళ్ళేసరికి ఇంకా పేపరువాడు రాలేదు. రోజూ అయితే ఏడు ఏడున్నరకల్లా పేపరు ఇచ్చేసేవాడు.అంతా కాకపోయినా ఓ సారి నాలుగుపేజీలు తిప్పి ముఖ్యవార్తలుచూసి వెళ్ళి పోయేది. సాయంకాలం తిరిగివచ్చేక సావకాశంగా మిగిలిన సమాచారాలు

చదివేది. ఒక్కొక్కరోజు పని ఎక్కువగా లేనప్పుడు ఆఫీసులో లంచ్ టైములో చూట్టంకూడా అలవాటే. ఆరోజు అక్కడకూడా పేపరు చదువు తుండగా చూసేరని వీప ...అన్నారేకాని అసలు వస్తువుమాత్రం కంటపడ లేదు. సర్లే—ఇంతలో మించిపోయే వార్తలేముంటాయి. ఇంటికి వెళ్ళాకే చూడొచ్చుఅని ఊరుకొంది లలిత.

తనగదిలోకి రాగానే రామకోటికూడా అక్కముఖంలోకి చూస్తూ "ఈరోజు పేపరుచూసేవా?" అన్నాడు.

"ఏంరా—ఏం సంగతి? ప్రత్యేకంగా అడుగుతున్నావు—విశేషా లేమైనా ఉన్నాయా?" అంది లలిత.

"అబ్బే—ఊరకే అడిగేను – విశాఖపట్నానికి ఉక్కుకర్మాగారం రావాలంటూ ఆమధ్య అంత అల్లరి చేసేరా—ఈరోజు పేపర్లో వార్తలు చూస్తుంటే అదంత తొందర్లో వచ్చేలాలేదు" అన్నాడు.

"అల్లర్లతో, అరుపులతో పనులు సానుకూలపడ్తాయని ఎవరు మాత్రం అనుకొన్నారు. చేసుకొనేవిధంగా చేసుకొనే తెలివితేటలుంటే వస్తుంది – లేకుంటే లేదు.

"నా అభిప్రాయంలో ప్రభుత్వం ఇటువంటి ఒత్తిడికి లొంగి నిర్ణ యాలు తీసుకోకూడదు. అటువంటి చర్య దేశానికి, ప్రజలకికూడా మంచిది కాదు. ఏదైనా పని జరగాలంటే ఇదొక్కటేమార్గం అన్నట్లు తయారవు తుంది .... ...."

"ఇప్పుడు మాత్రం అందుకు భిన్నంగా ఉందంటావా ?"

"అదీ నిజమే అనుకో... అయినా ఈ విశాఖపట్నానికి ఉక్కు కర్మాగారం కన్నా ముందుగా కావలసింది మంచినీటి సదుపాయం. మూడు రోజులై ఉదయంపూట నిండా గంటసేపైనా కొళాయిల్లోంచి నీళ్ళు రావడంలేదు. నీళ్ళకోసం నిలబడ్డ ఆ క్యూలు చూస్తుంటే ఈ బిందెలన్నీ ఎప్పటికైనా నిండుతాయా—అనిపిస్తున్నాది."

"మీకైతే నీళ్ళ బిళ్ళయినా వస్తాయి. ఇటువైపు అదీలేదు. రెండు

రోజులై తాగేందుకుకూడా తిన్నగా నీళ్లు ఉండటంలేదు'' అన్నాడు రామకోటి. మరికా స్తసేపు ఇలాగే అవీ అవీ మాట్లాడుకొన్నాక బస్సుస్టాపుదాకా వచ్చి లలితని పంపించాడు రామకోటి.

అనసూయ పరీక్షపోయిన విషయం, రామకోటి పేపర్లో చూసి ఉంటాడు. తను ఆ విషయం ఏమీ చెప్పకపోవడం చేత పేపరు చూసేవా అని అడిగిఉంటాడు. మంచి వార్త అయితే తనంత తానుగా చెప్పును. పోయిందన్న వార్త ఇంటికి వెళ్ళేక అదే తెలుస్తుంది. అని ఊరుకొని ఉంటాడు — అనుకొంది లలిత.

ఆరోజు ఉదయం లేచినదగ్గరనుంచి అన్నీ మంచి మాటలే చెవుల్లో పడ్డాయి. కడుపునిండా అన్నంతిన్నాక చివరి కడిలో పంటికిందపడ్డ మట్టి బెడ్డలా అనిపించింది అనసూయ పరీక్ష పోయినవార్త. అయినా ఈ దెబ్బకి అంతగా లొంగిపోలేదు లలిత "పోన్లే సెప్టెంబరుకి కట్టి పాసవుతుంది. కష్టపడి చదివింది ........ప్రాప్తంలేదు పోయింది ఏం చేస్తాం ?" అనుకొంది పేపరు మడిచిపెడుతూ.

అనసూయని ఓదారుస్తూ ఆ మాటే చెప్పింది.

"మళ్ళా కట్టినా పాసవుతానన్న నమ్మకం నాకు లేదత్తా. నాది వుట్టి మట్టి బుర్ర. అందుకే ఏడాదిపాటు చదివి ఆపాటి పాసుమార్కులు కూడా తెచ్చుకోలేక పోయేను. అప్పుడంటే మామయ్య, నువ్వు నూరిపోసేరు. జవాబులు బట్టీపెట్టి ఎలాగోలాగ మార్కులు తెచ్చుకొన్నాను. అంతా నా తెలివి తేటలనుకొన్నాను ....ఇప్పుడు తేలిపోయింది నా శక్తి .... అనవసరంగా మీ సొమ్ము పాడుచేసేను. మీరన్నట్లు ఏదైనా ట్రెయినింగుకి వెళ్ళవలసింది" అంటూ బాధపడింది అనసూయ.

"అనవసరంగా అలా దిగులుపడకు అనసూయా! పరీక్ష పాసైనా పోయినా, ఒక ఏడాదిపాటు కాలేజీకివెళ్ళి నలుగురిమధ్య తిరుగుతూ

చదువుకొన్నావు... ఆ అనుభవం నీకు జీవితంలో ఎంతో కొంత ఉపయోగించకపోదు. కావాలనుకొంటే మళ్లా సెప్టెంబరుకి కడుదువుగాని, లేదంటే ఏదో ఒక ట్రెయినింగుకి వెళ్ధువుగాని....మీ మామయ్య వచ్చేక అవన్నీ ఆలోచిద్దాం....లే...లేచి ముఖం కడుక్కో ... ఉదయంకూడా తిన్నగా భోజనం చెయ్యకుండా లేచిపోయావుట ... ఇద్దరం కలసి భోజనం చేద్దాం....లేచిరా" అంటూ ధైర్యం చెప్పింది లలిత.

భోజనాలు పూర్తిఅయేక రాజమ్మ ప్రయాణ విషయం బయట పెట్టింది లలిత.

"ఇప్పుడెందుకమ్మా! బోలెడు డబ్బు ఖర్చు. ఇంకోసారిచూద్దాంలే" అంది రాజమ్మ.

కోడలి కష్టానికి గుర్తింపు వచ్చిందన్న విషయం తెలుసుకొని రాజమ్మ సంతోషించింది. అయినా, ఆ సొమ్ము తనకింద ఖర్చుచెయ్యడానికి ఆవిడ ఇష్టపడలేదు.

"వచ్చే నెలలో అబ్బాయి ఆ మీటింగో .... ఏదో దానికోసం మద్రాసు వెళ్తానంటున్నాడుకదా....హాయిగా నువ్వూ ఒకనెల్లాళ్ళు సెలవు పెట్టి ఇద్దరూ ఇటుఅటు తిరిగిరండి. పెళ్ళి చేసుకొన్నారన్న మాటేకాని ఓ అచ్చటా ముచ్చటా ఏంతీరింది మీకు ? ఎప్పటికప్పుడు ఏదో దానికి అప్పులు చేస్తుండడం, అవి తీరుస్తుండడం, వాటితోనే అయిపోతున్నాయి రోజులు" అంది రాజమ్మ అదనంగా చేతిలోపడ్డ ఆసొమ్ము ఖర్చుపెట్ట డానికి మార్గం చూపుతూ.

క్షణకాలం లలిత మనసు కోర్కెల ప్రలోభానికి లొంగి ఊగిసలాడింది. కాని అంతలో బుద్ధి హితవుచెప్పింది. 'నువ్వు చిన్నపిల్లవు ఎప్పుడైనా వెళ్తావు, వొస్తావు. ఈ ఏటికి ఆవిడ ఇలాఉంది ! వచ్చేఏడుకి ఎలా ఉంటుందో—పెద్దది ఆవిడకోరిక ముందు తీరని!'అంటూ.

లలితమాట మారుస్తూ "నాకెంత వయసుంటుంది అత్తయ్యా" అంది.

"ఎంతోలే....రాత్రిపూట ఏళ్ళసంగతి ఎందుకు" అంది రాజమ్మ.

"అదికాదు... మాటకి అడుగుతున్నాను.. మీకంటే కనీసం పాతి కేళ్ళయినా చిన్నదాన్నిఅయే ఉంటాను....అవునా?"

రాజమ్మ అవును. కాదు అనలేదు. రాత్రిపూట వయసు అడగ కూడదు చెప్పకూడదు—అంటారు. అందుకే మౌనంగా ఊరుకొంది.

"తిని కూర్చుని ఎందుకొచ్చిన ప్రశ్నలివి" అని విసుక్కుంది.

"మృత్యుదేవత ఎవర్ని ఎత్తుకుపోవలసి ఉందా అని రాత్రిపూట ఇంటింటికి సంచారంచేస్తూ ఉంటుందిట. ఈ మనిషికి ఇన్నేళ్ళు అని తెలుస్తే, అయ్యో మరచిపోయేను. వీడిఆయుర్దాయం అయిపోయినట్లుందే అని లెక్కలుచూచుకొని, అంచక్కా నోటకరుచుకుపోతుందిట...."ఇలాగే ఏవేవో కథలు చెప్తారు పెద్దవాళ్ళు.

"మరేం లేదత్తయ్యా. ఎందుకడిగానంటే—మీకంటే చిన్నదాన్ని. ఒంట్లో శక్తిఉంది. అంతగా కావాలనుకొంటే ఆపాటి అప్పో సప్పో పుట్టించుకోగల పరపతిఉంది. నా మాటకేం ఎప్పుడైనావెళ్తాను. ఈసారికి మీరు పెళ్ళిరండి. మీరు ఇంట్లోంచి కాలు కదపాలంటే తగిన సాయం ఉండాలి... ఆపైని ఒకఏడుకి ఇంకోఏడు పైబడ్తుంటే దూరప్రయాణాలు చెయ్యడం కూడ కష్టం...."

"అదికాదమ్మా ! ఇలా ఒక్కసారిగా ఇంతసొమ్ము నీ చేతిలోపడ్డం అరుదు. ఇదికాస్తా నా తీర్థయాత్రలకి ఖర్చుపెట్టుకోడం అంటే విన్నవారికి కూడా బాగుండదు. ఇప్పుడు ఇంటికోసం మెడలోఉన్న ఒక్కగొలుసు అమ్మేసేవు. అప్పటినుంచి పసుపుతాడుతో మంగళసూత్రాలు కట్టుకొని ఉన్నావు. నా మాటవిని ఈ సొమ్ముతో ఒక.... నగో.... నత్రో చేయించుకో...."

"అయితే ఓపని చెయ్యండి అత్తయ్యా" అంది లలిత అప్పుడే కొత్తగా మనసులోకివచ్చిన విషయం ఏదో చెప్తున్నట్లు.

"ఏమిటమ్మా" అంది రాజమ్మ లలిత ఇంకేదో చెప్తుంది అన్నట్లు వింటూ.

"మీ యాత్రల్లో ఎలాగా తిరుపతి వెళ్తారుగా; ఎవరూ వినకుండా చూసి ఆ వెంకటరమణుడిని నాలుగుచీవాట్లు పెట్టండి .... మగాడివై ఉండి ఇన్నినగలు దిగవేసుకోపోతే మా కోడలు ఆడకూతురు, పసుపుతాడులో మంగళసూత్రాలు కట్టుకొనిఉంది... ఓ గొలుసో... కాసులపేరో... పంప రాదా అని."

"ఛీ. . అల్లరిపిల్ల... ఏళ్ళయితే వస్తున్నాయి కాని.... నీ మాటలు ఆ నాటికి ఈనాటికి ఒక్కలాగే ఉన్నాయి" అంది కోడలి చిలిపి మాటలకి చిన్నగా ముచ్చటపడ్తూ.

"అయినా నేనూ అడగాలనే అనుకొంటున్నాన్లే ... కాని నువ్వన్న కాసులపేరు గొలుసుకాదు. ఇంకొకటి" అంది రాజమ్మ కోడలివేపు అర్థవంతంగా చూస్తూ.

ఆమె వెంకటేశ్వరుణ్ణి కోరదలచిన వరమేదో లలిత గ్రహించింది. ఆరోజు తెల్లవారేక ఏదోరూపాన ఆ విషయం మళ్ళా మళ్ళా అన్నిసార్లు మనసులోకి రావడం ఆశ్చర్యం కలిగించింది.

"ఈ రోజు ఈ విషయం ఎందుకిన్నిసార్లు ప్రత్యక్షమవుతున్నాది? ఆ సమయం వచ్చిందా ?" తన్నితానే ప్రశ్నించుకోసాగింది లలిత.

"అత్తా... నీ మంచం, పక్కా, వరండాలో వెయ్యమంటావా? గది లోనే ఉంచేయమంటావా?" అంటూ అక్కడికి వచ్చింది అనసూయ.

ఆ ఉదయంనుంచి పరీక్ష పోయిందన్న విచారంతో, వేదనతో ముఖం పీక్కుపోయి, కళతప్పిఉన్న అనసూయని చూస్తూ, "ఇంకా రాలేదు... ఆసమయం ఇంకా రాలేదు" తనలో తనే మెల్లిగా అనుకొంది.

అతి దగ్గరగాఉన్న అనసూయకి ఆమాట కొద్దిగా వినిపించింది.

"ఎవరు మామయ్యేనా... రేపు కదూ వస్తానన్నాడు" అంది.

లలిత, అనసూయ అన్నమాట వినలేదు. ఆలోచన ఎటువేపుకో

పోయింది. సింహాచలంకొండమీద కప్ప స్తంభం,దానిమీద ఫామిలీప్లానింగ్ పోష్టరు గుర్తుకొచ్చేయి.

ఆరోజు గడచి ఎన్నేళ్లయింది ? అప్పుడనుకొంది. "అభీ నహీ" అని... కాని ఇప్పటికీ ఇంకా ఆమాటే విన్పిస్తున్నాది చెవుల్లో... రోజులు గడుస్తున్నాయి కాని... ఆర్థికపరిస్థితి మారలేదు ... వయసు పెరుగుతున్నాది. .కాని మనసుకి ఇంకా ధైర్యం చాలడంలేదు...కాని వస్తుంది ఆరోజు ఎప్పటికో ఓ నాటికి. . జీవితంలో ఎప్పటికీ రాకుండా ఉండిపోదు...అప్పుడనుకొంటుందితను.మనసు నిండుగా, నిర్భయంగా, తృప్తిగా "అభీ... అభీ ... అభీ"అని.

ఆలోచనలమధ్య నిద్ర పట్టేసింది లలితకి. మరునాడు తెల్లవారేసరికి అప్పుడేపుట్టిన పసిపాప చూపంత స్వచ్ఛంగాఉంది ఆమెమనసు. ఎటువంటి నిరాశ, ఆత్రుత, ఆరాటంలేకుండా.

# 8

ఆ రోజురాజమ్మ తీర్థయాత్రలు పూర్తిచేసుకొని తిరిగి వస్తున్నది. ప్రకాశం మద్రాసునుంచి ఇంకారాలేదు. ఆ ముఠాఅంతా అక్కడినుంచి మైసూరు, బెంగుళూరు వగైరా ప్రదేశాలు తిరిగి రావాలనుకొంటున్నారని, తను వెళ్ళడమా మానడమా అని ఆలోచిస్తున్నానని పదిరోజులకిందట ఒక ఉత్తరంరాసేడు. "తప్పకుండా వెళ్ళిరండి, చేతికి అందివచ్చిన అవకాశాన్ని జారవిడుచుకొంటే మళ్ళా జీవితంలో ఎప్పటికి కలసివస్తాయో"

అంటూ జవాబురాసి, దానితోపాటు ఒకనూరురూపాయలు టెలిగ్రాం మని యార్డరుకూడా కట్టింది లలిత ఎందుకైనా అవసరం ఉంటుంది.

వినోదయాత్ర పూర్తిచేసుకుని ప్రకాశం తిరిగి వచ్చేసరికి ఎంత లేదన్నా మరోవారం రోజులు పట్టవచ్చు. ఆరోజు అత్తగారు వస్తున్నా దని ఆఫీసుకి సెలవుపెట్టింది లలిత. ఇల్లూ, వాకిలీ సరిదిద్ది, పెందరాడే వంటా, వార్పు పూర్తిచేసుకొని, అత్తగార్ని ఎదురుకోడానికి స్టేషనుకి బయలుదేరింది.

"డారా.... ఒకసారి అలా తిరిగి వచ్చినట్లు అవుతుంది. అమ్మమ్మకోసం వెళ్ళినట్లు అవుతుంది" అంది.

అనసూయ ఒక్కనిమిషం ఆలోచించి "నువ్వెళ్ళిరా అత్తయ్యా: ఈరోజు నావంట్లో అంత సుఖంగాలేదు" అంది మెల్లిగా.

ఈమధ్య వారం పదిరోజులుగా అనసూయ నలతగానేఉంటున్నాది. జ్వరంలాంటిది ఏమీలేదు. అయినా పూర్వపు ఉత్సాహం పనిపాట్లలో కాని, మాటల్లోకాని కన్పించడంలేదు. రోజంతా ఒంటరిగా ఇంట్లో ఉండడం, ఇంత కష్టపడి చదివిన పరీక్షపోవడం దానికి కారణం అనుకొంది లలిత. కాలేజీలుతెరచి మళ్ళా ఏదో ఒకపనిలోపడితే ఆదే సర్దుకొంటుంది – అను కొని దాన్ని అంతగా పట్టించుకోలేదు.

"సరే—నీ ఇష్టం" అంటూ తాను ఒంటరిగానే అత్తగార్ని ఎదురు కోడానికి బయలుదేరింది.

రావలసినవేళకి కాస్త ముందుగానే వచ్చేసింది పూర్ణియాత్రా స్పెషల్. లలిత ప్లాట్ఫారంటిక్కెట్టు తీసుకొని వెళ్ళేసరికి అప్పటికే యాత్రికులంతా పెట్టా బేడాతో ఓగడం, కూలీలనెత్తికి సామాన్లుఎత్తి బయ టికి రావడానికి సిద్ధంగాఉండడం జరిగింది.

తనకోసం కొడుకో, కోడలో వస్తారనుకొంది రాజమ్మ. కాని రైలుదిగిచూస్తే ఎవ్వరూ కన్పించలేదు. మిగిలిన అందరికోసం ఎవరో ఒకరు ఇంటినుండి వచ్చేరు.

"మీ వాళ్లెవరూ రాలేదా ?" అంది రామాయమ్మ.

"నా ఉత్తరం అందిందో....లేదో? అబ్బాయి ఊళ్ళో ఉన్నాడో. లేదో, కోడలికి ఆఫీసువేళకదా" అంది రాజమ్మ.

"ఈ పూటకి మా ఇంటికిరండి....తరువాత అక్కడనుంచి వెళ్దరు గాని" అంది రామాయమ్మ.

"ఎందుకూ....కొత్తదాన్నా—తెలియనిఊరా ... చీకటిపడేలోపునే వెళ్ళిపోతాను ... నా సామాన్లు వేరే రిక్షాలో పెట్టించండి" అంది రాజమ్మ. అంతలో వచ్చింది లలిత "అత్తయ్యా" అంటూ.

అన్నిరోజుల తరువాత రాజమ్మని చూడడానికి నిజంగా ఆ పిల్ల మనసు తహతహలాడిపోయింది. ఆమె ఇంటలేనప్పుడు తెలిసింది ఆమె విలువఏమిటో....ఆమె అండలో తను పొందుతున్న అనుభూతులేమిటో?

"వచ్చేవమ్మా లలిత, ఇంట్లో అంతా బాగున్నారా" అంటూ అప్యాయంగా కోడల్ని దగ్గరికి తీసుకొంది రాజమ్మ.

తను ఇంటలేనికాలంలో కోడలుచిక్కి సగమైనట్లు అనిపించింది రాజమ్మకి. ఆమాట అందామనుకొని అంతలో ఇంకేదో భావం మనసులో కదలి ముచ్చటగా లలితనిచూస్తూ "....ఏమో...అలా ఎందుకు కాకూడదూ!" అనుకొంది.

అలా అప్యాయంగా పలకరించుకొంటున్న అత్త కోడళ్ళని మిగిలినవారంతా వింతగా చూసేరు "క్రిందటిజన్మలో వాళ్ళిద్దరూ తల్లీ కూతుళ్ల అయిఉంటారు. లేకపోతే ఇంతలేసి అభిమానాలు అత్తా కోడళ్ళమధ్య విన్నామా, కన్నమా?"అంది రామాయమ్మ పక్కనున్న వెంకమాంబతో.

"రండి వెళ్దాం. బైటరిక్షాఉంచివచ్చేను" అందిలలిత.

అందరిదగ్గర సెలవుపుచ్చుకొనిరాజమ్మ కోడలివెంట బైలుదేరింది.

ఇల్లుచేరే సరికి కొద్దిగా చీకటిపడ్తున్నది. ఇంటిముందు రిక్షా ఆగిన చప్పుడు విని అనసూయ గుమ్మంలోకి వచ్చింది.

అప్పుడే తలకి స్నానం చేసినట్లుంది. తడిజుట్టు బారుగా భుజాల మీదుగా మోకాళ్ళవరకు వ్రేలాడుతున్నాది. జుట్టులో ఇంకా అక్కడక్కడ కుంకుడుకాయ పిప్పులు కన్పిస్తున్నాయి.

నీలంకడ్డి అంచు తెల్లచీర కట్టుకొంది అనసూయ. అంచురంగుకి అతికేలా జాకెట్టు తొడుక్కొంది. నల్లనిజుట్టు మధ్య, అనసూయముఖం అప్పుడే సముద్రంలోంచి పైకి ఉదయిస్తున్న చంద్రుడిలా ఉంది.

"బాగా చిక్కిపోయేవు అనసూయ !" అంది రాజమ్మ ఆప్యాయంగా మనుమరాల్ని దగ్గరికి తీసుకొంటూ.

"మరేం అమ్మమ్మా! నువ్వువెళ్లేక నీకోడలు నాకు కడుపునిండా తిండి పెట్టిందనుకున్నావేమిటి? చిక్కకపోతేబలుస్తానా?" అంది అనసూయ నవ్వుతూ.

"మరేనమ్మా ... అను ... అను ... ఎంతచేసినా ... ఏం పెట్టినా అత్త పరాయిదేకదా" అంది లలిత కోపం నటిస్తూ.

ఆ రాత్రిబాగా పొద్దుపోయేదాకా తాను తిరిగిన ప్రదేశాలు వింతలు విశేషాలు చెప్తునేఉంది రాజమ్మ.

"ఏమిటో యాత్రలు యాత్రలు అనుకుంటాంగాని, వాటిగురించి దూరంగాఉండి, ఊహించుకొన్నప్పటి అనుభూతి, నిజంగా చూసినప్పుడు కలగలేదనుకో, భాగవతంలో ఆ మధుర, బృందావనంవాటిగురించి చదువుతుంటే ఆప్రదేశాల రూపురేఖలు మనసుని వదలిపెట్టేవికావు. తీరా అక్కడికి పోయిచూస్తే అన్ని ఊళ్ళలాగేఉన్నాయి అవిన్ని ... ఇంతకాలంగా మనసులో గీసుకొన్న అందమైనచిత్రాన్ని ఎవరో ఒక్కసారిగా చేత్తో చెరిపేసినట్లు అనిపించింది" అంది రాజమ్మ దిగులుగా.

"వాస్తవంకన్న ఊహ, కల్పన ఎప్పుడూ అందంగానే ఉంటుంది. మీరు పురాణాల్లో దర్శించిన మధుర, బృందావనంవంటి ప్రదేశాలు ఆనాటి కవుల ఊహలకి భావనా బలిమికి ప్రతిరూపాలు ... ఈనాటి ఆడుఃళ్ళు ఆ

పేర్లమీదుగా ప్రాముఖ్యాన్ని పొందిఉన్నా, అన్ని ఊళ్లలాంటివే అవీను" అంది లలిత.

మరునాడంతా తీర్థయాత్రలు సేవించుకొని వచ్చిన రాజమ్మను ఇరుగు పొరుగు ఆడవాళ్ళువచ్చి చూసిపోయేరు. వచ్చినవాళ్ళతో యాత్రా విశేషాలు చెప్పడంతోను, ఎవరు తెమ్మన్న వస్తువులు వారికి పేరు పేరున చెప్పి ఇచ్చి; డబ్బులెక్కలు సరిచూడడంతోను అయిపోయింది రాజమ్మకి.

* * *

ఆరోజు ఆదివారం, "నీలకంఠంగారి మేనగోడలికి పెళ్ళి"అంటూ ఆ ఉదయాన్నే చూడ్డానికి వెళ్ళింది లలిత. "వాళ్ళు బలవంతంచేస్తే అక్కడ భోజనానికి ఉండిపోవలసివస్తుంది. నా కోసం కనిపెట్టుకొని కూర్చోకండి" అంటూ అత్తగారితో చెప్పి స్కూటర్ స్టార్ట్ చేసింది. ఆమె వీధిచివరకి వెళ్లేవరకు గుమ్మంలో అలాగేనిల్చుని రాజమ్మ లలిత కను మరుగుకాగానే ఇంటిలోకివచ్చి తలుపు చేరబెట్టింది.

లలిత అన్నట్లుగానే పెళ్ళినుంచి తిరిగి వచ్చేసరికి బాగా వేళ తిరి గింది రాజమ్మ పెరటి వసారాలో చాపవేసుకొని పడుకొనిఉంది. ముందు గదిలో అనసూయకన్పించలేదు. ఎండపడి వచ్చిన లలితకి ఎవరెక్క డున్నారు అని పట్టించుకొనే ఓపికలేదు. తిన్నగా వంటఇంట్లోకివెళ్ళి కుండ లోంచి కంచెంబుడు నీళ్ళు ముంచుకొని గటగటతాగి గదిలోకివెళ్ళి పక్క మీద వాలింది.

తిరిగి ఆమెకు తెలివి వచ్చేసరికి ఎండబాగా తగ్గి చల్లబడింది. మరి కాస్తసేపు పక్కమీద ఇటు అటు దొర్లి బద్ధకం వదలించుకొని, లేచి బైటకి వచ్చేసరికి సంధ్య వెలుగుకాస్తా సన్నగా జారుకొంది.

రాజమ్మ పెరట్లో రోటిముందుకూర్చుని కందిపచ్చడి రుబ్బుతున్నాది. కుంపటిమీద గిన్నెలో అన్నం కుతకుత గెంతుతున్నాది.

"మీరు చేస్తున్నారేం ... అనసూయలేదా?" అంది లలిత ముఖం కడుక్కోడానికి నూతిలోకి చాదవేస్తూ.

"దానిఒంట్లో సరిగా ఉన్నట్లులేదే ... పిల్ల ఏదోలా ఉంటున్నాది. తిండికూడా తిన్నగా తినడంలేదు"

"నాకూ అలాగే అన్పించింది. వారం పదిరోజులుగా బొత్తిగా వాడిపోయి ఉంటున్నాది" అంది లలిత తువ్వాలుతో ముఖం తుడుచుకొంటూ.

"ఏమిటో చికాకు ... ఎవరికైనా చూపించేవా ?"

"ఆకలిగాలేదు ... అంతకన్న ఒంట్లో మరేం చికాకు లేదంటుంది. ఈ ఎండలు కారణంకావచ్చు. నిజంగా ఈ ఏటిఎండలు నిప్పులు చెరుగుతున్నాయి."

"అదిసరే అనుకో ... ఎండలబాధ అందరికీ ఉండేవే ... అనసూయ అంతేకాదనిపిస్తున్నాది"

"అంటే ?"

"నా అనుమానం యేమిటంటే" రాజమ్మ క్షణకాలం ఊరుకొంది.

"ఏమిట త్తయ్యా."

"అనసూయ ఉట్టిమనిషికాదని ..." నెమ్మదిగా, భారంగా అంది రాజమ్మ.

"ఆ" అంటూ నోరు వెళ్ళబెట్టింది లలిత ఆమాట నమ్మలేనట్లు.

"మొదటిరోజు చూడగానే అనుకొన్నాను ... పిల్ల మామూలుగా లేదని ... కాని నువ్వు అన్నట్లు ఎండలవల్లే అలావుంది అని సరిపెట్టుకొన్నాను. నిన్నరాత్రి తిండి తిన్నగా తినలేదు ... ఈ మధ్యాహ్నం విస్తరిదగ్గర కూర్చుని లేచి, పెరట్లోకి వెళ్ళి, ఘొళ్ళున వాంతి చేసుకుంది. "ఏమిటే అనసూయా" అంటే "అబ్బే....ఏం లేదు అమ్మమ్మా, ఒంట్లో కాస్త పైత్యంగావుంద. కడుపులో తిప్పింది....అంతకన్న మరేం చికాకు లేదు" అంది.

అత్తగారినోట ఆమాట వినేదాకా అనసూయ పడ్తున్న బాధ

యేమిటో అర్థంచేసుకోలేక పోయింది లలిత. తీరా తెలిశాక మతిపోయిన దానిలా యేమిఅనడానికి, యేమి చెయ్యడానికి పాలుపోక అరగంటకిపై గా అలా వుండిపోయింది.

అదే నిజమైతే....అత్తగారి అనుమానమే నిజమైతే యేంచెయ్యడం? సమయానికి ప్రకాశంకూడా యింట్లోలేడు. ఇంకా యెప్పటికివస్తాడో, యేమో! వచ్చినా అతడుమాత్రం ఏంచేస్తాడు ? అసలు యెవరుమాత్రం ఏంచేస్తారు? అనసూయ యిటువంటి తెలివితక్కువపని యెందుకుచేసింది?

అసలే అంతంతమాత్రంగావున్న తన బ్రతుకును చేజేతులా యిలా యెందుకు పాడుచేసుకొంది ?

అన్నీప్రశ్నలే....? జవాబులు మచ్చుకైనా కనిపించడంలేదు.

అసలు అత్తగారి అనుమానం నిజమో కాదో ముందు తేల్చు కోవాలి. అనసూయని అడిగితే చెపుతుందా ?

చెప్పకపోతే డాక్టరుచేత పరీక్షచేయించి తెలుసుకోవాలి.

అది నిజమే అని నిర్ధారణ అయితే....అప్పుడు ఏదో ఒకమార్గం చూడాలి. ఈ అనర్థం యెవరివల్ల .... యెలా జరిగిందో ముందు తెలుసు కోవాలి.

కంగారుపడి, ఆవేశపడి లాభంలేదు.నెమ్మదిగా ఆలోచించాలి అన్ని విషయాలు....అప్పుడు అప్పుడు ...

మెల్లగాలేచి అనసూయ గదిలోకి వెళ్ళింది లలిత.

పక్కమీద అటుతిరిగి పడుకొంది అనసూయ.

నిద్రపోవడంలేదు....కళ్ళుమాత్రం మూసుకొనివుంది.

"అనసూయా" అంది పక్కమీదకూర్చుని అప్యాయంగా నడ్డిమీద చెయ్యివేస్తూ లలిత.

"ఊ" అంది అనసూయ.

అంతవరకు ఏడ్చి ఏడ్చి అలసిపోయిన మనిషి కంఠంలోంచి పూడుకుపోయివచ్చినదానిలా వుంది ఆ పలుకు.

తలమీద చెయ్యివేసి లాలనగా నిమురుతూ "ఒంట్లో బాగాలేదా? మధ్యాహ్నంనుంచి అలాపడుకొన్నావు?" అంది తనవైపుగా తిప్పుకోటానికి ప్రయత్నిస్తూ.

అనసూయ మాట్లాడలేదు. మెల్లగాలేచి పక్కమీద కూర్చుంది.

ఆ పిల్లకళ్లు ఎర్రగా వాచిఉన్నాయి. వాడినముఖం లోతుకిపోయి వాచినకళ్ళు పైకి పొడుచుకొచ్చినట్లు ఉన్నాయి.

చీటికి మాటికి ప్రతిచిన్నవిషయానికి కంటతడిపెట్టే తత్వంకాదు అనసూయది. చాలాబాధల్ని మనసులోనే నిల్పుకొని భరించగలశక్తిఉంది ఆ పిల్లకి.

ఈరోజు ఇంత బేలలా అనసూయ ఏడుస్తున్నాదంటే అది బలీయమైన కారణమే అయిఉండాలి....బహుశ రాజమ్మ ఊహించిన కారణమే అది కావచ్చు — ఆడదానిబ్రతుక్కి ... అందునా అనసూయలాంటి నిర్భాగ్యురాలి జీవితానికి అంతకుమించిన ఆపద ఏముంటుంది?

వాలిఉన్న అనసూయ ముఖాన్నిఎత్తి పట్టుకొని సూటిగా ఆ పిల్ల కళ్ళలోకి చూస్తూ అడిగింది "నేను విన్నది నిజమేనా? — అమ్మమ్మ అన్నది నిజమేనా అనసూయా" అని.

రెండుచేతుల్లో ముఖం దాచుకొని బావురుమంది అనసూయ.

అయిదు, పది నిముషాలు అలా వెక్కివెక్కి ఏడ్చింది.

ఎదురుగా బొమ్మలా చూస్తూ కూర్చుండిపోయింది లలిత.

ఆ పిల్లని ఓదార్చాలి .... ఏదో విధంగా ఆ ఏడుపు మాన్పించాలి. లేకపోతే, ఉప్పెనలా ముంచుకొస్తున్న ఆ ఏడుపులో ఊపిరి సర్దుకోలేక, ఉక్కిరి బిక్కిరి అయి చచ్చిపోతుంది.

కాని .... ఏమని ఓదార్చడం?

ఎలా ధైర్యం చెప్పడం?

తనను తానె అదుపులో పెట్టుకోలేక పోతున్నాది లలిత.

తనకి తనే ధైర్యం చెప్పుకోలేక పోతున్నాది.

ఆ పరిస్థితిలో అనసూయకు ఎలా ధైర్యం చెప్తుంది ! ఏమని ఓదారుస్తుంది ? ఏడ్చి ఏడ్చి అలసిపోయి, ఇంక ఏడ్చే శక్తిలేక చల్లబడింది అనసూయ. అత్త ముఖంలోకి చూసే ధైర్యం లేదు. నోరు తెరచి మాట్లాడే శక్తిలేదు. అలాగని ఏమీ జరుగనట్లు పక్కమీద మళ్ళా పడుకోలేదు. నీటిలోంచి బైటపడ్డ చేపపిల్లలా గిలగిల్లాడి పోయింది ఆ పిల్ల ప్రాణం. చివరికి ఏదో చెప్పాలని తెగించి నోరు తెరచింది.

మాటకంటే ముందుగా తోసుకువచ్చింది ఏడుపు.

ఆవేశంగా లేచి అత్తకాళ్ళకి చుట్టుకొంది.

"నన్ను క్షమించు అత్తా .... నన్ను క్షమించు" అంటూ తల ఆమె పాదాలకేసి కొట్టుకొంది.

చేతులతో లేవనెత్తి మెల్లగా పక్కని కూర్చోపెట్టుకొంది లలిత.

"అనసూయా, ఒక్కమాట అడుగుతాను .... నిజం చెప్తావా ?" అంది.

అడుగు అన్నట్టు చూసింది అనసూయ.

"ఇలా ఎందుకు జరిగింది?" అనసూయ కళ్ళలోకి చూస్తూ ప్రశ్నించింది లలిత.

అనసూయ తల దించుకొంది. ఆమె కళ్ల మరో జల్లు వర్షించేయి.

"చెప్పు అనసూయా !" నీ జీవితాన్ని చేజేతులా ఎందుకిలా నాశనం చేసుకొన్నావు ? మామ్మూలుగా పెళ్ళికాని ఆడపిల్లలకే ఈ అనుభవం భరించరానిది. నీది అందరిలాగ అటువంటి జాతకంకూడా కాదు.

"అరిటాకు — ముల్లు; ఇది పాతసామెత కావచ్చు కాని .... అంతకన్నా సున్నితమైనది నీ పరిస్థితి. దేవుడు చేసిన అన్యాయానికీ, పెద్దలు తలపెట్టిన అక్రమానికి, తలవంచకుండా మనిషిలా బ్రతకాలనుకొన్నావు. దానికి అనువైన మార్గం ఎన్నుకోవాలనుకొన్నావు. ఆ ఉద్దేశంతోనే అటువంటి పరిస్థితిలో తెగించి ఇల్లు వదలి ఇక్కడికి వచ్చేవు. నీ కాళ్ళమీద నువ్వు నిలబడగలిగిందికి నేను, మీ మామయ్య చెయ్యగలిగిన

దంతా చేద్దామనుకొన్నాము —— నీకు తెలుసు మేము ఎన్ని భరించడానికి సిద్ధపడి ఈ బాధ్యత పైన వేసుకొన్నామో.

"నీ పరీక్ష పోయిందంటే నేను బాధపడలేదు ఈసారి కాకపోతే ఇంకోసారి కట్టి పాసవుతుంది అనుకొన్నాను. మనుషుల తెలివితేటలకి ఈనాడు పరీక్షలు పాసవడం, పోవడం నిజంగా కొలబద్దలు కావు. అందునా ఈ సంవత్సరం అడుగడుగునా ఈ స్ట్రయిక్‌ల మూలంగా చదువు తిన్నగా సాగలేదు. నీ పరీక్ష పోయిందని విన్ననాడు నువ్వు తెలివితక్కువదానివని అనుకోలేదు. కాని ఈరోజు, ఈమాట విన్నాక అనుకొంటున్నాను- నువ్వు వట్టి తెలివితక్కువదానివని, అమాయకురాలివని.

"అయిందేదో అయిపోయింది. జరిగిపోయినదానికి బాధపడుతూ కూర్చుంటే ఇది తీరేసమస్యకాదు. నిజానికి నువ్వు ఇంతకి పూర్వమే ఈ విషయం బైటపెట్టవలసింది. కనీసం నాతోనైనా చెప్పవలసింది. కాని, ఏ కారణంచేతో నువ్వు నన్ను నమ్మలేకపోయేవు.నీలో నువ్వే కుమిలిపోతూ బాధపడ్డావు ... అయినా ఎంతోకాలం అలా గడవదని ఏదోనాటికి ఈ విషయం బయటపడకపోదని నీకూ తెలుసు. గడచినన్నాళ్ళు గడవనీ అనుకొన్నావు. ఆ వేళకి ఏదో మార్గం కనిపించక పోతుందా - అనిఆశపడ్డావు.

"ఈ ఊబిలోంచి నువ్వు బయటపడ్డానికి ఏదైనా ఒక మార్గం తెరచివుందో, లేదో నాకు తెలియదు. అటువంటి అవకాశం ఏమైనాఉంటే నీ జీవితం బాగుపడ్డానికి నాకు చేతనైనదంతా చేస్తాను. అందుకే నిన్ను అడుగుతున్నాను ఈ ప్రశ్న. ఈ విధంగా నీ బ్రతుకుతో ఆటలాడిన వ్యక్తి ఎవరు ?"

అనసూయ జవాబు చెప్పలేదు. క్షణకాలం అత్తవంక చూచి కళ్ళు దించుకొంది.

"చెప్పు అనసూయా ! నిజం చెప్పు. ఏం చెప్పినా నిన్ను కోప్పడను. ఏ మాట విన్నా నేను బాధపడను .... నిజంతెలిస్తేకాని నేను నీకే విధంగానూ సహాయపడలేను —— చెప్పమ్మా"

అనసూయ పెదవులు ఏదో చెప్పడానికి అన్నట్లు విడుతున్నాయి. మళ్ళీ అంతలోనే మూసుకుపోతున్నాయి.

ఆమె పరిస్థితిని గుర్తించింది లలిత. నెమ్మదిగా వెళ్ళి కలం, కాగితం తెచ్చింది "దీనిమీద రాయి" అంటూ అందించింది.

అనసూయ వాటిని అందుకోలేదు.

ఎంతసేపటినుంచో కడుపులో కలుపుతూ ఒక్కసారి బొళ్ళున పైకి వచ్చిన వాంతిలా "రామకోటి" అన్న మాట ఆమె నోటిలోంచి బైట పడింది.

అతిబలవంతమైన ఆ కాస్తమాట బైటపడేసరికి నిజంగానే ఆ పిల్లకు కడుపులో తిప్పింది. పరుగుతో పెరట్లోకి వెళ్ళి నూతివారగా వాంతి చేసుకొని, ముఖం కడుక్కొనివచ్చి మంచం పక్కగావున్న కుర్చీలో కూర్చుంది. అత్త ఇంకా ఏమో అంటుంది — ఏమో అడుగుతుంది .... తను వాటికి జవాబులు చెప్పవలసి వుంటుందనియెదురుచూసింది అనసూయ.

లలిత యేమీ అడగలేదు. అసలు సూటిగా అనసూయవేపు చూత నైనా చూడలేదు.

"పద — భోజనం చేద్దాం. అమ్మమ్మ మనకోసం కనిపెట్టుకొని కూర్చుంటారు" అంది.

అత్త వెనుకనే తల వంచుకొని అడుగులో అడుగు వేసుకొంటూ నడిచింది అనసూయ.

రాజమ్మ వంటయింట్లో రెండు కంచాలు, పీటలు పెట్టుకొని కూర్చుంది.

"మీరు వెళ్ళి పడుకోండి అత్తయ్యా! మేము పెట్టుకుతింటాం" అంది లలిత. బహుశా, అనసూయతో యేదో మాట్లాడాలనే తనను లలిత వెళ్ళమనివుంటుంది— అనుకొంది రాజమ్మ. అనసూయకూడా అలానే అభిప్రాయపడింది. కాని లలిత ఆ విషయం గురించి మరోమాట అనలేదు.

అనసూయకి యేం కావాలో చూసి వడ్డిస్తూ మౌనంగా భోజనం పూర్తి చేసింది.

ఆ రాత్రి పొడుగునా మంచాలమీద అటు అనసూయ, యిటు లలిత కంటిమీదకు కునుకు రాక దొర్లుతూనే వున్నారు.

* * *

ఆఫీసుకి వెళ్ళిందన్న మాటేకాని ఆరోజు లలితకి తిన్నగా పని చేయబుద్ధి కాలేదు. "ఈరోజు మీ రెందుకో అదోలా వున్నారు" పక్క సీటులోని టైపిస్టు ఒకటికి రెండుసార్లు పరామర్శించేడు.

"ఏం లేదు .... ఒంట్లో అంత సుఖంగా లేదు" అంది లలిత ;

"సెలవు పెట్టలేకపోయారా ?" ఇంకొకరు సలహా సరఫరా చేసేరు.

"నేనూ అలాగే అనుకున్నాను. కాని విధిగా చెయ్యవలసిన పని కొంత ఉండిపోయింది."

"ఈ ఆఫీసులో అర్జంటుపని లేకపోయిందెప్పుడు. ఇరవై ఏళ్ళ సర్వీసు పూర్తికావస్తున్న ఎల్. డి. సి. విసురు అది.

"పని చేయడానికేగా మనకి జీతం యిస్తున్నది" కొత్తగా ఉద్యోగంలో చేరిన ఉత్సాహవంతుడైన యువకుని వాదం.

ఇటువంటి వాదప్రతివాదాలు వింటూనే తనపని తాను చేసుకుపోవడం లలితకి అలవాటు. కాని ఆరోజు పనిలో ఏకాగ్రత కుదరలేదు. చేసినపనిలో అవకతవకలు, బోలెడు తప్పులు, తుడుపులు .... అతి సామాన్యమైన ఒక చిన్న ఉత్తరం టైపు చెయ్యడానికి రెండు, మూడు కాగితాలు చించవలసి వచ్చింది.

సీటులో కూర్చుని ఇంక లాభంలేదని, ఇంకా టైము కాకమునుపే ఆఫీసరుదగ్గర సెలవుతీసుకొని ఇంటికి బయలుదేరింది. ఆస్థితిలో స్కూటరు

నడుపుకొంటూ ఇంటికివెళ్ళే ఉత్సాహం, ఓపికా లేకుండాపోయేయి లలితకి. ఆఫీసు ఆవరణలో దాన్ని పార్కుచేసి, తాళంవేసి చౌకీదారుకి అప్పగించి బస్సుస్టాపువైపు కాలుకదిపింది.

నాలుగు అడుగులు నడిచేసరికి లలిత మనసు మారిపోయింది. ఇప్పటినుంచి ఇంటికిపోయి చేసేదేముంది....కాస్తసేపు అలా బీచికిపోయి కూర్చుందామనుకొంది. అంతలోనే ఆ ఆలోచన కూడా మళ్ళిపోయింది. రామకోటిగదికి వెళ్ళి అతడిని ఒకసారి కలుసుకొని మాట్లాడాలని నిశ్చయించుకొంది.

చాలా సేపటిదాకా అటుపోయే బస్సు రాలేదు. వచ్చిన ఒక్కటీ ఆగకుండా నిండుగా వెళ్ళిపోయింది.

"దీనికోసం ఇంతసేపు కాచుకు కూర్చునేబదులు నడచిపోతే ఈ పాటికి ఇంటికి చేరిపోయిఉండేవారిమి" అంటున్నాది ఒకయిల్లాలు.

"బస్సులు, రిక్షాలు వచ్చేక మనుష్యులకి నడక అలవాటు బొత్తిగా తప్పిపోయింది....ఆ దొమ్మీలో దూరి కాళ్ళూ, చేతులూ విరుచుకునైనా బస్సెక్కి వెళ్తామంటారు. కాళ్ళలో శక్తివున్న పడుచువాళ్ళుకూడా ఈ నాలుగడుగులు నడిచేదాం అనుకోరు" లలితపక్కనే నిలబడ్డ ముసలాయన బస్సులమీద, అవి ఎక్కితిరిగే మనుష్యులమీద వ్యాఖ్యానాలు మొదలు పెట్టేడు.

అతడు అన్నమాట నిజమే అనిపించింది లలితకి .... అక్కడికి రామకోటి గది మైలులోపు....నడిచిపోతే ఈపాటికి చేరిపోయివుండేది.... ఇంతవరకు ఆ ఆలోచన మనసులోకిరాలేదు. అరగంట కావస్తున్నాది, ఈ వెధవ బస్సుకోసం పడిగాపులు పడుతూ.

పోనీ ఇప్పుడు మాత్రం మించిపోయిందేమిటి....నడిచివెళ్ళిపోతే— అనుకొంది. ఇంతసేపు నిరీక్షించి తను ఇటుకాలు కదపగానే అటునుంచి బస్సువస్తే "అయ్యో" అని అప్పుడు ఏడ్చుకోవలసి వస్తుంది.

లలిత ఇలా అనుకొంటుండగానే బస్సువచ్చింది. ఈసారి కాళీగానే

వుంది. నిండా పదినిమిషాలు నిండకుండానే బజారువీధిలో దింపి వెళ్ళిపోయింది. వీధిచివరికి వెళ్ళి కుడివైపు తిరిగితే వస్తుంది రామకోటి వుంటున్న ఇల్లు.

కాళ్ళీడ్చుకుంటూ లలిత అక్కడికి వెళ్ళేసరికి గదికి తాళంపెట్టి వుంది. రోజూ అయిదుకాకుండా వచ్చేస్తానంటాడే ఈరోజు ఇంకారాలేదేం అనుకొంటూ వరండాలో నిలబడింది.

ఎదుటి బాసలో చేటలో బియ్యంపోసుకొని రాళ్ళు ఏరుతున్న రామాయమ్మ లలితనుచూచి పలకరించింది, "ఈరోజు మీతమ్ముడు ఇంకా రానట్లుందే" అంటూ.

"అవునండి....వాడికోసమే చూస్తున్నాను" అంది లలిత.

రాజమ్మ ప్రయాణం బాపతు సొమ్ము ఆవిడకి ఇంకా కొంచెం ఇయ్యవలసివుంది. ఆరోజు జీతాలు పుచ్చుకోవడంచేత బ్యాగ్‌లోడబ్బు వుంది. ఆ లెక్కేదో చూసుకుని ఇచ్చేస్తే సరిపోతుంది అనుకొని అటు వెళ్ళింది.

ఆవిడ పక్కగదిలో ఉన్నకొడుకుని అడిగివచ్చి "అబ్బే—ఎంతో చేతిది పడలేదులే—ఒక్కఇరవై ఇస్తే సరిపోతుంది" అంది.

లలిత రెండు పదులుతీసి ఆవిడచేతిలో పెట్టింది—వాటిని పదిలంగా పట్టుకువెళ్ళి కొడుక్కిఇచ్చి వచ్చింది రామాయమ్మ.

ఆవెనుక మరికాస్తసేపు ఆమాటా ఈమాటా అడుగుతూ అక్కడే కాలక్షేపం చేసింది లలిత.

"రోజూ బాగా పొద్దుండగానే వచ్చేసేవాడు—ఈరోజు ఏమయిందో మరి ఇంకా రాలేదు మీ రామకోటి" అంది ఆవిడ తాళం పెట్టిఉన్న గుమ్మంవైపు చూస్తూ. అంతలో ఆమెకి రామకోటి వుదయం ఆఫీసుకు పోతూ చాకలివాడు వస్తే బట్టలు పడేయమని తాళమిచ్చి వెళ్ళిన సంగతి గుర్తుకొచ్చింది.

ఆ మాట చెపుతూ "తాళం నా దగ్గరేవుంది....యిమ్మంటావేమిటి"

అంది. ఆవిడకి వంటకి వేళవుతున్నాది. లలితతో మాట్లాడుతూ కూర్చునే తీరిక లేదు .... అది అసలు విషయం.

"ఇవ్వండి" అంది లలిత ఆమె వెనుకనే లేచి వాకిట్లోకి వస్తూ.

ద్వారబంధం పక్కగా మేకుకి వేళ్ళాడుతున్న పురికొసకి కట్టిన చిన్న తాళంచెవిని తీసి లలిత చేతిలో పెట్టింది రామాయమ్మ.

"మళ్ళా వస్తానండి" అంటూ రామకోటి గదివైపు నడిచింది లలిత.

గదంతా కాగితాలు, బట్టలు, పుస్తకాలతో చిందరవందరగా వుంది. దుప్పటిలేని పరుపు జిడ్డుమరకలతో అసహ్యంగా ఉంది. టేబిలుమీద పత్రికలు కాగితాలు కుప్పలాగ పడివున్నాయి.

వాటిని అలా చూస్తూ కూర్చోలేక తీసి దొంతి పెట్టాలని లేచింది లలిత. అందులో చాలాభాగం చవకబారు శృంగార సాహిత్య పత్రికలు.... ఆ పుస్తకాల్నీ అట్టమీద బొమ్మల్నీ చూస్తుంటే లలితకి తెలపరం కలిగింది. వయసులోఉన్న అబ్బాయిలు, అమ్మాయిలు బుద్ధులు చెడి పెడదారుల పట్టేందుకు యెన్ని అవకాశాలు వున్నాయో వాటన్నిటినీ వుపయోగించుకొని ఆ కథలకి, బొమ్మలకి రూపకల్పన చేసినట్లుంది.

రామకోటి యెప్పుడు గదిలో ప్రవేశించేడో లలిత చూడలేదు.

"మీ అక్క నీకోసం వచ్చి చాలా సేపటినుంచి కాచుకుకూర్చుంది. ఈ రోజు యింత ఆలస్యం చేసేవేం" అంది రామాయమ్మ. రామకోటి తాళంచెవి కోసం వెళ్తే.

అందుకే గదిలో ఆమెని చూసి ఆశ్చర్యపోలేదు. కాని ఆ పుస్తకాల్ని ఆమె అంత దీక్షగా చూస్తుంటే మాత్రం కంగారుపడ్డాడు.

"చాలా సేపై వచ్చేవుట" అన్నాడు పలకరింపుగా.

"ఊఁ" అంది లలిత.

"ఆఫీసునుంచి తిన్నగా వచ్చేస్తే అయిదు కాకుండానే వచ్చేద్దును.

అలా ఎగ్జిబిషన్ చూడ్డానికి కొంతమంది స్నేహితులతో కలసివెళ్ళేను" తన ఆలస్యానికి కారణం చెప్పుకొన్నాడు రామకోటి.

లలిత మాట్లాడలేదు. చేతిలో పుస్తకాన్ని టేబిలుమీద పడేసివచ్చి కుర్చీలో కూర్చుంది.

"ఏమైనా పనుండి వచ్చేవా ?" రామకోటి ప్రశ్నించేడు.

"మరేం" ఈసారి కూడా తుంచినట్లు సమాధానం చెప్పి ఊరు కొంది లలిత. రామకోటి మరో ప్రశ్న వెయ్యలేదు. పక్కగావున్న కొట్టు గదిలోకి వెళ్ళి బట్టలు మార్చుకొని వచ్చాడు.

అక్క మామ్మూలు స్థితిలో లేదన్న సంగతి తెలుస్తూనేఉంది. ఆ పుస్తకాలు కంటబడ్డమే దానికి కారణం అనుకొన్నాడు. లేక, ఇంకేమైనా కారణం ఉందో ఏమైనా అదేదో ఆమె తనంతట తాను బైటపెడితేనే క్షేమం అనుకొన్నాడు.

"కాఫీ తాగుతారా" అన్నాడు ఫ్లాస్కు చేతిలోకి తీసుకొంటు.

"వద్దు. అక్కర్లేదు నీతో కొంచెం మాట్లాడాలని వచ్చేను. అందుకే ఇంతసేపు కూర్చున్నాను" అంది లలిత.

"అది తెలుస్తూనే ఉంది ? లేకుంటే ఓ పావుగంట చూసి 'నేను వచ్చేను. నువ్వు గదిలో లేవు.' అని ఒక చీటీ రాసిపెట్టి వెళ్ళిపోయి ఉండే దానివి"....అనుకొన్నాడు రామకోటి. ఏం మాట్లాడాలి ? దేన్నిగురించి అని అతడు అడగలేదు. అది కూడా ఆవిడనే చెప్పనీ అనుకొన్నాడు.

రెండు నిముషాలు ఊరుకొంది లలిత.

అటు తరువాత తల ఎత్తి తమ్ముడివైపు చూస్తూ "ఇలాటి చెత్త వెధవ పుస్తకాలు చదివి ఒళ్ళు మనసు పాడుచేసుకోకపోతే ఎవర్నయినా చూసి పెళ్ళి చేసుకొని, సలక్షణంగా కాపురం పెట్టకూడదూ ?" అంది.

ఇదేనా అక్క తనని అడగాలనుకొన్న విషయం ?

రామకోటి సంశయంగా చూసేడు.

ఇదికాదు .... ఇంకేదో ఉంది. మనసు సమాధానం చెప్పింది.

"తాడూ బొంగరం లేనివాడిని నా కెవరు పిల్ల నిస్తారే....నీ పిచ్చి కాని" అన్నాడు తేలిగ్గా నవ్వేస్తూ.

"ఏం ఎందుకియ్యరు ? ఇంతకి పూర్వం ఏమోకాని, ఇప్పుడున్న ఉద్యోగం పండులాంటిది. నీకేం పెళ్ళివయసు మించిపోలేదు. కుంటి, గుడ్డి కావు. ఈపాటి పెళ్ళికొడుకుల కోసం ఎందరో అమ్మలుకన్న అయ్యలు, కాలికి బలపాలు కట్టుకొని తిరుగుతారు"

"అయితే .... ఓ పని చెయ్యి .... ఓ మంచి రోజు చూసి అటువంటి వాళ్ళలో ఒకణ్ణి ఎలాగైనా మెల్లిగా పట్టుకో— నాకేం కట్నకానుకలు అక్కరలేదు. జాతి, మతాలతో పనిలేదు. పిల్ల కాస్త చదువుకొని, సంసార పక్షంగాఉండి ఇల్లు వాకిలి దిద్దుకో గలిగేదయితే చాలు" తమాషాకి అంటున్నట్లే అన్నాడు రామకోటి.

"అటువంటి పిల్ల సిద్ధంగానే ఉంది. నీ అంగీకారమే తరువాయిగా ఉంది"

"అయితే అన్నీ సిద్ధం చేసుకొనే వచ్చేవన్న మాట .... ఇంకేం .... ఎవరా పిల్ల ? ఏమా కథ" అన్నాడు రామకోటి నవ్వుతూ.

"అనసూయ"

"ఏమిటి —అనసూయా— నీ మేనగోడలు అనసూయా !"

"ఏం నచ్చలేదా ! నువ్వు చెప్పిన గుణాలన్నీ ఆ పిల్లకి ఉన్నాయి. నువ్వు సంసార పక్షమైన అందం చాలన్నావు. అంతకుమించిన అందమే ఉంది అనసూయకి.... పోతే — జాతి.... మతాలతోనే ప్రమేయం లేనప్పుడు వితంతువు అన్న అభ్యంతరం ఉంటుందనుకోను...." లలిత గుక్క తిప్పుకోకుండా చెప్పుకుపోతున్నాది.

"అది సరె .... అక్కా అనసూయకి నువ్వు చెప్పిన అర్హతలన్నీ ఉన్నాయి. ఆ పిల్ల వితంతువు అన్నమాట ఎప్పుడైనా ఇలా మీరు గుర్తు

చేస్తున్నప్పుడే నాకు జ్ఞాపకానికి వస్తుంది. లేకుంటే ఇంకా పెళ్ళి కాని పిల్ల అనే అనిపిస్తుంది.

"నాకు ఇందులో అర్థం కానిదల్లా ఒక్కటే విషయం. ఇంత అకస్మాత్తుగా ఈ ఆలోచన నీ మనసులోకి ఎలా వచ్చింది? మధ్యలో ఆ పిల్ల చదువు మాన్పించి పెళ్ళి చెయ్యవలసిన అవసరం ఏ మొచ్చింది? చదువుకొంటున్నాది కదా ....ముందు చదువుకోని .... ఆ వెనక నేను కాకుంటే ఇంకొకడు— అనసూయకి మొగుడే దొరకడా?"

"ఎవరో —ఎప్పుడో అంటే కాదు— అనసూయ పెళ్ళి వెంటనే జరగాలి" నిశ్చలంగా అంది లలిత.

"అదే ....దేనికంత తొందర అని అడుగుతున్నాను."

"ఎందుకా— ఎందుకా .... అనసూయ గర్భవతి" తమ్ముడి కళ్ళలోకి పరీక్షగా చూస్తూ అంది లలిత.

ఎలక్ట్రిక్ షాక్ తిన్నవాడిలా కూర్చున్న కుర్చీలోంచి ఇంతెత్తు ఎగిరి పడ్డాడు రామకోటి. మళ్ళీ అంతలోనే సర్దుకొని "అరె —అరె .... అదేమిటి? — అదెలాగయింది" అన్నాడు అందీ పొందని మాటలతో ....

"ఏది .... ఎలాగయిందని నీ ప్రశ్న"

రామకోటి మాటాడలేదు.

"ఆడదానికి గర్భం యెలా వస్తుందంటావు?" లలిత తిరిగి తనే అంది.

"పురుషుడి సాంగత్యంవల్ల" పరీక్షపేపర్లో ప్రశ్నకి జవాబు రాస్తున్నట్టు వారా లేకుండా అన్నాడు.

"మరేం....యిక్కడా అంతే జరిగింది....అయితే....ఆ పురుషుడివి నువ్వే కావడం" ఈసారి లలిత తమ్ముడి ముఖంలోకి సూటిగా చూడలేకపోయింది. ఇటువంటి మాటల్ని తన నోటిమీదుగా అనవలసివచ్చినందుకు ఆమెకి బాధగావుంది; వ్యగ్రతగా వుంది.

"అబద్ధం....ఇది అబద్ధం.... ఎవరుచెప్పేరు?" అన్నాడురామకోటి ఆవేశంగా.

ఆవేశంతో వణుకుతున్న అతడి చేతులవంక కోపంతో ఎర్రబడిన ముఖం వంక క్షణకాలం రెప్ప వాల్చకుండా చూసింది లలిత.

"ఎవరో చెప్తే ఎందుకు నమ్ముతారా....అసలు వ్యక్తినోటిమీదుగా వినబట్టే ఇది నిజమని నమ్మి ఇంతదాకా వచ్చాను. అనసూయ నువ్వు అక్కడ వున్నప్పుడు అటు తరువాత ఇక్కడికి వచ్చేక కూడా చనువుగా వుండడం నాకు తెలుసు.

"కాని, ఇద్దరూ ప్రాజ్ఞులు, బాధ్యత తెలిసిన వాళ్ళు, స్నేహాన్ని హద్దుల్లో వుంచుకొంటారనుకున్నాను... లేకుంటే ఇటువంటిపరిస్థితి ఏర్పడ కుండా అప్పుడే ఏదో ఒక మార్గం ఆలోచించి వుండేదాన్ని. అనసూయ ప్రవర్తనమీదా, రాకపోకలమీదా ఒక కన్ను వేసి ఉంచేదాన్ని. అది నీ గదికి అప్పుడప్పుడు రావటం, మీరిద్దరూ కలిసి బీచికి వెళ్ళడం ఇవన్నీ నాకు తెలుసు—కాని—ఇటువంటిది జరుగుతుందని అనుకోలేదు"

"ఇప్పుడు మాత్రం ఎలా అనుకొన్నావు? నా మట్టుకి నేను హద్దులు మీరి ఆ పిల్లతో ఎప్పుడూ ప్రవర్తించలేదు కొంతకాలం ఒక ఇంట్లో కలసి వున్నాం కాబట్టి ఆ చనువుతో నా గదికి వచ్చేది. అంతకుమించి మామధ్య ఇంకేవిధమైన సంబంధం లేదు. ఎంత ఒట్టు వెయ్యమంటే అంత ఒట్టు. నా మాట నమ్మక్కా" అన్నాడు రామకోటి.

లలిత తమ్ముడి మాట నమ్మలేకపోయింది. ఈ విషయంలో రామ కోటి ప్రమేయం లేకపోతే అనసూయ అలా ఎందుకు చెప్తుంది ? మగాడు కాబట్టి, దోషిగా పట్టుబడే అవకాశం లేదు కాబట్టి, తమ్ముడు తప్పించు కొంటున్నాడు అనుకొంది.

"నిజానికి అనసూయ నా ఒక్కడితోనే స్నేహంగాలేదు. ఇంకెంత మందో ఆ పిల్లకి స్నేహితులువున్నారు. మీ పక్కవీధిలోవున్న సుధాకరం అనసూయ కలసి బస్సులో వెళ్తుండడం, వస్తుండడం నేనెన్నిసార్లో

చూసేను. ఇంకా జగన్నాధం; కృష్ణారావు—ఒకరా— యిద్దరా— నిజా నికి ఎవరివల్ల కడుపుతెచ్చుకుందో మీమేనకోడలికికూడా తెలియదేమో..."

రామకోటి చెంప చెళ్ళుమంది.

అటువంటి చర్యని ఊహించని కారణాన క్షణకాలం అక్కవంక తెల్లబోయి చూసేడు.

చిన్నతనంలో తమ్ముడు తన చెప్పుచేతల్లో వుంటున్నప్పుడు కూడా ఏమైనా తప్పుపనులు చేస్తే మాటలతో బుద్ధులు చెప్పేది కాని చెయ్యెత్తి కొట్టడం అంటూ ఎన్నడూ లేదు.

అటువంటి లలిత ఇప్పుడు, ఇంత పెద్దవాడైన తమ్ముణ్ణి, తనకంటే మరి గుప్పెడు పొడుగున్నవాణ్ణి, చెయ్యెత్తి బుగ్గన తట్టుతేలేలా కొట్టింది.

ఆ చర్యకి దెబ్బతిన్నవాడు దెబ్బ కొట్టిన ఆమె, ఇద్దరూ ఒక్క లాగే విస్తుపోయేరు; నోట ఇంకొక మాట రాకుండా శిలాప్రతిమల్లా నిలచి పోయేరు.

అవి శిలాప్రతిమలు కావని, మనసు, మమత ఉన్న మనుషులని తెలియజేస్తున్నాయి ఎర్రపడిన వారికళ్ళు, ఆ కళ్ళంట కారుతున్నకన్నీళ్ళు.

రామకోటి దెబ్బతిన్న దవడమీంచి చెయ్యి తియ్యనేలేదు. చేతిలోకి బ్యాగ్ తీసుకొని భారంగా అడుగులువేస్తూ వెనుతిరిగి వెళ్ళిపోయిందిలలిత.

*　　　*　　　*

లలిత ఇల్లు చేరేసరికి బాగా రాత్రయ్యింది. ఇరుగు పొరుగు ఇళ్ళలో దీపాలు ఆరిపోయేయి. రాజమ్మ వీధిగడపలోలైటువేసుకుని కోడలి కోసం ఎదురుచూస్తూ కూర్చుంది.

"స్కూటరేదీ?" అంది లలితను చూడగానే.

"ఆఫీసులో వదిలేశాను" గడపలో కాలుపెట్టూ అంది లలిత.

ఆమె క్షేమంగా ఇల్లు చేరినందుకు భారం తీరినట్లు నిట్టూరుస్తూ భోజనం ఏర్పాటు చేయడానికి వంట యింట్లోకి వెళ్ళింది రాజమ్మ.

అత్తగారి వెంటనే ఇంట్లోకి నడిచింది లలిత.

రాజమ్మ పీటవాల్చి కంచం పెడ్తున్నాది.

"అనసూయ భోజనం అయిందా?" లలిత ప్రశ్నించింది.

"వెలుగుండగానే కొద్దిగ తిని పడుకొంది" గ్లాసులో నీళ్ళుపోస్తూ జవాబు చెప్పింది రాజమ్మ.

"నేను పెట్టుకు తింటాను. మీరు వెళ్ళి పడుకోండి" అంది లలిత.

"ఏం పడుకోవడం....పడుకొంటేమాత్రం నిద్రవచ్చి చచ్చిందా.... ఊరకే పక్కమీద దొర్లడంమినహా. ఒక్కదానివీ కూర్చుని ఏంతింటావు. రా....వడ్డించేస్తాను" అంది రాజమ్మ.

"నాకింకా ఆలస్యముంది. ఒంటిమీద నీళ్ళు పోసుకు రావాలి. నిజానికి ఆకలిగా కూడా లేదు. ఆఫీసునుంచి వస్తూ పంకజం వాళ్ళింటికివెళ్లేను. అక్కడ రామాయమ్మ గారు ఏదో పెట్టేరు."

లలితకి అప్పుడు భోజనం చెయ్యాలని లేదు. బలవంతంగా విస్తరి ముందు కూర్చున్నా ముద్ద మింగుడుపడే పరిస్థితిలో లేదు. అందుకే అత్తగార్ని అలా చెప్పి పంపివేసింది.

పెరట్లో నూతి దగ్గరికి వెళ్ళి గబగబ నాలుగు చేదలు నీళ్ళతోడి ఒంటిమీద పోసుకుంది. నీళ్ళు మీదపడగానే ఉడుకులెత్తుతున్న ఒళ్ళు, మనసు చల్లబడ్డాయి.

వంట ఇంటిలోకివచ్చి కుండలోంచి రెండు గ్లాసులు చల్లనినీళ్ళు ముంచుకుని తాగింది. వంటకాల్ని ఒక పక్కగా సర్ది మూతలుపెట్టి, బైట వరండాలోకి వచ్చి కూర్చుంది.

ముందురాత్రి ఆ మాటలు అయేక అనసూయని తిరిగి చూడలేదు. ఉదయం లలిత ఆఫీసుకి వెళ్ళేసరికి ఆమె గదివదలిబైటికిరాలేదు. రాజమ్మ గ్లాసుతో కాఫీపట్టుకెళ్ళి ఇచ్చివచ్చింది.రాత్రంతాజాగారంచేసిన ఆ పిల్ల కళ్ళు ఎర్రగా నిప్పుల్లా ఉన్నాయి. "ఈ కాఫీతాగేసి మరికాస్తసేపు పడుకో...." అని చెప్పి వచ్చింది రాజమ్మ.

ఓ సారి అటువెళ్ళి అనసూయని చూసిరానా— అనుకొంది లలిత. అప్పుడు చూసినా చూడకపోయినా ఒకటే ప్రయోజనం. చెప్పడానికి, చెయ్యడానికి ఏముంది కాబట్టి?

రామకోటిని కలుసుకోక పూర్వం లలిత మనసులో ఎంతో ఆశ ఉంది. "ఫరవాలేదు. దీనికి పరిష్కారం కూర్చడం ఏమంత కష్టమైన పని కాదు" అనుకొంది.

అనసూయ అంటే రామకోటికి ఇష్టం ఉంది. ఈడు, జోడుకూడా సరిగా ఉంది. తన ఇంటిలో అతను ఉండేరోజుల్లో వారిద్దరూకలిసి కన్పించినప్పుడు, ఎన్నోసార్లు లలిత మనసులో ఇటువంటి ఆలోచనే వచ్చింది. కాని, ముందు అనసూయ చదువు పూర్తి కానీ.... రామకోటికి స్థిరమైన ఉద్యోగం అంటూ దొరకని....అనుకొంది.

ఇదిలా జరుగకపోతే రామకోటి తనంతట తానే ఈ విషయాన్ని ఏదోనాడు తనముందు పెట్టేవాడనడంలో లలితకి అనుమానం లేదు. అది అలా జరిగితే ఎంతో అందంగా వుండేది....అందరికీ తృప్తిగా ఉండేది.

కాని ఆశించినట్టు అది జరగలేదు. ఇటువంటి పరిస్థితిలో అతణ్ని దోషిగా నిలబెట్టి, నిర్బంధించి అనసూయ మెడలో పుస్తె కట్టించవలసిన స్థితి ఏర్పడింది.

అయినా ఫరవాలేదు. అతడు తన తమ్ముడు. స్వతహాగా మనిషి చెడ్డవాడు కాడు. తన మాట కాదనడు....తను ఒప్పించగలదు అనుకొంది. కాని అక్కడి పరిస్థితి ఇంకోలా తయారయింది. తన తప్పును అంగీకరించడానికి సిద్ధంగాలేడు. పైగా అనసూయమీదనిందలుమోపుతూ మాట్లాడేడు.

సుధాకర్‌తో కలసి అనసూయ కాలేజీకి వెళ్ళివస్తుండడం తనకి తెలుసు. ఒకచోటునుంచి బయలుదేరి ఒకే కాలేజీకి వెళ్ళవలసినవారు కలసి ఒక బస్సులో ప్రయాణించడంలో కాని, ఆ పరిచయం వల్ల పలకరిస్తూ మాట్లాడుకోవడంలో కాని, తప్పుఉన్నట్లు తనకి అనిపించలేదు. అనసూయ ఇంకెవరో పిల్లాడితో నవ్వుతూ బస్సుస్టాపులో మాట్లాడుతూ వుండడం

కూడా, తను ఒకటి రెండుసార్లుచూసింది. ప్రకాశంకూడా ఇటువంటివే చిన్న చిన్న సంఘటనలు చెప్పేడు.

"ఆడది మగాడితో మాట్లాడినంతమాత్రానే చెడిపోతుందా? మగాళ్ళతో సరిగా చదువులు చదువుతూ? ఉద్యోగాలు చేస్తూ తిరుగుతున్న ఈ రోజుల్లో అమ్మాయిలు ఉలుకు, పలుకు లేక మరబొమ్మల్లా ఎంతకని ఉండగలరు" అంది తను.

"చిన్నప్పటినుంచి నేనూ తిరగడంలేదూ? అడ్డుఆపులు నా కెవరు పెట్టేరు. మనిషికి స్వతసిద్ధంగా స్వచ్ఛత, నిజాయితీ వుండాలికాని ఎవరికి మాత్రం ఎవరు....ఎంతకాలం పెట్టగలరు? అంత కట్టుబాట్లమధ్య నిలచిన ఆ పవిత్రతకి అసలు విలువేమిటి?" అంటూ వాదించింది!

"నీ సంగతి వేరు. నిన్ను అదుపాజ్ఞల్లో పెట్టే పెద్దలంటూ ఎవరూ ఇంట్లో లేకపోవడంచేత నిన్ను నువ్వే అదుపులో పెట్టుకోడం చిన్ననాటి నుంచి నేర్చుకున్నావు. అంతా నీలాగే ఉంటా రనుకోడం పొరపాటు. ముఖ్యంగా అనసూయ విషయంలో కాస్త కనిపెట్టివుండడం ఎంతైనా అవసరం" అనేది రాజమ్మ.

కాని లలిత అనసూయని నమ్మింది. ఒకసారి జీవితంలో చావు దెబ్బ తిని బైటపడ్డ ప్రాణి, స్వత సిద్ధంగానే తన రక్షణ విషయంలో తగినంత జాగ్రత్తగా ఉంటుందనుకొంది. కాని అది అలా జరుగలేదు.

ఒక సమస్యనుంచి తప్పుకోవాలని ఇల్లు విడిచి వచ్చిన పిల్ల, ఇంకో సమస్యలో ఇరుక్కుపోయింది. ఈ గతికన్న పూర్వం ఉండే స్థితే కొంత నయం. ఆ పరిస్థితిలో సంఘం ఆసరా ఉంటుంది. బంధుమిత్రుల సానుభూతి ఉంటుంది.

కాని ఇప్పుడు నక్క గోతిలో పడితే నాలుగు రాళ్ళు విసిరేవారే అంతా అన్నట్లు తయారయింది పరిస్థితి. జీవితంలో రెండు అడుగులు పైకి ఎక్కి, మూడడుగులు క్రిందికి జారినట్లు అయింది.

ఆ స్థితినుండి ఆ పిల్లని ఎలా తప్పించడం ? అపవాదులపాలు కాకుండా ఎలా కాపాడ్డం ?

లలిత మనసులో ఆలోచనలు తామరతంపరలా పుట్టుకొస్తున్నాయి.

అంతలోనే కొట్టుకుపోతున్నాయి.

ఇది మార్గం, ఇది గమ్యం అంటూ ఏదీ నిలకడగా నిలవడంలేదు. అంతుతేలని ఆలోచనలతో మానసికంగా, శారీరకంగా అలసిపోయింది లలిత.

అలా ఎంత రాత్రి గడిచిందో తెలియదు. ఆలోచనల వేడితో కుత కుత లాడుతున్న మెదడుకి చల్లగాలి తగిలింది.

దూరంగా నక్కలు కూస్తున్నాయి వికృతంగా. పొరుగింట్లో చంటి వాడు గుక్కపట్టి ఏడుస్తున్నాడు. కాపలావాడు కర్ర తాటిస్తూ రోడ్డుమీద పోతూ, పక్కసందులోకి మళ్ళేడు.

రాత్రి గడుస్తున్నా కంటిమీదికి నిద్ర రాలేదు. పోయి పడుకోవాలనే కోరికా కలగలేదు.

వాకిట్లోకి వెళ్ళి జాజితీగ పక్కగావున్న రాయిమీద కూర్చుంది.

పందిరి రాటకి చేరబడి అలసటతో కన్ను మూసింది,

గంటో, గడియో .... గడిచిపోయింది.

కాలికేదో చల్లగా తగిలింది; త్రుళ్ళిపడి కళ్ళు తెరచిచూసింది.

పడమరకి వాలిపోయేడు అర్ధచంద్రుడు.

పల్చని వెన్నెల మసక మసకగా ఉంది.

"ఎవరది" కాళ్ళదగ్గర కూర్చున్న వ్యక్తిని ప్రశ్నించింది.

నిద్రరాని అనసూయ తన గదిలో చూసి, అక్కడ లేకపోగా ఇక్కడికివచ్చి ఉంటుంది అనుకొంది.

"నేను....అక్కా....రామకోటిని"

కాళ్ళకి ఏదో పాము చుట్టుకొన్నట్లు త్రుళ్ళిపడింది లలిత.

లేచి నిలుచుంటూ "ఎందుకొచ్చేవు ?" అంది నిర్లిప్తంగా.

అక్కతోపాటు తనూ లేచి నిలబడ్డాడు రామకోటి.

తను చెంపదెబ్బ కొట్టిన బుగ్గవంక చూసింది లలిత.

ఆ చిరువెలుగులో అది వాచి ఉందోలేదో కన్పించలేదుకాని, తన కంటే మరి గుప్పెడు పొడుగున్న తమ్ముణ్ణి, స్వతంత్రంగా ఉద్యోగం చేసుకొంటూ బ్రతుకుతున్నవాణ్ణి, చేయెత్తి అంతదెబ్బ కొట్టింది అన్న జ్ఞాపకం మనసులో ఇంకా పచ్చిగానే ఉంది.

తనచేత అంతదెబ్బ తిని మళ్ళా తన దగ్గరికే వచ్చేడు తమ్ముడు.

రక్తసంబంధం అంటే ఇదేనేమో అనుకొంది.

ఈ భావన మనసులోకి రావడంతోనే రామకోటిపట్ల ఆమె హృదయం ఆర్ద్రిత చెందింది. అతడు చెప్పింది నిజమేనేమో....అనసూయ చెప్పిందే నిజమని ఎందుకనుకోవాలి ? మనసు ప్రశ్నించింది.

అనవసరంగా ఆవేశపడి వాడిని కొట్టేనేమో వాడు అన్నట్లు నిజంగా ఈ విషయంలో వాడి ప్రమేయం లేదేమో అనుకొంది.

ఇటువంటి ఆలోచనలతో ఆమె మనసు మెత్తబడింది. అంతకు క్షణకాలం క్రిందటవరకు మనసులో గూడు కట్టుకున్న అసహ్యం, కోపం చల్లగా జారుకొని అభిమానానికి, భాతృప్రేమకి చోటు చేసేయి.

మూరెడు ఎడంలో తల వంచుకుని నేలచూపులు చూస్తూ నిలుచున్న తమ్ముడివంక ఆప్యాయంగా చూసింది. నిండుమనసుతో ఆమె ఏదో అనబోతుంటే....

రామకోటి అక్క కళ్ళలోకి సూటిగా చూస్తూ "నేను అనసూయని పెళ్ళి చేసుకొంటాను అక్కా" అన్నాడు నిదానంగా, నిశ్చలంగా.

"రామూ" అంది లలిత.

అవధులు మీరిన సంతోషంతో చేతులు ముందుకి చాచింది.

"అక్కా" అంటూ ఆ చేతుల్లోకి వాలిపోయేడు ఆరేళ్ళ పిల్లాడిలా రామకోటి.

నూనూగు మీసాల నూత్న యవ్వనంలో ఉన్న తమ్ముణ్ణి అదే వాత్సల్యంతో గుండెలకి అదుముకొంది లలిత.

నోటితో చెప్పుకోలేని ఎన్నో మాటలు దగ్గరగా స్పందిస్తున్న ఆ రెండు గుండెలు విడమరచి చెప్పుకొన్నాయి.

మూసివున్న ఆ నాలుగు కళ్ళముందు గతంలోని అనుభూతులు, భవిష్యత్తులోని ఆశలు, తెరలు తెరలుగా తెర్లుకొంటూ, తెరమీది బొమ్మల్లా రూపురేఖలు దిద్దుకొంటూ కదులాడేయి.

అలా ఎంతసేపు ఆ స్థితిలో ఇద్దరూ ఉండిపోయారో ?

గడచిపోయిన కాలానికి గుర్తుగా దూరాన్న కోడి కూసింది.

రావిచెట్టుమీద నిద్రరాక రాత్రంతా జాగారం చేస్తున్న ముసలిపక్షి హమ్మయ్యా ఇప్పటికి తెల్లవారింది అనుకొంటూ రెక్కలు టపటప కొట్టు కొంది.

తెల్లవారుజాము చల్లగాలి ఒక తెరలా వీచి చెట్లకి కొన ఊపిరితో అంటిపెట్టుకొని ఉన్న పండుటాకుల్ని గలగల రాల్చింది.

అక్కా, తమ్ముళ్ళు కళ్ళు తెరచి ఒకరినొకరు తృప్తిగా చూసు కొన్నారు.

తను వచ్చిన పని అయిపోయింది. అన్నట్లు ఇంకొక మాటైనా అనకుండా అడుగు కదిపేడు రామకోటి.

నాలు గడుగులు నడచి, గేటుముందు నిలచి వెనుతిరిగి చూసేడు. అతడివంకే చూస్తున్నది లలిత తృప్తినిండిన కళ్ళతో; మనసులో పొంగి పొర్లుతున్న సంతోషంతో.

ఒక్కక్షణం అక్కడే తల వంచుకొని నిలిచేడు రామకోటి.

ఏదో నిర్ణయానికి వచ్చినట్లు దిగ్గున తల యెత్తి చూసేడు. ఒక దగ్గు దగ్గి గొంతుక సవరించుకొన్నాడు.

"అనసూయ గర్భంలో పెరుగుతున్న శిశువుకి తండ్రిని నేనే" అన్నాడు ప్రతి అక్షరాన్ని స్పష్టంగా నొక్కిపలుకుతూ.

అంతే .... ఆ కాస్తమాటా అని యెవరో వెంటబడి తరుము తున్నట్లు గబగబ అడుగులు వేసుకొంటూ వెళ్ళిపోయాడు.

ఆ కొద్ది గంటల్లో రామకోటి యెంతో పెద్దవాడు అయినట్లు అనిపించింది లలితకి. "వీడు నా తమ్ముడు....నా రక్తం పంచుకుని పుట్టినవాడు. నా చేతుల్లో పెరిగినవాడు" అనుకొంది గర్వంగా.

లలిత కళ్ళంట బొలబొల నీళ్ళు కారాయి. ఆ సాయంకాలంనుంచి ఎన్నోసార్లు ఆమె పెదవులు కన్నీటిని రుచి చూశాయి.

కాని ఈసారి ఆ రుచిలో భేదం వుంది.

ఈ కన్నీటిలో దుఃఖంలేదు— ఆనందం వుంది.

ఈ అనుభవంలో ఖేదం లేదు— తృప్తి వుంది.

మంచి మనసుతో మనిషి చేసే పనికి దైవసహాయం సర్వదా వుంటుంది అన్న నమ్మకంతో ఆరోజు మొదలయింది.

మనుషులు సంతోషంగావుంటే కాలంకూడా ఉత్సాహం పుంజుకొని పరుగులు పెడుతుంది. అందుకే సుఖసమయాల్లో రోజులు నిముషాల్లా నడిచిపోతాయి. అదే బాధల్లో, దుఃఖంలో అయితే రోజుకి ఇరవైనాలుగు కాక, నలభై ఎనిమిది గంట లన్నట్లు అనిపిస్తుంది.

అనసూయ వివాహమై పదినెలల కాలం గడిచిపోయింది.

రామకోటి పెళ్ళి కాగానే అంతకుపూర్వం వుండే గదిని విడిచిపెట్టి మహారాణిపేటలో ఒక చిన్న భాగం అద్దెకు తీసుకొన్నాడు. సన్యాసి వాడి పెళ్ళికి జుట్టు, బట్ట అన్నీ ఎరువే అన్నట్లు కొత్తగా సంసారం పెట్టుకోడానికి ముంత, తప్పేలా, తట్ట, బుట్ట అన్నీ చూసుకోవలసివచ్చింది.

కొన్ని లలిత కొనిచ్చింది. మరికొన్ని రామకోటి తనే కొనుక్కున్నాడు. ఆ సమయంలోనే లలితకి వచ్చింది అయిదువందల రూపాయల మనియార్డరు.

ఆఫీసులో లలిత అర్జంటు కాగితాలు ఏవో టైపు చేస్తుండగా

ఆఫీసు బంట్రోతు వెంకన్న వచ్చి "అమ్మా ! మీకు మనియార్డరు ఉందిట. పోస్టుమ్యాను నిలబడ్డాడు" అన్నాడు.

"నాకు సొమ్ము పంపేవారు ఎవళ్ళూ లేరు. నువ్వు తప్పుగా విని వుంటావు. ఎకౌంటు సెక్షన్‌లో ఉన్న లతగారికి అయి ఉంటుంది. పోయి తిన్నగా కనుక్కొని ఆవిడకి చెప్పు" అంది లలిత పనిచేసుకొంటూనే.

వెళ్ళిన వెంకన్న అయిదు నిముషాలు కాకుండానే తిరిగివచ్చి "కాదు.... మీకేనటమ్మా" అన్నాడు.

"తనకు సొమ్ము ఎవరు పంపుతారు ! ఎంత ఆలోచించినా జవాబు దొరకలేదు. సీటులోంచిలేచి ముందు హాలులోకి వచ్చింది. పోస్టుమ్యాను మనియార్డరు ఫారం, అయిదు నూరు రూపాయల నోట్లు చేతిలోనికి తీసి పట్టుకొనిఉన్నాడు.

అయిదు వందలే ? ఆశ్చర్యంగా చూసింది లలిత. సంతకంపెట్టి సొమ్ము తీసుకొని ఎవరు పంపేరా—అని కిందికి చూసింది. "నువ్వు చేసిన పనికి నా ఆశీర్వాదాలుగా దీన్ని పంపుతాను. వాళ్ళ కొత్త కాపురానికి ఈ సొమ్ము ఉపయోగపడితే నాకు కొంత తృప్తి. అరుణాచలం" అని ఉంది.

ఇంటికి వెళ్ళేక అనసూయ చేతిలో సొమ్ము పెడుతూ ఎవరు, దేని కోసం పంపింది, చెప్పింది లలిత.

తల్లీ, తండ్రి తలపుకి రావడంతో అనసూయ కళ్ళలో నీళ్ళు తిరి గేయి. అంతలోనే కళ్ళు తుడుచుకొని చిన్నగా నవ్వుతూ "నాకు అన్నీ నువ్వే అత్తా — ఈ సొమ్ము ఎలా ఉపయోగించాలని తోస్తే అలా ఖర్చు పెట్టు" అంది ఆ నోట్లు తిరిగి ఆమె చేతిలో పెడుతూ.

వాళ్ళ కొత్త సంసారం మొదలయేక లలిత ఒకసారి వెళ్ళిచూసింది. ఎంతో ముచ్చటగా ఉన్న వాటితోనే అందంగా ఇల్లు అలంకరించుకొంది అనసూయ. బాధ్యత మనుషుల్లో పెద్దరికం తెచ్చిపెడ్తుంది అనడానికి నిదర్శ నంగా కన్పించేడు రామకోటి.

లలిత వెళ్ళేసరికి రామకోటి బజారునుంచి తెచ్చిన వస్తువుల్ని జాబితా ప్రకారం అనసూయకి అప్పగిస్తున్నాడు.

ఎప్పుడూ అల్లరి చిల్లరిగా తిరిగే తమ్ముణ్ని ఆ రూపులో చూసి ఫక్కున నవ్వింది లలిత.

"నవ్వకమ్మా తల్లీ ! అంతా మా బావగారిలాంటి అదృష్టవంతులే ఉండరు. రేపు ఆ అబ్బాయో — అమ్మాయో పుట్టుకొస్తే ఇంక ఈ రాణీ గారికీ, ఆ యువరాజుగారికి సేవలు చెయ్యడంతోనే అయిపోతుంది నా పని" అన్నాడు నవ్వుతూ.

"చేస్తే చేసేవు ....ఆలికి అన్నం పెట్టడం ఊరికి ఉపకారమా— అన్నట్లు నీ పెళ్ళాం పిల్లలకే చేస్తావుకాని ఎవరికీ పైవారికి కాదుగదా" అంది లలిత.

"అలా మీ తమ్ముడికి బుద్ధి చెప్పు అత్తా. తన ఒక్కరి ముఖాన్నే పొద్దుపొడిచినట్లు మాట్లాడుతారు. ఎవరి ఇంటిపనులు వారు చేసుకో రేమిటి ?" అంది అనసూయ చిలిపిగా రామకోటిని కవ్విస్తూ.

"ఇదుగో అమ్మాయి నేనంటే అన్నానుకాని .... మా తమ్ముడిని నువ్వంటే ఒప్పుకోను తెలుసా ? ఇప్పుడు పూర్వపు అత్తను కాను. ఆడ బడుచును గుర్తుంచుకో" అంది లలిత.

"సరి — సరి. ఇంకా నీ సాయం ఏదో వుంటుంది అనుకొంటే నువ్వు అటే చేరిపోయావా ! ఇంక నా పని మీ ఇద్దరిమధ్య ఆడకత్తెరలో చెక్కలా నలగవలసిందే అన్నమాట."

"నువ్వు, నీకొడుకు కలసి మావాడిని నలగకొట్టకుండా వుంటేను-" అంది లలిత.

లలిత అక్కడికి ఎప్పుడు వచ్చినా కాఫీ ఫలహారాలు సిద్ధం చేసేది అనసూయ. "ఇప్పుడవన్నీ ఎందుకే ఎలాగా ఇంటికి వెళ్ళగానే భోజనం చేస్తానుకదా" అనేది లలిత.

"అమ్మో —ఈవిషయం తెలిసిందంటే మా అక్కకి తగినరీతిగా మర్యాదలు చెయ్యలేదని మీ తమ్ముడు నా పీక తియ్యరూ" అనేది అన సూయ దొంగభయాన్ని నటిస్తూ.

అంతా అనుకున్నట్టే అనసూయకి తొలికాన్పుకి కొడుకే పుట్టాడు

"ముమ్మూర్తుల రామకోటే" అంది రాజమ్మ పిల్లడిని ఆస్పత్రినుంచిఇంటికి తీసుకురాగానే :

"ఆ చాదస్తం .... అప్పుడే పోలికలేం తెలుస్తాయి. నే చెప్పేను చూడండి. వాడు వాళ్ళ అమ్మలాగ వుంటాడు. తల్లిని పోలిన మగపిల్లలు అదృష్టవంతు లవుతారట. నా మేనల్లుడు తప్పక అదృష్టవంతుడు కావాలి" అంది లలిత.

'నిజంగా నా కొడుకు అదృష్టవంతుడు. కడుపులో పడగానే నా జీవితంలో వెలుగు నింపేడు. నవ్వుతూ నలుగురిలో తిరిగే మార్గం చూపేడు, అనుకొంది అనసూయ.

అక్కా వాళ్ళు పిల్లడిని తీసుకురాక పూర్వమే పక్కింటి మామ్మగార్ని పిలిచి వంటా వార్పు ప్రయత్నం చేయించేడు రామకోటి. "ఈ పూటమీరు మాఅతిథులు.భోజనంచెయ్యనిదే వెళ్ళడానికి వీలులేదు"అన్నాడు.

"రాజమ్మగారూ : మీకోసం మడికట్టుకొని మరీ వంట చేసేను. అబ్బాయి ముచ్చట పడ్తున్నాడు. కాదనకండి" అంది పొరుగింటి మామ్మగారు.

"సరె .... వాడి ముచ్చట ఎందుకు కాదనాలి. ఈ రోజు ఎలాగా మీకూ, నాకూ శెలవేకదా — సాయంకాలందాకా వుండి వెళ్ళిపోదాం" అంది లలిత.

"పుట్టిన పిల్లడికి బాలసారె, నామకరణం అంటూ ఆనవాయితీలేం జరగలేదు. నలుగురూ కూర్చుని ఆలోచించి ఏదో పేరు పెట్టండి; లేకపోతే ఎవరికి తోచినట్లు వాళ్ళు పిలవడం అవుతుంది" అంది రాజమ్మ

లలిత, ప్రకాశం, రామకోటి ఈ పేరు, ఆ పేరు అంటూ అర గంటకి పైగా వాదించుకొన్నారు.

"నీ కొడుకు పేరుకోసం మే మింతగా గొంతులు చించుకొంటుంటే నువ్వేం మాట్లాడకుండా అలా ముంగిలా కూర్చున్నావేం" అంది లలిత.

"నా కొడుక్కి ఏం పేరు పెట్టాలో వాడు పుట్టకముందే నిర్ధారించుకొన్నాను కాబట్టి...." అంది అనసూయ.

"అయితే ఆ మాటేదో చెప్తే మాకీ కంఠశోషతప్పునుకదా." అన్నాడు రామకోటి.

"పోనీ ఇప్పుడైనా చెప్పు" అంది రాజమ్మ.

"ప్రకాశం" అనసూయ చెప్పింది.

"అదేమిటి—మధ్యన వాడి పేరెందుకు ?" అంది రాజమ్మ.

"తొలిచూలు బిడ్డడికి తాతగారి పేరు పెట్టడం ఆనవాయితీయేకదా అమ్మమ్మా ? ఎప్పుడో అమ్మ కన్నది కాని, నాకు పునర్జన్మ యిచ్చినవాళ్లు అత్తా, మామయ్యా. ఆడపిల్ల పుడితే అత్త పేరు. మగపిల్లడు పుడితే మామయ్య పేరు .... అనుకొన్నాను. మగపిల్లవాడే పుట్టేడు. అందుకే మామయ్యపేరు పెట్టడం ఖాయం."

"నీ గడుసుదనం నాకు తెలుసులే అమ్మా, కొడుకుని నాలుగు మొట్టికాయలు మొట్టిందికి వీలుకాకుండా ఉండాలని అలా చేసేవు" అంది లలిత.

"అక్కడికి మొట్టకుండా, తట్టకుండా మొగుడుని ముద్దిస్తున్నట్లు-" అన్నాడు ప్రకాశం.

"మరేం .... పాపం. బావగారి బుర్రనిండా మా అక్కచేత తిన్న మొట్టికాయల బొడుపులే" అన్నాడు రామకోటి.

"అప్పుడే ఎగిరిపడకు అబ్బాయ్; నీ భార్యారత్నంకూడా అంతకి తక్కువ తిన్నదికాదు. అత్త దగ్గర బాగా తర్ఫీదై మరీ వచ్చింది. ఈ ముద్దు ముద్దు మాటలు మూడురోజులే నాయనా !" అంటూ బావమరదిని ఆటలు పట్టించేడు ప్రకాశం.

ఆ మాటా ఈ మాటా అనుకొంటూ సరదాగా సాయంకాలంవరకు గడిపేసేరు. వేళమిగిలి భోజనాలు చెయ్యడంచేత ఇంక రాత్రికి ఏం అపేక్ష

లేదంటూ లలిత, ప్రకాశం ఇంటికి బయలుదేరేరు. అనసూయ బలవంతం మీద రాజమ్మ ఉండిపోయింది.

"చంటిపిల్లవాడితో కొత్తగా వచ్చింది. ఇంట్లో మంచి చెడ్డా ఏం కావాలో చూసి రేపు వచ్చేస్తాను" అంది రాజమ్మ.

"అదేం కుదరదు. నా కొడుకు కాస్త పెద్దవాడు అయేవరకు అమ్మమ్మ నా దగ్గర ఉండవలసిందే" అంది అనసూయ.

* * *

# 9

ఆ రోజు చైత్ర శుద్ధ పంచమి.

తిథుల ప్రకారం లలిత పుట్టినరోజు.

నాటికి ముప్ఫయిఏళ్ళకి ముందు లలితను కనడానికి లలిత తల్లి ఆ సమయంలో ప్రసవవేదన పడ్డది. ఈనాడు లలిత అదేవేళకి నీళ్ళపొయ్యి క్రింద మంట పెట్టింది. తలంటినీళ్ళు పోసుకుని, కొత్తచీర కట్టుకొని, అత్తింట కాలుపెట్టిన తరువాత ఆ పదేళ్ళ కాలంలో మొదటి పుట్టినరోజు జరుపుకోవటానికి.

ముందురోజు ప్రకాశాన్ని కవ్వించి, బెల్లించి కొత్తచీర కొనిపించుకుంది. అప్పటికప్పుడు ఎదుట నిలబడి దర్జీవాడిచేత దానికి తగినరంగు జాకెట్టుకుట్టించుకొంది ఇంటికి తిరిగివస్తూ సింహాచలం సంపెంగలపొట్లం ఒకటి కొని తెచ్చుకుంది.

ఇంకా ఒక కిలో నేతిమిఠాయి, ఇన్ని పళ్ళు .... "ఏమిటే ఈ హంగామా లలితా, రేపు పండుగ పబ్బం కాదుకద" అంది రాజమ్మ అవన్నీ చూసి.

లలిత పుట్టినరోజు ఎప్పుడో రాజమ్మ మరచేపోయింది. అత్తింట కాలు పెట్టిన తరువాత తన పుట్టినరోజు మాట,లలిత కూడా ఎప్పుడూ ప్రస్తావించలేదు. రాజమ్మే ఎప్పుడైనా గుర్తుకి వచ్చి అడిగితే "పోనిద్దురూ అత్తయ్యా ! ఇంతయాక ఇంకా పుట్టిన రోజు లేమిటి చిన్నపిల్లనా" అనేసేది.

అందుకే మరునాడు లలిత పుట్టిన రోజన్నమాట రాజమ్మకి గుర్తు రాలేదు.

"చెప్పుకోండి చూద్దాం" అంది లలిత అత్తగార్ని కవ్విస్తూ.

"నాకు ఈ క్షణంలో అన్న విషయం మరుక్షణానికే గుర్తుండడం లేదు. నేనేం పోల్చుకొంటాలే !— నువ్వే చెప్పు" అంది రాజమ్మ కాగితంలో చుట్టిఉన్న చీరవంక చూస్తూ.

"రేపు నా పుట్టినరోజు".

పదేళ్ళ పాపంత ఉత్సాహంగా ఆ మాట చెప్పింది లలిత.

కోడలి ముఖంవంక వింతగా చూసింది రాజమ్మ.

ఇటీవల కాలంలో ఆ పిల్ల ముఖంలో అంత ఉత్సాహం, మాటల్లో అంత చురుకుతనం, ఎప్పుడూ కన్పించలేదు.

ఏమయింది ! ఈరోజు లలితకి ఏమయింది ! అనుకొంది రాజమ్మ.

"ఎన్నేళ్ళో తెలుసునా— అత్తయ్యా"

"అదీ నువ్వే చెప్పు"

"ముప్పయి" అంది లలిత ముచ్చటపడుతూ.

నిన్నకాక మొన్న తమ ఇంట నవవధువుగా కాలుపెట్టిన లలిత జీవితకాలంలో అప్పుడే మూడు పదులు గడిచిపోయేయి. పుట్టి, పెరిగి, ఈ

మూడు పదుల కాలంలో ఏం అనుభవించింది ? ఏం ముద్దు ముచ్చట్లు, సర దాలు తీర్చుకొంది ? రాజమ్మ ఆలోచిస్తూ ఉండిపోయింది.

"అత్తయ్యా మూడు నెలలకీ ముద్దు. మూడేళ్ళకే ముద్దు. ముప్పయి ఏళ్ళకీ ముద్దు; అంటుండేది మా అమ్మమ్మ. అలా ఎందుకంటారో మీకు తెలుసా ? "లలిత ప్రశ్నించింది ఉత్సాహంగా.

రాజమ్మకి తెలుసు—మూడు నెలలప్పుడు పసిపాప మనుషుల్ని గుర్తు పట్టి చిరునవ్వులు చిందిస్తుంటుంది. మూడేళ్ళ ప్రాయంలో ఆటపాటనేర్పి అమ్మా నాన్నల కన్నుల పండువుగా ఇంట్లో తిరుగాడుతుంటుంది.

ఇంక ముప్పయిఏళ్ళ ప్రాయంలో, పూర్వపు రోజుల్లో పదహారే ళ్ళకి పంటతల్లి అని ఆడదానికి కానుపు మొదలయేది. ముప్పయి ఏళ్లు వచ్చే సరికి మగపిల్లలకి వడుగులు, ఆడపిల్లలకి పెళ్ళిళ్ళు. అల్లుళ్ళతో, వియ్యాల వాళ్ళ రాకపోకలతో ఇల్లు కళకళ్లాడుతూ, జీవితంలో స్వర్ణయుగం అన్నట్లు ఉండేది.

కాని లలిత తన ముప్పయి ఏళ్ళ పుట్టినరోజునాటికి, ముచ్చటకైనా ఒక బిడ్డ లేకుండా మోడులా ఉండిపోయింది. అందుకే రాజమ్మ ఆ మాటకి వివరణ ఇయ్యడానికి ఇష్టపడలేదు. "ఏదో వరుస కుదిరిందని అని ఉంటారు. అంతకుమించి పెద్దగా అర్థం ఏమీ ఉంటుందనుకోను" అంది.

భళ్ళున తెల్లవారేసరికి తలంటి నీళ్ళుపోసుకొని ఉషాసుందరిలా ముస్తాబై వచ్చింది లలిత. నిద్రమత్తుతో బద్ధకంగా కళ్ళువిప్పిన ప్రకాశా నికి చేతితో కాఫీకప్పుతో లలిత అలా కనిపించేసరికి అది కలో....నిజమో తేల్చుకోలేక ఒకటి రెండుసార్లు కళ్ళు నులుముకొని మరీచూసేడు.

"లలితా, నువ్వే. నువ్వే"....అన్నాడు అమాంతం పక్కమీద లేచి కూర్చుంటూ.

"నేనే....కన్పించడంలేదూ....అయినా దేనికంత ఆశ్చర్యం!" అంది లలిత.

"ఆశ్చర్యంకాదూ....ఈ చూపులో నిన్ను చూస్తుంటే ఏమేమి గుర్తు కొస్తున్నాయో తెలుసా?"

"ఆ.... ఆ.... మీరలా మాట్లాడుతుంటే నాకూ చాలా.... చాలా గుర్తుకొస్తున్నాయి." అంది లలిత ముచ్చటగా నవ్వుతూ.

"నిర్జీవంగా రోజులు అలా దొర్లిపోతుంటే ఏమో అనుకున్నాను కాని మనమింకా ముసిలివాళ్ళం అయిపోలేదన్నమాట...."

"ఛీ ఏమిటా మాటలు? ఇప్పుడిప్పుడే మనకోసం మన జీవితం మొదలయింది" అంది లలిత ప్రకాశం నోటిమీద చెయ్యిఉంచి వారిస్తూ.

* * *

సాయంకాలం ఇన్ని పళ్ళు, పువ్వులు, మిఠాయి పట్టుకుని అనసూయను చూడటానికి బయలుదేరింది లలిత.

"ఈ రోజు మీ ఆఫీసుకి సెలవా అత్తయ్యా" అంది అనసూయ ఆ వేళప్పుడు వచ్చిన లలితని చూసి.

"ఫ్రెంచిలీవ్" అన్నాడు రామకోటి తువ్వాలుతో ముఖం తుడుచుకుంటూ అక్కడికి వచ్చి.

"నన్నంటున్నావు. ఇంట్లో కూర్చుని నువ్వేం చేస్తున్నట్లు?"

"ఈ రోజు నువ్వు సన్నసన్నగా పళ్ళు, ఫలహారాలు తెచ్చి మరదలు పిల్లకి మింగపెడతావని రాత్రి కల వచ్చింది. అందుకే పనిలోకి పోకుండా....... "

"ఉట్టిదే అత్తయ్యా, ఆయన ఇప్పుడే ఆఫీసునుంచివచ్చేరు" అంది అనసూయ.

"రాకపోతే నువ్వు నా కోసం, ఒక పండుముక్కయినా, లడ్డూ పూసయినా మిగుల్చుతావా—మరి—"

"ఎందుకంతలా ఏడ్చుకొంటారు? ఇదిగో ఇంచండి— మీ అక్కగారుతెచ్చిన పళ్ళు, ఫలహారాలు, అన్నీ మీరేఆరగించండి—నాకేం అక్కర లేదు" అంటూ లేని కోపం నటించింది అనసూయ.

"ఎందుకర్రా అలా కొట్లాడుకుంటారు.... ఇద్దరూ తింటారనే తెచ్చాను" అంది లలిత వారిద్దరి మధ్య లేని దెబ్బలాటకి రాజీ కుదురుస్తూ.

"అసలింతకీ ఈ రోజు ఏమిటివిశేషం?" అన్నాడురామకోటి లలిత కట్టిన కొత్తచీరవంక చూస్తూ.

"ఈ రోజు నా పుట్టిన రోజురా" అంది లలిత ఉత్సాహంగా.

అనసూయ, రామకోటి ఆమె వైపు నమ్మలేనట్లు చూసేరు. తను వారింట ఉన్న అయిదేళ్ళ కాలం లలిత నోట తన పుట్టినరోజు అన్నమాట కూడా వినలేదు. మరింత కాలానికి ఇప్పుడు ఇంత ఆర్భాటమేమిటి—అను కొంది అనసూయ.

"ఇంకా పుట్టినరోజులు; మెట్టినరోజులుచేసుకుంటున్నావు. అదృష్ట వంతురాలివి. నా పుట్టినరోజు ఎప్పుడో నీ దగ్గరినుంచి వెళ్ళిపోయేక మరచి పోయేను" అన్నాడు రామకోటి.

ఆ మాట అంటూనే గదిలోకి వెళ్ళేడు. అదే ఆదను అన్నట్లు తన వెనుకగా దాచిన ప్రేకెట్ తీసి అనసూయ చేతిలో పెట్టింది లలిత.

"ఇదేమిటి?" అంటూ మూతతీసి చూసింది. దానిలో ఉన్న సరం జామా చూసి చిన్నగా నవ్వుతూ "ఇద్దరూ లేక ముగ్గురు— అన్నారుగా..... మాకింకా ప్రకాశిగాడు ఒక్కడే'' అంది నవ్వుతూ అనసూయ.

''అటువంటిదే ఇంకోమాట కూడావుంది మరి—'ఒక బిడ్డకి కాదిది తరుణం' అంటూ....నిజానికి ఇది నీ పెళ్ళిలో ఇవ్వవలసిన మొదటికానుక. కాని నువ్వు బొమ్మని బొరుసు చేసి మరీ పెళ్ళి పీటలమీద కూర్చున్నావు. అందుకే అప్పుడు అవసరం లేదని ఇవ్వలేదు."

''అదిగో....అదిగో.... నేను అనుకొన్నంత అయింది. నేను అటు వెళ్ళగా చూసి, ఇటు మరదలుకి రహస్యంగా ఏదో అందించేస్తున్నావు. ఏమైనా నీ పక్షపాతబుద్ధి పోనిచ్చుకున్నావు కావు'' అన్నాడు రామకోటి.

''పక్షపాతం అంటూ వుంటే తోడపుట్టిన మీ మీద వుంటుంది కాని, నా మీద ఎందుకుంటుంది?''

"ఎందుకేమిటి అంతగా వాదులాడి ఆవిడ భర్తగారి పేరు, కొడుక్కి పెట్టలేదూ....అందుకే" నవ్వుతూ అన్నాడు రామకోటి.

అనసూయ కొడుకుని అత్తముందు ఆటలకి వదలి ఇంట్లోకివెళ్ళి రెండు కప్పులతో కాఫీ తెచ్చింది.

"నీకో" అంది లలిత.

"ఆవిడ కాఫీ తాగడం మానేసింది" అన్నాడు రామకోటి.

"అదేమిటి....అనసూయకి కాఫీ అంటే ప్రాణం కదా. తాక్కపోవడమేమిటి!" తెల్లబోతూ ప్రశ్నించింది లలిత.

"అబ్బే.... మరేం లేదు. అంతకన్న ప్రాణమైన కొడుక్కి పాలు చాలడంలేదట. కాఫీ మానేసి హార్లిక్సు తాగితే పాలుంటాయని ఎవరో చెప్పేరుట."

"ఓస్—అంతేకదా" అంది లలిత తేరుకుని.

"ఇంక వెళ్ళొస్తా౯ా — సాయంకాలం మీ బావగారు సినిమాకి వెళ్దామన్నారు" అంటూ లేచింది లలిత.

రామకోటి జేబులోంచి మూడు, పది రూపాయ నోట్లు తీసి, లలిత చేతిలో పెట్టేడు.

"ఇదేమిటి?" అంది లలిత ఫాటివంకచూస్తూ.

"నీ పుట్టినరోజుఅన్నావుకదా....నా పేరుగా ఇంకోచీర కొనుక్కొని కట్టుకో."

"అత్తయ్యా సంకల్పం చెప్పుకొనేటప్పుడు నా పేరు కూడా కలుపుకోవాలి. అందులో ఓ పది నాది" అంది అనసూయ లలితను నవ్వుతూ సాగనంపుతూ.

* * *

లలిత పుట్టినరోజు వెళ్ళి ఆరునెల్లయింది. ఎండల్ని వర్షాల్ని దాటించుకుంటూ దసరాపండుగ వచ్చింది.

"వినాయకచవితి మీయింట అయింది, విజయదశమి మా ఇంట కావాలి" అన్నాడు ప్రకాశం.

రామకోటి అనసూయ పండక్కి ముందురోజునే వచ్చేరు.

చిన్న ప్రకాశం, మాటలు నడక నేర్చేడు. ఇంట్లో అంతా వాడిని బుజ్జి అని పిల్చేవారు. అనసూయ మాత్రం "పకాశం" అని పిల్చేది. వచ్చీ రాని మాటలతో ఏమేమో చెడవాగుతూ, ఏడుస్తూ, లేస్తూ ఇల్లంతా ఎక్కడ చూచినా వాడే అన్నట్లు తిరగటం మొదలుపెట్టేడు. "ఏ వస్తువుఅయినా చేతికందితే విరిచి పోగు పెట్టందే వాడికి తోచదు. వాడితో వేగలేక చస్తున్నాననుకో" అనేది అనసూయ ఒకవంక కొడుకు అల్లరికి ముచ్చట పడ్తూనే.

బుజ్జికి మాటలు రాగానే వరసలుపెట్టి అందర్నీ పిలవటం నేర్పింది అనసూయ. రాజమ్మని చూడగానే అవ్వ .... అవ్వ.... అంటూ చేతులు అందిస్తాడు. లలితని నానమ్మ అనీ, ప్రకాశాన్ని తాతయ్య అని పిలుస్తాడు.

"ఇదిగో అనసూయా పెళ్ళయి నిండా ఏడు నెల్లు కాకముందే కొడుకుని కన్నావని మహా మిడిసిపడ్తున్నావు కానీ, అప్పుడే నీ కొడుకు మమ్మల్ని నానమ్మలు, తాతయ్యలుచేసి కూర్చోపెడ్తానంటే ఊరుకొనేది లేదు" అనేది లలిత.

లలిత ఆ మాట నవ్వుతూ పరిహాసానికే అన్నా ఆ మాట వెనుక ఏదో వేదన ఉన్నట్లు అన్పించింది అనసూయకి.

పిల్లలు నలుగురు కూర్చుని దేవిపూజ చేసుకుంటుంటే కళ్ళనిండుగా చూసుకొని ముచ్చట పడింది రాజమ్మ. అపరాహ్నం తిరుగుతుంటే పిండి వంటలతో భోజనాలుచేసి భుక్తాయాసంతోకడుపులురాసుకుంటూ అంతాచావిట్లోకి వచ్చారు.

ప్రకాశం తను కొన్న బట్టల్ని తెచ్చి పేరుపేరునా అందరికీ అందిచ్చేడు. బుజ్జిగాడికోసం కొన్నతాళ్ళ నిక్కరు, చొక్కా ఇంకో కవరులో ఉండిపోయాయి. ప్రకాశం అవి తేవటానికే గదిలోకి వెళ్తుంటే "ఒరే బుజ్జి

నీకోసం తాతయ్య బట్టలు కొనలేదుట్రా. అన్నీ ఏకంగా కూతురి పెళ్ళినాడే పెట్టేస్తాట్ట" అన్నాడు రామకోటి కొడుకుతో.

"ఆ....ఆ....వాడికెందుకు కొనరు. తన పేరింటిగాడు కదా........ వాణ్ని మరచిపోతారా .... .... అందరికన్న ముందే కొన్నారు." అంది లలిత.

కొత్త బట్టలు కట్టుకొని అమ్మమ్మకి, అత్తయ్యకి మామయ్యకి నమస్కరించింది అనసూయ.

"వచ్చేయేడు ఈరోజుకి పండులాంటి ఓ కూతుర్ని కను" అంటూ దీవించింది రాజమ్మ.

''ఏయ్ .... అనసూయా. అమ్మమ్మ అన్నదని కనేసేవు సుమీ.... తొందర పడ్డావంటే ఊరుకునేది లేదు'' అంటూ కళ్ళతో హెచ్చరించింది లలిత.

సాయంకాలందాకా ఉండి, రామకోటి, అనసూయ ఇంటికి బయలు దేరేరు.

బుజ్జిగాడు అవ్వ ఒడిలో కూర్చుని ఆమె చేతులమీద కదలాడుతున్న పచ్చ నరాల్ని పట్టుకోడానికి తెగ ప్రయత్నం చేస్తున్నాడు.

"ఏరా—మేము వెళ్ళిపోతున్నాం. నువ్వు అవ్వ దగ్గర ఉండిపోతావేమిటి" అంది అనసూయ.

"పోనీ — ఉంచెయ్యరాదూ. రేపు నా కెలాగూ ఆఫీసు లేదు. సాయంకాలం తీసుకొచ్చేస్తాను" అంది లలిత ఉత్సాహంగా.

"ఈ రాత్రికి మీ ఇంటిమీద కమ్మలన్నీ ఎగరకొట్టి మరీ వదులుతాడు. మళ్ళీ సొమ్ముపెట్టి నేయించుకునే ఓపిక బావగారికి ఉంటే, నా అభ్యంతరం ఏం లేదు" అన్నాడు రామకోటి.

"నేను పక్కలో లేందే పడుకోడు అత్తా.... నువ్వు ఉంచుకోలేవు" అంది అనసూయ.

"నీ కొడుకు మా కెందుకమ్మా? ఎరువు సొమ్ము బరువు చేటు.

న వ్వే తీసికెళ్ళు" అంటూ ఈ బుగ్గా ఆ బుగ్గా నివితీరా ముద్దులాడి బుజ్జి గాడ్ని అనసూయ చేతుల్లో పెట్టింది రాజమ్మ.

వాళ్ళు వెళ్ళిపోయాక ఎంతసేపటివరకో లలిత అలా గుమ్మంలో నిలబడి ఉండిపోయింది అత్తగారు అన్న చివరి మాటలు ఆమె చెవుల్లో మారుమ్రోగుతున్నాయి....అవును ఎంత చేసినా ఏం పెట్టినా పైవాళ్ళు .... పైవాళ్ళే....తనవాళ్ళు ఎలా అవుతారు ? ఎరువుసొమ్ము నిజంగా బరువే.... దానిమీద ఎం మమత పెంచుకున్నా ఎంతగా నాదే అనుకున్నా ఏదోనాటికి దాని హక్కుదారుకి అందియ్యక తప్పదు.

లలిత అలా ఆలోచిస్తుండగానే అనసూయని రామకోటిని బస్సు దాకా అంపకం పెట్టడానికి వెళ్ళిన ప్రకాశం తిరిగివచ్చేడు. అలా పరధ్యాన్నంగా ఉన్న భార్యను క్షణకాలం పరిశీలనగా చూసి "ఏమిటి లలితా ! అంతదీర్ఘాలోచనలో పడ్డావ్" అన్నాడు పలకరిస్తూ.

అతడు తిరిగి రావడం చూడని లలిత తొట్రుపాటుతో "అబ్బే .... ఏం లేదు .... ఏం లేదు. చాలా ఏళ్ళ తరువాత దేవుడిముందు తలవంచి కూర్చుని అంత శ్రద్ధతో పూజ చేశారుకదా....ఏం వరం కోరివుంటారా.... అని అఆలోచిస్తున్నాను" అంది.

"చెప్పనా?" అన్నాడు ప్రకాశం చిలిపిగా చూస్తూ.

"కోరినవరం పైవాళ్ళకి చెప్తే ఫలం ఇయ్యదుట."

"ఆ — అటువంటి చాదస్తం నాకు లేదు — అయినా భార్య పైదేమిటి ?"

"అయితే చెప్పండి...."

"మరేమో దేవుడూ——మా లలితకి ఎరువు సొమ్ముకాని అలంకారం ఒకటి కావాలట — త్వరగా పార్సెల్ చేసి రిజిష్టర్ పోష్టులో పంపించూ అని—"

"ఛీ. అన్నీ అబద్దాలే—"

'అబద్ధం ఎందు కయింది ?"

"అబద్ధం కాకపోతే నిజమా—నాకోసం మీరెందుకు కోర్తారు ?"

"పోనీ—అయితే —ఏం వరం కోరిఉంటానో నువ్వు ఊహించి చెప్పు"

"చెప్పనా—ఓయి దేవుడూ, పదేళ్ళు కావస్తున్నాది ఇలా ట్యూటరు పోస్టులో పడివున్నాను. లెక్చరరుగా ప్రమోషను ఇప్పించూ అని"

"అంతగా దేవుణ్ణి కోరడానికి అదేం పెద్ద కోరికా ? ప్రమోషన్ వస్తే వస్తుంది - లేకుంటే లేదు... ఈ వస్తున్న జీతం మనిద్దరికీ చాలదా ఏం ?"

"ఎప్పటికీ ఇలా మనిద్దరమే ఉండిపోతామేమిటి ... మరో ఇద్దరు పుట్టుకొస్తే ?"

"ఓ అదా...అప్పుడే అడగవచ్చు...దేవు డెక్కడికి పోతాడు...మన మెక్కడికి పోతాం ?" అన్నాడు ప్రకాశం నవ్వుతూ.

"మీకు ఒక్క పిసరైనా ముందు జాగ్రత్త లేదు" అంది లలిత.

"ఉంటే నువ్వూ, నేనూ ఇలా ఉండేవారిమా ? ముసలితనంలో ఆదుకోడానికి ఇప్పటికి ఓ అరడజనుమంది పిల్లల్ని కని-"

"ఆ...ఆ...అదేం కుదరదు స్వామీ ... దో యా తీన్ బచ్చే బస్" అంది లలిత నవ్వుతూ.

* * *

ఉదయమనగా కొడుకు, కోడలు ఇల్లు విడిచి వెళ్ళిపోతే రాజమ్మకి ఒంటరిగా ఇంట్లో కూర్చోబుద్ధి కావడంలేదు. పూర్వం అయితే ఇరుగు, పొరుగుల్లో ఆమె ఈడువారు తెలిసినవారు ఉండేవారు. వాళ్ళతో కాస్తసేపు కాలక్షేపం. మరికాస్తసేపు రామాయణ పఠనం ఇలా గడిచిపోయేది కాలం.

అనసూయ వచ్చేక ఆమె దినచర్యలో కొంత మార్పు వచ్చింది. మధ్యలో ఒక ఏడాదిపాటు కాలేజీ అంటూ వెళ్ళివచ్చినా మిగిలినకాలం

అంతా ఇంటిపట్టునే ఉండేది అనసూయ. అమ్మమ్మ . .అమ్మమ్మ అంటూ ఏవో కబుర్లు చెపుతూ వెంటవెంట తిరుగుతుండేది.

అనసూయ కొడుకు నెత్తుకొని భర్త దగ్గరికి వెళ్ళిపోవడం. పొరుగింటి మీనాక్షమ్మ మనుమడికి కాన్పూరు ట్రాన్స్‌ఫర్ అయిందని ఆవిడ వెళ్ళిపోవడం, ఎదుటి వాసలోఉన్న అన్నపూర్ణమ్మ గుండెపోటు వచ్చి అకస్మాత్తుగా కళ్ళు ముయ్యడంతో ఒక్కసారిగా ఒంటరితనం రాజమ్మ చుట్టూ గూడు కట్టింది.

పిలిస్తే పలికేవారులేని ఈ యింట్లో ఒంటరిగా ఉంటూ ఆ అన్నపూర్ణమ్మలాగే ఏదోరోజున తనూ గుండె ఆగి కన్నుమూస్తే, సాయంకాలం పిల్లలు తిరిగి వచ్చేవరకు ఆ శవం ఇంట్లో ఈగలు ముసురుకుంటూ అలా పడివుండవలసిందే. మీ అమ్మకు ప్రాణంమీద కొచ్చింది అని కొడుక్కి కబురు చెప్పేపాటి పొత్తుగలవాళ్ళు ఇరుగుపొరుగుల్లో ఎవ్వరూ లేరు.

పూర్వం అక్కడో కొంప, ఇక్కడో కొంప ఉన్నప్పుడే నయం. మాట సాయానికో- మనిషి సాయానికో, ఒకరిమీద ఒకరు ఆధారపడి మంచీ, చెడ్డ అనుకొనేవారు. ఇప్పుడు వాడలుతీరి ఇళ్ళు లేచాయి. ఇళ్ళల్లో ఎలక్ట్రిక్ దీపాలు, కొళాయిలు వెలిశాయి. వీధి మొదట్లో బజారు, కాఫీ హోటలు అన్నీ సిద్ధమయ్యాయి. మనిషి బ్రతకటానికి అవసరమయే అన్ని హంగులు ఉన్నాయి. లేనిదల్లా మనుషుల మధ్య పొత్తే.

అప్పట్లో అంతా పట్నంలో ఎక్కువగా అద్దెలు యిచ్చుకోలేని మధ్యతరగతి కుటుంబీకులే ఈకొసలంటచేరి ఇల్లు కట్టుకున్నారు. క్రమంగా ఆఫీసర్లు, వ్యాపారస్తులు కారులమీద తిరిగేవారు, నౌకర్లు చాకర్లు కలవారు మేడలు మిద్దెలు కట్టేరు. వాళ్ళకి తమకీ ఏం కలుస్తుంది? అయినా తన వంటి ముసలమ్మతో ఎవరు మాట్లాడుతారు?

ఒకటికి రెండుసార్లు తల్లినోట ఇటువంటి మాటలు విన్న ప్రకాశం అమ్మకి వయసు మీరుతున్నది. మనిషిలో పూర్వం ఉండే ధైర్యం, నిశ్చలత లేకుండా పోతున్నది-అనుకున్నాడు.

ఆ రోజు ఉదయం కొడుకు, కోడలు బైటికి వెళ్ళేక ఒకసారి అలా పట్నంలోకి వెళ్ళి అనసూయని చూసిరావాలని బయలుదేరింది రాజమ్మ. ముందుగా రామాయమ్మ గారింటికి వెళ్ళి, అక్కడ ఆవిడతో కాస్తసేపు కాలక్షేపం చేసి, అక్కడినుంచి అనసూయవాళ్ళ ఇంటికి వెళ్ళింది.

మనుమరాలితో మాట్లాడుతూ, బుజ్జిగాడి ముచ్చట్లు వింటూ అలా కూర్చుంటే ఎంత సమయం గడిచిందీ రాజమ్మకి తెలియనేలేదు. అనసూయ "అమ్మమ్మా ప్రకాశిగాడ్ని ఒక్క నిముషం చూస్తూండు. ఆయన వచ్చే వేళయింది. కుంపటి అంటించి కాఫీకి నీళ్ళు పడేసివస్తాను" అంటూ లేవబోతుంటే అప్పుడు అడిగింది. "ఎన్ని గంటలయిందే?" అని రాజమ్మ.

"నాలుగున్నర" అంది అనసూయ కుంపట్లో బొగ్గులు వేస్తూ.

"చెయ్యి కడుక్కొచ్చి నీ కొడుకుని తీసుకో—నే వెళ్ళాలి" అంటూ లేచింది రాజమ్మ.

"అప్పుడే తొందరేముంది .... మామయ్య ఊర్లో లేడన్నావుగా"

"మామయ్య లేకపోతేనేం .... అత్త ఉందికదా .... ఏ వేళకి వస్తుందో....ఏమో....వీధి తాళంచెవి నా దగ్గరే ఉండిపోయింది."

"అత్త ఇంత వేళుండగా ఎక్కడ వస్తుందిలెద్దూ ....స్కూటరు కూడా మరామత్తుకి వెళ్ళిందన్నావు. ఆవిడ రెండు బస్సులు మారి ఇల్లు చేరేసరికి నువ్వు వెళ్ళలేకపోవు. ఈ వీధి మొదట్లోనే రిక్షా దొరుకుతుంది. మరి కాస్తసేపు కూర్చో" అంది అనసూయ.

అంతలోనే రామకోటి వచ్చేడు. "కూర్చోండి నే రాగానే వెళ్ళిపోతున్నారేమిటి ?" అన్నాడు.

అవునూ, కాదూ అంటూ మరో అరగంట కూర్చుని బయలుదేరింది రాజమ్మ.

అనుకొన్నట్లే ఆమె ఇంటికి చేరేసరికి లలిత ఆఫీసునుంచి వచ్చేసింది వీధి వరండాలో తడికెకి చేరబడి కూర్చునిఉంది.

"ఎంత సేపయింది నువ్వు వచ్చి? అనసూయని చూడాలని వెళ్ళేను. లేచి వచ్చేస్తుంటే రామకోటి వచ్చేడు. వాడితో నాలుగు మాటలు మాట్లాడి వచ్చేసరికి ఆలస్యమయిపోయింది" అంది రాజమ్మ.

"ఫరవాలేదులెండి. నేనూ ఇప్పుడే వచ్చేను" అంద లలిత అత్తగారి చేతిలో తాళం అందుకొని తలుపు తీస్తూ.

కోడలివెంట లోపలికి వెళ్ళింది రాజమ్మ. రిక్షాలో వెళ్ళి, వచ్చినా బాగా అలసిపోయింది మనిషి. పెరట్లోకివెళ్ళి కాళ్ళూ, చేతులు కడుక్కొని, చావిట్లో మంచంమీద చేరబడుతూ "ఫాస్కులో కాఫీ పోసిఉంచేను తీసుకో" అంది కోడలితో.

అప్పటికే లలిత రెండు గ్లాసుల్లో కాఫీ పోసి తెచ్చి ఒకటి అత్త గారికి అందిచ్చింది.

పూర్వపు రోజుల్లో అయితే రాజమ్మ రెండోపూట కాఫీ తాగేది కాదు. అసలుమధ్యాహ్నం భోజనం అయేక, రాత్రి గ్లాసుడు పాలకి మినహా మరేం తీసుకొనేదికాదు. ఇప్పుడు అలా ఒంటిపూట భోజనంతో ఉండలేక పోతున్నాది. మధ్యలో పండో, కాయో — కాఫీయో ఒకటికి రెండుసార్లు ఆరారా నోట్లో పోసుకోకపోతే డొక్కలో మంట పుట్టడం, లేచి తిరగ లేకపోవడం అలా తయారయింది పరిస్థితి.

గ్లాసులోని కాఫీని నెమ్మదిగా తాగుతూ, "అనసూయా వాళ్ళు ఎలా ఉన్నారు? ఈమధ్య చాలారోజులై అటు వెళ్ళాలనుకొంటూనే పని తొందర వల్ల పడ్డంలేదు" అంది లలిత.

"అనసూయ మళ్ళా నెల తప్పింది. క్రిందటిమాటులా వేవిళ్ళు అవీ లేవు. ఈసారి ఆడపిల్ల పుడ్తుంది. అందుకే ఈ మార్పు అని చెప్పి వచ్చాను." రాజమ్మ గ్లాసులో ఉన్న ఆఖరి గుక్క కాఫీ నోట్లో పోసు కొంటూ అంది.

లలిత తెల్లబోయి అత్తగారివంక చూసింది.

"నిజం ? .... మీరు సరిగ్గా విన్నారా .... లేక ఒక మాటకి ఒక మాట..."

"అదేమిటే లలితా ! మరి అంతలా మతి పోయిందిటే...మొగుడు, పెళ్లాం ఇద్దరూ నీతో చెప్పమన్నారు కూడా" అంది రాజమ్మ కాఫీగ్లాసు తీసుకొని కడిగిపెట్టడానికి పెరట్లోకి వెళ్తూ.

లలిత గ్లాసులో మిగిలిన కాఫీ అలాగే చల్లారిపోయింది.

చల్లారిన కాఫీలో ఒక ఈగ పడి చచ్చింది.

తిన్నగావెళ్ళి కాఫీని కాలువలో పారబోసి గ్లాసుకడిగి ఇంట్లో తిన్నె మీద పెట్టింది.

తిరిగివచ్చి వరండాలో కూర్చుంది బట్టలయినా మార్చుకోకుండా.

ఆమె కళ్లముందే ఆకాశంమీద మిగిలిఉన్న సంధ్య వెలుగుపోయి చీకటి ముంచుకొచ్చింది. చీకటిని తరుముకుంటూ చిరువెన్నెల వచ్చింది. అయినా లలిత కదలలేదు. అలా బొమ్మలా అక్కడే కూర్చుంది.

పెరటివాకిట్లో మంచంమీద పడుకొన్న రాజమ్మ, ఓ కునుకు తీసి లేచింది. దాహంవేసి మంచినీళ్ళకోసం వంట ఇంట్లోకి వచ్చింది. కడిగి పెట్టిన కంచం, గ్లాసు అలాగే ఉన్నాయి. మూతపెట్టిన కూరా అన్నం, తీసిన సూచనలేదు.

ముందు ఇల్లంతా చీకటిగా ఉంది. లలిత గదిలోకూడా దీపం లేదు. తడుముకొంటూ వెళ్ళి లైటు స్విచ్ వేసింది రాజమ్మ. ఓరగా వున్నతలుపు మరికాస్త తెరచి గదిలోకి చూసింది.

ఇటీవలి కాలంలో లలితకి తరచుగా తలనొప్పి వస్తున్నది. అది వచ్చినప్పుడు ఇంక తిండితిప్పలు అంటూ లేకుండా అలా పడుకొని పోతుంది.

కొడుకు కూడా ఇంట్లో లేడు. ఒకసారి పలకరించి పాలో, నీళ్ళో ఏం కావాలో కనుక్కోవాలనుకొంది రాజమ్మ. తలుపు తోసి "లలితా" అంటూ మెల్లగా పిల్చింది.

లలిత గదిలో లేదు— వేసిన పక్క వేసినట్లే వుంది.

చావిట్లోలేక, గదిలోలేక ఇంతరాత్రప్పుడు ఎక్కడికి వెళ్ళినట్లు ? కంగారుగా అటు ఇటు చూసింది రాజమ్మ.

వోరవాకిలిగా ఉన్న వీధితలుపు లోంచి సన్నగా వెన్నెలధార నేల మీద పడ్తున్నది. తలుపుదగ్గరికివెళ్ళి మరికొంచెం తెరచిచూసింది రాజమ్మ.

లలిత చెక్కటం చెయ్యిజేర్చి; తడికకి చేరబడి కళ్ళు మూసుకుని కూర్చుంది. "లలితా" మెల్లగా తట్టి పిల్చింది రాజమ్మ. కోడలు కూర్చునే అలా నిద్రపోతున్న దనుకొని.

లలిత కళ్లుతెరచి చూసింది.

ఆ కళ్ళలో నీళ్ళు లీలగా కదులాడుతున్నాయి.

రాజమ్మకి చత్వారంవచ్చి చాలాకాలం అయింది. ఆ చిరువెలుగులో లలిత కళ్ళలోని నీటిని ఆమె చూడలేదు.

"ఇక్కడ కూర్చుని నిద్రపోతున్నావా? ఇంట్లో ఎక్కడా కన్పించక పోతే కంగారుపడ్డాను....భోజనం చెయ్యలేదేం.... మళ్ళా తల నొప్పేనా" అంది లాలనగా లలిత నుదుటిమీద రాస్తూ.

"అత్తయ్యా" అంటూ ఆమె ఒడిలో తలపెట్టుకొని బావురుమని ఏడవాలనిపించింది లలితకి.

కాని, ఎందుకేడుస్తున్నావు....అంటే ఏం చెప్పడం ?

తలనొప్పివల్ల తనేడుస్తున్నదంటే ఇన్నేళ్ళుగా తన తత్త్వం తెలిసిన అత్తగారు నమ్ముతుందా ?

అందుకే నెమ్మదిగా, తన గొంతులోని దుఃఖపుజీర ఆమెకి విన్పించనంత మెల్లగా అంది లలిత "ఆకలిగా లేదత్తయ్యా....సాయంకాలం ఏదో కొంత తిన్నాను" అంటూ.

"లోపలికొచ్చి పడుకో.... బాగా రాత్రయింది. మొన్న సందెవేళ కాంతారావుగారింట దొంగపడి వాళ్ళ పిల్ల మెళ్ళో గొలుసు కత్తిరించుకొని వెళ్ళిపోయేడుట. రోజులు బాగాలేవు....వాడుకూడా ఇంట్లో లేడు" అంటూ కోడల్ని లేవదీసింది రాజమ్మ.

ఆమె వెంటనే అడుగులో అడుగువేసుకొంటూ నడిచివెళ్ళిందిలలిత.

అత్త వెళ్ళిపోయాక గుండెల్లో పేరుకొన్న బాధ కరిగిపోయేలా కళ్ళల్లో మిగిలిఉన్న నీళ్ళతో కడిగివేసుకొంది.

* * *

అనసూయకి ఏడో నెల వచ్చింది. ఆ సారి నెల తప్పేక మొదటి మూడు, నాలుగు నెలలు వేవిళ్ళు, నీర్సం లేకుండా ఆరోగ్యంగానే తిరిగింది.

అయిదోనెల వచ్చేసరికి కడుపు ఉండవలసినదానికన్న పెద్దదిగా పెరిగిపోయింది. లేచినా, కూర్చున్నా ఆయాసం, ఊపిరి తిన్నగా రాకపోవడం, ఏపాటి తిన్నా గుండెలకి ఎగదన్ని భారంగా ఉండడం వంటి లక్షణాలు మొదలయేయి.

రామకోటి భార్యను ఆసుపత్రికి తీసుకువెళ్ళిచూపించేడు. "కడుపులో నీరుంది అనీ, ఆ కారణంగానే ఆ పొంగు, ఆయాసం అనీ" ఏవేవో మందులు ఇన్‌జక్షన్‌లు రాసి ఇచ్చేడు డాక్టరు.

ఇంట్లో పనీ పాటు, పిల్లడినిచూసుకోడం అనసూయ ఒక్కతెవల్ల అయ్యే పని కాదని తేలిపోయింది. పై పనులు చేసిందికి పిల్లడిని ఆడించిందికి ఒక పనిమనిషిని పెట్టుకొన్నారు. మిగిలిన పనిని తీరికవేళల్లో రామకోటి చేసేవాడు. కొంత, మొదలు అనసూయ చూసుకొనేది.

అనసూయకి నెలలు మారుతుంటే నెలలో సగం రోజులు రాజమ్మ, వారింటనే ఉండిపోయేది. "మీ రే పనిపాట్లు చెయ్యనక్కరలేదు. మీరు ఇంట్లో ఉంటేనే మాకు కొండంత ధైర్యం మామ్మగారూ! మీ మనుమరాలి బరువు తేలికపడేవరకు ఇక్కడే ఉండండి" అనేవాడు రామకోటి.

ఆ మధ్యకాలంలో ఎప్పుడో వచ్చి వెళ్ళిపోయింది లలితపుట్టినరోజు. ఇటు లలితకికాని, అటు మిగిలిన వారికికాని ఆ విషయమే గుర్తుకిరాలేదు. కాలేజీనుంచి నాలుగురోజుల కోసారి అటువెళ్ళి మేనగోడలి యోగక్షేమాలు కనుక్కొని వచ్చేవాడు ప్రకాశం.

"ఈ రోజు అనసూయ వాళ్ళ ఇంటికి వెళ్లేను" అని ప్రకాశం అంటే "ఎలా ఉందేమిటి?" అని లాంఛనానికి ప్రశ్నించి ఊరుకునేది

లలిత. "ఎందుకో ఈ మధ్య లలిత అదోలా ఉంటున్నది" అనుకొన్నాడు ప్రకాశం.

అనసూయ కూడా ఆ మాటే అంది. "ఈ మధ్య అత్తయ్యకి నా మీద కోపం వచ్చినట్లుంది. పదిరోజులకి ఒకసారైనా ఇటు తొంగి చూడ్డం మానేసింది. పోనీ నేనే రావాలనుకొంటే ఈ స్థితిలో ఎలా రాను చెప్పు మామయ్యా" అంది.

అనసూయ అలా అనుకోడానికి కారణం లేకపోలేదు. అంతకు పూర్వం వారానికి నాలుగైదు సార్లయినా అటువైపు వెళ్ళి వస్తుండేదిలలిత. తన అవకాశాన్ని బట్టి అరగంటో, పావుగంటో కూర్చుని, తమ్ముడితో మరదలితో కబుర్లు చెప్పి బుజ్జిగాడిని కాస్తసేపు ఆడించి, మరి కాస్తసేపు ఏడిపించి మరీ ఇంటికి దారితీసేది.

రమారమి రోజూ అత్తయ్య వస్తుంది అన్నట్టే కాఫీ, ఫలహారాలు ఆమెకి కూడా సిద్ధంచేసి ఉంచేది అనసూయ. ఏ రోజైనా లలిత రాకపోతే "నిన్న నువ్వు వస్తావేమో అని ఉప్మా చేసి ఉంచేను. చీకటి పడేవరకు ఉంచి అప్పుడు పనిదానికి పడేసేను" అనేది.

"పోనీలే నా మూలంగా దండగైతేఅయింది. మా తమ్ముడి ఆర్జనే కాని, నీ పుట్టింటి ఆస్తేం ఒరగపొయ్యేలేదు కదా" అనేది నవ్వుతూ లలిత.

లలిత వారింటికి అంత తరుచు వెళ్ళడానికి కారణాలు లేకపోలేదు. ఒకటి బుజ్జిగాడి అల్లి బిల్లి కబుర్లు వినడం అంటే ఆమెకి ఎంతో ఇష్టం. రెండోది రామకోటి కొత్తగా తీసుకున్న ఇల్లు తన ఆఫీసుకి దగ్గరగా ఉండడం. ఒక్కొక్కసారి ఆఫీసులో అంతగా పనిలేకపోతే మధ్యాహ్నం లంచ్ టైములోకూడా ఒక చక్కర్ కొట్టి వచ్చేది.

"నీకేమమ్మా, పక్కనే అన్నదమ్ముడు ఉన్నాడు. హాయిగా వెళ్ళి కడుపునిండా ఆరగించి వస్తావు. మాకేముంది ఆ కేంటిన్‌లో ఏ గడ్డిపెడితే అదే తినాలి" అనేవారు కొత్తగా ప్రవేశించిన సరళ, సీత.

అటువంటి లలిత పదిహేను రోజుల కొకసారైనా అటు తొంగి

చూడకుండా, ఆఫీసులో పని జాస్తిగా ఉంటుందని తప్పించుకొంటుంటే ఆమె ప్రవర్తన అందరికీ ఆశ్చర్యమే కలిగించింది.

"ఈ మధ్యన అన్నిటా అలాగే అంటీ ముట్టనట్లు తిరుగుతున్నది. పిల్లకూడా పొగాకుకాడలా నల్లగా మాడిపోతున్నది. ఓ సారి డాక్టరుకైనా చూపించకూడదూ ?" అనేది రాజమ్మ.

"ఒకరు చెప్పడం తను వినడం నీ కోడలుకి ఎప్పుడైనా ఉందా అమ్మ. తనకి ఎంతపుడితే అంతే....నా ఒంట్లో ఏం లేదు. మహారాజులా ఉన్నాను. అనవసరంగా రోగం రొచ్చు అంటూ నన్ను మీరుబాధపెట్టకండి అంటుంది. కాళ్లూ చేతులూ కట్టి ఈడ్చుకుపోవడానికి చిన్నపిల్లకాదుకదా.... నన్నేం చెయ్యమంటావు చెప్పు" అనేవాడు ప్రకాశం.

లలిత ఆ రోజు తనంతట తనే డాక్టరుదగ్గరికి వెళ్ళివస్తానని బయలు దేరితే అందుకే రాజమ్మ అంతగా ఆశ్చర్యపోయింది.

"వెళ్ళి రా అమ్మా!....ఏం చికాకో....ఏమో....సరిగా చూపించుకు రా—మరీ చిక్కి సగమైపోయేవు?" అంది.

డాక్టరు నారాయణమ్మతో లలితకి అంతకి పూర్వం కొద్దిగా పరిచయం ఉంది. ఆవిడ మేనకోడలు అరుంధతి,లలిత క్లాసుమేట్సు. ఆపిల్లతో ఒకటి, రెండుసార్లు వారింటికి వెళ్ళింది. ఆ పరిచయాన్ని జ్ఞప్తికి తెస్తూ ముందురోజు ఆవిడకి ఫోను చేసింది. "మీరు ఎప్పుడు తీరికగా ఉంటారు? ఏ రోజు రమ్మంటారు ?" అంటూ.

నారాయణమ్మ అప్పుడు గవర్నమెంటు సర్వీసులో ఉండేది. అటు తరువాత దాన్ని విడిచిపెట్టి ప్రయివేటు ప్రాక్టీసు పెట్టింది. "మా ఇల్లు [illegible] తెలుసుగా— ఆ పక్కనే ఉంది నా డిస్పెన్సరి. ఉదయం ఏడు పన్నెండు మధ్య, సాయంకాలం నాలుగు ఎనిమిది మధ్య, ఎప్పుడైనా రావచ్చు— అయినా నా దగ్గరికి రావడానికి నీకు ఎపాయింట్‌మెంట్ దేనికి. ఏదో వేళప్పుడు రా—ఉంటే డిస్పెన్సరీలో ఉంటాను, లేకుంటే ఇంట్లోఉంటాను" అంది ఆవిడ.

ఉదయం పదిగంటల వేళ వెళ్ళింది లలిత.

"కాస్తసేపు కూర్చో. వీళ్ళని పంపివేస్తే— కాస్త సావకాశంగా మాట్లాడుకోవచ్చు" అంది అప్పటికే వేచి ఉన్న రోగుల్ని చూపిస్తూ.

"నాకేం తొందరలేదు... మీ పని కానివ్వండి" అంది లలిత.

హాలులో కూర్చున్న రోగులు ఒకరొకరుగా పక్క గదిలోకి వెళ్ళి పది, పదిహేను నిమిషాల్లో తిరిగి వస్తున్నారు.

అప్పట్లో నారాయణమ్మ సన్నగా, నాజూగ్గా కోలముఖంతో ఎంతో అందంగా ఉండేది. ఇప్పుడు బాగా ఒళ్ళు వచ్చేసింది. మనిషికూడా కాస్త నల్లబడింది. ముఖంమీద స్ఫోటకం మచ్చలు, కొద్దిగా నెరసిన జుట్టు... అయినా ఆ రోజుల్లో కన్పించనిహుందాతనం, నిదానం ఇప్పుడు మనిషిలో నిండుగా కన్పిస్తున్నాయి. రోగులతో ఆప్యాయంగా మాట్లాడుతూ, వాళ్ళకి ధైర్యం చెపుతూ, ఉత్సాహపరుస్తూ ఆవిడను చూస్తేచాలు జబ్బులు పరుగు తీస్తాయి — అనే భావన వారికి కలిగేలా ప్రవర్తిస్తున్నది.

లలిత అక్కడ టేబిలుమీద పడి ఉన్న పత్రికల్ని తిరగేస్తూ అర గంటపైగా గడిపివేసింది. నారాయణమ్మ చివరి రోగిని అంపకం పెట్టి, సబ్బుతో చేతులు కడుక్కొని తువ్వాలుతో తుడుచుకొంటూ లలితకూర్చున్న చోటికివచ్చి "ఇప్పుడు చెప్పు....ఏమిటి సంగతి? ఎక్కడ ఉంటున్నావు.... ఏం చేస్తున్నావు?" అంటూ ప్రశ్నించింది.

లలిత తనగురించి చెప్పింది.

"అరుంధతి ఇప్పుడు ఎక్కడ ఉంటున్నది ?" అని అడిగింది.

"దానికిద్దరు పిల్లలు. ఒక కొడుకు, ఒక కూతురు. కొడుకు పెద్ద వాడు. ఎనిమిదేళ్ళుంటాయి.... కూతురికి ఆరు.... నీకు తెలుసుగా దాని మొగుడూ డాక్టరే అని.... మిలటరీ డాక్టరు. ప్రస్తుతం మీరట్‌లో ఉంటు న్నారు— ఏడాది కిందట ఓ సారి వచ్చింది. నిన్ను చూడాలని మీ ఇంటికి వెళ్ళిందట. ఆ పిల్ల పెళ్ళిచేసుకొని అత్తవారింటికి వెళ్ళిపోయిందన్నారుట ఇరుగు పొరుగువాళ్ళు. వాళ్ళు చెప్పిన చోటుకివెళ్ళి అడిగితే ఎక్కడో

ఇల్లు కట్టుకొని వెళ్ళిపోయి చాలాకాలం అయింది అన్నారుట. 'ఇంతా తిరిగేను కాని....లలితని చూడ్డం అవనేలేదు' అంది. మరునాడే వాళ్ళు వెళ్ళిపోయారు."

మరి కాస్తసేపు అరుంధతి కొడుకు ఎంత అల్లరిపిల్లడో, కూతురు ఎంత ముద్దుగా ఇంగ్లీషులో మాట్లాడుతుందో ఆ భోగట్టాలన్నీ చెప్పింది ఆవిడ. తను చెప్పవలసినదంతా అయిపోయింది అనుకొన్నాక....

"నీకేమైనా పిల్లలా ?" అంటూ ప్రశ్నించింది.

"లేరు" అంది లలిత.

"నీ పెళ్ళయి ఎన్నాళ్ళయింది?" లలితవంక చూస్తూ ఆమె వయసు ఎంత ఉంటుందో అంచనా వేస్తూ ప్రశ్నించింది నారాయణమ్మ.

"పదకొండేళ్ళకి పైగా అయింది."

"కొన్ని గృహసంబంధమైన చిక్కులవల్ల ఏడాదిక్రిందటి వరకు అటువంటి ఆలోచన పెట్టుకోలేదు."

"తరువాత ?"

"అందుకే ఇప్పుడు మీ దగ్గరికి వచ్చేను." అంది లలిత.

"అలాగా" అంటూ లలితని పక్కగదిలోకి పిల్చుకుపోయి అవసరమైన పరీక్షలన్నీ చేసింది నారాయణమ్మ. ఆమె అడిగిన వాటికల్లా నెమ్మదిగా సమాధానాలు చెప్పింది లలిత.

అరగంట తరువాత ఇద్దరూ తిరిగి ముందు హాలులోకి వచ్చేరు. "అనవసరంగా నువ్వు ఏవేవో జాగ్రత్తలుపడ్డావు కాని, నిజానికి నీ గర్భకోశం ఈ స్థితిలో ఉండగా నీకు కానుపు వచ్చే అవకాశం లేదు" అంది ఆవిడ ఎదురుగా కుర్చీలో కూర్చుంటూ.

లలిత తుళ్ళిపడి చూసింది. "నిజంగానా" అన్నట్లు ప్రశ్నిస్తున్నాయి ఆమె కళ్లు.

"అంటే నా అభిప్రాయం నీకు బిడ్డలు పుట్టే అవకాశమే లేదని

కాదు. ఆపరేషన్ చేయించుకొని బిడ్డసంచిని సరియైన స్థానంలో నిల్పడం జరిగితే కానుపు వచ్చే అవకాశం ఉంది."

"ఈ విషయంలో మీకు బాగా నమ్మకం ఉందా?"

"నేను డాక్టర్ని లలితా. ప్రయత్నించి చూడందే అవును, కాదు అంటూ నికరంగా చెప్పను, కాని నా మట్టుకి ఆపరేషన్ చేయించుకొంటే నువ్వు తల్లి వయే అవకాశం ఉందనే నాకు బాగా అన్పిస్తున్నది" అంది ఆవిడ.

"ఎప్పుడు రమ్మంటారు ?" నీరుగారిపోతున్న ఉత్సాహాన్ని కూడ గట్టుకొంటూ అడిగింది లలిత.

"ప్రస్తుతం నువ్వు చాలా నీర్సంగా ఉన్నావు. వంట్లో తగినంత రక్తం లేదు. ఈ స్థితిలో ఆపరేషన్ చెయ్యడం మంచిదికాదు....అలా చేస్తే గర్భం నిలచినా, పుట్టేబిడ్డ ఆరోగ్యం దెబ్బతినే అవకాశం ఉంది. ముందు నువ్వు, బలానికి రక్తంపట్టడానికి టానిక్కులు, ఇన్‌జక్షన్‌లు తీసుకోవాలి. కాస్త ఆరోగ్యం కుదుటపడ్డాక అప్పుడు ఆలోచిద్దాం మిగిలిన విషయాలు."

నారాయణమ్మ రాసిచ్చిన మందు చీటీ పట్టుకొని ఇంటికి చేరింది లలిత. గాలిపోయిన బెలూన్‌లా ముడుచుకుపోయింది ఆమె మనసు. వేళకి సరిగా నీళ్లు అందని మొక్క చిగురులా వాడిపోయింది ఆమె ముఖం.

"డాక్టరమ్మ ఏమందేమిటి ?" లలిత ఇంట్లో కాలు పెడ్తుండగానే ఆత్రంగా అడిగింది రాజమ్మ.

"జబ్బేం లేదట. నీర్సం తప్పిస్తే మరేం చికాకు లేదు. బలానికి ఏవో మందులు, ఇన్‌జక్షన్‌లు రాసిచ్చింది" అంది లలిత.

లలిత డాక్టర్ని చూడాలనుకోడానికి కారణం ఏమిటో రాజమ్మకి తెలియదు. అందుకే అసలు విషయం ఆమెతో చెప్పలేదు. ప్రకాశంతో కూడా చెప్పకూడదనుకుంది. కాని, ఆపరేషన్ అంటూ జరుగుతే ఎలాగా

అతడితో చెప్పక తప్పదు. అప్పుడు చెప్పేవి ఇప్పుడు చెప్తేనే మంచిది అనుకొని అతడితో మాత్రంచెప్పింది ఉన్న పరిస్థితి "అత్తయ్యతో ఇప్పటి మంచి ఏవీ అనకండి... ఆ సమయం వస్తే అప్పుడు చెప్పవచ్చు" అంది.

ప్రకాశం ఆ సాయంకాలం బైటకి వెళ్తూ "ఆ మందు చీటీ సొమ్ము ఇయ్యి. ఈ రోజు కొనుక్కొస్తే రేపటినుంచే ట్రీట్‌మెంటు మొదలు పెట్టవచ్చు" అన్నాడు.

"మందు చీటీ టేబిలుమీద ఉంది. నా పెట్లో మీదనే నల్ల మనీ పర్సు ఉంది. దానిలోంచి తీసుకోండి సొమ్ము" అంటూ వంటపనిలో ఉన్న లలిత తాళంచెవి అతడికి ఇచ్చింది.

తాళం తీసి పెట్టె తలుపు తీసేడు ప్రకాశం. లలిత అన్నట్టు చీరల మడతలకి పైనే ఉంది నల్లమనీపర్సు. దానిలోంచి అవసరం అనుకున్నంత సొమ్ము తీసుకొని మళ్ళా అక్కడే పెట్టేసి పెట్టెమూత వేసేసేడు. పెట్టె మూత వేస్తుంటే అతడికేదో గుర్తు వచ్చింది. మళ్ళా మూతతీసి చూసేడు. అతడి అనుమానం నిజమే అయింది. ఆ కాగితం ఇప్పుడు అక్కడలేదు. ఒకప్పుడు పెట్టెమూతకి లోపలివైపు అంటించి ఉండేదనడానికి నిదర్శనంగా ఇంకా తిన్నగా ఊడిరాని కాగితం ముక్కలు చివరంటూ ఉన్నాయి.

ఒక రోజు లలిత ఏదో వస్తువు కోసం పెట్టి తీస్తుంటే చూసేడు ఆ కాగితాన్ని. అది ఫామిలీప్లానింగ్ పోష్టరు. "అగ్‌లా బచ్చా అభీ నహీ" అని హిందీలో ఉంది.

"ఇదేమిటి ! దీన్ని తెచ్చి ఇక్కడ తగిలేచ్చేవు" అన్నాడునవ్వుతూ.

"వ్యామోహానికి లోబడి కర్తవ్యాన్ని మరచిపోకుండా ప్రతిరోజు గుర్తు చేసుకోడానికి అంది లలిత.

ప్రకాశం మనసు బాధతో క్షణకాలం విలవిల్లాడింది. నెమ్మదిగా పెట్టెమూత వేసి, తాళం లలితకి ఇచ్చి వీధిలోకి బయలుదేరాడు.

# 10

ఆ నాటి నుంచి క్రమం తప్పకుండా మందులన్నీ వాడుతున్నది లలిత. ఆరోగ్యం పూర్వంకంటే బాగా బాగుపడింది. శరీరానికి మందులు బలం తెచ్చాయి. మనసుకి నారాయణమ్మ మాటలు ఉత్సాహాన్నిచ్చేయి.

నెలనాటికి లలిత మళ్ళా మామూలుమనిషి అయింది. ముఖంలోకి కళ వచ్చింది. పనిలో చురుకుతనం వచ్చింది.

"లలితకి పిల్లలు పుట్టినా, పుట్టకపోయినా నాకేం పట్టింపులేదు. తన ఆరోగ్యంబాగుపడింది. అంతేచాలు" అన్నాడు ప్రకాశం నారాయణమ్మతో.

"పిల్లలు పుట్టరని మాత్రం ఎందుకనుకోవాలి ? ఇంతకన్న గడ్డు కేసులే ఆపరేషన్స్ వల్ల నయమవుతున్నాయి. ఆ భగవంతుడు అనుగ్రహించి, అన్నీ సాఫీగా సాగిపోతే ముందు ఏటికి మీరు బిడ్డతండ్రి అవుతారు" అంది నారాయణమ్మ ఆశ చూపుతూ.

తొలకరి వర్షాలుపడి ఎండలుధాటి, కొంత తగ్గింది. ఆగస్టు పది అయితే తనకి ఆపరేషన్ చెయ్యడానికి అనుకూలంగా ఉంటుంది అని చెప్పింది నారాయణమ్మ.

లలిత ఆగస్టు ఫస్టునుంచి ఒక నెల సెలవు పెట్టింది.

ఆ రోజు జూలై పదిహేనోతేది. ఆఫీసులో అర్జంటు కాగితాలు ఏవో టైపు చేస్తుంటే వచ్చేడు మెల్లకన్ను గుమాస్తా.

"మీ సెలవు శాంక్షను అయింది. ఇదిగో ఆర్డరు" అన్నాడు ఒక కాగితం ఆమెకి అందిస్తూ.

"థాంక్సండి" అంటు అందుకొని బ్యాగ్‌లో పెట్టుకొంది లలిత.

అంతలోనే మెయిన్‌హాల్లో పనిచేసే రంగశాయి వచ్చి "మీకు టెలిఫోన్ కాల్ వచ్చింది" అన్నాడు లలితతో.

"ఎవరేమిటి" అంటూ లేచి వెళ్ళింది లలిత ముందుహాల్లోకి.

"మీ వారే అనుకొంటాను. ఆయన పేరు ప్రకాశరావు కదూ"

"అవును" అంటూ టెలిఫోన్ రిసీవరు అందుకొంది లలిత.

రాజమ్మకి వారంరోజులై ఒంట్లోబాగాలేదు. దగ్గు,జ్వరం,వాంతులు డాక్టరుచూసి "గాభరా పడిందికి ఏమీ లేదు. మందిస్తాను. నాలుగైదు రోజుల్లో తగ్గిపోతుంది" అన్నాడు.

ప్రకాశానికి సెలవు వుంది కాబట్టి, ఇంటిదగ్గర ఇబ్బంది లేకుండా జరిగిపోతున్నది. ఇప్పుడు ప్రకాశం టెలిఫోన్‌చేసేడు అనగానే అత్తగారికి ఎలా వుందో అని కంగారుపడింది లలిత.

ఆవిడకి సులువుగానే ఉంది. అదికాదు అప్పటి విషయం. అనసూయకి పురిటి సమయంగా ఉంటట. ఆమెని ఆసుపత్రికి తీసుకుపోతూ పొరుగింటి కుర్రాడిచేత ప్రకాశానికి కబురు పంపేడు రామకోటి.

"అమ్మ కదిలే స్థితిలోలేదు. నువ్వు వెంటనే బయలుదేరి అక్కడి నుంచి అలాగే వచ్చేయి. నేను అక్కడికి వెళ్తున్నాను" అన్నాడు ప్రకాశం ఫోనులో.

ఆఫీసరుతోచెప్పి సెలవుతీసుకొని కె. జి. ఆసుపత్రికిబయలుదేరింది లలిత.

మెటర్నిటీ వార్డు దగ్గర రామకోటి, ప్రకాశం కన్పించేరు. అయిదు నిమిషాలు వారితో మాట్లాడి లలిత లోపలికి వెళ్ళింది.

ఆమెని చూస్తూనే "అత్తయ్యా" అంటూ బావురుమంది అనసూయ.

ఆ పిల్ల పడ్తున్న బాధచూస్తూంటే లలితకి కళ్ళంట నీళ్ళు తిరిగేయి.

భగవంతుడా....ఆడది ఏం పాపం చేసిందని ఇంత శిక్ష విధించేవు.

నీ సృష్టికి ప్రతిసృష్టి చేస్తున్న ఆడదానిపట్ల నీ కెందు కింత కక్ష ? అను కొంది.

"తమాషా ఏమిటంటే ఈ శిక్ష అనుభవించడానికే నువ్వు రాత్రి, పగలూ తహతహలాడిపోతున్నావు" అంది మనసు.

ఆ సమయంలో అనసూయపట్ల అంతకు పూర్వం కొంతకాలంగా లలిత మనసులో ప్రవేశించిన ఈర్ష్యాసూయలు పక్కకి తప్పుకొని మొదటి కలయికనాటి మమతకి చోటుచేసేయి.

"అనసూయా" అంటూ ఆప్యాయంగా పక్కనకూర్చుని ఆమె తల నిమిరింది. ధైర్యం చెప్పింది. మానసికంగా ఆ బాధని భరించడానికి తగిన శక్తిని తన మాటలవల్ల కలిగించింది.

నిముషాలు గంటలుగా కూడబడ్డాయి.

పగలు రాత్రికి తిరిగింది.

రాత్రి వేకువను ప్రసవించింది.

అయినా....అనసూయకి కానుపు కాలేదు. ఆ గర్భంలోఉన్న బిడ్డకి భూమిమీద పడ్డానికి ఇంకా తరుణం రాలేదు

అక్కడ ఉన్న ముగ్గురికీ తిండీ, నిద్రా ధ్యాస లేదు. ఇంట్లో ఉన్న రాజమ్మ ఆరాటానికి అంతం లేదు. ఆమె మొక్కని దేవుడు లేడు. కట్టని ముడుపులులేవు. మనుమరాలి క్షేమం కోసం విలవిల్లాడిపోయింది ఆ పెద్ద ప్రాణం.

ఉదయం పదిగంటల పొద్దు ఎక్కేసరికి ఇంక కత్తులు, కటార్లు ఉపయోగించందే కాన్పు అయేమార్గంలేదని తేలిపోయింది. తల్లిగర్భంలో బిడ్డ అడ్డంగా పడి ఉంది. ఒకరు కాదు....ఇద్దరు.

అర్జంటుగా పోయి ఏవో మందులు తెమ్మని రామకోటి చేతిలో చీటి పెట్టింది హెడ్ నర్సు. అయిందికి ధర్మాసుపత్రి....అయినా అడుగడుగునా ముడుపులే. కావలసిన మందులు ఏవీ సమయానికి స్టాకు ఉండవు. నడిరాత్రిసమయంలో అయినా, నల్లబజారులో ఐనా - అడ్డకిపడ్డపోసి అవి

తెచ్చుకోవలసిందే ఆత్మీయులు. "ఇవిగో, మందులు మేమేం తినేయడం లేదు. మీ మనిషికేవాడుతున్నాం?" అన్నట్లు ప్రవర్తిస్తారు అక్కడివాళ్ళు.

"నువ్వుండు నేను వెళ్ళి తెస్తాను" అన్నాడు ప్రకాశం రామకోటి చేతిలో చీటి అందుకోబోతూ.

"కాదు....స్కూటరు వేసుకుని నే వెళ్ళి వస్తాను. నాకన్న ఇక్కడ మీరు ఉండడమే మంచిది" అంటూ స్కూటరు తాళాలు తీసుకుని బయలు దేరేడు రామకోటి. అది ఏం మందో... ఎంతవుతుందో అతనికి తెలియదు. ఎంతైనా అనసూయ ప్రాణం ముందు తక్కువే—అనుకొన్నాడు.

అరగంట గడిచినా రామకోటి రాలేదు. ఆపరేషన్‌కి అన్నీ సిద్ధ మయేయి. నర్సులు కంగారుగా ఇటుఅటు తిరిగేరు. మందులు ఇంకా రాలే దని హెడ్‌నర్స్ చిరబుర్లాడింది.

మరో అరగంట గడిచింది, అయినా రామకోటి ఇంకా రాలేదు. వస్తున్న సూచన కన్పించలేదు. ఇలా ఉంటాయి మీరు చేసే పనులు. పైగా మాటలంటారు మమ్మల్ని. అర్జంటని అంతలా చెప్తే ఇంత సేపైనా పత్తా లేదు ఆ మహానుభావుడు; ఇప్పుడేం చెయ్యమంటారు? —అన్నట్లు చూసేరు అక్కడివాళ్ళు.

"మీరు ఏ టాక్సీ అయినా వేసుకొని వెళ్ళిరండి, ముందు మందులు తెండి. రామకోటి సంగతి తాపీగా చూడొచ్చు" అంది లలిత.

ప్రకాశం ఆసుపత్రి గేటు ముందునుంచి పరుగుపెడ్తున్న టాక్సీని కేకేసి పిల్చాడు. "బజారుకి పోని...మందులషాపుకి—"అన్నాడు అందులో కూర్చుంటూ.

చుట్టుపక్కల కొట్లన్నీ మూతపడిఉన్నాయి ఆ రోజు సెలవు రోజు కాదు. అయినా ఒకటీ తెరచిలేదు. అది కాదని ఇది, ఇది కాదని అది, తెలి సిన బజార్లన్నీ టాక్సీలో తిరిగేడు ప్రకాశం.

ఆ రోజు పట్నంలో హర్తాళ్ జరుగుతున్నదట బజార్లు, కొట్లు, కాఫీ హోటళ్ళు అన్నీ మూత పడిఉన్నాయి.

హైద్రాబాద్‌లో ఏవో అల్లర్లు జరిగేయట. సర్కారు జిల్లాలవారిని తెలంగాణావాదులు పట్టుకు తన్నేరేట. దానికి నిరసనగా ఇక్కడ హర్తాళ్ జరుపుతున్నారట.

ఏం దారి....ఏం దారి? కాలుకాలిన పిల్లిలా తిరిగేడు ప్రకాశం. చివరికి దొరికిందో చిన్న మందుల షాపు. ఆ షాపు యజమాని అల్లుడు ప్రకాశం పని చేస్తున్న కాలేజిలోనే చదువుకున్నాడు. ఆ చుట్టరికం చెప్పుకొని దొడ్డిదోవన వెళ్ళి కావలసిన మందులు సంపాదించాడు.

దారంతా రాళ్ళు, రప్పలు, విరిగిపడ్డ ఫర్నిచరు. చెదరిపడ్డ చెప్పుల జోళ్ళు, పగిలిన గాజుపెంకులు. సీసా ముక్కలు—అంతకుపూర్వం అక్కడ జరిగిన భీభత్సకాండకి నిదర్శనాలుగా పడివున్నాయి.

అదేం పట్టించుకొనే స్థితిలో లేడు ప్రకాశం. టాక్సీవాడు ఎప్పుడో మీటర్ మూసేసేడు.

"ప్రాణాపాయంలో ఉన్న మనిషి అన్నారని నా ప్రాణాలకి తెగించి అక్కడికి వచ్చేను. నా కషం మీరు చూడాలి" అన్నాడు ప్రకాశం పది రూపాయల నోటు చేతిలో పెడ్తుంటే టాక్సీవాడు. మరో అయిదు వాడి చేతిలో పడేసి ముందుకి నడిచేడు ప్రకాశం.

ఎంత సొమ్ము ఖర్చయినా సమయానికి అందేయి మందులు. అనసూయ ప్రాణం దక్కింది. అంతే చాలనుకొంది లలిత.

అప్పటికి వచ్చింది రామకోటి తలంపు ఆమెకి.

ఏమై ఉంటాడు....తమ్ముడు ఎక్కడికి పోయివుంటాడు ?

భార్య చావుబ్రతుకుల్లో వుండగా బాధ్యతకల వ్యక్తి ఎక్కడెక్కడో తిరుగుతూ ఎలా ఉండిపోతాడు ?

ఏదో జరిగిఉంటుంది——రామకోటికి ఏదో జరిగివుంటుంది.

ఆ జరిగిందేదో ........జరగరానిదేఅయివుంటుంది. లేకపోతే అతీ గతీ లేకుండా రామకోటి ఏమైనట్లు ? ఎక్కడికి పోయినట్లు ?

*     *     *

అనసూయకి తెలివి వచ్చింది. తన రక్తంలోని రక్తం, తన ప్రాణంలోని ప్రాణం అయిన పాపల్ని కళ్ళనిండుగా చూసుకొంది.

ఇద్దరూ ఆడపిల్లలే. తొక్కతీసి కడిగిపెట్టిన కందదుంపల్లా ఎర్రగా నెత్తురు చిమ్ముతూ ఉన్నారు. చిన్నచేతులు, చిన్నకాళ్ళు. విడీవిడని కళ్ళు-అవయవాలన్నీ సరిగానే ఉన్నా.... నెలతక్కువ బిడ్డలు ! తల్లి పక్కలో చనుపాలు త్రాగుతూ, సహజంగా గాలి పీల్చుకొంటూ బ్రతికే పరిస్థితిలో ఇంకా లేరు అద్దాలతొట్టిలో కృత్రిమ వాతావరణంమధ్య ఎక్వేరియమ్‌లో చేపల్లా వున్నారు కవలలు.

"ఏరీ—ఆయనేరి- మీ తమ్ముడేరి అత్తయ్యా" నీర్సంవల్ల గొంతు లోంచి మాట ఊడిరాకపోయినా మెల్లిగా పెగుల్చుకొని అడిగింది అనసూయ.

"వస్తాడమ్మా, ఇప్పుడే వస్తాడు .... నువ్వు కళ్ళు మూసుకొని పడుకో—వాడు రాగానే లేపుతాలే" అంది లలిత.

"ఇక్కడ లేరా .... ఆయన ఇక్కడ లేరా?" నిరాశగా చూస్తూ అంది అనసూయ.

"ఇక్కడే ఉన్నాడమ్మా—ఇప్పటిదాకా ఇక్కడే ఉన్నాడు. ఇప్పుడే అలా బైటికి వెళ్ళేడు. మీ మామయ్యని పిల్చుకురావడానికి—" అదురుతున్న గుండెల్ని బిగపట్టి కంటనీరు ఉబకకుండా ఒత్తిపెట్టి అంది లలిత.

ప్రకాశాన్ని పిల్చుకురావడానికి రామకోటి వెళ్ళేడంది లలిత. కాని, రామకోటికోసం ప్రకాశమే తిరిగేడు. ఎక్కడ కన్పించే అవకాశం ఉందను కొంటే ఆ చోటుకల్లా—చివరికి ఇంక కాళ్ళలో శక్తి సన్నగిల్లి, మనసులో ధైర్యం తరిగిపోయేక, చేసేది ఇంక ఏమీలేదు అన్న నిశ్చయానికొచ్చి పోలీసుస్టేషనుకు వెళ్ళాడు రిపోర్టు యివ్వడానికి.

అక్కడి పోలీసు అధికారి ప్రకాశంచెప్పిందంతా శ్రద్ధగా విన్నాడు. అతడి పరిస్థితిని సానుభూతితో అర్ధం చేసుకున్నాడు. అంతకుమించి వెంటనే అతడు చేయగలిగింది ఏమీ లేదు.

"మీరు వినే వుంటారు, ఈరోజు ఊరంతా హర్తాళ్ జరిగింది. అది మొదలుపెట్టినవాళ్ళు ఎటువంటి ఉద్దేశాలతో, ఆదేశాలతో మొదలుపెట్టినా ఇటువంటి అవకాశాన్ని తమ అరాచక చర్యలకి ఉపయోగించుకునే గూండాలు, రౌడీలు చేరి తుంటరి చర్యలు మొదలుపెట్టేరు. కొన్నిచోట్ల దొమ్మీలు, కొట్లాటలు జరిగేయి. చాలామందికి దారినే పోతున్నవారికి బాగా దెబ్బలుతగిలాయి. ఎల్లమ్మగుడిదగ్గర ఒక బస్సును తగలపెట్టేరు. ఆ దారినేపోతున్న రెండు, మూడు స్కూటర్లు, సైకిలు రిక్షాలు అటకాయించి ఆపివేసి, ఆ మంటలోకి విసిరివేశారు. సకాలంలో పోలీసులు ఆదుకోవడంవల్ల పరిస్థితి అంతటితో అదుపులోకి వచ్చింది. మాకు ఇప్పటివరకు అందిన సమాచారం ప్రకారం ప్రాణనష్టం ఏమీ కలుగలేదు. దెబ్బలు తగిలినవాళ్ళని వెంటనే ఆసుపత్రిలో చేర్చారు. అందులో మీ బావమరది ఒకడు అయివుంటాడో లేక—అతడు ఇంకెక్కడయినా ఉన్నాడో నాకు తెలియదు. ఇప్పుడు మీరు రిపోర్టు ఇచ్చేరుకాబట్టి, తెలుసుకోడానికి ప్రయత్నం మొదలుపెడ్తాం —ఏమైనా తేలగానే మీకు తెలియచేస్తాను." అన్నాడు అతడు.

"దెబ్బలు తగిలినవార్ని ఎక్కడెక్కడ చేర్చేరో కాస్త చెప్పండి— నా ప్రయత్నం నేనూ చేస్తుంటాను."

అతడు ఇచ్చిన లిష్టులాంటిది పట్టుకొని ఒకటి తరువాత ఒకటిగా అన్ని ఆసుపత్రులు చూసుకొంటూ తిరిగేడు. చివరికి ఒకదానిలో కన్పించేడు రామకోటిలాంటి వ్యక్తి. తలకి చేతులకి కట్లతో, ఒంటిమీద తెలివి లేకుండా పడివున్నాడు.

డాక్టరు దగ్గిర అనుజ్ఞ తీసుకొని ఆ మంచం దగ్గిరగా వెళ్ళిచూశాడు. అతడు రామకోటే, —అందులో సందేహంలేదు. అనసూయకోసం ఇచ్చిన మందులచీటీ ఇంకా అతడి జేబులోనే ఉంది. దానితోపాటు ఉండవలసిన సొమ్ము మాత్రం అక్కడలేదు. ఎవరో పుణ్యాత్ములు అప్పటికే దాన్ని కైంకర్యం చేసేశారు.

"ఈ తెల్లవారితేగాని ఏమీ చెప్పలేము. తలకి బాగా మోపైన దెబ్బ తగిలింది" అన్నాడు అక్కడ వున్న డాక్టరు.

తెల్లవారేదాకా అనసూయకి, లలితకి, ఆ వార్త అందచెయ్యకపోవ డమే మంచిది అనుకొన్నాడు ప్రకాశం.

ఇంటికి వెళ్ళి అనసూయ కులాసాగా ఉన్న వార్త తల్లికి చెప్పి, స్నానం చేసి, బట్టలు మార్చుకొని, మళ్ళా తిరిగి రామకోటి ఉన్న ఆసు పత్రికి వచ్చేడు. పరిస్థితిలో ఏమీ మార్పులేదు.

*　　*　　*

గోడలకి చెవులుంటా యంటారు.

మత్తుమందు నిషాలో ఉన్నవారికి కూడా కొన్నిమాటలు అవి వారి అంతర్యంలో పట్టి పీడిస్తున్న వేదనలైతే వినిపిస్తాయంటారు.

ప్రకాశం అతిమెల్లగా లలితతో అంటున్నమాట అనసూయచెవుల్లో పడింది. పెనుగాలికి చెదిరిపోయే మేఘంలా ఆమె బుద్ధిని అంటిపెట్టుకున్న విషా, తొలిగిపోయింది.

"ఏమయింది అత్తయ్యా! ఆయనకేమయింది?"అందిఆందోళనతో.

"ఎవరికి....ఏమీ కాలేదమ్మా... నువ్వు పడుకో అనసూయా"అంది లాలనగా.

"కాదు....ఏదో అయింది....మీ తమ్ముడికి ఏదో అయింది....మీరు నాతో చెప్పడం లేదు" అంటూ ఏడవసాగింది అనసూయ.

"తప్పమ్మా అనసూయా. అలా కళ్ళ నీళ్ళు పెట్టుకోకూడదు.... చచ్చి బ్రతికేవు....చక్కని చుక్కల్లాంటి పిల్లల్ని కన్నావు....రామకోటికి ఏమీ కాలేదమ్మా....ఇప్పుడే వస్తాడు....నేను మామయ్య వెళ్ళి పిలుచు కొస్తాము....నువ్వు పడుకో అమ్మా....కళ్ళు మూసుకుని పడుకో"

"మామయ్య మాటలు విన్నాను అత్తయ్యా.... ఇంకా నా దగ్గర ఎందుకు దాస్తావు.... చెప్పు అత్తయ్యా.... నీ కాళ్ళు పట్టుకొంటాను....

ఆయన కేమయింది? ఏమి కాకుంటే ఇంతవరకు రాకుండా, పిల్లల్ని చూసుకోకుండా, ఎలా ఉంటారు ? మామయ్యా.... నువ్వు చెప్పు మామయ్యా, అత్తయ్య నిజం చెప్పడంలేదు.... నా దగ్గర ఏదో దాస్తున్నావి. చెప్పు మామయ్యా నిన్ను బ్రతిమాలుకొంటాను... నీ కాళ్ళు పట్టుకొంటాను" ఆవేదనతో వణికిపోతున్నది అనసూయ. ఆయాసంతో ఎగిరెగిరిపడ్తున్నది ఆమె గుండె.

అనసూయ కొంతవిన్నది. చెప్పకుండాదాచిపెడితే ఏవేవో ఊహించుకొని ఇంకా బాధ పడ్తుంది. ఏదో విధంగా సర్ది, ఉన్న పరిస్థితి అంతా కాకున్న, కొద్దిగానైనా చెప్పవలసిన అవసరం ఉందనుకొన్నాడు ప్రకాశం.

రామకోటి మందుకోసం వెళ్ళడం, దొమ్మిలో ఇరుక్కొని దెబ్బ తినడం ఆసుపత్రిలో చికిత్స పొందుతుండడం మొదలైన విషయాల్ని సాధ్యమైనంతనెమ్మదిగా కంగారుపడ్డానికి ఏమీలేదన్నట్లుచెప్పేడు ప్రకాశం.

భరించరాని వేదనతో బాధతో అనసూయ కళ్ళు మూసుకొంది.

ఆమె మళ్ళీ మత్తులోకిజారిపోయిందిఅనుకున్నారు లలిత ప్రకాశం.

* * *

రామకోటికి ప్రాణభయం తప్పింది కాని దానితోపాటు తెలియవచ్చింది ఇంకోచెడువార్త. శారీరకంగాకోలుకొన్నా అతడు మళ్ళా ఎప్పటి మనిషి కావడం కష్టం. తలమీద తగిలిన దెబ్బతో మెదడులో కొన్ని భాగాలకి బాగా ఒత్తిడి కలిగింది. పూర్తిగా పిచ్చివాడు కాకపోయినా మతిస్థిరం తక్కువగా ఉండొచ్చు.

తెలిసీ తెలియని వార్తలు, ఒకదానికొకటి అందీ పొందకుండా వింటూన్నది అనసూయ. నర్సులు ఆయాలుచెప్పుకొనే కబుర్లవల్ల ఎవర్ని అడిగినా పూర్తి నిజం తెలియడంలేదు. తన దగ్గర ఏదో దాస్తున్నారని మాత్రం రూఢి చేసుకొంది.

ఆ విషయం తనకి అప్రియమైందే ... అందుకే చెప్పడం లేదు.

రాత్రి పగలు అలమటించి పోతున్నది అనసూయ. లలిత ఓదార్పుమాటలు ఆమె మండిపోతున్న మనసుకి ఊరట కలిగించడంలేదు. ప్రకాశం చెప్పే ధైర్యవచనాలు ఆమె తలకి ఎక్కడంలేదు... రామకోటి... రామకోటి... అతడికేమయింది... అదే జపం అయిపోయింది ఆమెకు.

ఆ రోజు రాజమ్మకి కొంచెం సులువుగా ఉంది. బుజ్జిగాడిని తీసుకొని ఆసుపత్రికి వచ్చింది. మూడునాళ్ళ తరువాత అమ్మని చూసి ఊ ముచ్చటపడిపోయేడు వాడు. చిన్నపాపల్ని చూపించమని అవ్వని ఒకటే తొందర పెట్టసాగేడు.

అమ్మమ్మనిచూసి కంటికి కడివెడుగా ఏడ్చింది అనసూయ. పక్కనున్న నర్స్ రాజమ్మ కేకలేసి ఊరుకోపెట్టేరు.

"నీ మొగుడుకొచ్చిన ఆపదేం లేదు తల్లీ, భగవంతుడు దయామయుడు. నిన్నింత ఆపదనుంచి కాపాడి.... నీకు అన్యాయం చెయ్యడు. ధైర్యంగా ఉండమ్మా.... పచ్చివంటిమీద అలా కళ్ళనీళ్ళుపెట్టకు" అంటూ ఓదార్చింది రాజమ్మ.

మూడు నాలుగురోజులుగా తిండి, నిద్రాసరిగాలేని లలిత, ప్రకాశం ఆ రోజు ఇంటికి వెళ్ళేరు. కాదు, వారంతట వారు వెళ్ళలేదు. రాజమ్మ వారిని బలవంతంగా ఇంటికి పంపివేసింది.

"ఈ రాత్రికి నేను ఉంటాను. అడుగడుక్కీ డాక్టర్లు నర్స్‌లువచ్చి చూస్తూనే ఉన్నారు. మీరుండిమాత్రం చేసేదేముంది? ఇంటికిపోయి కాస్త విశ్రాంతి తీసుకోండి" అంది.

నిజంగానే శారీరకంగా, మానసికంగా ఆ దంపతులకు విశ్రాంతి ఎంతైనా అవసరం. కాదు కూడదని మొండికేసి తిరిగితే, వాళ్ళిద్దరూ మంచాన పడే స్థితిలో ఉన్నారు.

ఉదయాన్నే తిరిగి వస్తామంటూ బుజ్జిగాడిని తీసుకొని ఇంటికి బయలుదేరారు.

"ఇంట్లో వంట చేసి పెట్టి రాలేదు. దారిలో ఏ హోటల్లో అయినా ఇంత తిని పొండి" అంది రాజమ్మ.

"అలాగే" అంటూ రిక్షా ఎక్కాడు ప్రకాశం.

కడుపులో ఇంత తిండి పడేసరికి ఎక్కడలేని నీర్సం ముంచు కొచ్చింది లలితకి. ఇంటికి ఎలాచేరుకుందో అలాగే, బట్టలైనా మార్చుకో కుండా పిల్లడిని పక్కలో వేసుకుని మంచంమీద వాలిపోయింది. ఆమె నిద్రలోకి జారుకొనేసరికి ప్రకాశం ఇంకా మెలకువగానేఉన్నాడు. మూడు రోజులై చూడని న్యూసు పేపర్లని ముందేసుకొని దీపం ముందు కూర్చు న్నాడు.

పక్క చూసిందే తడవుగ లలిత కళ్ళు మూసుకుపోయేయి. అన సూయ గురించిన ఆరాటము, రామకోటి గురించిన ఆందోళన, వీటన్నిటికీ అతీతమైన ఏదో స్థితిలోకి జారిపోయింది ఆమె మనసు.

అలా ఎంతసేపు నిద్రపోయిందో....ఎంత రాత్రయిందో పక్కలో బుజ్జిగాడు ఆకలంటూ లేచి కూర్చోడంతో తెలివి వచ్చింది. సాయంకాలం తల్లిదగ్గరే ఉండి పోతానని వాడు మారాంచేస్తుంటే బలవంతంగా లాక్కొ చ్చేరు. ఆ ఏడుపుమధ్య వాడికి ఆ హోటలు మెతుకులు మింగుడుపడ లేదు.

వాడిని సముదాయిస్తూనే నిప్పు చేసి నీళ్ళు మరగించి హార్లిక్సు కలిపి తెచ్చింది లలిత. ఆకలితో ఉన్న బుజ్జిగాడు వేడి వేడి హార్లిక్సు తాగి మళ్ళా నిద్రలోకి జారిపోయేడు.

లలితకి చాలా సేపటి వరకు తిరిగి నిద్రపట్టలేదు. ఆసుపత్రిలోఉన్న అనసూయ; రామకోటి గుర్తుకొచ్చేరు. 'మేముచేయగలిగింది ఏమీలేదు.... ఈ నావలు ఒడ్డుచేర్చే భారం నీదే భగవంతుడా!'అని మనసులోనే దేవుని ప్రార్థించింది.

మగత నిద్రలో బయట ఎవరోపిలుస్తున్నట్లు వినిపించిందిలలితకి. ఇంత అర్ధరాత్రివేళ ఎవరు పిలుస్తున్నారు? తెలివి తెచ్చుకొని నిదానంగా వింది; ఈ సారి పిలుపు స్పష్టంగానే వినిపించింది. "ప్రకాశరావుగారూ"

అంటూ పేరు పెట్టి ఎవరో పిలుస్తున్నారు. ఆదమరచి నిద్రపోతున్న ప్రకా శానికి ఆ పిలుపు వినపడలేదు.

పక్కమీంచి మెల్లగా లేచి "ఏమండీ" అంటూ తట్టిలేపింది లలిత.

"ఏమిటి లలిత- ఏమయింది?" అన్నాడు కంగారుతో ప్రకాశం.

"వీధిలో ఎవరో పిలుస్తున్నారండి"

"నన్నా! ఇంత రాత్రప్పుడా....కలొచ్చిందేమోనే"

"కల కాదండి స్పష్టంగానే విన్నాను."

అంతలో ఆ పిలుపు మళ్ళా వినిపించింది.

ప్రకాశం ఒళ్ళంతా గడగడలాడింది.

అర్ధరాత్రి ఆ పిలుపుకి అర్ధం ఏమిటో అతనికి తెలుసు. అది డాక్టరు గారి రెండో అబ్బాయి గొంతుక. ఏదైనా అవసరం పడితే తనకి ఫోను చెయ్యమని రెండిళ్ళవతలఉన్న డాక్టరు రఘుమూర్తిగారి టెలిఫోనునెంబరు ఇచ్చి వచ్చేడు.

"మీరు వెళ్ళి విశ్రాంతి తీసుకోండి. అవసరం అనుకుంటే నేను ఫోను చేస్తాను" అంది నైట్‌డ్యూటీ నర్సు విజయ. విజయ, ప్రకాశం హైస్కూల్లో రెండు, మూడేళ్ళు కలిసి చదువుకొన్నారు. ఆమె మాటమీద ప్రకాశం ఇంటికి వచ్చేడు.

ఇప్పుడు ఇంత రాత్రప్పుడు ఆ పిలుపు వచ్చింది. ఏమిటి?-ఎందుకు? అన్న విషయం ఆలోచించడానికి కూడా ప్రకాశం మనసుకి ధైర్యం లేకుండాపోయింది.

లుంగీ సవరించుకొని పైమీద లాల్చీ వేసుకొంటూ బైటకి వచ్చేడు. అతడి అంచనా సరిఅయినదే. ఆ పిలుస్తున్నది డాక్టరుగారి రెండో అబ్బాయే.

"కే. జి. నుంచి మీకు ఫోను వచ్చింది ఎవరో విజయట. మీతో వెంటనే మాట్లాడాలట" అన్నాడు కుర్రాడు వర్తమానం అందిస్తూ.

"అనసూయకి తొమ్మిది గంటలప్పుడు విపరీతంగా జ్వరం వచ్చిం

దట. పరిస్థితి అంత బాగాలేదు. మీరు వెంటనే బయలుదేరి రండి" అంది ఆమె.

ఆ రాత్రి సమయంలో బళ్ళు, బస్సులు, రిక్షాలు పట్నానికి ఆ కొసలో మచ్చుకి కూడా కన్పించవు.

ఎలా వెళ్ళడం ? .... .... నడిచివెళ్తే ఎప్పటికి చేరడం ?" ఆలోచిస్తున్నాడు ప్రకాశం.

"ఈరోజు మా డ్రైవరు ఇక్కడే పడుకొన్నాడు. మీ ఆవిణ్ణి కూడా పిల్చుకురండి. కారులో దింపివస్తాడు" అన్నారు డాక్టరుగారు.

"చాలా థ్యాంక్సండి... ఈ సమయంలో మీ సహాయం—"

"ఆ దానిదేముంది....ఇరుగుపొరుగు అన్నాక ఆపాటి ఒకరికొకరం. కాకపోతే ఏముంది" అంది డాకరుగారి భార్య

నిద్రపోతున్న బుజ్జిగాడిని భుజాన వేసుకుని బయలుదేరింది లలిత. వీళ్ళు అక్కడికి వెళ్ళేసరికి అనసూయ పరిస్థితి అయోమయంగా వుంది. మంచం చుట్టూ చిన్నా, పెద్దా డాక్టర్లు నర్సులు కాళ్ళు తొక్కుకుంటున్నారు లలితని, ప్రకాశాన్ని చూసి ఒక నర్సు దారి యిచ్చింది. కాళ్ళదగ్గర బల్లమీద కర్రబొమ్మలా కూర్చుని వుంది రాజమ్మ.

అనసూయ చెరుపు మరుపుగా ఉంది. ఉండుండి ఫిట్సు వస్తున్నాయి. ఫిట్సు తగ్గి తెలివి వచ్చినప్పుడు పిచ్చిగా ఇటు అటు చూస్తూ ఏమో మాట్లాడుతున్నది. అందులో చాలావరకు మాటలు అత్తతో అంటున్నట్లే. కొన్ని స్పష్టంగా తెలుస్తున్నాయి .... .... మరికొన్ని నోటిలోనే గొణుక్కుపోతున్నాయి.

"పెళ్ళయి ఏ నెల్లు కాకుండా కొడుకుని కన్నానని విర్రవీగుతున్నావులన్నావు కదూ—కనకుండానే నీకు కొడుకుని ఇచ్చేస్తాను....నేనెంత మంచిదాన్నో చూశావా ?

"అత్తా ఒకసారి పెళ్ళయి మొగుడుపోతే విధవ అంటారు— రెండుసార్లు ముండ మోసిన ఆడదాన్ని ఏమంటారు—

"అప్పుడు వైధవ్యం అంటే ఏమిటో నాకు తెలియదు అత్తా. ఆ భర్తా....ఆ ఇల్లూ నాది అన్న మమకారం నాకు కలగలేదు. కాని ఇప్పుడో మరి— ఇప్పుడో—అమ్మో—నేను భరించలేను బాబోయి --- బ్రతికి భరించ లేను"

"ఇంత తెలివిగా మనసులోని మాటల్ని చెప్తున్నట్లు మాట్లాడు తున్నది. ఇదంతా సంధి ధోరణే అంటారా సిస్టర్" అంటూ ప్రశ్నించింది లలిత.

"ఆమె ధోరణి ఆమెదే కాని—మన తెలివిలేదు. మీరు ఏదైనా ప్రశ్నించి జవాబు పొందగలరేమో చూడండి" అంది నర్స్.

"అనసూయా — మరి నీ కూతుళ్ళకి ఏం పేర్లు పెడ్తావే" అంది లలిత కాస్త దగ్గరగా వంగి.

"నావంక అలా కోపంగా చూడకు అత్తా — మీ తమ్ముణ్ణి నేను చంపేయలేదు—ఊరకే వాళ్ళంతా అలా అంటున్నారు. ఆయనంటే నాకు ప్రాణం. నా ప్రాణాన్ని నేనే తీసేసుకొంటానా?"

కళ్ళనీళ్ళు పైటకొంగుతో తుడుచుకొంటూ పక్కకి తప్పుకొంది లలిత.

ఆ పగలంతా అనసూయకి అలాగే ఉంది. రాత్రి గడవడం కష్టం అన్నారు డాక్టర్లు. సాయంకాలం ఏడు గంటలయింది. బుజ్జిగాడు ఆకలికి, నిద్రకి ఏడుస్తున్నాడు.

పక్క వీధిలోనే ఉంది నీలకంఠంగారి ఇల్లు. బుజ్జిగాడిని తీసుకొని అక్కడికి వెళ్ళింది లలిత.

"ఈ రాత్రికి వీడిని మీ ఇంట్లో వుంచుకోవాలి" అంది.

"అయ్యో దానికేం-ఈ రోజేకాదు. మీ మరదలికి కాస్త సులువుగా ఉండేవరకు వాడిని ఇక్కడే వుండని — మా మనవలతోపాటు ఆడు కొంటాడు" అంది నీలకంఠం తల్లి.

నీలకంఠం భార్యకి చాలామంది పిల్లలున్నారు. అయినా ఆవిడకు పిల్లలంటే ఇంకా వాపే .... ఉన్నవాళ్ళకి ఉన్నంత వాపు.... తిన్నవాళ్ళకి తిన్నంత వాపు అని అందుకే అంటారులాగుంది. తన పిల్లలు చాలరన్నట్లు అక్క పిల్లల్ని, తమ్ముడి పిల్లల్ని తెచ్చిపెట్టుకొంటుంది.

"ఎలా ఉంది అనసూయకు" అంటూ ప్రశ్నించింది ఆవిడ.

లలిత పరిస్థితిచెప్పింది.

"మొన్న మా అత్తగారు వెళ్లేరు. మొగుణ్ణి చూడాలని ఊరకే తాప త్రయపడ్తున్నదట— పోని—ఓసారి చక్రాల కుర్చీలో కూర్చోపెట్టి తీసు కొచ్చి చూపించకూడదూ."

"అటువంటి అవకాశం లేదు పిన్నిగారూ—వాడికి ప్రాణభయం తప్పిందికాని మన తెలివిలో లేదు. అలా అనసూయ చూడ్డంమంచిది కా దన్నాడు డాక్టరు."

"ఏమిటో — ఈ ఘోరం. ఇద్దరికి ఇలా ఒక్కసారె ముంచుకు రావాలా—అందుకే అంటారు కష్టాలు ఒంటిగ రావని" అంది నీలకంఠం తల్లి.

లలిత తిరిగి వచ్చేసరికి అనసూయని ఉంచిన గదిముందు నిశ్శ బ్దంగా ఉంది. ఒక్క క్షణకాలంపాటు గుండె కొట్టుకోడం మానేసినట్లు అనిపించింది.

ఆమె వెళ్లేసరికి డాక్టర్లు, నర్సులు, మందులు ఇన్‌జక్షన్‌లు ఒకటే హడావిడిగా ఉంది గదిలో. డాక్టర్లు వచ్చేవారువస్తున్నారు-వెళ్ళేవారు వెళ్తు న్నారు...ఏమేమో సంప్రదించు కొంటున్నారు...అవును, కాదు అనుకొంటు న్నారు—ఇలా ఉంది పరిస్థితి.

ఇప్పుడు ఈ నిశ్శబ్ద వాతావరణం మంచికా, చెడుకా — దేనికి సూచన? అనసూయకి కాస్త నింపాదిగా ఉండడంతో ఎవరి పనులమీద వాళ్ళు వెళ్ళిపోయేరా—లేక—లేక—

అదిరే గుండెలతో మెల్లగా తలుపుతోసి గదిలోకి నడిచింది లలిత.

ఎదురుగా రెండు చేతుల్లో తల పట్టుకొని కూర్చున్న ప్రకాశం కన్పించాడు. అనసూయ ముఖం మీద ఆసుపత్రి దుప్పటి తెల్లగా, మృత్యు వంత భయంకరంగా వుంది.

గుండెల్ని పిండే బాధ గొల్లుమని ఏడుపు రూపంలో బైటికి తన్ను కొచ్చింది.

"అనసూయా నేను లేకుండా చూసి ఎక్కడికి వెళ్ళిపోయావే" అంటూ రోదించింది లలిత.

ప్రకాశం ఆమె నడ్డిమీద చెయ్యివేసి "మన దుఃఖాన్ని, బాధని మనసులోనే ఉంచుకోవాలి— ఇది ఆసుపత్రి" అంటూ గుర్తు చేసేడు.

"అమ్మ పక్కగదిలో ఉంది- చూస్తుండు. నేనలా వెళ్ళివస్తాను" అన్నాడు.

ఆ వార్త వినగానే తెలివితప్పి పడిపోయింది రాజమ్మ. తిరిగి ఆవి డకి తెలివి వచ్చినా ఆ గదిలోకి రానివ్వలేదు డాక్టరు.

చిన్నతనంలో తన చేతుల్తో ఎత్తుకుమోసిన అనసూయకు, తన చేతులమీదుగా పెళ్ళిచేసి, మోడువారిన ఆమె జీవితాన్ని చిగురింపజేసిన అన సూయకు, ఆఖరి ప్రయాణపు ఏర్పాట్లు చెయ్యడానికి వెళ్తున్నాడు ప్రకాశం.

ఈ జీవితాలు, బాంధవ్యాలు ఎంత తమాషాగా ఉంటాయి ?

కొన ఊపిరి ఉన్నంతకాలం, ఆ జీవుడు కట్టెలో ఉన్నంతకాలం మనిషి ఏ పరిస్థితిలో ఉన్నా భరిస్తారు ఆత్మీయులు.

ఒంటిలో ఆ కాస్తవేడి తగ్గిపోగానే ఆ కట్టెని ఎంత త్వరగా వదుల్చుకోవాలని తొందర పడ్తారు ? వారి బాంధవ్యం రక్తమాంసాలు నింపుకొన్న ఈ కట్టెతోకాదు— ఈ కట్టెని నడిపిస్తున్న ఆ జీవుడితో.

ఆ జీవుడికి ఆశ్రయమిచ్చింది ఈ శరీరం—— దానితో వారికున్న బాంధవ్యం అంతే—

* * *

ఆసుపత్రినుంచి వచ్చినవార్త అందుకొని రామకోటిని చూడ్డానికి వెళ్ళేడు ప్రకాశం. డాక్టరు రామనాథాన్ని అతడి ఆఫీసుగదిలో కలుసుకొని మాట్లాడేడు. "మీ బావమరదిని ఇంక ఇంటికి తీసుకు వెళ్ళిపోవచ్చు" అన్నాడు అతడు.

"డాక్టర్.... అతనికి పూర్తిగా నయమైపోయినట్లేనా?" అన్నాడు సంశయంగా ప్రకాశం.

"నయమంటే....తగిలిన దెబ్బలన్నీ మానిపోయేయి ....కాని—"

"అదే నేను అడుగుతున్నది — ఈ పరిస్థితిలో అతన్ని ఇంటికి తీసుకువెళ్ళి చిన్నపిల్లలమధ్య ఉంచడం క్షేమమేనంటారా ?"

"అయితే ఓ పని చెయ్యండి— మా ట్రీట్‌మెంటు పూర్తిఅయింది కాబట్టి మేము ఇక్కడ ఉంచడానికి వీలులేదు. అలాగని ఇంటికి తీసుకు పోదానికి అతడి మనస్థితి అంత బాగాలేదు. కొంతకాలంపాటు ఏదైనా లూనిటిక్ ఎసైలమ్‌లో ఉంచితే అతడికి, మీకూ కూడా మంచిది."

"మీరన్నమాట నిజమే....కాని అక్కడ అంత సులువుగా చేర్చుకొంటారా అని."

"అ అనుమానం మీకేం వద్దు. అక్కడఉన్న డాక్టరు కృష్ణారావు నాకు తెలుసు. అతడిపేర ఉత్తరం రాసిస్తాను. అది చూపిస్తే పని సులువుగా జరిగిపోతుంది" అన్నాడు అతడు.

డాక్టరు రామనాథం రాసిచ్చిన చీటి పట్టుకువెళ్ళడంచేత అక్కడ పని త్వరగానే తెమిలిపోయింది. "ఇంక మీ బావమరది పూచీ మాది....మీరేం కంగారుపడకండి" అన్నాడు డాక్టరు కృష్ణారావు.

తిరిగివచ్చి ఆ వార్త డాక్టరు రామనాథంతో చెప్పి అతడి సహాయానికి కృతజ్ఞతలు చెప్పుకొన్నాడు ప్రకాశం,

అది అంత సులువుగా అవుతుందనుకోలేదు ప్రకాశం. ఇంకా దాని కోసం ఎంతమంది కాళ్ళు పట్టుకోవాలో ఎంత సొమ్ము విరజిమ్ముకోవాలో అనుకొన్నాడు. రికమెండేషన్లకి వున్న విలువేమిటో ఆరోజు తెలిసివచ్చింది అతడికి. రామనాథంగారిదగ్గర సెలవు పుచ్చుకొని ప్రకాశం పిల్లల వార్డు దాటి వస్తుంటే విజయ కన్పించింది.

"ఎలా ఉన్నారు కవలలు" అన్నాడు.

"బాగున్నారు. ఈరోజు మీకు ఫోను చెయ్యమని డాక్టరు జయమ్మ గారు చెప్పేరు."

"ఈరోజో, రేపో మీ అవకాశాన్నిబట్టి పిల్లల్ని ఇంటికి తీసుకు వెళ్ళవచ్చు. ఇంక మామూళ్ళు పసిపిల్లలకి తీసుకొనే జాగ్రత్తలు తీసుకొంటే సరిపోతుంది. ప్రత్యేకమైన ట్రీట్‌మెంటు ఏమీ అవసరంలేదు" అంది విజయ.

డాక్టరు జయమ్మని కలుసుకొంటే ఆవిడా ఆ మాటే చెప్పింది. "కావాలంటే ఇప్పుడే తీసుకువెళ్ళవచ్చు.కాగితాలు సిద్ధం చేయిస్తాను"అంది.

మొదట్లో మరునాడు తను, లలితా కలసివచ్చి తీసుకు వెళ్ళాలను కొన్నాడు ప్రకాశం. కాని, లలితని మళ్ళీ అక్కడికి తీసుకువచ్చి అనసూయ జ్ఞాపకాన్ని కెలకడం ఎందుకు అనుకొన్నాడు. ఆ ఆసుపత్రిలోఉన్న సంబంధం ఎంత వేగిరం పూర్తి చేసుకొంటే అంత మంచిది.

"ఇప్పుడే తీసుకువెళ్ళాలను కొంటున్నాను .... కాని నా ఒక్కడి వల్లనే అవుతుందా అని సందేహిస్తున్నాను" అన్నాడు ప్రకాశం.

"ఆయాను మీతో పంపుతాను. ఆమె అక్కడ పాపలకి అన్నీ సరిచూసి, తిరిగివచ్చేస్తుంది. మీరు టాక్సీ పిల్చుకురండి — ఈలోగా కాగితాలు సిద్ధంచేసి ఉంచుతాను" అంది డాక్టరు జయమ్మ.

ప్రకాశం టాక్సీకోసం వెళ్ళేడు.

* * *

సంతతం కదలడమే స్వభావంగాగలకాలానికిమనుషులకష్టసుఖాలతో ఆశ నిరాశలతో సంబంధం ఉండదు. ఎవరు ఎలా ఉన్నారో పట్టించుకో కుండా, గానుగెద్దు చందంగా తన గాడిలోపడి నడుచుకుపోతుంటుంది.

ఆ ఇంట ఎవ్వరూ గుర్తించకుండానే జూలై నెల వెళ్ళి, ఆగస్టు ప్రవేశించింది. తొమ్మిదోతేదీకూడా తోసుకువచ్చింది. భోజనంచేసి బట్టలు కట్టుకొని బైటికి వచ్చింది లలిత. ఎక్కడికోవెళ్ళే ప్రయత్నంలోవున్న కోడల్నిచూసి "సెలవు అయిపోయిందా" అంది రాజమ్మ ఆమె ఆఫీసుకే వెళ్తున్నదన్న అభిప్రాయంతో.

"లేదు ఇంకా ఇరవై రోజులు ఉంది." అంది లలితచెప్పులు తొడుక్కొంటూ.

"డాక్టరు దగ్గరికా ?" అన్నాడు ప్రకాశం పరిశీలనగా ఆమె ముఖం వంక చూస్తూ.

"అవును.... రేపు ఆపరేషన్ కోసం నిర్ణయించుకొన్నది తేది. ఆ రోజు తరువాత మళ్ళా ఆవిడని కలియడమే పడలేదు. రావడం లేదని చెప్పి రావాలికదా" గడప దిగుతూ అంది లలిత.

తల వంచుకొని రోడ్డుమీద నడిచిపోతున్న లలిత వంక జాలిగా చూసేడు ప్రకాశం.

"లలిత ఎక్కడికి వెళ్తున్నదిరా" అంటూ ప్రశ్నించింది రాజమ్మ.

"పిల్లలికిపాలడబ్బాఅయిపోయింది...కొనుక్కురావడానికి వెళ్ళింది"

ఆ మాట నిజమే.... కాని లలిత అందుకోసం వెళ్ళలేదు. తనకి గుర్తుంటే కొని తెస్తుంది. లేకపోతే సాయంకాలం వెళ్ళి తెచ్చుకోవచ్చు-అనుకొన్నాడు ప్రకాశం.

అప్పటివరకు నారాయణమ్మ లలితదగ్గర ఫీజు ఏమీ పుచ్చుకోలేదు. ఆపరేషన్ అయేక అంతా కలసి ఇయ్యవచ్చు అనుకొంది లలిత. ఇంక ఇప్పుడు అటువంటి అభిప్రాయం లేకపోయేక ఆవిడకి ఇయ్యవలసింది ఏదో ఇచ్చి రావడం, మర్యాదగా ఉంటుందని బ్యాగులో సొమ్ము వేసుకుని ఇంటినుండి బయలుదేరింది.

లలిత ఎంతగా బలవంతపెట్టినా ఆవిడ సొమ్ము తీసుకోలేదు.

"అనుకొన్నట్లు ఆపరేషన్ జరిగి, నా కోరిక తీరిఉంటే తీసుకొని ఉండేదాన్ని ఏమీ చెయ్యకుండా నీ దగ్గిర ఎలాపుచ్చుకోను?" అంటూ నిరాకరించింది.

బజారులోంచి తిరిగి వస్తుంటే పాపలకి పాలడబ్బా అయిపోయిందన్న సంగతి గుర్తుకొచ్చింది. లలితకి ఎదురుగాఉన్న షాపులోకివెళ్ళి బేబీ ఫుడ్ కోసం అడిగింది. షాపువాడు రెండు డబ్బాలు తీసి, కాగితంలో చుట్టి లలితముందు పెట్టేడు.

డాక్టరు నారాయణమ్మ తీసుకోని సొమ్ము పాలడబ్బాలకి ఉపయోగపడింది. లలిత సొమ్ముచెల్లించి డబ్బాలు తీసుకొంటుంటే, వెనుకనుంచి వచ్చి వెన్నుమీద తట్టింది, పుట్టింట ఆరోపురుడు పోసుకొని నాలుగు రోజుల క్రిందట అత్తవారింటికి తిరిగివచ్చిన పంకజం.

"అమ్మ దొంగా.... చెప్పేవే కావు" అంది ఆమె చేతిలో బిల్లు, పాలడబ్బాలు చూసి.

ఏమిటి చెప్పకపోవడం— అన్నట్లు చూసింది లలిత.

"ఇప్పటికి, నీకూ కలిగిందన్నమాట వీటితో అవసరం?" నవ్వుతూ అంది పకంజం.

ఆ నవ్వులో ఒక రకమైన తృప్తి ఉంది. నిరాశఉంది. ఇంతకాలం స్వేచ్ఛగా పక్షిలా తిరుగుతున్నావు ... నీకూ పడ్డాయిలే సంకెళ్ళు అన్న తృప్తి. అయ్యో నీకూ పిల్లలుపుట్టేసేరా....ఏ విషయంలోకాకున్నా ఇందులో నీకన్నా అధికురాల్ని అనుకున్నానే....ఇదికూడా లేకుండా అయిందా అనే నిరాశ.

లలిత ఆమె మాటకి జవాబు చెప్పలేదు.

"చాలా సేపయింది ఇంటినుంచి బయలుదేరి, వెళ్ళాలి" అంటూ అక్కడినుంచి తప్పించుకొంది.

"మరేం... పూర్వంలా ఎలా తిరుగుతావు? ఇన్నాళ్ళకి చిన్నారిపాప ఇంట్లో కాలుపెట్టేక" అన్న పంకజం మాటలు లలిత వెన్నులో గుచ్చు కొన్నాయి. వెనుతిరిగి చూడకుండా వెళ్ళిపోయింది లలిత.

* * *

అనసూయ అకాలమృత్యువువాతపడి మూడునెల్లకి పైగా అయింది.

రామకోటిపరిస్థితి అత్తింటికి, పుట్టింటికి తిరిగే ఆడపిల్లలాఅయింది.

పదిరోజులు ఇంట్లో ఉంటే నెలరోజులు ఆసుపత్రిలో అన్నట్లు తయారయింది,

కవలలకి మూడోనెల వచ్చి, మూతులు విరవడం మొదలు పెట్ట గానే వనజ జలజ అని పేర్లు పెట్టింది లలిత. జలజకన్న వనజ పదిహేను నిముషాలు పెద్ద. వనజ గడ్డం కింద సెనగబద్దంత ఆ పుట్టుమచ్చేలేకపోతే కన్నతల్లికి కూడా ఎవరు ఎవరో పోల్చుకోడం కష్టం అన్నంత పోలికగా ఉన్నారు పిల్లలిద్దరూ. దానికిసరిగా ఇద్దరికి ఒకేలాంటి బట్టలుతొడిగేదిలలిత.

"కాస్త ఆ ఫ్రాకునైనా మార్చి తొడగవే లలితా ! నా గుడ్డి కళ్ళకి ఆ పుట్టుమచ్చ సరిగా కన్పించదు" అనేది రాజమ్మ.

ఆ ఏడు పెద్ద పండుగ వెళ్ళగానే బుజ్జిగాడిని వాల్తేరుకాన్వెంటులో

చేర్పించేరు. ఆ కాలనీలో చాలామందిపిల్లలు అక్కడచదువుకొంటున్నారు. రెండు, మూడు జట్కాబళ్ళలో పిల్లలంతా కాన్వెంటుకి వెళ్ళి వస్తుంటారు. డాక్టరుగారి చిన్నమ్మాయి పదేళ్ళ కమల, బుజ్జిగాడికి గార్డియన్‌గాతయారై ఆ పిల్లడిని తనతో జాగ్రత్తగా తీసుకువెళ్ళి, తీసుకురావడం బాధ్యత మీద వేసుకొంది.

పిల్లలు పెరిగి పెద్దవారు అవుతుంటే ఇంట్లో పనిపాట్లు, అలవాట్లు మాటా మంతీ, అన్నీ వాళ్ళ అవసరానికి అనుకూలంగా జరగడం మొద లయేయి. వరుసలు వావులు వాళ్ళ పరంగానే అలవాటులోకి వచ్చేయి.

"ఒరేయ్ బుజ్జీ.... నీళ్ళు కాగిపోయేయి. మీ తాతని స్నానానికి రమ్మన్నా" అంటూ పెరట్లోంచి కేకపెట్టింది లలిత.

"చూడు బుజ్జి.... నే బజారుకి వెళ్తున్నాను. నానమ్మకి ఏమైనా కావాలేమో కనుక్కోరా బాబూ" అనేవాడు ప్రకాశం బట్టలు వేసుకొంట్తూ.

ఆ నాడు అనసూయ కొడుకుచేత తాతయ్యా, నానమ్మ అని పిలిపిస్తే బుజాలు తడుముకొంది లలిత. ఈనాడు ఆ పిలుపుతో ఏదోపెద్దతనం తనకి సంక్రమించినట్లు మురిసిపోతున్నది.

పసివాళ్ళకి అయిదోనెల వచ్చేదాకా జీతంనష్టంమీద ఆఫీసుకి సెలవు పెట్టింది లలిత. అటుతర్వాత పిల్లల్నిచూడ్డానికి ఒక ఆడమనిషిని పెట్టింది. దాని పేరు తాయారు. వాళ్ళ యింట్లో పాచిపనిచేసేదాని కోడలు. తాయారు కాపురానికి వచ్చి ఆరేళ్ళు కావస్తున్నా దానికి పిల్లలు లేరు. పిల్లలంటే చెప్పలేనంత అపేక్ష దానికి. వనజకి, జలజకి ఏపాటి లోటుపాట్లు వచ్చినా లలితనికూడా సాధించేంతటి అభిమానం దానికి కవలలమీద.

ఆఫీసులో పని ఎంత తొందర్లో అయిపోను— అన్నట్లు చూసేది లలిత. గుడ్డిలోమెల్ల అన్నట్లు గంటలు, నిముషాలు కొలిచే ఆ ఆఫీసరు బదిలీ అయి వెళ్ళిపోయి, ఇంకొకడు వచ్చేడు. ఇతడు చాలా మంచివాడు. వయసు మీరినవాడు. తనకింద ఉద్యోగులు కష్టం, సుఖం చెప్పుకొంటే విని, సానుభూతితో అర్థంచేసుకొనే రకం.

లలిత ఇంట్లో ఏర్పడ్డ పరిస్థితిని మంచి మనసుతో అర్థంచేసుకొని, ఆమె రాకపోకల్ని అంతగా పట్టించుకొనేవాడుకాడు. దానికి సరిగా లలితఆఫీ

ములో కాలుపెట్టేక,తిరిగివెళ్ళిపోయేవరకు వంచినతల ఎత్తకుండాపనిచేసేది.

లలితఆఫీసునుంచివచ్చేసరికితాయారుచంటివాళ్ళచేష్టలు,నోరుముయ్యకుండా అరగంటకి పైగా అప్పచెప్పేది. రాత్రి ప్రకాశానికి తూ.చ తప్పకుండా అందించేది లలిత.

ఆ రోజు వనజకి రొంపచేసి కొంచెం పక్కలు వెచ్చగా ఉన్నాయని ఆఫీసుకి సెలవు పెట్టింది లలిత. ప్రకాశం కాలేజీకి వెళ్లేడన్నమాటే కాని మనసంతా ఇంటిపైపే ఉంది.

సాయంకాలం ఇంటికివస్తూనే "వనజ కెలా ఉంది లలితా?" అంటూ ఆత్రంగా అడిగేడు.

"మరేం చికాకులేదు. డాక్టరుగారు ఆసుపత్రికివెళ్తూ వచ్చిచూసేరు. ఏదో మందు ఇచ్చేరు. రెండు మోతాదులు పాలలోకలిపి పట్టేను. తెల్లవారేసరికి తగ్గిపోతుందన్నారు" అంది లలిత.

లలిత చేతిలో ఉన్న జలజ ప్రకాశాన్నిచూసి నోటితో ఏవోధ్వనులు చేస్తూ, చేతులుజాచింది. అప్పుడప్పుడే రెండేసిఅక్షరాల మాటలు పలకడం నేర్చుకొంటున్నారు కవలలు.

జలజ చెవి దగ్గరగా నోరుపెట్టి లలిత ఏమో అంది.

"నాన్నా... నాన్నా...." అంటూ చిలకపిట్టలా ఆ మాటని ఉచ్చరించింది జలజ.

జలజని చేతులోకి తీసుకొని లలిత వంక చూసేడు ప్రకాశం.

లలిత తలవంచుకుని ఇంటిలోపలికి వెళ్ళిపోయింది.

రాత్రి భోజనాల దగ్గర బుజ్జిగాడి బుర్రలో ఒక సందేహం ప్రవేశించింది. అవ్వ దేవుడి దగ్గర వెలిగించిన దీపం ఉఫ్ మని ఊదితే ఆరిపోతుంది కదా.... మరి ఎలక్ట్రిక్ లైటు ఎందుకు ఆరిపోదూ—అని.

"అది మాత్రం ఆరిపోదని నీకెలా తెలుసు – ఎప్పుడైనా ఊదిచూశావా?" అన్నాడు ప్రకాశం.

"లేదు. నానమ్మ చెప్పింది" అన్నాడు బుజ్జి.

"ఇదిగో బుజ్జీ! ఎవరేదిచెప్తే అదల్లానమ్మేయకూడదు. నీ అంతట నీవు చూసి తేల్చుకోవాలి. తెలిసిందా" అన్నాడు ప్రకాశం నవ్వుతూ.

ప్రకాశం నోట్లోమాట ఇంకా పూర్తికాకుండానే పరుగుదీశాడు బుజ్జి

ఆ విషయం తేల్చుకోవడానికి. వంట ఇంట్లో, సావిట్లో లైట్లు ఎత్తుగా వున్నాయి. వాడు ఊది చూడటానికి అనువుగాలేవు. తిన్నగా గదిలోకి పరుగు తీసేడు. అక్కడ ఉన్న టేబిలులైటు కిందుగాఉంది. దానిముందు నిలిచి నోటినిండా గాలిపూరించి "ఉఫ్" అని గట్టిగా ఊదేడు.

దీపం ఆరిపోయింది.

"తాతయ్యా—తాతయ్యా— లైటు ఆరిపోయింది— నానమ్మ అన్నీ అబద్ధాలు చెప్పింది" అంటూ ఉత్సాహంగా కేకలుపెడ్తూ పరుగుతోవచ్చేడు బుజ్జిగాడు.

బుజ్జిగాడు ఊదడంతో ఆ లైటు ఒక్కటే ఆరిపోలేదు. ఇంట్లో లైట్లన్నీఆరిపోయాయి....ఆ ఇంట్లోనేకాదు ఆ వీధి వీధంతాదీపాలులేవు.

ఉత్సాహంగా అరుచుకొంటూ చీకట్లో పరుగుతో వస్తున్న బుజ్జిగాడి కాలికి గడపతగిలి బోర్లపడ్డాడు.వేలు మణికి నొప్పిపుట్టడంతో ఆరున్నొక్క రాగం అందుకొన్నాడు.

లలిత గూట్లోంచి కొవ్వొత్తులు తీసి వెలిగించి ఇంట్లో నాలుగు చోట్లా పెట్టింది. బుజ్జిగాడు కాలు డెట్టాల్‌తో కడిగి దెబ్బ తగిలినచోట అయిడన్ రాసింది.

"ఈ చీకట్లో వంటఇంటిపని ఇప్పుడేంచేస్తావు. అలాపడివుండనీ.... ఉదయం చూసుకోవచ్చు" అంటూ రాజమ్మ బైటకి వచ్చింది.

పోయి అరగంట అయినా కరెంట్ తిరిగి రాలేదు.

కొవ్వొత్తి వెలుగులోనే లలితఅందరికీ పక్కలు వేసింది.బుజ్జిగాడు రాజమ్మదగ్గరపడుకొన్నాడు.నిద్రలోకూడా ఇంకా చిన్నగాబెక్కుతున్నాడు.

కడుపునిండా పాలుతాగి తొట్టిలో పడుకుని నిద్రపోయింది జలజ. అంతవరకు జ్వరతీవ్రంవల్ల నిద్రపోయిన వనజ చెమటపోసి జ్వరం విడిచి పెట్టగా కళ్ళు విప్పి చూసింది.

డాక్టరుగారు ఇచ్చిన మందు ఇంకో మోతాదు పాలలో కలిపిపట్టి మళ్ళీ తొట్టిలో పడుకోపెట్టింది లలిత. పగలంతానిద్రపోయిన వనజకి ఇంక అప్పుడునిద్రరాలేదు. కాళ్ళు, చేతులుఆడిస్తూ "అత్త, తాతా...అమ్మా..." అంటూ మాటలు మొదలుపెట్టింది.

వనజ "అమ్మ" అన్నప్పుడల్లా లలిత ముఖంలో ఓ వింత కాంతి

కన్పిస్తున్నది. ఆ కళ్ళలో "ఇవి" అని తెలియరాని ఎన్నో కోరికలు కదులాడుతున్నాయి.

గోడ గడియారం అరగంట కొట్టింది.

తొట్టిలో వనజ ఇంకా కేరింతలు కొడ్తునేఉంది. లలిత నెమ్మదిగా జోలపాడుతూ వనజని నిద్రపుచ్చడానికి ప్రయత్నిస్తున్నది.

సగంకాలిన కొవ్వొత్తినుంచి కొవ్వుకారి టేబిలుమీదపడ్తున్నది. గాలికిజ్యోతి కదలుతున్నప్పుడల్లా ఆ వెలుగునీడలు గదిగోడలపై నాట్యం చేస్తున్నాయి.

తనచుట్టూ ఉన్న వస్తువులకి ప్రకాశం ఇస్తూ,తాను కాలిపోతున్నది కొవ్వొత్తి. కొవ్వొత్తి ఆత్మార్పణతో పరిసరాలు వెలుగు సముపార్జించుకొంటున్నాయి. కాని తన్ను తాను కరగించుకొంటూ ఇతరులకు వెలుగు పంచిపెడ్తున్న కొవ్వొత్తిచుట్టూ మిగిలింది చీకటిమాత్రమే. తొట్టిలో పాప నిద్దరోయింది. తొట్టి వూపుతున్న లలిత చెయ్యి ఆగిపోయింది కొవ్వొత్తి చిరువెలుగులో నిర్మలంగా నిద్రపోతున్నది లలిత.

చిన్ననాటినుంచి తనకోసం కాక, ఇతరులకోసమే బ్రతకడం నేర్చుకొన్న లలిత....స్త్రీసహజమైన ఒకేఒక చిన్నకోరిక తీర్చుకోలేనిలలిత....

ఎదురుగా కాలుతున్నకొవ్వొత్తికి,పాపతొట్టిపక్కమంచంమీదనిశ్చలంగానిద్రపోతున్నలలితకి ఏదోపోలికఉన్నట్లు అనిపించిందిపత్రికాశానికి.

ప్రపంచంలో కొందరు మనుషులు తమకోసమే తాము బ్రతుకుతారు, తమ మనుగడ కోసమే ఇతరుల్ని బ్రతకనిస్తారు....మరికొంతమంది ఇతరులకోసమే తాము బ్రతుతారు. వారి బ్రతుకుల సాఫల్యంతోనే తమ జీవితాలు నింపుకొంటారు.

గడియారం పదకొండు గంటలు కొట్టింది.

నిద్రకి ప్రకాశంకళ్ళు, బరువెక్కి మూతలు పడ్డాయి.

కొవ్వొత్తి ఇంకా వెలుగుతూనే ఉంది.

ప్రకాశించే శక్తి తనలో మిగిలి ఉన్నంతవరకు అది అలా తన్ను తాను కరగించుకొంటూ వెలుగుతూనే ఉంటుంది.

సమాప్తం